శ్రీరామ నృసింహ గ్రంథ రత్నమాల

# శ్రీమదాంధ్ర భాగవతము

## ప్రథమ సంపుటము

[ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధములు]





రచయితలు:

శతావధానులు, ఉభయభాషా ప్రవీణులు

శ్రీ రామ నృసింహ మూర్తి కవులు

అను

గంధం శ్రీరామమూర్తి

ఇట్టింకి నరసింహామూర్తులు

(గద్వాల సంస్థానాస్థాన కవులు)



ప్రకాశకులు:

శ్రీరామ నృసింహ గ్రంథరత్నమాల,

ఉప్పులూరు.

1955

# శ్రీమదాంధ్రభాగవతము.

## ఉపోద్ఘాతము.

ఏకాలమున నేది దొరకదని తోఁచునో యద్దానిని మనము ముందుగనే నిలువ చేసికొందుము. వేసవికాలమున మంచినీరు లభ్యముకాదని ముందుగనే చెఱువుల నింపుకొందుము. అట్లే వర్షకాలమునకు వంటచెఱకుఁ, గఱవుకాలమున కాహార పదార్థములుఁ, జలికాలమునకు వస్త్రములు జాగ్రత్తపఱచుకొందుము. కాలచక్రము తిరుగుచుండుటచేఁ గలిమిలేములు, బాగోగులు, మంచిచెడ్డలు, రాత్రింబవళ్లు, చీఁకటి వెన్నెలలు, కష్టసుఖములు, లాభనష్టములు, జననమరణములు పర్యాయమునఁగల్గు చుండును. చైత్రమాసమునఁ జెట్లు చిగుళ్లతోఁ దులదూగి ఫాల్గుణమాసమున నాకు రాల్చి మోడుబాఱియుండును. అట్లే యౌవనమున మిసమిసలాడి వార్ధక్యమునఁ గదలమెదలలేకయుందుము. శారీరక పోషణకుఁగాను నాఁకలిదప్పులఁ దట్టుకొనుటకు వలయు సామగ్రి ముందు జాగ్రత్తపఱచుకొనునట్లు, మానసికపుష్టికిని విజ్ఞానమును గొఱఁతకాలమునకు జాగ్రత్తపడవలయును. మొదటిదగు కృతయుగమున ధర్మజ్ఞాన వికాసము కలిగి కడపటిదగు కలియుగమునఁ జైత్రమాసమునఁ జెట్లుచిగిర్చి ఫల పుష్పములతో నలరారి ఫాల్గుణమాసమున మోడువాఱునట్లును, వర్షకాలమున నీరుసమృద్ధిగనుండి వేసవికాలమున లభ్యముకానట్లును, నాధర్మజ్ఞానవికాసము క్షీణిం చుటయు సహజమై కనఁబడుచున్నది. అందువలన ద్వాపరయుగాంతమునఁ గలియు గాదిని ముందు విజ్ఞానము కొఱఁతవడుననియే శౌనకాదిమహర్షులు విజ్ఞానధనులు, మానవశ్రేయస్కాములు (88000) అష్టాశీతి సహస్రసంఖ్యాకులు సమావేశమై దీర్ఘసత్రయాగము నెపంబున వేయిసంవత్సరంబులు విమర్శించి మానవసుఖసాధనం బగు విజ్ఞానధనంబును వాఙ్మయరూపంబున విజ్ఞానము కొఱఁతవడు కలియుగంబునకు నిలువఁజేసిరి. ప్రతివ్యక్తియు సుఖము నేకోరును గాని సుఖసాధనము విజ్ఞానధనికిఁ గోచరించునట్లజ్ఞానికి గోచరించదు. దుఃఖసాధనము సుఖసాధనముగా భ్రమించి యజ్ఞాని సుఖమునకుమాఱు దుఃఖమునే పొందుచుండును. బాలుఁడు దీపము సుఖసాధన మన్ని దానితో నాడి సంతసింపఁదలఁచి సంతోషమునకుమాఱు చేయికాలి దుఃఖ మునే పొందుచుండునుగదా! ద్వాపరయుగాంతమునకు స్వీకరింపఁబడిన శబ్దబ్రహ్మ రూపమును గాంచుటవలనఁ గలిగిన శాస్త్రానుభవము, రూపబ్రహ్మమును గాంచుట వలనఁగలిగిన లోకానుభవము, నీరెండింటి సమైక్యానుభవమునఁ గలిగిన యాత్మాను

భూతితోఁ గులకమైయున్న శబ్దబ్రహ్మరూప వాఙ్మయమును విషయవిభాగ మొనరించి ద్వైపాయనుండు వ్యాసుండై తన త్రివిధరూపజ్ఞానానుభవమున మానవ శ్రేయస్సుఁ గోరి మానవుఁ డెట్టియే సమయములఁ బ్రవర్తింపవలెనో యేది సుఖసాధనమో యేది దుఃఖసాధనమో యాయాధర్మముల గుర్తెఱుంగుటకుఁగాను భారతమను సద్గ్రంథమును రచించెను. కాని యది మానవశ్రేయస్సునకు సమగ్రగ్రంథమని తనకుఁ దృప్తికలుగక పోవుటచే వికలమనస్కుఁడయ్యెను. అజ్ఞాని కావించిన యొక చెడుకార్యమునందలి లోపమును దెల్పి దానివలని నష్టమును వెల్లడించెను. ఆవిధమున నాయజ్ఞాని జ్ఞానలోపమున నేకార్యమొనరించిన నది నష్టమునే కల్గించును. ఆయాకార్యనష్టముల నన్నిఁటినిఁ దెలిపి యా యకార్యములనుండి యా యజ్ఞానిని మరలించుటకంటె నా యజ్ఞానమే వానినుండి తొలగించుటకు విజ్ఞానప్రబోధముఁ గావించిన శ్రేయోదాయకమై యుండునుగదా ? మొదటఁ జీఁకటియే యున్నదను కొందము. వెలుఁగెంతప్రసరింపఁజేసిన నంత మార్గసుబోధకమై వస్తునష్టముగాకుండుట చీఁకటి పటాపంచలగుట తెలిసినదే. అందువలన నా వ్యాసభగవానుఁడు లోకశాస్త్రాత్మానుభవములరచించిన భారతగ్రంథానంతర మాత్మోద్యమానఫలతకసంతృప్తిఁజెంది యజ్ఞాననిర్మూలకంబు విజ్ఞానప్రబోధమునగు తత్త్వశాస్త్రము భాగవతపురాణరూపమున వెల్లడించెను. పురాణకథలెట్లు కల్పించినను . శాస్త్రము మాత్రము యథార్థముగనే బోధింపవలెను. ఆంజనేయులతోఁక బారెడన్నను లేక పదివేల బారలన్నను నష్టములేదు. కాని వైద్యశాస్త్రమున నొక నేపాలమాత్ర యనునది పదినేపాలమాత్రలన్న సేవించువాని కపరిమితప్రమాదమగునుగదా! అట్లే యీభాగవతతత్త్వశాస్త్రమును పురాణరూపమున నెక్కించుటలోను గొంత తికమక కలుగకపోదు. కాని భగవదవతారపురుషుఁడగు వ్యాసకవి యీచిక్కుసమస్యను సులభముగఁ బరిష్కరింపఁగలిగెను. నీతియైనను బ్రత్యేకముగ గ్రహించుటకు విసుగుజనించును. మన యాహారపదార్థములైనను గొంతగడ్డిలేక గింజలుకాని, యన్నముకానిలభించునా ? అందువలన గ్రంథములును ప్రభుసమ్మితములు (ధర్మంచర, సత్యంవద, ఇట్లాజ్ఞాపించు వేదములు), మిత్రసమ్మితములు స్నేహితులవలెహితమునుబోధించునవి (పురాణములు), కాంతాసమ్మితములు (కావ్యాదులు), ప్రియురాలివలె బోధించునవిగ కవులు కల్పింతురు. అందు మానవశ్రేయస్సునకుఁ గారణమగు నీతిమాత్రము కల్పింపఁబడక, యపౌరుషేయము, ననాదియునై యుండును. పురాణములకు నయిదులక్షణముల నియమించిరి. 1. సర్గము (సృష్టికారణము) 2. ప్రతిసర్గము (సృష్టికార్యము) 3. మన్వంతరము (కాలము) 4. వంశము (మానవసమాజములు) 5. వంశానుచరితము (మానవసమాజములెట్లు సంచరించి లాభనష్టములు పొందినవో

నిదర్శనముఁ జూపుట). ఈ పురాణలక్షణముల నైదింటితో నీ భాగవతతత్త్వశాస్త్రము రూపొందించుట యందే వ్యాసభగవానుని ప్రతిభ వెల్లడి యగుచున్నది. మొదట నీ సృష్టికిఁగారణము పిదప సృష్టికార్యము, కాలస్వరూపము, మానవ సమాజములు, మానవసమాజ ప్రవర్తనమందలి లాభనష్టములు, మానవుని శ్రేయస్సాధనము, యథార్థముగ బోధించి పురాణపంచలక్షణముల తత్త్వశాస్త్రము యథాతథంబుగ వెల్లడించి మానవలోకమునకు మహోపకార మొనరించెను. ఇందలి విషయములు ప్రతిమానవున కెల్ల కాలముల మేలును జేకూర్చునవిగనే• యిమడ్చబడి యున్నవి. వ్యాసభగవానుఁడు భారతరచనానంతరము మానవ విజ్ఞానవికాసమునకుఁ గాను సరస్వతీపశ్చిమతీరంబున ఋషులకు సత్రవర్ధనంబై శమ్యాప్రాసంబని ప్రసిద్ధిఁ గాంచిన యాశ్రమంబున నిశ్చలమానసంబున స్వార్థరహితుఁడును, మానవశ్రేయ స్కాముఁడునై యీ తత్త్వ సంహితయగు భాగవతమును రచించి తనకుమారుఁడగు శుకునిచేతను శిష్యుఁడగు రోమహర్షణునిచేతను జదివించెను. దానిని రోమహర్షణుని సుతుఁడు తండ్రివలన పఠించి ద్వాపరయుగాంతమునఁ గలియుగాదిని దీర్ఘసత్రయాగ వ్యాజంబున విజ్ఞానము కొఱతవడు కలియుగమునకు విజ్ఞానధనమును వాఙ్మయ రూపంబున నిలువఁజేయు శౌనకాదిమహర్షులకుఁ జెప్పెను.

## భా గ వ త గో ష్ఠి.

ఇట్లు నైమిశారణ్యంబున శ్రీవిష్ణుక్షేత్రమునందు శౌనకాదిమహామునులు మానవలోకకల్యాణార్థము సహస్రవర్షంబు లనుష్ఠానకాలంబుగాఁగల సత్రసంజ్ఞికంబైన యాగంబుఁజేయుచు నొక్కనాఁడు తేపకడ నిత్యనైమిత్తికహోమంబు లాచరించి వ్యాసశిష్యుండగు రోమహర్షణుని పుత్రుండును, నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీ సమేతుండునై యుగ్రశ్రవసుండను పేరనొప్పు సూతమహర్షిం గాంచి సత్కరించి "ఋషిపుంగవా! యీ కలియుగంబున మానవులు అలసులు, మందబుద్ధులు, నల్పా యుర్దాయము కలవారు, ననేక రోగములబాధల నొందువారు, మందభాగ్యులు, మంచిపనులెవ్వియుఁ జేయఁజాలనివారు, కాన నిట్టివారి కెట్లాత్మశాంతి చేకూరు? సర్వసౌఖ్యంబు లెట్లొనఁగూడు? వినిపింపుము; నీ వనేకోత్తమగ్రంథములఁ జదివి యందలి యర్థముల నవగతంబుఁ జేసికొన్నవాఁడవు; పెద్దల సమక్షంబున నుత్తమ గోష్ఠిని జిరకాలము గడపినవాఁడవు;నగుట మానవలోక శుభాకాంక్షనడుగు మా యీ కోరికఁ దీర్పఁగలసమర్థుండవు"అన సూతమహర్షి వారలకీ భాగవతసంహిత వినిపించెను.

## భా గ వ త గ్ర ం థ ప్ర స క్తి.

భారతయుద్ధానంతరము శ్రీకృష్ణనిర్యాణము కాఁగా భరతవంశభూషణుఁడు నర్జునపౌత్రుఁడు, నభిమన్యుసుతుఁడు, హస్తినాపురప్రభువు నగు పరీక్షిన్మహారా జుత్త

రుని పుత్రికయగు నిరావతినిఁ బెండ్లియాడి యామెయందు జనమేజయాదుల నలువురఁ బుత్రుల నుత్పాదించి సమస్తదేశములు జయించి ధర్మపరిపాలనముఁ గావించుచుం డెను. అతఁడొకనాఁ డడవికిఁ బోయి యక్కడ నొక్కవృషభము మఱియునొకగోవుఁ దత్తఱపాటునఁ బరువెత్తుకొని వచ్చుచుండుటయు, వానివెనుక నొకక్షుద్రుఁడు చేత ముసలముఁ దాల్చి కొట్టుచుఁ దఱుముచుండుటయుఁ గాంచెను. అంతమహారాజా నీ చునిఁ బిలిచి "ఓరీ! నీవెవండవు? అర్జునుఁడులేనంతమాత్రమున నధర్మమున కడ్డు దగులువారుండరనియా? గోవృషభంబుల నిట్లు బాధించుచున్న వాఁడవు? ఈభరత వంశమున నెవఁడును దీనులకష్టములఁ జూచుచు నూరకుండఁజాలఁడు"అని కత్తిదూసి యదలించెను. మఱియు నా రాజా గోవృషభంబులఁగూడఁ జెంతకుఁబిలిచి మీా రెవరు? ఎందువలన నిట్లు పలాయితులగుచున్నవారలు? నేనుండ మిమ్ముల బాధిం చుట కెవ్వనికిని సామర్థ్యము లేదు. నిర్భయంబున వాక్రువ్వుఁడు" అని యడుగ వృషభము తలవంచి 'మహారాజా ! నీయెదుటనిలఁబడిన యీా పాపరూపకాల వర్ణభయంకరమూర్తి కలికాలపూరుషుఁడు. ఇతఁ డరుదెంచుటచే మేము భీతిఁ బరు వెత్తుచున్నారము. నాపేరు ధర్ముఁడు, ఈ గోవు భూదేవి. ఈమెయు నితనిభయ ముననే పరువెత్తుచున్నది. నేను సత్యయుగమగు కృతయుగంబునఁ దప, స్సత్య, దయా, శౌచంబులనెడు నాల్గుపాదంబులను, త్రేతాయుగంబున సత్య,దయా, శౌచ ములను మూఁడుపాదంబులను, ద్వాపరంబున దయా,శౌచములను రెండుపాదములను నిలిచి సంచరించితిని. ఇప్పుడీ పాపపు కలియుగంబున కేవల బాహ్యశౌచమను నొంటి తొంటకాలున నిలువంబడితి. అయినను నీ కలికాలపూరుషుఁ డిట్లు తఱుముచున్నాఁడు రక్షింపు" మనెను.

భూదేవియు"నోధర్మాత్మా! ఈ నీచ కలికాలపూరుషుఁ డధికమైన యధర్మ భారము నామీాఁద నుంపఁజూచుచున్నాఁడు.నే నద్దానినిమోయఁజాలను. ఈ భయం బుననే నేనును బాఱిపోవుచుంటిని" అన విని యా పరీక్షిన్మహారాజు "ధర్మదేవతా! నే నిప్పుడే యీాకలికాల నీచపురుషుని హతమార్చి నిన్ను మఱల నాల్గుపాదంబుల నడిపింతును. ఓ భూదేవీ! నీవును నిర్భయంబున నుండు"మని వాని కభయ మొసంగి కలిపురుషునిఁ బొమ్మని యదలించి పలికెను.

జూపె. తన్మూలంబులగు హింస, కామ, అసత్య, మద వైరము లనెడి యైదుస్థాన ములయ్యె. కలి తన ప్రదేశములకుఁ బయనించెను. ధర్మదేవత సురక్షితముగ రాజు హృదయమున విహరించుచుండెను. భూదేవి స్వీయరూపమునఁ గలిసిపోయెను. రాజు వేట చాలించి నగరమునకు వచ్చి ధర్మపాలనఁ గావించుచుండెను.

మఱికొన్నాళ్ళకుఁ బరీక్షిన్మహారాజు వేటకుఁ బోయి పిపాసఁజెంది నికటస్థ ఋష్యాశ్రమముఁ జేరెను. శిరస్సునందలి కిరీటసువర్ణమూలంబగు రాజ్యాధికార మద మునఁ గలిపురుషుఁడు నివసించుచునే యుండెను. అతఁడు తన యవసరమునుబొంది రాజు నజ్ఞానపరవశునిఁ గావించెను. అందువలన నిశ్చల హరిధ్యానంబున నిమీలిత నేత్రుఁడై బాహ్యప్రపంచమును మఱచియున్న మహామునిని మోసగానిగ భావించి రాజా మునిగళంబున మృతసర్పమును వైచి గృహంబునకుఁ జనియె. గృహంబునఁ గిరీటముఁ దీసినపిమ్మట నజ్ఞానము తొలఁగి కిరీటసువర్ణమూలక రాజ్యమదంబునఁ గలి పురుష నివాసంబుఁ గుర్తించి తన యకృత్యమును దలంచి పశ్చాత్తప్తుఁడై తన్నుఁ దా నిందించుకొనెను. ఆహా! పాపపుకలి తుదకు నన్నే మోసగించెను. ఈ మహా పాపమునుండి యెట్లు విముక్తుఁడఁ గాఁగలను. ఈ ఋష్యవమతిజనిత పాప మెట్లుప శాంతిఁ బొందగలదు అని వితర్కించుకొనుచుఁ బొగులుచుండెను.

ఋష్యాశ్రమమందలి మునిబాలకు లా దృశ్యముఁగాంచి తత్తరంబునఁ గౌశికీ నదీతీరముననున్న యుపవనమందు నాడుకొను నా ఋషిపుత్రున కీ వృత్తాంత మెఱిం గించిరి. ఆ కుమారుఁడును బాల్యచాపలంబునఁ గౌశికీనదితోయము దోసిటం బట్టి 'నా తండ్రిమెడలో మృతసర్పము వైచిన దుష్టుఁడు పాముకఱచి తప్పక యేఁడవనాటికి మృతిఁ బొందఁగలండని శాపంబిచ్చి యాశ్రమమునకు వచ్చి తండ్రిమెడనుండి మృత సర్పమును దొలంగించినంత నా మునితిలకుఁడు సమాధ్యుత్థితుఁడు కాఁగ' శరీరము నంబాళించుకొమ్మని జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పెను. అంత నాఋషి జ్ఞాన నేత్రముఁ దెఱచి ధ్యానముతో నాలోచించి 'కుమారా! ఎట్టిపని జేసితివి? ఏల ప్రభు వునకు శాపం బొసంగితివి? ఎవని పరిపాలనంబునఁ బశుపక్షులును దుఃఖపడుటలేదో' ఎవని దేశమున సింహాది క్రూరజంతువులును గోవు మొదలగు సాధుజంతువులును సహజమైన యన్యోన్య ద్వేషములుగూడ విడిచి కలసిమెలసి మెలంగుచుం డెనో, ఎవనిరాజ్యమున మనము సుఖముగఁ దపంబాచరించుకొనుచుంటిమో యట్టి పరీక్షిన్మహారాజే కాలదోషంబుననో యిట్లుగావించిన నేమి నష్టము వాటిల్లె. అల్ప దోషమున కధికశిక్ష న్యాయమా? బాల్యచాపలంబున నెంతటి పాపంబున కొడిగట్టి తివి!'' అని పుత్రుని మందలించి జరిగిన వృత్తాంతముఁ దెల్పి సావధానుండవు కమ్మని

హెచ్చరికచేయ శిష్యుని మహారాజుకడకంపెను. పరీక్షిత్తు తన పాపమునకుఁ గలిగిన దండంబును దెలిసికొని సంతసించి యా యేడుదినంబులఁ దానుజేయఁదగిన కార్యంబు నిరూపించుకొనెను. పతిధర్మము ననుసరించి యుత్తమకార్యాచరణమునకు విఘ్నము కలిగింపకుండుటయే సతీధర్మమని భార్యల నోదార్చి సుతుండగు జనమేజయునకు రాజ్య పట్టాభిషేకమొనర్చి నీతులం గఱపి రాజ్యాది సర్వమాయాజాలంబులనుండి విడివడి నిర్మోహుండై తన యోగసాధనము గుఱించి గంగాతీరంబునకుఁజేరి ప్రాయోపవేశ దీక్షవహించి విచారింపఁ దొడంగెను. ఇది విన్నవారెవ్వరును విచారింపకుండనుండఁ జాలకపోయిరి.

ఋషికుమార శాపంబును పరీక్షిన్మహారాజు గంగాతీరంబుఁ జేరుటయుఁ దెలిసికొని వ్యాస, వసిష్ఠ, భరద్వాజ, కాత్యాయన, పరాశర, నారద, విశ్వామిత్ర, వామదేవ, జమదగ్ని ప్రముఖులగు నష్టాశీతి సహస్ర (88000) సంఖ్యాకులగు ఋషివర్యులు చనుదెంచి యథోచితాసనంబుల నుపవిష్టులైరి. వారివారి శాస్త్రంబులఁ దర్కించి తర్కించి యనేకధర్మముల నుపన్యసించిరి. అంత దిగంబరుఁడు భూతమయుఁడు నగు శుకదేవుండు రాజు శ్రద్ధను గమనించి యతని సందేహంబులఁ బాపి మోక్షమార్గం బుపదేశింప నచటికిరా నందఱును లేచి నిలువంబడి భక్తిభావంబున నంజలి ఘటించి యతనితోపాటుగా నుపవిష్టులైరి. రాజద్దానిఁ గాంచి యాశ్చర్యపడి యీశుకుని తండ్రియగు వ్యాసుండును దాతయగు పరాశరుండును వానితాతయగు వసిష్ఠుండును తదితరులగు మహర్షులును వీనికింతగ నాధిక్యమిడుటయేల' యన పరాశరముని నిలువంబడి 'మే మెంతపెద్దలమైనను జ్ఞానాచరణంబుననీతనికిఁ బిన్నలము. నీయదృష్టవశమున నితండు చనుదెంచె. నీ మూలంబున మేమును విని కృతార్థులము కాఁగలము' అని పలికెను. రాజు శుకుని సత్కరించి నమస్కరించి యిట్లనియె దేవా! నాయధర్మ మపారము. ఆయుష్పరిమాణ మేడుదినంబులు. నే నేమి సేయవలయు? ఎయ్యది భవవిముక్తికి సాధనము? అన 'రాజా! ముక్తి యొకఘడియధ్యానముననే లభించును. ఖట్వాంగమహారాజు నారదోపదేశంబున రెండుఘడియలలోనే ముక్తినొందెను. నీ కేడురోజుల వ్యవధి కలదు. ధైర్యమువహించుము. ఏకాగ్రచిత్తుండవై నీకుఁ గల జ్ఞానముననే సర్వవిషయంబుల నొక్కసారి యవలోకనంబుఁ గావించుకొనుము. మనస్సు నొకస్థితికి స్థిరపరచుకొమ్ము. భగవంతుఁడును మాతండ్రియునగు వ్యాస మహర్షి నాచేఁ జదివించిన ద్వాదశ స్కంధములుగల భాగవతపురాణము నీకుఁ జెప్పెద. అది నీసందేహముల నన్నిఁటి నిర్మూలించి మోక్షమార్గంబు సుకరంబుగఁ జూపఁగలదు' అని శుకుఁ డీ భాగవతగ్రంథప్రసక్తిఁ దెచ్చి వినిపించె"నని సూతుఁడు శౌనకాది మహర్షులకుం జెప్పె.

పరీక్షిన్మహారాజు తన పరిపాలనంబున ధర్మము నాల్గుపాదముల నడపవలె నని ప్రయత్నించెను. కాని "నేను పరిపాలకుఁడ" నను దురభిమానమే యతనిని బ్రమాదలోలునిఁ గావించెను. మసి యున్న గదిలోఁ దెల్లని వస్త్రము ధరించిన వ్యక్తి మసి యంటకుండ నెంత జాగ్రత్తతీసికొన్నను మసియంటుట సహజమేకదా! కాన సాధకుఁడు నిర్మలినమైన గృహమున శుభ్రవస్త్రధారియై సంచరింప మాలిన్య ప్రమాదమునకుఁ గురికానట్లు సద్గోష్టిచే విజ్ఞానధనియై దుఃఖదూరుఁడై సుఖించు ననుటయు విశదమే. పాలు నీటితోఁ గలియునుగాని, పాలసారమగు వెన్న నీట నున్నను నీటి నంటక వేఱుగనే యుండునట్లు పరిపక్వజ్ఞానులగు మహాత్ములు ప్రపంచ మున (సంసారమున) నున్నను నిర్లిప్తులేగదా! అందువలన బరీక్షిన్మహారాజు సాధకుఁ డగుట లోకప్రవర్తనము ప్రమాదభరితమని సద్గోష్టిఁ గాంక్షించెను. అప్పటి విజ్ఞానధనులు (88000) అష్టాశీతిసహస్రసంఖ్యాకులు విచ్చేసిరి. శుకుఁడును వచ్చెను. చెప్పుట తేలికయేగాని యాచరించుట కష్టము. సత్యము, ధర్మము, అహింస, భూత దయ మొదలగునవి మంచివని యందఱును జెప్పుదురు. కాని వాని యాచరణము మాత్రము ప్రతివానికిఁ గష్టసాధ్యమే. శుకుఁడట్లుగాక తాను జదివిన భాగవతమున ననుభవపూర్వకమైన యానందమనుభవించి యా యాత్మానుభవమును వ్యక్తపఱచు టకుఁ దగు నవకాశము లభించెనని సంతసించెను. అద్దానినిఁ బరీక్షిన్మహారాజునకు విజ్ఞానధనులు, వేదవేదాంగపారంగతులు నగు యెనుబదియెనిమిదివేలమంది మహా ఋషుల సన్నిధానమున నిరాఘాటముగ వ్యక్తపఱచెను. అనుభవములేని వ్యక్తి "అట" అని చెప్పును. అనుభవముగలవ్యక్తి నిర్ధారణముగ నిరూపించి తాను సందేహరహితుఁడై సందేహిప్రశ్నలకన్నిటికిఁ దృప్తికరమగు సమాధానము లిచ్చి తనవలెఁ బృచ్ఛకునిగూడ శంకారహితునిఁ గావించి ధన్యునిఁ గావించును. శుకుఁడు వ్యాసభగవానుని కృషిఫలితమో యనునట్లు తత్కృతభాగవతముఁ జదివి యను భవముఁజేసికొని తాను దరించి పరీక్షిజ్జనపాలుని, వాని నెపమ్మున (88000) యెనుబదియెనిమిదివేలమందిమహర్షులను నింకనువిన్న యనేకమంది జనులనుదరింపఁజేసి పితౄణ, మనుష్యఋణ, దేవఋణాదులనుండి విముక్తుఁడాయెను.

సుఖసాధనములు తెలియక యజ్ఞానమున దుఃఖములనొందు మనకొఱకు విజ్ఞానమును బ్రసాదించుటకై జ్ఞానము నిలువఁజేయఁబడిన యుద్గ్రంథమగు నీ భాగ వతమందలి పరమార్థము గ్రహించి తరించి మనకొఱకు శ్రమపడిన యా మహర్షులకుఁ గృతజ్ఞులమౌట వారి కానందముఁ గల్గించి వారి కృషికి ధన్యవాదము లర్పించినవార మగుదుము. గమనింతురుగాక.

వేద వేదాంగ పారంగతులు, విజ్ఞానధనులు, మహామహులు నగు శౌనకాది మహర్షులు సూతునివలనను, పరాశరాదులు పిన్న యగు శుకునివలనను మాత్సర్యాది శత్రుగుణవిరహితులై సంస్కృతవ్యాసభాగవతము విని యానందించి తరించి వ్యాస భగవానుని కృషి సార్థకపఱచి సంతసింపఁజేసిన ట్లాంధ్రమహాజనులు, పండితులు, పెద్దలు, విజ్ఞానధనులు, లోకమున కపరిచితులము, పిన్నలము నగు మానుండి వెలువడిన యీ యాంధ్రభాగవత పఠనమున సంస్కృతవ్యాసభాగవతపరమార్థరహస్యవేదులై తరించి మాకృషిని సార్థకపఱచి భగవంతున కానందముఁ జేకూర్తురుగాక.

"శ్రీరామ నృసింహమూర్తి కవులు"

ఓం

# శ్రీమదాంధ్ర భాగవతము

రచయితలు:



శ్రీరామ నృసింహమూర్తి కవులు.




I have the pleasure to enrol Sri. Gandham Sreeramamurty and Sri. Irrinki Narasimhamurty who are popularly known as " Sreerama Narasimha Murty Kavulu " as our Court Poets. Hereafter they are entitled to the privileges of our Court.

Gadwal,

1-3-1945.

Youvaraja Saheb of Gadwal.

( For Maharani Saheba of Gadwal )

# శ్రీమదాంధ్రభాగవతము

## కథాసంగ్రహము.

---

### విదుర మైత్రేయ సంవాదము.

పాండవులు పండ్రెండుసంవత్సరము లరణ్యవాసము, నొక్కవత్సర మజ్ఞాతవాసము సలిపి తమ సమయంబుఁ జాలించి ధృతరాష్ట్రునిచెంతకుఁ దమ రాజ్యభాగముకొఱకుఁ గృష్ణుని రాయబారిగఁ బంపిరి. ఆకృష్ణుండును హస్తిపురికింజని విదురునింట విందుఁగుడిచి మహాసభలో ధృతరాష్ట్రునితోఁ బాండవుల రాజ్యభాగము పాండవుల కొసఁగుట ధర్మమని నొక్కి వక్కాణించెను. విదురుండును దానిని బలపఱచెను. దుర్యోధను డందుల కలిగి "దాసీపుత్రు నీ విదురు నీ సభకేల రానిచ్చిరి. నీచజాతి వారికి ధర్మాధర్మములవిధాన మేమి తెలియు"నని యీ మొదలగు దుర్భాషలాడి శ్రీకృష్ణుని బంధింప యత్నించెను. విదురుండు బంధునాశనంబు గుర్తెఱింగి దుర్యోధనుఁడాడిన దురాలాపంబులకు మనస్తాపముఁజెంది ధైర్య మవలంబించి మఱుమాటాడక శరశరాసనంబులు దిగవిడిచి క్రోధంబు నణంచి వనంబునకుఁజని యనేక పుణ్యతీర్థములఁ గ్రుంకులిడి యనేక పుణ్యక్షేత్రముల దర్శించుచు యమునానదీతటంబునఁ గృష్ణభక్తుండగు నుద్ధవునిఁగాంచి వానివలనఁ గురుపాండవ యుద్ధోదంతంబును, యాదవ నాశంబును, శ్రీకృష్ణావతార నిష్క్రమణంబును విని "యుద్ధవా! భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు మర్త్యశరీరంబుఁ ద్యజించునప్పుడు భక్తుండవగు నీ కంత్యసందేశ మేమొసంగెను" అని యడిగెను. దానికి నుద్ధవుఁడు "విదురా! "యంతిమమునఁ దనచెంతకుఁ జేరిన మైత్రేయమహర్షికి జ్ఞానోపదేశముఁజేసె. అతఁడా యుపదేశము నీకు వివరింపఁగలఁడు. వానివలన నీవు సర్వంబును దెలియఁగలవు. చను" మని పలికి యమునానదిదాటి బదరికావనంబునకుఁ జనియె. విదురుండును యమునానది నుత్తరించి కతిపయప్రయాణంబుల గంగానదీతటంబున యోగిజనగేయుండగు నా మైత్రేయునిం గాంచెను.

ఇట్లు విదురుఁడు ద్వైపాయనసఖుండగు మైత్రేయమునిపుంగవుంగాంచి "మునిపుంగవా! భక్తపారిజాతంబగు నా శ్రీకృష్ణభగవానుఁ డవసానకాలంబున నిడిన దివ్యసందేశంబేమి?" అన మైత్రేయుఁడు శ్రీకృష్ణభగవానుఁడు నిర్యాణకాలంబున సన్నిధికిఁజనిన నన్నుఁ జేరంజీరి విజ్ఞానంబెల్ల నుపదేశించి నీకు నెఱిఁగింపుమని యానతిచ్చుటంజేసి యవశ్యంబు నీకుఁ నెఱిఁగింతు. దత్తావధానుండవై వినుము. నిజోదరసంస్థితవిశ్వము నే విధాత మఱలమరల సృష్టించుచుండును. తొలుత నవ్యక్తము, ప్రకృతి, కాలచోదితము ననబరఁగు మాయవలన మహత్తత్త్వము పుట్టు. పిదప విశ్వనిర్మాణవాంఛ గలిగిన యచ్యుతుచే నది దృగ్గోచరమై రూపాంతరమునొందు. ఆ మహత్తత్త్వమువలన సత్త్వ, రజ, స్తమో, గుణమై కార్య,కారణ, కర్త్రాత్మకమై, భూతేంద్రియ మనోమయమై యహంకారతత్త్వ ముద్భవించు. సాత్త్వికాహంకారంబున మనంబు, వైకారికా కార్యభూతంబులైన దేవగణంబుఁ

గలుగు. రాజసాహంకారంబున నింద్రియములుపుట్టు. తామసాహంకారంబునఁ దన్మాత్ర లుదయించు. భగవన్నిరీక్షణంబునఁ గాలమాయాంశయోగంబున దేవగణంబులు నింద్రియములు దన్మాత్రలుఁ గూడుట నాకాశాది పంచభూతఁబులు నొండింటిఁ బుట్టించు. ఇవి సమైక్యము కానియెడల సృష్టింపనేరక భగవంతు నాశ్రయించు. ఆ భగవంతుఁడు మహదాదుల కన్యోన్యమిత్రత్వమందకున్న కతమున జగత్కల్పనాశక్తి లేకుండుట యెఱింగి కాలవేగంబున నుద్రేకంబునొందిన ప్రకృతితోఁ బొంది నిజబలంబందునిల్పి సప్తవింశతితత్త్వంబుల నొక్కపటిఁ బ్రవేశింప జగన్నిర్మాణమున కనువగు ననెను. విదురుఁడు మహాత్మా! యొక్క సందేహంబుగలదు. అగుణుఁడు నిర్వికారి యగు భగవంతునకు సృష్టి, స్థితి, సంహారంబులు లీలలైన సగుణుండగుట యెట్లు తటస్థించు? సమస్తశరీరములందు జీవరూపమానున్న దేవునకు దుర్భరక్లేశసిద్ధి యెట్టికర్మవలన సంభవించు? దీనిఁదెల్పుమన మైత్రేయుఁడు విదురా! దేవునకు గుణములు నంటవు. కర్మములును బాధింపవు. స్వప్నమునఁ దదవస్థచే జీవుఁడు తలనఱుకఁబడినట్లు ననేకబాధలనొందినట్లుఁ దలంచి జాగ్రదవస్థ నద్దానిని దెలియుచున్నను వాస్తవముకానట్లును, నిర్మలజల ప్రతిబింబితచంద్రబింబము తదంబుచాలనవిడంబనహేతువు నొందియు నాకాశంబునఁ గంపమొందనివిధంబునను, సర్వశరీరధర్మములు గలిగి చరించు జీవరూపదేవునకుఁ దత్తత్కర్మబంధములు గలుగనేరవు. పైనఁజెప్పిన ట్లవస్థాదోషము, జలదోషము (స్థానదోషము), ఉపాధిదోషములేకాని వాస్తవమున జీవునకు గుణకర్మబంధములు కలుగనేరవు. అవిద్యామహిమచే జీవావస్థఁ గర్మబంధనాదికము సంప్రాప్తంబగుఁగాని సర్వభూతాంతర్యామియైన భగవంతునికే కర్మబంధముఁ గలుగనేరదు. అట్టి యవిద్య తొలఁగుటకు యథార్థజ్ఞానము భగవద్ధ్యానము బాగుగ నుపకరించును.

ఇట్లు పలికిన మైత్రేయమునిపుంగవుంగాంచి విదురుం డార్యా! తొలుత సర్గము (సృష్టిసాధనములు) చెప్పితివి. ఇక ప్రతిసర్గము (ఆ సాధనములఁగావించిన విశ్వసృష్టి) మన్వంతరములు (కాలము) వంశములు వంశానుచరితములు (సృష్టిచరిత్ర) విశదపఱుపుమన మైత్రేయుండిట్లనియె. విదురా! నీ వడిగిన ప్రశ్నలకు చక్కగ సమాధానమొసఁగునది, భగవత్ప్రోక్తము, ఋషిసాంప్రదాయకము, పురుషోత్తమస్తోత్రము, పరమపవిత్రమునగు భాగవతపురాణకథాసూత్రము. కాన నద్దాని వివరించెద వినుమని యిట్లనియె. క్షీరసముద్రంబున భగవంతుఁడు శేషశయ్యఁ బవళించి జఠరమున దాచిన లోకనికాయముల సృజించుటకు సాధనమగు సూక్ష్మార్థము మనమునఁగని రజోగుణంబుఁ బుట్టించె. తద్గుణంబునఁ బరమేశ్వరు నాభిదేశమందు నళిననాళముదయించె. అంత నాపద్మముకుళము కర్మబోధితమైనకాలమున భగవత్తేజమున విరిసె. అప్పద్మకర్ణికయందుఁ జతురాననుం డుద్భవించె. అప్పుడు కమలజాఁడు ప్రళయజలధిజలంబునఁ దన జన్మకారణమగు పద్మనాళమూలమును దెలియఁగోరి యనేక సహస్రదివ్యవత్సరంబులు ప్రయత్నించెఁగాని పద్మనాళమూలముఁ దెలియఁజాలక విఫలుండయ్యె. తుదకుఁ బద్మకర్ణికకే చేరి యం దాసీనుండై యం తర్వీక్షణుండై తపోనియతిఁ దనహృదయకమలముననున్న నారాయణుఁగాంచి యానందపరవశుఁడై కృతకృత్యుఁడై స్తుతించె. అంత శ్రీమన్నారాయణుఁడు సంతసించి విధాతా! మత్ప్రీతికై నిన్ను సృష్టించితి. అహంకారమూలతత్త్వము నొంది నాలో నిశ్చయగతి నివసించియున్న జగంబుల బహిర్వ్యాప్తిఁ గావింపుము. అని పలికి యంతర్హితుండయ్యె. అప్పుడు విధాత లోనున్న సమస్తలోకములఁ బొడఁగాంచి వానినే మరల సృష్టించె. ఇటుల భగవంతుఁడు కాలానుగుణ్యముగ జగంబుల సృష్టించి, రక్షించి, యణంచుచుండు. అని కాలవిధానంబును సచరాచర ప్రపంచనిర్మాణంబును శబ్దబ్రహ్మవిషయంబును మున్నుగ విదురుఁడడిగిన సర్వవిషయంబులును మైత్రేయమునిపుంగవుండు వివరించి తెలిపె.

# యజ్ఞవరాహావతారచరిత్రము.

## మన్వంతరోదంతము.

మైత్రేయుఁడు విదురా! మానవుల ద్విపక్ష సంయుతమాసము పితృదేవతల కొక దినము. మానవుల సంవత్సర పరిమాణము దేవతల కొకదినము. అట్టి మూఁడువందల యఱువదియైదు దినంబు లొక దివ్యవత్సరము. అట్టి దివ్యవత్సరములు నాలుగువేల యెనిమిదివందలైన కృతయుగము. మూఁడు వేల యాఱువందలు త్రేతాయుగము. రెండువేల నాలుగువందలు ద్వాపరయుగము. పండ్రెండు వందలు కలియుగము. మొత్తము నాలుగు యుగములసంఖ్య పండ్రెండువేల దివ్యవత్సరములు (అన మానవ వత్సరములు) $12000 \times 365=4380000$. నలుబదిమూఁడులక్షల యెనుబదివేలు. ఇదియొక మహాయుగము. ఇట్టి మహాయుగములు డెబ్బదియొకటైన యొక మన్వంతరము. అట్టి మన్వంతరములు పదునాల్గు బ్రహ్మకొక దినము. (అన వేయి మహాయుగములు). అట్టి మూఁడువందల యఱువదియైదు దినములు బ్రహ్మకొక సంవత్సరము. అట్టి నూఱుసంవత్సరములు బ్రహ్మాయుర్దాయపరిమితి. ఇప్పటిబ్రహ్మకు నేబదియొకటవ సంవత్సరమున మొదటిదినము జరుగుచున్నది. ఈదినమున గతించు 1 స్వాయంభువ, 2 స్వారోచిష, **3 ఉత్తమ**, 4 తామస, 5 రైవత, 6 చాక్షుష, 7 వైవస్వత 8 సూర్యసావర్ణి, 9 దక్షసావర్ణి, 10 బ్రహ్మసావర్ణి, 11 ధర్మసావర్ణి, 12 భద్రసావర్ణి. 13 దేవసావర్ణి, 14 ఇంద్రసావర్ణి, అను పదునలుగురు మనువులలో నిప్పుడు సప్తమ మన్వంతరము జరుగుచున్నది. బ్రహ్మాయుర్దాయము నూఱుసంవత్సరములు తీరిన నది బ్రహ్మప్రళయము. పిదప మఱియొకబ్రహ్మ రాఁగలఁడు. బ్రహ్మాయుర్దాయ సంవత్సరములఁ బ్రతిదినంబును నిద్రావస్థను నైమిత్తిక ప్రళయము (దినప్రళయము) జరుగుచుండును. ఈబ్రహ్మకేబదియొకటవ సంవత్సరపు మొదటిదినమున బ్రారంభింపబడిన స్వాయంభువ మన్వంతరమునాటి కథ యడుగఁబడినది. బ్రహ్మదేవు ప్రతిదినంబునఁ బదునల్వురు మనువులును బ్రతిమన్వంతరమున మనువు వాని సంతతి (ఉపమనువులు) దేవతలు ఇంద్రుడు భగవదవతారము ఋషులును మాఱుచుందురు. ఇప్పటి సప్తమమనువు, అన. వైవస్వతుఁడు, వీనిసంతతి, యిక్ష్వాకాదులు, (ఉపమనువులు) ఆదిత్యాదులు దేవతలు, పురందరుఁ డింద్రుఁడు, గౌతమ, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, కశ్యప, వసిష్ఠ, జమదగ్ను లేడ్వురు ఋషులు. వామనుఁడు భగవదవతారము. మనువులు ఉపమనువులు లోకమును రక్షించుచుందురు. వీరి కతీతమగు రక్షణము దేవతలు, నింద్రుఁడుఁ జూచుచుందురు. వారికి నతీతమగు రక్షణము, (దుష్టశిక్షణము శిష్టరక్షణము), భగవదవతారము గావించుచుండును. దినప్రళయమున మఱుగుపడు శబ్దబ్రహ్మమును (వేదశాస్త్రరూపమగు వాఙ్మయమును, ఋషులు ప్రకటింతురు. విదురా! నీ వడిగిన స్వాయంభువమనువు బ్రహ్మ యేబదియొకటవ సంవత్సరపు ప్రథమదినమందలి ప్రథమమనువు. దినప్రళయమున లీనమైన భూమినుద్ధరించిన దీ కల్పమున శ్వేతవరాహము గాన దీనిని శ్వేతవరాహకల్పమని యందురు. జరిగినది పద్మకల్పము. ఇట్టి నైమిత్తిక కల్పములతోఁగూడిన బ్రహ్మకల్పము మహావిష్ణువున కొక నిమిషము. అనంతమగు కాలస్వరూపముఁ దలఁచుటచే మన యల్పాయుర్దాయము స్ఫురణకు రాఁగలదు. ఈ శ్వేతవరాహ వృత్తాంతమును బ్రథమ మనువగు స్వాయంభువుని పరిపాలన క్రమమును జెప్పెద సావధానచిత్తుఁడవై వినుమని యిట్లు చెప్పఁదొడఁగెను.

## శ్వేతవరాహావతారము.

స్వాయంభువగు చతుర్ముఖుని దేహంబు ద్వివిధంబైన నట్టి రూపద్వయ విభాగంబు స్వరాట్టగు స్వాయంభువమనువును దన్మహిషియగు శతరూప యను కన్యకయునుగా మిధునంబై జనించె. అమ్మిధు

వంబువలనఁ బ్రియవ్రతోత్తానపాదులను పుత్త్రద్వయంబు నాకూతి దేవహూతి ప్రసూతులను కన్యకాత్రయంబును గలిగిరి. అందు నాకూతిని రుచికునకు, దేవహూతిని గర్దమునకుఁ, బ్రసూతిని దక్షునకు నిచ్చె. వీరివలన మిథునసృష్టిని బ్రజాసంతతులచే జగంబులు పరిపూర్ణంబులయ్యె. అంత స్వాయంభువమనువు కమలగర్భునకు నమస్కరించి నాకెద్ది యాచరణీయం బానతిమ్మన బ్రహ్మ సంతసించి యజ్ఞంబు లాచరించి ప్రజావృద్ధి నెఱపి లోకసంరక్షకుఁడవు కమ్మనెను. అంత నమ్మనువు జనకా! దినప్రళయంబున భూతకోటి కాధారభూతంబగు ధరణి జలాంతర్నిమగ్నయయ్యె. అది యెట్లుద్ధరింపఁబడును? ఈ ప్రజాసంతతు లెట నివసించును? అని యడిగెను. విధాత పుత్త్రా! పూర్వము నాచే నిది జలంబులనుండి యుద్ధరింపఁబడి జనావాసయోగ్యంబైనది. మరల నిప్పుడు జలనిర్మగ్నయైనది. ఉద్ధరింపసాధ్యంబ అని భగవంతుని ధ్యానింప నతని నాసికావివరంబునుండి యంగుష్ఠమాత్రదేహంబుతో యజ్ఞవరాహంబు వొడమి క్షణమాత్రంబున విబుధు లాశ్చర్యపడ మహాగజప్రమాణమయ్యెను. బ్రహ్మ తన ధ్యానమునకును నీ వరాహావతారంబునకును సంబంధము కలదని నిశ్చయించుకొని యాతఁడే భగవంతుఁడని స్తుతింప మొదలిడెను. అంత నావరాహంబు మహావేగంబున సముద్రంబు దరియం జొచ్చెను. విధాత మహాప్రళయంబున యోగనిద్రావశుండు గాఁగ నుదకస్థంబైన భూమి రసాతలగతంబైన దాని నుద్ధరించుటకు సముద్రోదరంబుఁ దఱియం జొచ్చు నా వరాహరూపుని వేగంబు సైరింపఁజాలక సముద్రుం డార్తుని పగిది యూర్ములను భుజంబుల నెత్తి రక్షింపుమని యాక్రోశించుచుండెనో యన్నట్లు ఘూర్ణిల్లుచుండఁ దీక్ష్ణంబులైన ఖురాగ్రంబుల జలంబులు విచ్ఛిన్నంబులు గావించి యపారంబైన రసాతలంబుఁ బ్రవేశించి భూమిం బొడఁగాంచి తదుద్ధరణ ప్రయత్నంబున నుండె.

## దితి సంతాన కాంక్ష.

దక్షప్రజాపతి తనయ యగు దితి సంతానకాంక్షఁ బతిసంగమమును వాంఛించి సంధ్యాకాలంబున హోమశాల నగ్నికృత్యంబులఁ దీర్చుచున్న పతియగు కశ్యపుం గాంచి పుష్పసాయకశరనిర్భిన్నమానసయై వినయంబున నిట్లు పలికె. నాథా! కామశరవిద్ధమానసనై సంగమవాంఛ నీదరికిఁ జేరితి. మదనుఁ డదయుఁడై మదగజ మనటీకంబంబుఁ గరణిఁ జిత్తంబును వేధించుచున్నాఁడు. నా తోడి సవతు లెల్లరు నీసంగమ సౌఖ్యముఁ గాంచి పుత్త్రవతులైరి. అన్నియుఁ దెలిసిన మీవంటి విద్వాంసు లార్తులైన మాబోటివారల కోర్కులు వ్యర్థంబులు గాకుండఁ దీర్చుట ధర్మమే కదా? మా తండ్రియగు దక్షప్రజాపతి కూఁతులమగు మమ్ము వాత్సల్యంబునఁ బిల్చి మీ మనోగతుండగు భర్తను దెల్పుఁడన మేము పదుమువ్వురము మిమ్మే కోరియుంటిమి గదా అందఱకోరికలుఁ దీర్చి నామనోరథం బేల నిరసింతురు? అని బహువిధంబులఁ బలుకుచు సంభోగకాంక్షఁ దరిఁజేరిన దితిం గాంచి కశ్యపుఁ డిట్లనియె. తరుణీ! నీవు సంతానవాంఛఁ జేరితివి. నీకోర్కెఁ దీర్చుటయు నావిధి. కాని యొక్క ముహూర్తకాలమాగుము. ఇది సంధ్యాకాలము. రుద్రుఁ డిప్పుడు రౌద్రమూర్తియై భూతగణంబులతో విహరించుచుండు. ఉగ్రదేవతాకంబగు నీసంధ్యాకాలంబున గవఁగూడం జనదు. అన దితి తాళఁజాలక వారకామినియుఁబోలె కశ్యపుని నిర్బంధించెను. కశ్యపుండును భార్యానిర్బంధమునకుఁ దొలంగనేరక యీశ్వర నమస్కారంబుఁ గావించి యేకాంతంబునకుం జని కాంత యభిమతం బీడేర్చి సంగమానంతరము వార్చి స్నాతుండై బ్రహ్మగాయత్రి జపించె.

అంత దితి తన నిషిద్ధకర్మమునకు సిగ్గుపడి భయంబునఁ బతిం జేరి గర్భకుశలంబుఁ గోరుకొనెను. కశ్యపుండును యువతీ! వెలయాలివిధంబున సిగ్గువిడిచి నన్ను నిర్బంధించి నీచకాలంబునఁ గవగూడఁ జేసితివి కావున భద్రామభద్రులను నిద్దరు క్రూరకర్ములు నీ కుదయించగలరు. వారల భగవంతుఁడు దేవ

ప్రార్థితుండై సంహరించఁగలఁడు అనెను. దితి విచారంబునఁ బొక్కుచు నాథా! క్షమించి యటుల గాకుండఁజేయు మనఁ గశ్యపుండు సతీ! నీ యకృత్యంబున నింతవాటిల్లె. ఆ భద్రానుభద్రులే హిరణ్యాక్ష హిరణ్యకశిపునామంబులఁ బ్రసిద్ధి నొందఁగలరు. అందు హిరణ్యకశిపునకు భాగవతోత్తముండు జనించి దుర్వర్ణహేమ మగ్నిపుటంబునఁ బరిశుద్ధమగునట్లు దుష్టాత్మసంభవుండయ్యు వంశపావనుం డగు నని యోదార్చిపంపెను. దితియుఁ దనకుమారు లితరులచేఁగాక భగవంతునిచే హతులగుటకును వంశపావనుండగు మనుమఁడు జనించుటకును సంతసించి దుష్టపుత్రజననంబునేఁగల్గు దుఃఖమునుండి తొలంగెను. దితిగర్భంబు శతవర్షంబులు ధరియించెను. అంతదేవతలు భయకంపితులై చతురాననున కీ వృత్తాంతము నివేదించిరి. అతండు దానికిఁ దగుకారణ మీ విధంబునఁ జెప్పందొడంగె.

## జ య వి జ యు ల శా ప ము

దేవతలారా! నా మానసపుత్రులగు సనక, సనందన, సనత్సుజాత, సనత్కుమారు లడ్డులేనివారై సమస్తలోకంబులు గ్రుమ్మరి యొకనాఁడు వైకుంఠమునకు విష్ణుసేవారతులై చనిరి. ఆ వైకుంఠధామంబున భగవద్దర్శనకుతూహలమానసులై యాఱుకక్ష్య లప్రతిహతంబుగ దాటి యనంతరము సప్తమకక్ష్యనున్న సమానవయోవిశేషుల గదాధరుల వేత్రదండాభిరాముల నిద్దఱ ద్వారపాలకులఁ గాంచిరి. సనకాదులు వృద్ధులయ్యుఁ బంచాబ్దంబులబాలకులై నిశ్శంక ననివారితగమనంబులఁ జనుచుండ నా తపస్సంపన్నుల భగవద్దర్శన కుతూహలుల ద్వారపాలకు లడ్డుపెట్టిరి. తమకుఁగలిగిన యవరోధమున కలిగి ఓరీ! మ మ్మకారణంబుగ వారించితిరి. స్వామిహితార్థము కుటిలులఁ బ్రవేశింప నీయకుండుట కే మిరిచటనుంటిరి. ప్రభువు సాపరాధులగు కింకరుల దండించు ననుభయంబు దౌవారిక లక్షణమగుట నడ్డితిమన్నను యుక్తాయుక్త పరిజ్ఞానముండవలదా? మందబుద్ధులరై భగవద్దర్శన కుతూహల భాగ్యసౌఖ్యమున కవరోధంబుగల్గించి సుఖభంగంబుగావించితిరి. కావున లోభమోహములు శత్రువులై బాధింప భూలోకంబున జనింపుఁడని శాపంబిడిరి. ద్వారస్థులగు జయవిజయులు మహాత్ములకు నమస్కరించి అయ్యా! మేము మా సేవకధర్మము నెఱపితిమి. అకృత్యంబొనర్చిన మాశిక్షయుచితంబ కాని సజ్జనావమానముఁగావించినవారిగ మమ్ము లోకము పరిగణింపకుండుగాక, మేము జన్మించు జన్మలందును భగవంతుని సందర్శనాదిభాగ్యంబులు లభించుఁగాక, మీదిజన్మంబుల మా కీ శాపంబులేకుండుగాక, అనుగ్రహింపుఁడని ప్రార్థించిరి. అంతనా ద్వారస్థకలకలంబు భగవంతుఁడాలకించి లక్ష్మీ విలాసంబులఁజాలించి ద్వారంబులుగడచి పాదచారియై యచటికిఁ జనుదెంచెను. అట్టి భగవంతునిఁగాంచి సనకాదు లానందపరవశులై స్తుతించిరి. భగవంతుఁడు సనకాదులఁగాంచి జయవిజయాభిధానులగు మదీయద్వారపాలకు లిరువురు మిమ్ముఁగైకొనక మదీయాజ్ఞాతిక్రమణులై చేసిన యపరాధంబునకుఁ దగినదండంబుఁ గావించితిరి. ఇది నాకును నభిమతంబ. భృత్యవర్గంబుచేయు నపరాధంబు స్వామిదియ. కాన నీ తప్పునకు మాననీయుండనైన నన్ను మన్నించి ప్రసన్నులగుదురుగాక. శరీరమునఁబుట్టిన శ్వేతకుష్ఠు మొదలగు చర్మవ్యాధుల శరీరపురంగు మారునట్లు భృత్యదోషంబున యజమాని సద్యశంబు దుర్యశంబగుగదా! మదీయమందిరమునకుఁ జనుదెంచిన సజ్జనులగు మిమ్ము నాభృత్యు లవమతిఁజేసిన యా దోషంబు నాయదియ కాదె? నాహృదయము తెలియక యుద్వృత్తిఁగడంగి మీ యానతిఁగడచిన తద్దోషఫలము వీరికి సంప్రాప్తంబయ్యె. నాచిత్తంబుననున్న పద్ధతియు నిదియ. వీరు భూమియందుఁబుట్టి యచిరకాలంబున మదీయాంతికమునకు వచ్చునట్లనుగ్రహింపుఁడనెను. సనకాదులు చిత్తంబులఁ దృప్తినొందక భగవంతునివాక్యంబుల గంభీరభావంబులు దురవగాహంబులై యుండ నిట్లనిరి. దేవా! మీ జయవిజయుల కలిగి మేము శాపంబిడితిమి. దానినుండిరక్షించిన రక్షింపుము. లేదా యొక్కువ శిక్షవిధించిన విధించుము. వీర లనపరాధులైన మావాక్యము లసంబద్ధములైనవైన మమ్మెన్న నీచిత్తంబు

కొలఁది యాజ్ఞాపింపుమనిరి. అంత భగవంతుఁడు మీ యాజ్ఞను వీరు భూమి నసురులై చరింతురు. వైరానుబంధంబున విగతదోషులై మదీయాంతికమునకుఁ జేరఁగలరు. చింతఁదక్కుఁడనెను. జయవిజయులఁగాంచి మీ రసురయోని జనింపుఁడు. తపస్సంపన్నులగు మహర్షి వాక్యంబులకు భంగపాటు వాటిల్లనేరదు. నాయందలి వైరానుబంధంబున నన్నుఁజేరగలరని రమాదేవితో నభ్యంతర మందిరమునకుఁజనియె. ఆ జయవిజయులే యిపుడీ దితిగర్భమున విరాజిల్లుచుండిరని బ్రహ్మ దేవతలకుఁజెప్పెను.

### హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జననము.

అంత దితి యనేక దుశ్శకునంబులు దోఁచుచుండ నిరువుర పుత్రకులఁ గనెను. కశ్యపుఁడు పుత్రకులఁ జూచి దితి మందిరమునకుఁ జనుదెంచెను. దితిగర్భమున ముందు బీజము నిక్షిప్తమై వెనుక జనించిన పుత్రునకు హిరణ్యకశిపుఁడనియు, వెనుక నుంచఁబడిన వీర్యమున ముందు జనించిన పుత్రునకు హిరణ్యాక్షుఁడనియు నామంబులిడెను. హిరణ్యకశిపుఁడు కమలగర్భవరదానప్రభావంబున మృత్యుభయంబులేక నిర్భయుండై సుఖముండె. సోదరుఁడగు హిరణ్యాక్షుఁడు ప్రతిదినంబు గదాదండంబు ధరించి తన్నెదిరించి కదనంబుఁ జేయంజాలిన మొనగానిఁ గానక భూలోకంబెల్లఁ గ్రుమ్మరి స్వర్గంబునకుఁ జనెను. దేవతలును భయకంపితులై తావుల వీడి యొందేనిఁ జనిరి. అంత హిరణ్యాక్షుఁడు వార్ధింజేరి తన యుచ్ఛ్వాస నిశ్వాసంబులఁ జెలరేగిన తరంగముల గదాదండంబునఁ గొట్టుచు నవ్వార్ధిం బెక్కు వత్సరంబులు వీరవిహారంబుఁ గావించె. అంత వరుణపాలితంబగు విభావరీనగరంబునకుఁ జని వరుణునిఁ గాంచి నీ వతిబలుండవని ప్రఖ్యాతిఁజెందితివి. నాతో రణంబునకు రమ్మని పరిహాసితోక్తులం బలికెను. వరుణుఁడు శత్రుబలము తనబలము గమనించి శత్రువుతో యుద్ధమున కిది సమయంబుగాదని తాలిమి వహించి ఆర్యా! సంగరంబులు చాలించి శాంతిఁబూని నియమపాలితులమై యున్నవారలము. నిన్నెదిరించ ముకుందునకుఁదక్క యెవ్వరికిని శక్తిలేదు. అతండు వైకుంఠంబున నున్నవాఁడు. నీకు వెఱచి చరించు పిఱికిపందలతో నేమి? అచటికిఁ జనుము. అతఁడు నీ కుతూహలంబుఁ దీర్పఁగలఁడనెను. అంత హిరణ్యాక్షుఁడు వైకుంఠంబున కరుగుచు మార్గమధ్యమున నారదుఁగాంచి నారదా! నేను వైకుంఠంబునకు ముకుందునితోఁ బోరఁ జనుచుంటిని. అతం డట నుండునా! అని యడిగెను. నారదుఁడు మహాత్మా! అతఁడిపుడు వైకుంఠంబున లేఁడు. ధరణిసముద్ధరణార్థము సముద్రములో రసాతలంబున నున్నవాఁడు. వేగిరమునఁ జనుము. యుద్ధ మవశ్యము సంభవించు ననెను.

### హిరణ్యాక్షవధ

హిరణ్యాక్షుఁడు గదఁబూని వేగిరంబున జలధింజొచ్చి ధరిత్రి నుద్ధరించు నా వరాహమూర్తిం గాంచి ఛీ ఛీ! భగవంతుఁడన వరాహమా! అని యీసడించి పలుకుచు నావరాహరూపుని గదంగొట్టెను. అప్పుడా వరాహమూర్తి హుంకరించి యుద్ధంబునకుఁ దలఁపడె. అప్పు డా యిరువురకును పోరు ఘోరంబయ్యె. దితికి స్తనంబులనుండి శోణితధారలు స్రవించె. ఆమెయుఁ బతివాక్యంబు తప్పదని వ్యాకులితమానసయై యుండె. అయ్యజ్ఞవరాహ మా హిరణ్యాక్షుఁ బొలియించి దేవతల స్తుతులంది ధరణిసమస్థితిం బొందించి వైకుంఠంబున కరిగె. ధాత స్వాయంభువమనువున కా భూమింజూపి ప్రజాసంతతుల వృద్ధినొందించుచు నీ భూమండలంబును బాలింపుమని తనలోకంబునకుఁ జనియె.

## కపిలోపాఖ్యానము

కృతయుగంబున బ్రహ్మమానసపుత్రుండగు కర్దమప్రజాపతి ప్రజలసృష్టించుటకునై బ్రహ్మను మతినొంది సరస్వతీ నదీతీరమున పదివేల దివ్యసంవత్సరంబు లేకాగ్రచిత్తంబున భగవంతునిఁగూర్చి

తపంబొనర్చెను. అంత భగవంతుఁడు ప్రత్యక్షంబు కాఁగ శబ్దబ్రహ్మశరీరవంతుండగు నాదేవుని వేద వాక్కులస్తుతించి తనకోరిక నిట్లుదెలిపెను.

దేవా! నిన్నుదర్శించియుఁ దుచ్ఛకామంబులఁగోరి భవదీయ మాయామోహితులు సంసార పారావారంబున నిమగ్నులగుదురు. నేనును నట్టికోరికయే కోరుచుంటిని, కాని యది నీ యాజ్ఞాచక్రము ననుసరించుటకేగాని మదీయ కామంబుకొఱకుఁగాదు. ఇంతవరకు మానససృష్టిమాత్రము గావింపఁబడియె. ఇంతటినుండి మిథునసృష్టిగావింప నీదయచే నిచ్చవొడమెడిని. కాన నందుల కనువగు సమానశీలయయిన భార్యం బరిణయంబుగా నపేక్షించి కల్పతరుమూల సదృశంబైన భవదీయ పాద మూలంబు నాశ్రయించితి' నన భగవంతుండు మునివరా! యే కోరికచే నన్నారాధించితివో యది నీకు లభింపఁగలదు. బ్రహ్మమానసపుత్రుండగు స్వాయంభువమనుచక్రవర్తి బ్రహ్మావర్తదేశంబును బాలించు చున్నవాఁడు. అతఁడు శతరూపాహ్వయభార్యాసమేతుండై భర్తృకామయగు దేవహూతియను కుమార్తెతోఁ నీ పిచటికి రాఁగలండు. ఆ దేవహూతి నీకు ననురూపవయశ్శీలసంకల్పగుణాకర. అద్దానినీకుఁ బరిణయంబుఁగావించు. ఇది మదీయేచ్ఛ. భవదీయమనోరథంబిట్లు సిద్ధించును. ఆమెయందునీకు సౌందర్యవతులైన తొమ్మండ్రు పుత్రిక లుదయింపఁగలరు. ఆ కన్యకానవకంబునందు మరీచ్యాది మహర్షులు పుత్రోత్పాదనంబుఁ జేయఁగలరు. నిష్కాముఁడవగు నీకు దేవహూతివలనఁ బిమ్మట నేను బుత్త్రుఁడనై జన్మించి తత్త్వసంహిత నుపన్యసింతు ననిచెప్పి యంతర్ధానముఁ జెందె.

## దే వ హూ తి క ర్ద ము ల ప రి య ణ ము.

కర్దముఁడు బిందుసరంబున భగవద్వాక్యము నిరీక్షించుచుండ మఱునాఁడు కనకరథారూఢుం డగుచు స్వాయంభువుండు నిజభార్యాసమేతుండై భర్తృవాంఛాపరయైన పుత్రికకుఁ దగినవరు నన్వేషింపఁజాలక తుదకు బిందుసరోవరంబునకుఁ జనుదెంచెను.

కర్దమునకు సాక్షాత్కరించిన భగవంతుని కృపాసార్ద్రనయనయుగళంబు నుండి యానందబాష్పబిందువులు కురియుటంజేసి సరస్వతీనదీ పరివృతంబగు నా సరోవరంబు బిందుస రోవరంబను నామంబుఁజెందె. అందలి కర్దమప్రజాపతియాశ్రమంబు స్వాయంభువుండు గనుంగొని మిత పరిజనులతోఁజొచ్చి కర్దమప్రజాపతికి సాగిలిమ్రొక్కె. అతండును దనగృహంబునకు విందైవచ్చిన యమ్మనువునాదరించి యర్ఘ్యపాద్యాదివిధులఁ బరితుష్టుఁగావించి పూర్వోక్తంబైన భగవదాదేశంబు సంస్మరింపుచు నమ్మనువునకిట్లనియె. మహాశయా! భవదాగమనంబునకు నిమిత్తంబెయ్యది? అన మునీం ద్రునకు నరేంద్రుండిట్లనియె. ఓప్రజాపతీ! దుహితృస్నేహదుఃఖపరిచ్ఛిన్నాంతఃకరణుండనై సకల దేశభ్రమణఖిన్నుండనైన నావిన్నపం బవధరింపుము. ఈ కన్యకామణి నాకూతురు. దేవహూత్యభిధాన. పతిగనెవ్వరిని వరింపక నారదోక్తంబున మిమ్ము వరింప నభిలషించి యరుదెంచినది. అనురూప గుణశీల విరాజితయగు దీనివరింపుము. ఎట్టివిరక్తులైనను:దనయంత లభించు సౌఖ్యంబుల వర్జింపరన నిఁక రక్తులగు వారు లభ్యంబులగు సౌఖ్యంబులఁద్యజింతురే? అభిమాని తనవేడికోలు ప్రతిహతంబైన యశము, గౌర వముఁజెడుననిబాధపడు. మీరు వివాహేచ్ఛఁ బరఁగుచుంట నెఱింగియే యిచటి కరుదెంచితి. కాన మదీయప్రార్థన వీటిఁబుచ్చక యస్మత్తనూజను వరియింపుడు. అనిన గర్దముండు సంతసంబున నమ్మనువు కిట్లనియె. రాజా! సర్వాంగసుందరియగు నీ కన్యకామణిని కందుకక్రీడా పరవశను సౌధాగ్రస్థితను విమానారూఢుండై యాకాశమునఁజను విశ్వావసుండను గంధర్వనాయకుండుగాంచి మోహావేశంబునఁ గ్రిందంబడెనని విందు. ఇంద్రియ జయుండగు భగవద్భక్తుండుగాక యీమెను నితరుఁడు బొడఁగాంచ లేఁడనియందురు అట్టికోమలి యదృష్టవశమునఁ దనంతవచ్చి కామింప వలదనువాఁడుండునె? నాకుం

దగిన యీకన్యకామణినిఁ దప్పక వరియింతుఁగాని యొకసమయంబుగలదు. సంతానపర్యంతంబీమెతో గృహస్థధర్మము నెఱపి పిమ్మట భగవదాజ్ఞఁ దపంబునకుఁజనుదు. భగవదాజ్ఞోల్లంఘనంబు సేయరానిదని తెలియరానిది కాదుకదా. అన మనువు భార్యయగు శతరూపయొక్కయు, కుమార్తెయగు దేవహూతి యొక్కయు చిత్తంబు నెఱింగి మునిసమయంబున కియ్యకొని విధ్యుక్తప్రకారంబున సాలంకృత కన్యాదానంబొసంగి విగతచింతాభరుండై దుహితృనియోగవ్యాకులిత స్వాంతుండై కూతుం గౌఁగలించుకొని ధైర్యంబుఁజెంది నూతనవధూవరుల నాశీర్వదించి శతరూపాసమేతుండై కనక రథారూఢుండై బ్రహ్మావర్తదేశంబునకుం జనె.

## తపస్సంపద.

ఇట్లు స్వాయంభువుండు తనకుమార్తెయగు దేవహూతిని కర్దమప్రజాపతికి వివాహంబుగావించి చనినయనంతరంబు దేవహూతియుఁ బతిభక్తిగలిగి శుశ్రూషణంబులు గావించుచుండెను. నిజసేవాయాసకృశీభూతదేహయైయున్న దేవహూతిం గరుణాతరంగితాపాంగుండై కర్దముండు కనుంగొని నా శుశ్రూషణంబున యుష్మద్దేహంబు కార్శ్యంబుఁజెందె. నీకువలయువరంబేదేనిఁ గోరుకొనుము. క్షణమాత్రంబున నాశనంబులగు నీ తుచ్ఛభోగములఁజెప్పనేల ? ఎట్టి దివ్యభోగంబులనైనను మదీయ తపోబలంబున లభింపఁజేయువాఁడనన సలజ్జయై యాకుంచిత వదనయగుచు మృదుమధురోక్తుల భర్త కిట్లనియె. అనఘా ! భవదీయ ప్రభావవిశేషం బే నెఱుంగనిదానఁగాను. భవదీయసంయోగవాంఛాపరతంగృశీభూతంబైన యీదేహం బెవ్విధంబున మజ్జనభోజన, పానసుఖంబులం బరితుష్టింబొందు నట్టి, కామశాస్త్రం బుపశిక్షించి యందుల కుచితంబులగు వివిధాంబరాభరణ మాల్యానులేపనమందిరారామ ప్రముఖ నిఖిలవస్తువిస్తారంబుగావించి కరుణింపుము. అన కర్దముండు నిజయోగమాయాబలంబున దివ్యవిమానంబుఁ గల్పించి దేవహూతికిఁజూపిన నామెయు సంతసింపకుండుటయెఱింగి సతీమణీ ! నీవీ జలాశయంబుఁ బ్రవేశింపుము. నీ మనోరథము సిద్ధించఁగలదు. అన పతియాజ్ఞ బిందుసరోవరంబునఁ బ్రవేశించెను.

అంత సర్వాభరణభూషితయై రుచిరసూక్ష్మాంశుకధారిణులు కిశోరవయఃపరిపాకశోభితలు నుత్పలగంధులునగు కన్యకాసహస్రంబుగొలువ నాశ్చర్యపరీత మానసయై కర్దమ తపస్సంపద నుగ్గడించి సరోవరంబువెలువడి నిజపతికిం బ్రణమిల్లె. అంత గర్దముం డానందభరితుండై కన్యకాసహస్ర పరివృతయగు నిజభార్యంగూడి విమానారూఢుండై తారాగణ పరివృత రోహిణీయుక్తుండగు సుధాకరుండుం బోలె విరాజిల్లె.

## సంతానప్రాప్తి.

ఇట్లు నిజభార్యావాంఛితంబుఁ బూరింప శతసంవత్సరంబు లనంగకేళీవిహారంబులం సలిపె. యా దేవహూతియందుఁ దొమ్మండ్రుకుమార్తెలంగని కర్దముండు సన్యసింపఁదలంచె. అట్టి పతికోరిక యెఱింగి నాథా ! సంతానపర్యంతంబు గృహస్థధర్మము నెఱపుదునని సమయంబుఁజేసి యిట్లు కూతుల నొసంగి చనిన వీరు తమంత భర్తలవెతకికొందురె! నాయందు దయయుంచి నాకోరికమన్నించి పుత్రికలకు దగినభర్తలకుఁ బరిణయమొనర్చి నాకు జ్ఞానోపదేశంబు జేయంగలపుత్రునొకనిఁ బ్రసాదించి సన్యసింపుఁడు. చాలకాలంబు మోహంబున నూరకపోయె. ఐహికసుఖంబులు నీహమాత్రె. సత్పురుష సాంగత్యంబున లభింపని మనోరథంబుకలదె ? అనెను. కర్దముండు సంతసించి దేవహూతీ! చింత నొందకుము. అచిరకాలంబున భగవంతుండు నీగర్భమునఁ బ్రవేశించు. వ్రతనిష్ఠందవిలి భగవంతు నారాధించుము. అతఁడు నీమనోజనిత శంకాగ్రంధి విచ్ఛేదముఁగావించునని యెను. దేవహూతి యానందపరవశయై వ్రతనిష్ఠాపరురాలై హరిని ధ్యానించుచుండెను.

## కపిలుని జన్మము.

అంత నా కర్దమ దేవహూతులకు భగవంతుండు పుత్రుండై లోకమానందింప జనించెను. ఆతండే కపిలుండు. అట్టి భగవంతునిదర్శించి కర్దమప్రజాపతికి ధన్యవాదములు సమర్పించుకొఱకు మరీచ్యాదిమునిగణసమేతుండై బ్రహ్మ చనుదెంచెను. విధాత కర్దముంగాంచి ప్రజాపతీ! భవదీయ తనూభవలఁ బ్రకటశీలవ్రతాచారసంపన్నలైన యీ మరీచ్యాదిమునులకుఁ బెండ్లిఁగావింపుము. అట్లైన ప్రజాసృష్టి వృద్ధిఁబొందఁగలదని చెప్పి కపిలునిస్తుతించి దేవహూతికర్దములకు ధన్యవాదములర్పించి బ్రహ్మ తనలోకంబునకుఁజనియె. కర్దముండు విధాతృనాజ్ఞ మరీచికిఁ గళను, అత్రికి ననసూయను, అంగిరునకు శ్రద్ధను, పులస్త్యునకు హవిర్భువును, పులహునకుగతిని, క్రతువునకు క్రియను, భృగువునకు ఖ్యాతిని, వసిష్ఠునకు నరుంధతిని, నధర్వునకు శాంతిని వివాహంబుగావించె. వారును దమతమ భార్యలం గూడి నిజాశ్రమంబులకుఁ జనిరి.

## కర్దమ తపోయాత్ర.

కర్దముండు భగవంతుండు తనకుఁ గుమారుండై పుట్టుట యెఱింగి వివిక్తస్థలంబున నా కపిలునికి వందనంబాచరించి యిట్లని స్తుతించె, దేవా! మదీయగృహంబునఁ బూర్వంబునం బ్రతిశ్రుతంబులైన వాక్యంబులు దప్పకుండ ననుగ్రహింప నుదయించితివి. తత్త్వసంహిత నుపదేశించి యిఁక నన్ను ధన్యునిఁగావింపుమని వేడుకొనెను. అంతఁ గపిలుండు కర్దముంగాంచి మునివరా! నాచెప్పంబడిన రీతి నుదయించితి. ఈజన్మ నాకొఱకుఁగాదు. జిజ్ఞాసువులు, మహాత్ములునగు నీవంటి మునులకుఁ దత్త్వసంహిత నుపదేశించుటకే యని తలంపుము. నన్ను భవదీయాంతఃకరణసరోజాతకర్ణికాతలంబున సుస్థిరుంజేసి యింద్రియంబుల నిరసించి మనోనేత్రమునఁ గాంచుచుండుము. అట్లైన మోక్షమునొందెదవని చెప్పెను. కర్దముండు కపిలునికి నమస్కరించి దేవహూతికిఁ గపిలునాశ్రయింపుమని చెప్పి వనంబునకుఁ జనియె.

అచ్చటఁ గర్దముఁడు మౌనమున నిస్సంగుండై పరబ్రహ్మంబును జిత్తంబున నిల్పి యహంకారంబువిడిచి మమత్వంబు నిరసించి సర్వభూతసమత్వంబు భజించి శాంతశేముషీగరిష్ఠుండగుచు నిస్తరంగంబగు వార్ధిచందంబున ధీరుండై నిఖిలప్రపంచమును దైవమయంబుగాఁ దలంచుచు భక్తియోగంబున భాగవతగతింజెందె.

## దేవహూతి కపిలు ముక్తిమార్గప్రబోధార్థ మాశ్రయించుట.

కర్దముండు వనంబునకుఁ జనినయనంతరంబు మాతృవత్సలుండైన కపిలుండు బిందుసరంబున వసించియుండ దేవహూతి తత్త్వమార్గప్రదర్శకుండైన సుతునిఁగనుంగొని బ్రజాపతి వచనంబులం దలంచుచు నిట్లనియె. అసదర్థంబులగు నీయింద్రియముల ఘర్షణముచే నజ్ఞానతిమిరావృతనైన నాకు విజ్ఞానోదయము గల్గింప జ్ఞానభాస్కరుండవగు నీవుదక్క మరెవ్వరుదిక్కు. నే నబలను. నాయజ్ఞానంబెట్లు నివర్తించు, నేనేమిచేయవలయు? ఎయ్యది తెలియవలయు? అడిగి తెలిసికొనుటకును నసమర్థురాలను. కరుణించి వలయు తత్త్వసంహిత నుపదేశింపుమనెను. కపిలుండు మందస్మితముఖారవిందుండగుచుఁ బరమశాంతంబున నిట్లువచించె. జననీ! చిత్తమే భవబంధమునకు నపవర్గమునకుఁ గారణంబగు. ఆచిత్తము సత్త్వరజస్తమోగుణంబుల వికృతింజెందెనేని భవబంధకారణంబును నారాయణాసక్తమయ్యెనేని మోక్షకారణంబును నగు. మనంబెప్పు డహంకారమమకారరూపాభిమానజాతములగు కామక్రోధాదికలుషవ్రాతంబులచే విముక్తంబై పరిశుద్ధంబగు నప్పుడ దుఃఖరాహిత్యంబగు మోక్షంబు సిద్ధించు. పఁగం విత్రాదియార్థా ద్యసద్విషయంబుగ నొనర్పఁబడిన జీవునకు

శాశ్వతబంధకారణంబును నంతఃకరణసంయమనహేతుభూతంబైన సద్విషయంబుగ నొనర్పఁబడిన ననర్గళమోక్షద్వారంబును నగుఁ గావున సర్వసంగవివర్జితులగు పరమభాగవతజనుల సంగం బపేక్షణీయము. దుర్జనసంగంబు త్యాజ్యంబు నని పలికెను. దేవహూతి యనఘా! ఏభక్తిచే నేయోగంబుచేఁ జిత్తము నిశ్చలముగ నిష్కళంకముగ మోక్షమార్గముఁ బొందఁ దనువగు పథంబు; నను వర్తించు నట్టి తత్త్వమార్గము విస్పష్టముగ స్ఫుటముగ సాకల్యంబుగ మందబుద్ధిని నబలను నైన నాకుఁ దెలియ నానతీయుమనినఁ గపిలుం డిట్లనియె.

## కపిలుని విజ్ఞానప్రబోధము.

మాతా! భక్తిమార్గంబ సర్వోత్కృష్టము. ముక్తికంటె గరిష్ఠము. దీప్తమగు జఠరాగ్ని భుక్తాన్నము జీర్ణమునందఁజేయునట్లు జన్మకారణమగు లింగదేహమును భక్తియే నాశనముఁజేయఁగలదు. అశాశ్వతములైన స్థూలదేహముతో నాశనముఁజెందు ధన, పశు, మిత్ర, వనితాదులపై మమకారముఁ దొలఁగించి భగవంతు నారాధించుచుండిన నతండే భవనీరధినుండి తరింపఁజేయును. ఏవాని నాజ్ఞఁ బంచభూతములు మొదలగునవి యనుసరించి చరించుచుండునో యట్టి భగవంతునియందలి భక్తిని భక్తులు నిర్భయాత్ములై చరింతురు. కాన భగవంతునియందు ఐక్యము, విశ్వాసము నతని ప్రభావంబుఁ దెలియఁబడుటచే నేర్పడును. ప్రకృతితత్త్వంబు దెలియఁబడుట దాని యథార్థంబును గోచరం బగును. ప్రకృతిపురుషుల భేద మెఱింగిన నరులు ప్రకృతిగుణంబుల విముక్తులై హృదయగ్రంథివిచ్ఛేదకము నాత్మదర్శనరూపము నగు మోక్షము వడయుదురు. కాన నట్టి తత్త్వలక్షణముఁ దెలియఁబఱతు వినుము. కర్తృత్వశూన్యుండగు నీశ్వరుండు సాక్షియగుటంజేసి కార్యకారణ కర్తృత్వంబును ప్రకృత్యధీనంబులనియు, సుఖదుఃఖభోక్తృత్వంబులు ప్రకృతివిలక్షణుండయిన పురుషునివనియు నెఱుంగుము. అమ్మా! ప్రకృతి చతుర్వింశాత్మకము. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులను పంచమహాభూతంబులును, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబులను పంచతన్మాత్రలును, త్వక్చక్షుశ్శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణంబులను పంచజ్ఞానేంద్రియంబులును, వాక్పాణిపాద పాయూపస్థములను పంచకర్మేంద్రియంబులును, మనోబుద్ధిచిత్తాహంకారములను నంతఃకరణచతుష్టయంబును, జతుర్వింశతితత్త్వాత్మకప్రకృతి యనఁబడు. ఇట్టిపురమున శయనించుటవలన నాత్మ పురుషుఁడనఁబడును. క్షేత్రజ్ఞుఁడైన పురుషునితో నిది పంచవింశతి తత్త్వాత్మకంబయ్యె. ప్రకృతిపురుషుల సంగమంబున బింబప్రతిబింబసామ్యమున మహత్తత్త్వముఁబుట్టె. అందు సత్వ, రజ, స్తమోగుణము లుదయించె. క్రియారూపంబునఁ గల్గు నహంకారంబు సాత్వికాహంకారము, రాజసాహంకారము, తామసాహంకారము నని త్రివిధంబయ్యె. సాత్వికాహంకారంబున నాధిదైవతములగు నగ్ని, సూర్యుఁడు, వరుణుఁడు, నశ్వినీదేవతలు, వాయువు, రుద్రుఁడు, నింద్రుఁడు, హరి, యోషధులు, నదులు, సముద్రములు, మొదలగు దేవతలును రాజసాహంకారంబున నాధిభౌతికంబులగు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, పంచతన్మాత్రాదులు, మనోబుద్ధిచిత్తాహంకారాదులు నుదయించె. తామసాహంకారంబున నాధ్యాత్మికములగు చక్షురాదిగోళంబులును జనించె. వికృతిం బొందిన యహంకారంబున నాకాశగుణకంబగు శబ్దతన్మాత్రయు నందుండి నభమును శబ్దగ్రాహియగు శ్రోత్రమును గలిగె. దైవచోదితమై వికృతిం బొందిన శబ్దతన్మాత్రకంబగు నభంబువలన స్పర్శతన్మాత్రయు, నందుండి వాయువును, స్పర్శసంగ్రహం బగు త్వక్కును గలిగె. స్పర్శతన్మాత్రకవాయువునుండి రూపతన్మాత్రయు నందుండి తేజంబును రూపోపలంభనంబగు చక్షువును గలిగె. రూపతన్మాత్రిక తేజమునుండి రసతన్మాత్రయు నందుండి జలంబును రసగ్రాహకంబైన జిహ్వయుఁ బొడమె. రసతన్మాత్రికజలంబునుండి గంధతన్మాత్రయు నందుండి పృథ్వియు గంధగ్రహణంబగు ఘ్రాణంబును గలిగె. కార్యకారణసమన్వయంబున

భూమియందే విశేషము మెండుగఁ గన్పట్టుచుండును. ఇట్టి యండకోశంబునుండి విరాట్పురుషం డుత్థితుండు గాఁగఁ బ్రథమమున ముఖము వినిర్భిన్నమయ్యె. అందుండి వాణియు, వహ్నియుఁ గలిగె. పిమ్మట నాసలును, నా నాసికారంధ్రములనుండి ప్రాణముతో వాయుతత్త్వమును గలిగె. పిదప నక్షులును, చక్షురింద్రియమును నందుండి సూర్యుండును, ననంతరంబు కర్ణంబులును, శ్రోత్రేంద్రియంబును, దానివలన దిక్కులును విభిన్నంబులయ్యె. అంత రోమకూపంబులును, త్వగింద్రియంబును నందుండి యోషధులును బుట్టె. పిమ్మట శిశ్నంబును దానివలన రేతంబును నందుండి జలంబును బొడమె. అనంతరము గుదంబును దానినుండి యపానంబును, దానినుండి మృత్యువును గలిగె. తరువాత హస్తంబులును, వానివలన బలమును, నింద్రుండును బిదపఁ బాదములు వానినుండి గతి, హరియుఁ గలిగిరి. పిదప నాడులు విభిన్నంబు కాఁగ నందుండి పూర్ణంబైన రక్తంబును, దానివలన నదులును గలిగె. పదంపడి యుదరంబు నిర్భిన్నము కాగ నందుండి క్షుత్పిపాసలును, వానినుండి సముద్రమును గలిగె. అంత హృదయంబు భిన్నంబు గాఁగ నద్దాన మనంబును నందుండి చంద్రుండును, బుద్ధియు, బుద్ధినుండి చతుర్ముఖబ్రహ్మయుఁ గలిగిరి. అనంతర మహంకారంబున రుద్రుండును, చిత్తంబున క్షేత్రజ్ఞుఁడును గలిగిరి. వహ్ని వాక్కుతో ముఖంబును, వాయువు, ఘ్రాణేంద్రియంబుతో నాసికను, సూర్యుండు చక్షురింద్రియముతో నక్షులను, దిక్కులు కర్ణేంద్రియముతో శ్రోత్రంబులను నోషధులు రోమంబులతోఁ ద్వచంబును జలంబులు రేతంబుతో శిశ్నంబును, మృత్యువపానముతో గుదంబును, హరి గతిచేఁ జరణంబులను, నింద్రుండు బలంబుతో హస్తంబులను నదులు లోహితంబుతో నాడులను, సముద్రుండు క్షుత్పిపాసలతో నుదరంబును బ్రవేశించెను. చంద్రుఁడు మనస్సుతో, బ్రహ్మ బుద్ధితో, రుద్రుఁ డహంకారముతో, క్షేత్రజ్ఞుఁడు చిత్తముతో హృదయమును బ్రవేశింప విరాట్పురుషుం డుత్థితుండయ్యెను. ఇటు లా యాత్మ పరధ్యానమున నజ్ఞానమున మాయను నేర్పడిన ప్రకృతి నిశ్చలత్వమున, సుజ్ఞానమున మాయావిరహితత్వంబునఁ గానరాకుండు. ప్రసుప్తుండగు పురుషుని ప్రాణేంద్రియమనోబుద్ధు లెవ్వండు లేక యుత్థాపనంబు జేయ సమర్థంబులు గాకుండునో యా ప్రత్యగాత్మను యోగప్రవృత్తమైన బుద్ధిచేతను, భక్తిచేతను, విరక్తిచేతను, జ్ఞానంబుచేతను నెఱింగి యాత్మయందుఁ జింతింపనగునని చెప్పి మఱియు నిట్లనియె.

ఇట్లు ప్రకృతియందుఁ బ్రతిబింబించిన పురుషుఁడు ప్రకృతిస్థుఁడయ్యు నంబుబింబితుండగు సర్యముఁడుంబోలెఁ బ్రాకృతగుణకదంబంబువలన నిర్లిప్తుండైయుండు. వాస్తవమున లేనిదయ్యు విషయముల ధ్యానించు పురుషునకు స్వప్నమందు మతిని భ్రమపెట్టు నర్థాగమమువలె సంసృతి నివృత్తి గాకుండు. కాన జననీ! చిత్తము సత్పథమున నడపుచు నంతకంతకుఁ దీవ్రతఁగాంచు భక్తిచేతనో విరక్తిచేతనో యాచిత్తమును వశ్యముఁజేసికొనఁదగు. బలవదింద్రియనిగ్రహసాధకంబులగు యమనియమాదులఁగాని ధ్యానసముపార్జిత సంయమనంబుగల భక్తింగాని మనంబున నేకాగ్రత లభింపఁజేత తత్త్వజ్ఞానంబున మోక్షముం బడయనగు ననిన దేవహూతి కపిలున కిట్లనియె.

మహాత్మా? బ్రహ్మస్వరూపా! ప్రకృతిపురుషు లన్యోన్యాశ్రయులగుటంబట్టి నిత్యులగుటం జేసియుఁ బ్రకృతి పురుషు నెప్పుడు విడువకుండుంగదా. పృథివికి గంధంబువోలె, జలంబులకు రసంబువోలె, పరమపురుషునకుఁ బ్రకృతి వ్యతిరిక్తంబుగాకుండు. అకర్తయైన పురుషునకు గుణాశ్రయంబైన యీ కర్మబంధం బెట్లు కలిగె, తత్త్వజ్ఞానంబుచే సంసారరూపంబైన భయంబు నివృత్తంబయ్యును బ్రకృతిసంబంధంబు నివృత్తిగామింజేసి క్వాచిత్కముగ వెండియుఁ దోఁచుచుండు. ఇట్లు ప్రకృతి గుణంబులు సన్నిహితంబులైయుండ వీనినుండి కైవల్యంబు పురుషున కెట్లు ప్రాప్తించుఁ దెల్పుమనఁ గపిలుం డిట్లనియె.

దేవహూతీ! స్వధర్మంబునను నిష్కామకర్మను నమలినహృదయంబునను భగవద్భక్తిని, జ్ఞానంబునను, దపంబునను, యోగంబునను నాత్మసమాధిని నహర్నిశంబు లగ్నికిఁ గారణంబైన యరణినిబోలెఁ జిత్తంబును,రగుల్పంజేసినఁ బుటమిడిన బంగారమున మాలిన్యంబులుంబలెఁ బ్రకృతిగుణంబులు మందగించి పురుషున కశుభంబునొసంగఁజాలకయుండు. స్వప్నావస్థఁబొందినపురుషునకు స్వప్న దృశ్యప్రకృతి బాధకల్గించునట్లు జాగ్రదవస్థఁబొందిన పురుషుని బాధించదుగదా. తిరుగలి నడిమిరాటి నాశ్రయించుకొనియున్న గింజలు నలుగక మిగిలినవి రాతియొత్తిడి నలిగిపోయినట్లు భగవంతు నాశ్రయించుకొన్న జీవులును బ్రకృతియొత్తిడి బాధనొందవు. మాతా! భక్తిమార్గము, తత్త్వలక్షణము కొలదిగ నుపదేశించితి. యోగమార్గమునుగూడ విశదపఱతు సావధానచిత్తవై యాకర్ణింపుము. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధుల నెడు నష్టాంగయోగంబుల నెఱింగి మనంబును శుద్ధింపవలయు.స్వధర్మాచరణము,శాస్త్రనిషిద్ధ కర్మపరిత్యాగము, యదృచ్ఛాలాభ సంతుష్టి, సాధుసేవ, గ్రామ్యనీచధర్మనివృత్తి, మోక్షధర్మరతి, మితాహారసేవ, నిర్జనప్రదేశసుఖావాసము, అహింస నవలంబించుట, సత్యము, నస్తేయముఁ అన, దొంగతనము చేయకుండుట (తనకెంత యర్థం బుపయోగించు నంతయర్థంబుమాత్రము స్వీకరించుట) బ్రహ్మచర్యము, తపశ్శౌచములు, స్వాధ్యాయపఠనము, మౌనము, నాసనజయము, మానసస్థైర్యము. ప్రాణాయామము, మనస్సునింద్రియవిషయములవలనమరలించి హృదయమందునిలుపుట, లక్ష్యవిశ్వాసములతోఁగూడినభగవద్ధ్యానముఁ గలిగి ఋజుకాయుండై ప్రణవమార్గంబునఁ గుంభక, రేచక, పూరకంబులఁగోశశోధనంబుఁజేసి చంచలంబయిన చిత్తంబును స్థిరపఱుపవలయు. ఇట్లు ప్రాణాయామమను పావకునివలన వాత పిత్త, శ్లేష్మంబులను దోషంబుల భస్మంబుఁగావించి ధారణచేఁ బాపంబులను బ్రత్యాహారంబుచే సంసర్గంబులను. రాగంబులను దహనపఱచి ధ్యానంబుచే సత్త్వాదిగుణంబుల నివారింపవలయు. జితశ్వాసుండైన యోగిమనంబు వాయ్వగ్నులచేఁగరిగించఁబడిన లోహంబుఁబోలె నచిరకాలంబున రజోవిరహితంబై మాలిన్యంబువిడుచు: నిశ్చలధ్యానముఁగూడిన యోగిదేహము మద్యపానంబున నొడలు తెలియక యున్న వాని వస్త్రముదిగజారిపోవునట్లు దిగఁజారిపోవును. తానున్నచోటినుండియే నాసిక గాలిచేఁ గొనిరాబడిన పరిమళము నాఘ్రాణించునట్లు యోగరతమైన మనము తనంతఁబ్రత్యగాత్మను బొందును. పరకాయంబుననున్న తన్నుశత్రువుగ భావించుట ప్రతిబింబమునుగాంచి ద్వేషించుట వంటిదిగ భావింపుము. కాన నభేదదర్శికావలెను. గాలిచేఁ జాలితమయ్యు మేఘము పవనశక్తి గుర్తించనట్లు జగము కాల స్వరూపుఁడగు భగవంతునిచేఁ గదలింపఁబడుచున్నను వాని ప్రభావ మెఱుంగఁజాలకున్నది. జీవుఁ డజ్ఞానంబున స్థూలదేహసంబంధములగు పుత్ర, మిత్ర, కళత్ర, ధనాదులఁగాని రాగద్వేషాది జనితమానసికప్రకృతిఁగల సూక్ష్మదేహంబునుగాని గమనించక దానియందలి మోహంబునఁ బ్రకృతిని యథార్థంబుగఁదలఁచి తన్నుమఱచి బాధలనొందుచుండును. స్థూలదేహంబున నానావిధ సంసారతాపంబు లనుభవించి స్థూలదేహవిముక్తిని, సూక్ష్మశరీరమున నరకాదియాతనలఁబొంది కారణ శరీరంబున జన్మఁగాంచి బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యంబుల ననేకసుఖాభాసంబులగు కష్టంబుల నొందుచుండును. ఇట్లు బ్రహ్మంబహంకారరూపకంబై త్రివిధంబును, భూతాత్మకంబై పంచవిధంబును, నింద్రియాత్మకంబై యేకాదశవిధంబునునైయుండు. జీవరూపుండైన విరాట్పురుషుండు జీవశరీరంబగు బ్రహ్మాండంబునఁ దోఁచుచుండు. ఈ పరబ్రహ్మంబును శ్రద్ధాభక్తి యోగాభ్యాసంబులచేత నిత్యంబు సమాధియుక్తచిత్తుండును, నిస్సంగుండును, విరక్తుండునైనవాఁడు గాంచుచుండు.

తల్లీ! ప్రకృతి పురుషతత్త్వ మెద్దాన ద్యోతకమగుచుండునో యట్టి పరమపవిత్రము బ్రహ్మబోధమనగు జ్ఞానమును దెలిపితి. అవ్యక్తగతియగు కాలంబు జీవులకు నుత్పత్తినిధనంబులఁ గల్పించుచుండు.

అవిద్యాకర్మనిర్మితంబులగు బహు విధంబులైన సంసారంబులు జీవునకుఁ గల్గుచుండు. ఆ సంసారం బునం జొచ్చి జీవుం డాత్మగతి నెఱుంగకుండును.

అమ్మా! ఇది పరమరహస్యమైనది. కాన నీ సాంఖ్యయోగమును, ఖలమతికి, నవినీతునకు దురాచారునకు, డాంబికునకు, మూఢాత్మునకు, లోలాత్మునకు, గృహాలూఢచిత్తునకు, భక్తద్వేషికి, నభక్తునకుఁ జెప్పఁగూడదు. శ్రద్ధధానుఁడు, శాంతమతి, భూతసఖుఁడు, ననసూయుఁడు, బుద్ధిశాలి, జాతవైరాగ్యుఁడు, సువినీతుఁడు, శుచి, హితుఁడు, భగవత్సేవాభిరతుఁడు, భక్తుఁడునైనవానికి మాత్రము జెప్పఁదగు ననెను. కపిలుని సూక్తులు విని దేవహూతి మోహమువిడిచి కపిలుని కెఱఁగి స్తుతించి కర్ద మాశ్రమమందలి సమస్త వైభవములఁ ద్యజించి కపిలుని హృదయమున ధ్యానించుచు, జీవభావంబు తొలంగుటంజేసి వీతక్లేశయై నిర్వృతిఁజెంది గుణభ్రాంతిరహితయై జాగ్రదవస్థఁబొందిన వ్యక్తి స్వప్న దృష్టపదార్థంబుంబోలె ముక్తకేశము గతాంబరము దైవగుప్తమునగు దేహంబుఁ దెలియకుండె. ఇట్లు దేవహూతి సిద్ధింబొందె. ఆ ప్రదేశము సిద్ధపదనామకంబగు పుణ్యక్షేత్రంబయ్యె. ఆ దేవహూతి శరీరము పుణ్యస్రవంతియై సిద్ధసేవితయై విరాజిల్లె.

కపిలుండును దల్లియాజ్ఞఁగొని యాశ్రమము విడిచి యీశాన్యదిక్కునకుఁ జనియె. విదురా! నీ యడి గిన సాంఖ్యాచార్యుండగు కపిలుని వృత్తాంతము వినిపించితి నని మైత్రేయుండును, మైత్రేయుం డిట్లు విదురునకుఁ జెప్పెనని శుకుండు పరీక్షిన్మహారాజునకును శుకుండిట్లు చెప్పెనని సూతుఁడు శౌనకాది మహామునులకును జెప్పిరి.

---




## శ్రీ మదాంధ్ర భాగవతము.

రచయితలు:— శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, శ్రీ గద్వాల సంస్థానాస్థానకవులు, "శ్రీరామ నృసింహమూర్తికవులు," అను శ్రీ గంధం శ్రీరామమూర్తి, శ్రీ ఇట్టేంకి నరసింహమూర్తులు.

వీర లాంధ్రవిశ్వవిద్యాలయ ఉభయభాషాప్రవీణ పట్టభద్రులై ప్రఖ్యాతిఁ గాంచిన శ్రీ గద్వాల సంస్థానాస్థానకవులై ఆంధ్రరాష్ట్ర పశ్చిమగోదావరీ మండల స్థానికోన్నత పాఠశాలలఁ బ్రథమశ్రేణి ప్రధానాంధ్రోపాధ్యాయులుగ సుమా రిరువది సంవత్సరములు పనిచేసి యనేక స్వతంత్ర, అనువాద గ్రంథముల రచించి వ్యాసకృత సంస్కృత శ్రీ మద్భాగవతానువాద పద్యకావ్యరచనకుఁ బూనుకొని కృతకృత్యులు కాఁగలుగుట వీరి పూర్వజన్మ సుకృతవిశేషమని చెప్పనొప్పును.

అందలి ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధములుకల ప్రథమసంపుటముఁ జూచితి. అందు వీరికిఁగల పాండిత్యప్రకర్షయు ననన్య సామాన్యమగు నాధ్యాత్మికానుభవమును ద్యోతకమగుచున్నవి. మఱియు మూలానుసరణముగనుండుట, మక్కికిమక్కిగగాక తెలుగునుడికారమునకు భంగపాటులేని చక్కని భాషకలిగి యుండుట, సలక్షణముగ లక్ష్యగ్రంథముగనుండుట, ఏపద్యమునకాపద్యమే సంపూర్ణార్థ బోధకముగనుండుట, షష్ఠ్యంతములు కృతిపతులు వంశవృత్త వర్ణనలు మొదలగు నాంధ్రకవుల పరిపాటి చీకాకులేకుండుట, ఏదో వచనముగ వ్రాసి శ్రమకుఁబ్రాలుమాలి మ్రొక్కు చెల్లించుకొన్నట్లుకాక యాయా జ్ఞాపకముంచుకొనఁదగుతావుల పద్యములనే నక్రమముగవ్రాయుట, దురభిమాన పూర్వకపద్యములఁ జొప్పింపకుండుట, తిక్కనశైలివలె పదమధ్యయతులు వచన రూపకపద్యములు కలిగియుండుట, భాషాడంబరమున భావలోపములఁ గప్పిపుచ్చకుండుట, సంస్కృతమునన్నది యర్థమునఁ దికమకపడి వచనమునను విషయము సుబోధకమగు ఫక్కిని వ్రాయలేనిచోట్లు తెలిసినభావమైనను పద్యమునఁబట్టించలేక వదలివేయు నిరంకుశ నీరసత్వము యసభ్య శృంగారవర్ణనలు లేకుండుట మొదలగు మంచివిషయములెన్నేని కన్పించుచున్నవి. మొదట యుపోద్ఘాతము భాగవతపురాణోపోద్ఘాతమనుటకుఁ దగియున్నది. కథా సంగ్రహము గ్రంథపఠనమున కభిరుచిఁ గల్గించుచున్నది. అధ్యాయవిభజనము, అధ్యాయమందలి విషయమున కంత కొ కే

యొకశీర్షిక మొదటనేయుంచుటయు, నాయాసందర్భముల శుకుఁడు, సూతుఁడు, విదురుఁడు, మైత్రేయుఁడు, బ్రహ్మ, రాజు, ఈ మొదలగు శీర్షికలవలన నెవరివాక్యమైనది తేలికగ తెలిసికొనవీలుకలిగియు పాఠకులకెక్కువ యుపకరించుచున్నది. అశ్వత్థామ పరాభవము, భీష్మస్తుతి, కృష్ణ నిర్యాణము, బ్రహ్మస్తుతి, విదురమైత్రేయ సంవాదము, యజ్ఞవరాహావతారచరిత్రము, కపిలోపాఖ్యానము మొదలగు ప్రసిద్ధ ఘట్టము లందలి కొన్ని పద్యముల నీక్రింద నుదహరించుచున్నాఁడను. అందలి శైలి, అనువాద లక్షణము మొదలగు సర్వవిషయములఁ బ్రాజ్ఞులు గమనింతురుగాక.

ప్ర థ మ స్కం ధ ము.

ఉ. ఆగమకల్పకక్షితిరుహంబునఁ బండి శుకాననచ్యుతం
బై గణనీయమున్ రసమయం బమృతద్రవసమ్మితంబు నా
భాగవతాఖ్య సత్ఫలముభావుకులార ! రసజ్ఞులార ! స్వే
చ్ఛాగతిఁగ్రోలుఁడయ్య భువిసారెకు నామరణాంతముం దమిన్. 3

శ్లో॥ నిగమ కల్పతరోర్గళితం ఫలం, శుకముఖాదమృత ద్రవసమ్మితమ్
పిబత భాగవతం రస మాలయం, ముహు రహో! రసికా భువి భావుకాః॥

మ. భగవంతుండగు బాదరాయణుఁడు విద్వల్లోకముఖ్యుండు ము
న్నుగనై వేనినెఱింగె బ్రహ్మవిదు లన్యుల్ మానులుం గేవలం
బగు ధీయుక్తి నెఱింగిరో స్తుతమతీ ! య య్యా సర్వముం దత్కృపన్
దగుచందంబున నీ వెఱింగితిగ సూతా! ధీవిశేషాన్వితా. 7

ఉ. స్నేహసమభ్యుపేతుఁడగుశిష్యునకున్ గురువుల్ గడంగి సం
దేహము నుజ్జగించి యుపదేశముఁజేయుచునుంద్రు తన్మనో
మోహమువాయునట్లు పరిపూర్తిగ గుహ్యమునైనఁగాని సూ
తా ! హరిపాదభక్తి కలితా! యెఱిఁగింపుము మాకు నీ వటుల్. 8

శ్లో॥ యానివేదవిదాంశ్రేష్ఠో,భగవాన్ బాదరాయణః
అన్యే చ మునయ స్సూత !, పరావరవిదో విదుః॥

శ్లో॥ వేత్థత్వం సౌమ్య ! తత్సర్వం,తత్వత స్తదనుగ్రహాత్
బ్రూయు స్స్నిగ్ధస్య శిష్యస్య,గురవో గుహ్య మప్యుత॥

మ. అనుపేతుండు నపేతకృత్యుఁడును సన్న్యస్తుండునై పోవు నె
వ్వని 'పుత్రా'యనుచున్ విరాళివెతమైవ్యాసుండు బిల్వం బ్రతి
ధ్వనులం దన్మయతంబొనర్చెఁ దరుసంతానంబు లహ్మానినా
ఘుని సద్బోధుని బాదరాయణి భజింతున్ సర్వభూతాత్మగున్. 21

శ్లో॥ యం ప్రవ్రజంత మనుపేత మపేతకృత్యం, ద్వైపాయనో విరహకాతర ఆజుహావ
పుత్రేతి తన్మయతయా తరవోఽభినేదు, స్తం సర్వభూతహృదయం
మునిమానతోఽస్మి॥

చ. అమలినమానసుల్ పరమహంస లెటన్ విహరింపకుండ్రొ లో
కముల సదా పునీతములుగా నొనరించెడు వాసుదేవు స
ద్విమలయశం బెటం బరిఢవిల్లకయుండునొ యట్టి వ్యర్థ వా
క్యమది యుదాత్తచిత్ర పదమయ్యును వాయసతీర్థతుల్యమా. 123

శ్లో॥ నయద్వచశ్చిత్రపదం హరేర్యశో, జగత్పవిత్రం ప్రగృణీత కర్హిచిత్
తద్వాయసంతీర్థ ముశంతి మానసా, నయత్ర హంసా విరమంత్యుశిక్షయాః॥

ఉ. మాని స్వధర్మమున్ విభునిమంజుపదాంబుజమున్ భజించు చ
ద్దాన నపక్వుఁడౌచుఁ బతితత్వముఁ జెందిననే నమంగళం
బౌనె యొకించుకంత? పరమాత్ము హరిన్ భజియింపకున్న నే
దే నొక యర్థ మీఁగలుగునే పరికింప స్వధర్మ మేరికిన్. 129

శ్లో॥ త్యక్త్వా స్వధర్మం చరణాంబుజం హరే, ర్భజ న్నపక్వోఽథపతే త్తతో యది
యత్ర క్వవా భద్ర మభూ దముష్యకిం, కోవార్థ ఆప్తో భజతాం స్వధర్మతః॥

గీ. నిరపరాధుల బాలుర నిద్రితులను, బలిమిమై నిశిఁ జంపె నీ బాలిశుండు
బ్రాహ్మణాధము నితనిఁ గాపాడఁదగదు, సంహరింపుము పార్థ! నిస్సంశయముగ.

క. మత్తుని జడునిన్ సుప్తుఁ బ్రమత్తుని, బాలునిఁ, బ్రపన్నమగువ, విరథు, ను
న్మత్తుని, భీతుని, రిపునే, నుత్తమధర్మజ్ఞుఁ డాత్మ నొల్లఁడు చంపన్. 204

శ్లో॥ మైనం పార్థార్హసి త్రాతుం, బ్రహ్మబంధు మిమం జహి
యోఽసావనాగసః సుప్తా, నవధీ న్నిశి బాలకాన్॥

శ్లో॥ మత్తం ప్రమత్త మున్మత్తం, సుప్తం బాలం జడం స్త్రియం
ప్రపన్నం విరథం భీతం, న రిపుం హంతి ధర్మవిత్॥

మ. నరహస్యంబగు చాపవేదమును నిస్తంద్రప్రయోగోపసం
హరణోపేత మహాస్త్రకోటియు యదీయానుగ్రహప్రాప్తిఁ జా
తురిమై నేర్చితొ! నీవు పూజ్యుఁడగు నా ద్రోణుండు పుత్రాకృతిన్
బరగెం జూ మనప్రోల నేఁ డిచట నశ్వత్థామనామంబునన్. 212

ఉ. ఆతని ధర్మపత్నియుఁ దదర్ధశరీరము వీరమాతయున్
బూతచరిత్రమైన కృపిపుత్రనిమిత్తము భర్తతోడ వి

ఖ్యాతిగ వహ్నిలోఁబడకయక్కట! యున్నది యింటఁగాన నా
రీతియెఱింగియే నగనికరింపుఁడు సమ్మతి గౌతమీసుతున్. 213

శ్లో॥ సరహస్యో ధనుర్వేదః, సవిసర్గోప సంయమః
అస్త్రగ్రామశ్చ భవతా, శిక్షితో యదనుగ్రహాత్॥

శ్లో॥ స ఏష భగవాన్ ద్రోణః, ప్రజారూపేణ వర్తతే
తస్యాత్మనోఽర్ధం పత్న్యాస్తే,నాన్వగా ద్వీరసూః కృపీ॥

చ. చెలువునిమాటచే నుభయసేనలమధ్యను దక్షిణంబ తే
ర్నిలిపి విరోధిసైనికవరేణ్యులయాయువు లెల్ల వాడి చూ
పుల హరియించుచున్ విజయమున్ వడిఁగ్రీడికిఁ గల్గఁజేయు నా
హాలఁ జెలువారు పార్థసఖునందు సదా రతి నాకుఁ గల్గెడున్. 301

శ్లో॥ సపది సఖివచోనిశమ్య మధ్యే, నిజపరయో ర్బలయో రథం ప్రవేశ్య
స్థితవతి పరసైని కాయు రక్ష్ణా, హృతవతి పార్థసఖే రతి ర్మమాస్తు॥

చ. అవనిభరంబుఁదీర్చుటకునై యనిలుండునుబోలెఁ దాను గౌ
రవకులమందు భీషణతరంబయి క్రాలెడు నక్షువంశవ
హ్నివెలుఁగజేసినట్టి జగదీశు ప్రశాంత్రి హరాంఘ్రిఁ గృష్ణు నా
దవు హృదిఁ గౌఁగిలించుకొనియల్లన వీడెద మర్త్యదేహమున్. 308

చ. ఇనుఁడొకరుం డనేకుల కనేకవిధంబులఁదోఁచునట్టి మా
ద్రిని నిజకల్పితాఖిల శరీరి నికాయహృదంతరస్థితుం
డు వజుఁడు సర్వలోకవిభుఁడుం బరమాత్ముఁడునై నయట్టి యా
తని నెఱుఁగంగఁగంటి నెడదంగల మోహములెల్లఁ బాయఁగన్. 309

శ్లో॥ క్షితిభరమవరోపితుం కురూణాం, శ్వసన ఇవాసృజ దక్షువంశవహ్నిమ్
తమిమమహమను వ్రతార్తిహాంఘ్రిం, హృది పరిరభ్య జహామి మర్త్యనీడమ్॥

శ్లో॥ తమిమమహమజం శరీరభాజాం, హృది హృది ధిష్ఠిత మాత్మకల్పితానాం
ప్రతిదృశమివ నైకధార్క మేకం, సమధిగతోఽస్మి విధూత భేదమోహః॥

చ. సకియరో! యేవ్రజాంగనలుస్వాంతము లచ్యుతునందుఁజేర్చి పా
యక మధురాధరామృతముసానుచుఁ దన్మయతం జరింత్రో య
మ్మక చెల! వారు శ్రీహరి సమర్చలుచేసినవారెసుమ్ము త
ప్పక తొలిజన్మమందుఁ గడుభక్తి వ్రతాదుల నాచరించుచున్. 335

శ్లో॥ నూనం వ్రతస్నానహుతాదినేశ్వరః, సమర్చితో హ్యస్య గృహీతపాణిభిః
పిబంతి యాః సఖ్యధరామృతం ముహు,ర్వ్రజస్త్రియః సంముముహు ర్యదాశయాః॥

చ. అనఘుఁ డజాతశత్రుఁడు మహామహిమాన్వితుఁడైన కృష్ణుపైఁ
దనకుఁగలట్టి స్నేహము కృతంబునఁజేసి తదీయవిద్విష
జ్జనములనుండి శంకగొనుస్వాంతముతోఁ జతురంగయుక్తమై
తనరెడు సైన్యముం బనిచెఁదత్పురి రక్షణపొంటె వెంబడిన్. 338

శ్లో॥ అజాతశత్రుః పృతనాం, గోపీథాయ మధుద్విషః
పరేభ్యః శంకితః స్నేహా, త్ప్రాయుఙ్క్త చతురంగిణీం॥

చ. ఉరురవకారియౌచు ధవళోదరమైనదరంబు శ్రీధరా
ధరమణిరాగరక్తిమయుతంబయి తత్కమనీయపాణితో
యరుహాపుటంబునంబరఁగి శ్రయత్రజి శోభిలె నబ్జమండ మం
దరుదుగఁగూయుచున్న కలహంసవతంసము పోలె లీలమై. 342

శ్లో॥ స ఉచ్చకాశే ధవళోదరోదరో, ప్యురుక్రమ స్యాధరశోణ శోణిమా
దధ్మాయమానః కరకంజసంపుటే, యథాబ్జమండే కలహంస ఉత్స్వనః॥

ఉ. చారుసితాతపత్త్ర మృదుచామరమండితుఁడై పురాంగనా
పేరితపుష్పవృష్టులు పయింబడుచుండఁ బిశంగచేల మిం
పారఁగఁ గంఠసీమ వనమాల చెలంగఁగ సూర్యచంద్రవృ
త్తారిధనుస్తటిల్లతలనంబుదుఁడుంబలె శౌరి యొప్పెడున్. 359

శ్లో॥ సితాతపత్ర వ్యజనై రుపస్కృతః, ప్రసూనవర్షై రభివర్షితః పథి
పిశంగవాసా వనమాలయా బభౌ,ఘనో యథార్కోడుపచాపవైద్యుతైః॥

శా. ఏ పూఁబోండ్ల గభీరభావపిశునాహీనోల్లసద్హాసల
జ్జోపేతాక్షి విలాసపాతమున మోహోద్రిక్తుఁడై కంతుఁడున్
జాపంబున్ విడనాడి లోఁబడునొ యాచంద్రాస్యలుం గృత్రిమ
వ్యాపారంబులఁ గృష్ణుడెందము మథింపంజాలరై రింతయున్. 367

శ్లో॥ ఉద్దామభావపిశునామలవల్గుహాస, వ్రీడావలోకనిహతో మదనోఽపి యాసాం
సంముహ్య చాప మజహా త్ప్రమదో త్తమాస్తా, యస్యేంద్రియం విమథితుం
కుహకై ర్న శేకుః॥

గీ. తాను గర్భదృష్టుని నాత్మఁదలఁచికొనుచు, నిందు నరులనెల్లరను బరీక్షఁజేసెఁ
గానఁ దలఁపఁబరీక్షిత్తునా నితఁడు సమస్తలోకమునందు విఖ్యాతుఁడయ్యె. 385

శ్లో॥ స ఏష లోకే విఖ్యాతః, పరీక్షిదితి యత్ప్రభుః
గర్భదృష్ట మభిధ్యాయ, న్పరీక్షేత నరే ష్విహ॥

ఉ. వన్నెఁదొఱంగినట్లు కనవచ్చుచునుంటివి నాదుచూడ్కి కో
యన్న ! భవచ్ఛరీరమి దనామయమై పొలుపారుచున్నదే ?
మన్ననమాని నిన్ను నవమానముఁజేసిరొ? యెల్లబంధువుల్
ఖిన్నమనస్కుఁజేసి తమగేహములం జిరకాల ముండుటన్. 457

చ. అతిపరుషాప్రియశ్రుతిభయావహవాక్యకశాభి ఘాతతా
డితమతివైతొ ? యి ట్లటమటింతువు యాచకకోటికిం బ్రతి
శ్రుతమగు నర్థముం బలుకుచొప్పున నీక దురాశపెంపునన్
వితథులఁజేసి నెట్టితివొ? వీరవతంసమ ! నాకుఁజెప్పుమా. 458

శ్లో॥ కచ్చిత్తేఽనామయం తాత !, భ్రష్టతేజా విభాసిమే
అలబ్ధమానోఽవజ్ఞాతః, కింవా తత్రచిరోషితః॥

శ్లో॥ కచ్చిన్నాభిహతో భావై, శ్శబ్దాదిభి రమంగళైః
నదత్తముక్త మర్థిభ్యః, ఆశయా యత్ప్రతిశ్రుతమ్॥

మ. ఘనరాజన్య రథాభియుక్తసముదగ్ర ద్రోణభీష్మార్కనం
దనశల్యాది చమూసమూహములలోనాముందఱన్నిల్చి స్వం
దనమధ్యస్థితయోధనాథుల సముద్యన్మానసోత్సాహ శ
క్తిని దేజంబును నాయువుం జెఱుచుఁ జూడ్కిన్ శౌరి నన్ దేర్చుచున్. 476

శ్లో॥ యో భీష్మకర్ణగురుశల్య చమూష్వదభ్ర, రాజన్యవర్య రథమండలమండితాసు
అగ్రేచరో మమవిభో రథయూథపానా,మాయు ర్మనాంసిచదృశాసహఓజఆర్చత్॥

గీ. అట్లె మధురాపురంబునకును నృపుండు, శూరసేనకుమారు వజ్రుని నిలిపియు
నేమమలరఁ బ్రాజాపత్యనామకేష్టిఁ, జేసి తనయందు నగ్నులఁ జేర్చికొనియె. 496

శ్లో॥ మధురాయాం తథా వజ్రం, శూరసేనసుతం తతః
ప్రాజాపత్యాం నిరూప్యేష్టి, మగ్నీనపిబ దీశ్వరః॥

సీ. సత్యంబు దయయును శౌచంబు క్షమయును, ద్యాగంబు సంతోషమార్జవంబు
శమము దమంబును సమత తపంబును, శ్రుతముఁ దితిక్షయు స్మృతి యుపరతి
జ్ఞానంబును విరక్తిశౌర్య మైశ్వర్యంబు, బలము తేజంబుఁ గౌశలముఁ గాంతి
ధృతి మార్దవము స్వాతంత్రతయుఁ బ్రాగల్భ్యంబు,వినయ శీలములు గభీరతయును

గీ.సహము బలము భగంబు నోజంబు స్థిరత,యాస్తికత కీర్తిమా నానహంకృతులును
నరులమహిమఁబెంచెడు బహ్వాంతరగుణములు,నిచ్చలుంగృష్ణునందివినిల్చియుండు.

శ్లో॥ సత్యం శౌచం దయా క్షాంతి,స్త్యాగ స్సంతోష ఆర్జవమ్
శమో దమ స్తప స్సామ్యం, తితి క్షోపరతి శ్శ్రుతమ్॥

శ్లో॥ జ్ఞానం విరక్తి రైశ్వర్యం, శౌర్యం తేజో బలం స్మృతిః
స్వాతంత్ర్యం కౌశలం కాంతి, ర్ధైర్యం మార్దవ మేవచ॥

శ్లో॥ ప్రాగల్భ్యం ప్రశ్రియ శ్శీలం, సహ ఓజో బలం భగః
గాంభీర్యం స్థైర్య మాస్తిక్యం, కీర్తి ర్మా నోఽనహం కృతిః॥

శ్లో॥ ఏతే చాన్యేచ బహవో, యస్మిన్నిత్యాం మహాగుణాః
ప్రార్థ్యా మహత్త్వ మిచ్ఛద్భి, ర్నవియంతిస్మ కర్హిచిత్.

సీ. అని సమభ్యర్చితుఁడయి యప్పుడు కలికి, ద్యూతంబుఁబానంబుఁదొయ్యలులును
బ్రాణివధంబునాఁబరఁగు చతుర్విధా, ధర్మంబుల నొసంగెస్థానములుగఁ
గ్రమ్మఱ యాచింపఁగాంచనంబునొసంగె, నవ్వానివలన నొయ్యన నసృతము
మదము కామంబునుమఱి రజంబును బంచ,మమగు వైరమును సంభవముల య్యె

గీ. ఔత్తరేయదత్తముల నీవైమెదుస్థాన,ముల నధర్మప్రభవుఁడగుకలిగ్రహించి
యా నృపాలునా దేశముఁనాదలన్ ధ,రించి వసియించె నో ద్విజశ్రేష్ఠులార! 565

శ్లో॥ అభ్యర్థిత స్తదా తస్మై, స్థానాని కలయే దదౌ
ద్యూతం పానం స్త్రియ స్సూనా, యత్రాధర్మ శ్చతుర్విధః॥

శ్లో॥ పునశ్చ యాచమానాయ, జాతరూప మదా ద్విభుః
తతోఽనృతం మదః కామో, రజో వైరంచ పంచమమ్॥

శ్లో॥ అమూని పంచస్థానాని, హ్యధర్మప్రభవః కలిః
ఔత్తరేయేణ దత్తాని, న్యవసత్తన్నిదేశకృత్॥

## ద్వితీయస్కంధము.

చ॥ ఖర ముర కేశ్యరిష్ట నరక ద్వివిద ద్విప సాల్వ కంస శం
బర యవన ప్రలంబ శిశుపాల జరాసుత దంతవక్త్రద
ర్దుర వృష మల్ల పల్వల విదూరథ పౌండ్రక రుక్మిముఖ్యులౌ
సురరిపుకోటులం దునిమి శోభనముం గలిగించు నుర్వికిన్. 135

మ॥ కలనన్ విక్రమశాలులై యొసఁగు లోకఖ్యాతు లుద్యచ్ఛరా
సులు కాంభోజక మత్స్య సృంజయ కురుక్షోణీపతుల్ కేకయుల్
బలభీమార్జునకైతవాఖ్యుఁడగు నాపద్మాక్షుచే సత్కళా
నిలయంబైన వికుంఠధామము నయోన్వీతంబుఁబ్రాపిం త్రోగిన్. 136

శ్లో॥ యే చ ప్రలంబ ఖర దర్దుర కేశ్యరిష్ట,మల్లేభ కంస యవనాః కుజ పౌండ్రకాద్యాః
అన్యేచ సాల్వ కపి పల్వల దంతవక్త్ర,సప్తోక్ష శంబర విదూరథ రుక్మిముఖ్యాః॥

శ్లో॥ యేవామృధే సమితిశాలిన ఆత్తచాపాః, కాంభోజ మత్స్య కురు సంజయ కేకయాద్యాః
యాస్యం తదర్శనమలం బలభీమపార్థ,వ్యాజాహ్వాయేన హరిణా నిలయం తదీయమ్॥

తృతీయస్కంధము.

మ॥ అతిపుణ్యోపవనాద్రికుంజయుత నానారణ్యదేశంబులన్
గతపంకామలతోయసంగతసరిత్కాసారభాగంబులన్
సతతోద్భ్రాజదనంతలింగనిచయాంకచ్ఛత్పుణ్యతీర్థంబులన్
ధృతిమీఱన్ విదురుండు గాఢమగు భక్తిం బర్యటించె న్నృపా! 18

శ్లో॥ వన్యేషు పుణ్యోపవనాద్రికుంజే, ష్వపంకతోయేషు సరిత్సరస్సు
అనంతలింగై స్సమలంకృతేషు, చచార తీర్థాయతనే ష్వనన్యః॥

క. ఆ నదిఁ ద్రిత భార్గవ వైశ్వానర మను పృథు సుదాస వాయు యమ మహా
సేనాసిత గో నామము,లైన మహాతీర్థసంచయము సేవించెన్. 22

శ్లో॥ తస్యాం త్రితస్యోశన సోమనోశ్చ, పృథో రథాగ్నే రసితస్య వాయోః
తీర్థం సుదాసస్య గవాం గుహస్య, యచ్ఛ్రాద్ధదేవస్య స ఆసిషేవే॥

చ॥ హలకులిశాతపత్రజలజాంకుశచక్రయవాదిరేఖలన్
బొలుపగు కృష్ణుపాదములు మోపినపట్టులనున్న పాంసురా
సులు మెయినిండ భక్తిపరిశుద్ధమతిన్ భగవత్ప్రపన్నుఁడై
యలరు శ్వఫల్గుపుత్రుఁడు మహాత్ముఁడు మోదపరీతచిత్తుఁడే? 32

శ్లో॥ కచ్చిద్బుధస్స్వ స్త్యనమీవ ఆస్తే, శ్వఫల్గుపుత్రో భగవత్ప్రపన్నః
యః కృష్ణపాదాంకితమార్గపాంసు,ష్వావేష్టత ప్రేమవిభిన్నధైర్యః॥

మ॥ అకటా! కుందుదు తేనిదుర్గతికి నైయస్తంగతుండైన భ్రా
తకు ద్రోహం బొనరించె నాపగిది సంగ్రథత్మావిభుం డట్లు పు
త్రక దుర్వృత్తుల కియ్యకో ల్దెలుపుచున్ దమ్మున్ ననున్ వీటనుం
డి కఠోరంబుగ నెట్టివైచె వెలి కానింద్యుంబు మేల్పొందునే? 41

శ్లో॥ సౌమ్యానుశోచేతమధఃపతంతం, భ్రాత్రేపరేతాయచదద్రుహేయః
నిర్యాపితో యేన సుహృత్స్వపుర్యా, అహం స్వపుత్రాన్ సమనువ్రతేన॥

మ॥ జనుఁ డుత్స్వప్నగతంబులైన నిజశీర్షచ్ఛేదనాది క్రియల్
తన యాత్మన్ నిజమంచు నెంచినను దర్థ్యం బెట్లుకావల్లె యీ

శునకుం గర్మగుణానుబంధనములుం ‡ జూడంగ మాయాబలం
బున నున్నట్టులు దోఁచుచుండు నిరతం‡బున్ సుంత లేకుండియున్. 173

చ॥ జలములబింబితుండయిన ‡ చంద్రునకుం దలపోయఁ దత్కృతం
బులయిన కంపనాదులెటు ‡ బుద్ధికిఁదోఁచియు వాస్తవంబుగాఁ
గలుగకయుండునట్లు గుణ‡కర్మము లాపరమాత్మునందు స
గ్గలముగఁ దోఁచుచుండెడిని ‡ గాని యథార్థముగా వొకింతయున్. 174

శ్లో॥ యథార్థేనవినాపుంసో, మృషైవాత్మవిపర్యయః
ప్రతీయత ఉపద్రష్టుః,స్వశిరచ్ఛేదనాదినా॥

శ్లో॥ యథా జలే చంద్రమసః, కంపాదిస్తత్కృతో గుణః
దృశ్యతే సన్నపిద్రష్టు,రాత్మనో నాత్మనో గుణః॥

అధ్యాయము 9 దండకము (ముఖ్యముగ చదువదగినది.) 201

చ॥ పటుతర వజ్రకూటతను ‡ పాతజవాతివిశీర్ణకుక్షియై
స్ఫుటముగ మొఱ్ఱపెట్టుచు స ‡ ముద్రుఁడు దీర్ఘతరంగబాహు లు
త్కటమగునార్తిఁబొందిన వి ‡ ధంబున మీఁదికినెత్తుచున్ మహా
కిటిమయయజ్ఞరూప! పరి‡కింపుము నన్నృప నంచుఁ గుయ్యిడెన్. 279

శ్లో॥ సవజ్రకూటాంగనిపాతవేగ,విశీర్ణకుక్షి స్తనయ న్నుదన్వాన్
ఉత్సృష్టదీర్ఘోర్మిభుజైరివార్త‡శ్చుక్రోశ యజ్ఞేశ్వర! పాహిమే ।

మహాస్రగ్ధర. వడి నీ వస్మద్భుజాగ్ర ‡ ప్రవిణుదితగదా ‡ భగ్నశీర్షుండవై చే
డ్పడియుండన్ నీకు నిచ్చల్‡బలినొసఁగుఋషి‡వ్రాతముల్ దేవకోటుల్
దడయుం గంపంబు పుట్టన్‡దడబడు చితిక‡ర్తవ్యతామూఢులై త
ల్లడపాటున్ జెందుచుం ద్రు‡ల్లముల నిఁక గతా‡లంబులై దీనవృత్తిన్.

శ్లో॥ త్వయిస్థితే గదయా శీర్ణశీర్ష ణ్యస్మద్భుజచ్యుతయా యేచ తుభ్యం 438
బలిం హరిష్యంత్యృషయో యేచ దేవా స్స్వయంచ సర్వే నభవిష్యం త్యమూలాః॥

మ॥ బహులామర్షసముత్థదీర్ఘతరని‡శ్వాసంబులం బుచ్చు చం
త హిరణ్యాక్షుఁడు క్రోధసంచలిత‡బుద్ధ్యాదీంద్రియవ్రాతుఁడై
మహు రాసాదితమైన భూరిగదచే ‡ మోదెన్ వెసన్ దానవా
రి హరిన్ ఛద్మకిరిన్ గృపాలహరి శౌ‡రిన్ ధైర్యభాస్వద్గిరిన్. 448

శ్లో॥ సృజ న్నమర్షితశ్శ్వాసం, మన్యుప్రచలితేంద్రియః
ఆసాద్య గదయా దైత్య, స్తరసాభ్యహన ద్ధరిం॥

సీ. ధవళపద్మోత్పలదాము సుస్నిగ్ధనీ, లాలకకలితానననాభిరాము
శంఖచక్రగదాదిసాధనోపేతుఁ గుం, డలకిరీటాదిమండనసమేతు
శ్రీమ దురస్స్థితశ్రీకు సజ్జనహృద, యాహ్లాదకరసుస్మితావలోకుఁ
బరికటితసత్వగుణకదంబు మేఖలా, పీతకౌశేయశోభితనితంబు
గీ. కౌస్తుభమణివిరాజితకంబుకంఠు, వైనతేయాంసవిన్యస్తపాదపద్ము
నంతరిక్షస్థితున్ మహితార్క తేజుఁ, గమలనాభునిఁ గాంచె నాకర్దముండు. 535
శ్లో॥ సతం విరజ మర్కాభం,సితపద్మోత్పలస్రజమ్
స్నిగ్ధనీలాలకవ్రాత,వక్త్రాబ్జం విరజాంబరమ్॥
శ్లో॥ కిరీటినం కుండలినంశంఖచక్ర గదాధరమ్
శ్వేతోత్పలక్రీడనకం, మనస్స్పర్శస్మితేక్షణమ్॥
శ్లో॥ విన్యస్యచరణాంభోజమంసదేశే గరుత్మతః
దృష్ట్వాఖేఽవస్థితం వక్షశ్శ్రియం కౌస్తుభకంధరమ్॥

సీ. శ్రీవత్సలాంఛనాంచితపీనవక్షు నం, భోరుహానవ్యపత్రారుణాక్షు
వికచాబ్జకింజల్కపీతకౌశేయు స, ద్భక్తజనావళిభాగధేయు
నమలప్రసన్నాననాంభోజు శతకోటి, మార్తాండసన్నిభమహిత తేజుఁ
గాంచనకాంచీగుణాంచత్పృథునితంబుఁ, బరిణుతి పాత్రోజ్జ్వలద్గుణకదంబు
గీ. నలికులాంచితవనమాలికాభిరాము, నవ్యనీలోత్పలశ్యామునభవ్యధాము
వరకిరీటకేయూరనూపురవిలాసు, శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గభాసు. 729
సీ. వినివర్తితాశ్రితజనమనోమోహు ను, శ్యామలదేహు నాజానుబాహు
భక్తరాజీమనఃపద్మాసనాసీను, దివ్యపరిభాళిదేదీప్యమాను
సాధుసముత్కరనరక్షణోత్కంఠు, కౌస్తుభాలంకృతకంబుకంఠు
స్వజనమనోనేత్రవర్ధనపారీణు, నార్తజనావనోద్యమధురీణు
ఆ. పాపకర్మునన్ శుభప్రదదర్శను, కీర్తనీయతీర్థకీర్తికలితు
ననఘమతిఁదరుణవయస్కు సమగ్రాంగు,ధ్యానమునొనరింపఁదగుఁదిరముగ.730
శ్లో॥ ప్రసన్నవదనాంభోజం, పద్మపత్రారుణేక్షణమ్
నీలోత్పలదళశ్యామం, శంఖచక్రగదాధరమ్॥
శ్లో॥ లసత్పంకజకింజల్క, పీతకౌశేయవాససం
శ్రీవత్సవక్షసంభ్రాజ,త్కౌస్తుభాముక్తకంధరమ్॥
శ్లో॥ మత్తద్విరేఫకలయా,పరీతం వనమాలయా
పరార్థ్యహారవలయం,కిరీటాంగదనూపురమ్॥

శ్లో॥ కాంచీగుణోల్లసచ్ఛ్రోణిం, హృదయాంభోజవిష్టరం
దర్శనీయతమం శాంతం, మనోనయన వర్ధనమ్॥
శ్లో॥ ఆపీచ్యదర్శనం శశ్వ, త్సర్వలోకనమస్కృతమ్
సతం వయసి కైశోరే,భృత్యానుగ్రహకాతరమ్॥
శ్లో॥ కీర్తన్యతీర్థయశసం, పుణ్యశ్లోకయశస్కరం
ధ్యాయే ద్దేవం సమగ్రాంగం, యావన్న చ్యవ తేమనః॥

మొత్తమువీద గ్రంథమంతయు నిదేమాదిరిగ నున్నది. ఇటుల సంస్కృతముతో నంతయు ముద్రితమైన యాంధ్రప్రజానీకమున కెంతయేని మేలు చేకూర్పఁగలదు. ఇట్టి పవిత్రవాణి వెలువడు పుణ్యమూర్తులగు శ్రీరామ నృసింహమూర్తులకు భగవంతుఁ డాయురారోగ్యైశ్వర్యములఁ జేకూర్చి పవిత్ర గ్రంథరచన కితోధికోత్సాహము నొసంగుఁగాక. శ్రీమంతులు, భక్తులు, పండితులు, కవులు, ప్రభుత్వము, వీరి పవిత్రగ్రంథ ప్రకటనకు సహాకరింతురుగాక.

విద్వాన్ కె. శ్రీరామమూర్తి.

# శ్రీ మదాంధ్ర భాగవతము.

రచయితలు:—శ్రీరామనృసింహమూర్తి కవులు.

ఏతద్గ్రంథప్రచురణమున కార్థికముగ సహకరించిన మహాశయులకు మా నమోవాకములు. వారల శుభనామములు సాధ్యమైనంతవరకు ప్రథమసంపుటముననె ప్రకటింతుము లేదా ద్వితీయసంపుటమునఁ దప్పక ప్రకటింపఁగలమని మనవిఁజేసికొనుచున్నాము. ముద్రణవిషయమున శ్రద్ధవహించి తోడ్పడిన శ్రీ తణుకు రాయలముద్రణాలయమువారికి నందు ముఖ్యముగ బ్రహ్మశ్రీ చుండూరి పాపయ్యశాస్త్రిగారికి మా కృతజ్ఞతాపూర్వకాభివందనములు. సకాలములోఁ దమ తమ సదభిప్రాయము లొసంగిన విద్వద్వరేణ్యులకు మా ప్రణామశతంబులు. వ్యవధి తక్కువగుటఁ గొన్ని యభిప్రాయములుమాత్ర మిందు పొందుపరచుచున్నాము. మిగిలినవన్నియు ద్వితీయసంపుటమునఁ దప్పక ప్రచురింపఁగలమని మా విజ్ఞప్తి. ప్రచురణమున మా కనుభవము తక్కువగుట పొరపాటులు దొరలకపోలేదు. ద్వితీయ ముద్రణమున నవియన్నియు సరిఁజేసికొందుము. పాఠక మహాశయులు క్షమింతురుగాక.

ప్రకాశకులు.

## పండితాభిప్రాయములు

### ప్రసాదము.

ఉ. కోమలవాగ్విలాసములఁ గోటివరాలెగఁబోయుచున్న శ్రీ
రామనృసింహమూర్తులు చిరస్మరణీయులు విశ్వకావ్య గీ
తామృతసార సంస్కృతి సమన్వితభాగవతంబు వ్యాసవా
ణీమణి మొక్కవోని కరణిన్ రచియించిరి తెన్గుబాసలోన్.

ఉ. పాలకులెంద ఱెందఱో ప్రపంచమునేలుట కర్తలై భుజా
స్ఫాలనఁజేసి పాలనముఁ జక్కఁగఁజేయుటలేదె? యట్టులే
యేల కవీంద్రులింక రచియింపఁగ భాగవతాంధ్రకర్తలై
తేలఁగరాదు? దీని గణుతించి పఠించి తరించి కొల్వుఁడీ.

మ. అవధానమ్ములు సల్పినా రఖిల విద్యాప్రౌఢు "లోహో" యటం
చు వినోదించు సదస్సులందుఁ గవితా స్రోతస్సులందెన్నియో

నవమాణిక్యమరాళరాజమురళీనాట్యోత్సవశ్రీ కళా
వ్యవసాయమ్మున నాంధ్రభాగవతముం బండించి రీ సత్కవుల్.

కం. విద్వత్ప్రాప్తిఁగనుంగొను గద్వాలాస్థానమందుఁ గవిసింహములై
తద్వీరతోరణమ్ములు విద్వద్గర్వంబులేలు విజయులువీరే.

కం. మహిషాసురమర్దని వా గ్గ్లహరీ నవరత్నమీన కాత్యాయనియై
మహదాశీస్సులఁ బ్రోచుత నిహపరసౌఖ్యములుఁగూర్చి యీకవివరులన్.

కవితా సంస్థానము
తాడేపల్లిగూడెం
9—3—1955

జగజ్జనని
వేదాంతకవి.
(ఆంధ్ర బెర్నార్డుషా)

# ప్రశంస

## ఉత్పలమాలిక

బమ్మెరపోతరాజ కృత భాగవతంబు జగద్ధితార్థమై
యిమ్మహి రాగతాళలయహిండితమై నటియించుచుండఁగాఁ
గ్రమ్మఱ మూర్తిసత్కవులు వ్రాసిరి భాగవతంబు తెల్గులో
అమ్మక చెల్ల! పూర్వకృతమైన యఖండతపఃఫలాప్తిచే
ముమ్మరమైన భక్తిఁ బరిపూతమనస్కత నాంధ్రులార! మీ
రిమ్మహి తాంధ్రభాగవతమేర్పడ సారసి సారసాత్ములై
కమ్మని తత్త్వబోధముల గాథలలోని మహాత్వసంపదల్
నెమ్మదులందునింపుకొని నెమ్మదిచెంది సుఖింపుఁడయ్యా! స
త్యమ్ముగఁ జెప్పుచుంటినిది యారని సంస్కృతి బాధలొందు లో
కమ్ము తరింపఁ జేయుటకుఁగా లిఖియింపఁగఁబడ్డ గ్రంథరా
జమ్మని; తిక్కయజ్వవగు శబ్దచమత్కృతులింపు నంతటన్
గ్రమ్ముకొనెం గనుండు కవిరాజులు భారతశైలిలో నవీ
నమ్ముగ వ్రాయఁగాఁబడిన నాఁటెపుఁ బొత్తమిదొక్కటంచు సా
రమ్ముగ్రహించినట్టిరు పరంపరగా వచియింతు, రంతె కా
దెమ్మెయి దీనిఁబోని కృతి యింకొకటెక్కడ లేదటంచు ధై
ర్యమ్ముగఁ జెప్పఁగాఁగలరు రమ్యకవిత్వపటుత్వవేదులే
కమ్మయి మెచ్చఁగాఁగలరు కాకవిమూఁకలు కావుకావుమం

చుమ్మలికంబుమై నలుచుచుండిన మొండినబండ గొంతులన్;
గుమ్మంగలారు లావుగల కోవిదవర్యులు వానివూనికన్;
తమ్ముల తెమ్మలై వలచు తావుల పూవులు చిత్తజల్లుగాఁ
జిమ్మెడు హృద్యపద్యములఁజేవలు దేలుచునున్న దివ్యకా
వ్యమ్ముగఁదీర్చిదిద్దిన యపారకృపాపరుఁడైన సూతువా
క్యమ్ముల సొమ్ములెల్లెడల నందము చిందుచు విందుఁగూర్ప, గా
నమ్ము నొనర్చి పేర్చిన యనంత తపోమహిమాఢ్యమూర్తులన్
బమ్మిన భక్తిభావములఁ బ్రస్తుతిచేయనివారలుందురే
తమ్ములమిచ్చి సత్కృతులఁ దన్పకయుండని వారలుందురే
నిమ్మకునీరుపోసినటు నిండినకుండలువోలెనుండు మా
తమ్ములచేత స్వీయకథ తానయి వ్రాయఁగఁజేసి పద్మనే
త్రిమ్ములవాఁడు మర్త్యులకుఁ దాపము లెల్లనడంచి మోక్షధా
మమ్మునఁ గల్పవృక్షములమధ్యములన్ విహరించి మించు భా
గ్యమ్ములొసంగుఁగాతఁ గలకాలము మూర్తికవీంద్రచంద్రులన్
సమ్మదమొప్ప సత్కవనచాతురిఁగీరితికెక్కఁ జేయుతన్.

శ్రీ విక్రమవిలాసము,
త ణు కు.
**20—3—1955**

విద్వాన్
పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజు.
(జయపుర సంస్థానాస్థానకవి)

## ఉ ప దే శ ము.

"శ్రీమదాంధ్ర భాగవతము" దీనిని గద్వాల సంస్థానాస్థానకవులు 'శ్రీరామ నృసింహామూర్తి కవులు' గంధం శ్రీరామమూర్తి, ఇట్టెంకి నరసింహామూర్తులను జంటకవులు రచించి మొదటి మూఁడు స్కంధములు ముద్రించియున్నారు. సాధారణముగ జంటకవులు తమతమ రచనలు భాగములుగ విభజించుకొని చేయుదురో ప్రతిభాగముఁ గలిసి చేయుదురో లేక యొకేభాగమును నిరువురు సాయముపట్టి చేయుదురోకాని యిందు సౌకర్యముకంటె యసౌకర్యమే హెచ్చియుండుననియు, మొదటిమైత్రి తరువాత తరువాత తగ్గి జంటకవులు జంటలైనను గవిత్వమున కంత జంటతనముఁ గలిగింపఁజాలరని నాతలంపు. ఇందులకు వారివారి గ్రంథభాగములే ప్రమాణములు.

వీ రీ గ్రంథము మూలానుసారముగా (శ్లోకమునకుఁ బద్యముగా) రచించినట్లు సూచించుటకుఁగాబోలు మొదట సంస్కృత శ్లోకములు కొన్ని యుదహరించి యున్నారు. భాగవతము పురాణమువంటిది కాని కావ్యమువంటిది కాదు. కావ్యములు మక్కికి మక్కిగాఁ దెనిగింపనొప్పును. పురాణములట్లొప్పవు. కథాభాగములను విడువక తెనిగించుటయే మూలానుగతమని నామతము.

లోకములో పోతన భాగవతము విఖ్యాతమగుచుండ మఱియొకరెవ్వరును భాగవతము నాంధ్రీకరింపఁ బూనుకొనుటకు భయపడుచుండువారు. ఇప్పుడిప్పుడట్టి భయము విడిచి పెక్కుమంది తత్ప్రయత్నమునం దుత్సాహ సాహసములు చూపుచున్నారు. ఇది మిక్కిలి ముదావహము.

శ్రీరామ నృసింహమూర్తి కవుల శ్రీమదాంధ్ర భాగవతములోని మొదటి మూఁడు స్కంధములు నేను జదివినాఁడను. శైలి ప్రౌఢము, సంస్కృతపద భూయిష్ఠమునై సుదీర్ఘసమాసముల ననేకాద్భుత ప్రయోగములతో నిండియున్నది. నేను దీర్ఘసమాసమనిన మిక్కిలి భయపడు స్వభావముకలవాఁడను. ఈభయము సమాసప్రకరణము నాకుఁ గలిగించినది. దీర్ఘసమాసములలో నింత యేమఱిల్లితిమేని యనేక దోషములు తమంతఁ దామే వచ్చిపడును.

ఈ భాగవతానువాదమెట్లున్నదో నే నిట వ్రాయ నవసరములేదు. ఇందు మొదట విద్వాన్ కె. శ్రీరామమూర్తిగారు వ్రాసిన సమీక్ష నీక్షించినవారికిఁ దెలియక మానదు. కావున నే నిటఁ బునరుక్తిఁ జేయను. "అనగ ననగ రాగ మతిశయిల్లుచునుండు" అనునట్లె సర్వమునకుఁ గాలమే ప్రమాణమై సమీచీనతఁ గల్గించునని నా నిశ్చయము.

ఈ యిద్దఱు కవులును దాయభాగములేని సోదరులవలెనుండి సర్వవిషయము లొకరినొకరు సంప్రతించుకొనుచుఁ దమకుఁ దెలియని సంగతుల నితరులనడిగి తెలిసికొనుచు సంస్కృత ప్రతులలో నుండు పాఠభేదములు కనిపెట్టి యేది యుక్తమో దానిఁ గ్రహించుచు నిట్లే సద్గ్రంథరచనఁగావించి యతిలోకఖ్యాతిఁ గాంతురుగాక యని కోరుచు వారికిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యైశ్వర్యము లొసంగుంగాక యని ప్రార్థించుచున్నాను.

రాజమహేంద్రవరము
27—3—1955.

కవిసార్వభౌమ,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.
ఆంధ్ర ప్రభుత్వాస్థానకవి.




## ప్రథమ స్కంధము.



## ద్వితీయ స్కంధము.

## తృతీయ స్కంధము.

శ్రీరస్తు.

శ్రీ రామకృష్ణ పర బ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

శ్రీరామ నృసింహమూర్తి కవులు:—

## శ్రీరామకృష్ణ పరబ్రహ్మ స్తుతి.




కృచ్ఛ్యామలకోమలాంగము, నిజాంఘ్రిద్వంద్వమూలాశ్రితా
ప్తౌకానందవిధాయ్యపాంగము, రమాదోర్వల్లికాశ్లిష్టశి
ష్టాకారంబును గల్గు దుష్టజన శిక్షాసాధురక్షాసమీ
క్షాకల్యంబగు రామకృష్ణ సమభిఖ్య బ్రహ్మ మోము న్నమమున్. ౧

### వాల్మీకిస్తుతి.

మ. మనుజశ్రేణికి మార్గదర్శకుని, శ్రీమద్రామతత్త్వంబెఱిం
గినవిద్వన్మణి మహాత్ము నాదికవి, ముక్తిం గూర్చు "రామాయణం"
బను కావ్యంబు సృజింప బ్రహ్మ తన జ్ఞాయం జోడుగాఁజేసి కూ
ర్చిన వాల్మీకిని బోయబిడ్డను మదిన్ సేవింతు మశ్రాంతమున్. ౨

### వ్యాసస్తుతి.

మ. పరమంబౌ హరితత్త్వ మేఘుని యవ్యాజాంతరంగంబునన్
దిరమై నిల్చె నెవండు వేదముల వ్యాప్తిం జేసె నర్థిం బరా
శరపుత్రున్ మునిలోకచంద్రముని దాశాపత్యజున్ జ్ఞానభా
సురునిన్ భాగవతప్రణేతృ సువికాసుం గొల్తు మా వ్యాసునిన్. ౩

### శ్రీ శుకస్తుతి.

మ. దిననాథోపమ తేజమొప్పఁగ "స్వయం తీర్ణః పరాం స్తారయే"
త్తను సూక్తిం దరియించి తా నొరుల మోహాఖ్యాంబురాశిం దరిం
పను బోధించిన ప్రౌఢ భూతమయుఁడుం బాల్యంబునం బిన్న య
య్యును జ్ఞానంబున మిన్నయౌ శుకుని ధన్యుం గొల్తు మెల్లప్పుడున్. ౪

### సూతమహర్షి స్తుతి.

శా. "శిష్టాచారపరాయణుం" డను ప్రశస్తిన్ సూతజుండయ్యు ను
త్కృష్టానేకపురాణశాస్త్రసుధ రక్తిం గ్రోలి జ్ఞానప్రకృ

ష్టాష్టాశీతి సహస్రతాపసులు వేడ్కం దెల్ప నెవ్వాఁడు దాఁ
దుష్టిం బొల్చి స్మరింతు మాగుణసమేతున్ సూతు నుగ్రశ్రవున్. ౫

కృతజ్ఞత.

శా. ఓ యవ్యాజ కృపాప్రపూర్ణహృదయా! శ్రీ యోగదేవదేవా! రజో
భూయిష్ఠంబగు మర్త్యలోకమున మమ్మున్ సత్త్వమూర్తుల్ సుర
ప్రాయుల్ పుణ్యులునైన దంపతులకుం బ్రాదుర్భవింపించి దీ
ర్ఘాయుష్మంతులఁజేసి కూర్చితి వమూల్యంబైన సౌశీల్యమున్. ౬

సీ. సంస్కృతాంధ్రాదిభాషాధ్యయనాధ్యాప, నములఁ జేయించితివమలబుద్ధి
ఆంధ్రభాషను స్వతంత్రానువాదగ్రంథ, ముల రచింపించితివలఘు ఫణితి
అవధాన విధుల ననర్గళ వైఖరిన్, నల్పించితివి సజ్జనప్రశస్తి
సామర్థ్య మొసఁగి వ్యాసకృత సంస్కృత భాగ, వతము దెల్గింపఁ జేసితివి ప్రోది
గీ. ఆంధ్ర విశ్వవిద్యాలయమందు మాకు, నుభయభాషాప్రవీణాఖ్యశుభ బిరుదము
లీయఁజేసితి గద నీ కివే జోహారు, లాశ్రితజనానుకూల! కృపాలవాల! ౭

శా. జ్ఞానానందమయస్వరూప! యల శ్రీగద్వాలరాజన్య సం
స్థానాస్థానకవీంద్రగౌరవములంగల్పించి త్వత్పాదసే
వానిర్ణిద్రులమైనయట్టి మము నాపైఁ దావకీనోన్నతా
స్థానంబందున నిల్పికొంటి పృథుతేజా! శ్రీజగన్నాయకా! ౮

సీ. వ్యాసమునిప్రోక్త శ్రీ భాగవత పురాణ, మాంధ్రీకృతంబు మున్నైననఁ గాని
సురవాణిపైఁగల్గుసురుచిరభక్తి భా, వంబె యీ యాంధ్రానువాదమునకుఁ
బ్రేరేచె నది భవత్ప్రేరణగా నెంచి, యేము కడంగితిమీపనికయి
భవదనుగ్రహమునఁ శ్రీ బ్రారిప్సితార్థ సం, సిద్ధినిఁగందుమేమేము దేవ!
గీ. లక్షణయుతంబుగాఁగ మూలంబుకంటె, న్యూన మధికంబుఁ గాని సముచితసరణి
నింపెసఁగు నుడికారంపుసొంపు పెంపు, నింపు తెల్గింపుఁ జేసి నిలింప వినుత! ౯

సీ. సేవించినార మాసేతు కైలాస ప, ర్యంతంబు నీదు పుణ్యస్థలములు
కావించి నార మేకాగ్ర నిర్మలభక్తి, ననువేలముం ద్వదీ శ్రీ యార్చనములు
భావించినారముత్తవర పురుషార్థంబు, గాఁగ భాగవత సంయోగములను
జీవించి నారము చింతించుచు మది రం, జిల్ల నీ లీలా విశేషములను
గీ. మమ్ము నీభక్తులం జేరిమంబు మీఱ, నకలుషంబైన ప్రారిప్సితార్థ మందు
నెట్లు చరితార్థులంజేసి శ్రీ యేలుకొందొ, యఖిలలోకైకనాథ! దయానాథ!. ౧౦

శ్రీరస్తు.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ మ దాం ధ్ర భా గ వ త ము

## ప్రథమ స్కంధము

### అ ధ్యా య ము 1.

—శౌనకాది మహర్షికృత ప్రశ్నానుక్రమణిక—

వ్యాసుఁడు :—

సీ. జన్మాదికంబు విశ్వమున కెవ్వని నుండి, యగు నన్వయమునఁ ద దన్యమునను
సర్వార్థవేదియు స్వప్రకాశుండు నై, యెవ్వాఁడు తనరారు, హృదయ మందు
విజ్ఞులనేన్ మోహపెట్టు వేదము నాది, కవి యైన తోయజగర్భునకు నె
వం డుపదేశించెఁ బావక తోయ మృ, ద్వినిమయ మెట్లట్లు దెలిసి చూడఁ

గీ. త్రిగుణమయమై చెలంగెడు సృష్టి మిథ్య
యగుచు ననిశంబు నెవ్వాని యందుఁదోఁచు
నాత్మతేజో నిరస్త మాయా సమూహు
నట్టి సత్యాత్ము పరమాత్ము నాత్మఁ దలఁతు. 1

చ. పరముని సంప్రణీత మగు భాగవతంబున ధర్మ మొప్పెడున్
బరమ మకైతవం బయి, యమత్సర సాధు జనైకవేద్య మై
పరఁగుఁద్రితాపహారి యగు వస్తు విటం బెఱలేల ? దీనిఁ ద
త్పరత వినంగఁగోరు చరితార్థుల కీశుఁ డధీనుఁ డయ్యెడున్. 2

ఉ. ఆగమ కల్పక క్షితిరుహంబునఁ బండి శుకానన చ్యుతం
బై గణనీయమున్ రసమయం బమృత ద్రవ సమ్మితంబు నౌ
భాగవతాఖ్య సత్ఫలము భావుకులార ! రసజ్ఞులార ! స్వే
చ్ఛాగతి గ్రోలుఁడయ్య భువి సారెకు నామరణాంతముం దమిన్. 3

గీ. అనిమిషక్షేత్ర మగు నైమిశాఖ్య వనిని, శౌనకాది మునీంద్రులు స్వర్గలోక
సముపలబ్ధికి నై ఘనసత్ర యాగ, మర్థిఁ గావించిరి సహస్రహాయనములు. 4

క. ఆతాపసవరు లొకపరి, ప్రాతఃకాలంబున హుతపావకులై సం
ప్రీతి నుపాసీనుం డగు, సూతుం బ్రశ్నించి రిట్లు సునియతమతులై. 5

ఋషులు :—

క. అమలమనీషీ! యితిహా, సములు పురాణములు ధర్మశాస్త్రము లెల్లన్
గ్రమ మొప్పఁగ నీ వధ్యయ, నముఁ జేసితి మఱియు వివరణముఁ జేసి తహో! 6

మ. భగవంతుం డగు బాదరాయణుఁడు విద్వల్లోకముఖ్యుండు ము
న్నగనై వేని నెఱింగె బ్రహ్మవిదు లన్యుల్ మానులుం గేవలం
బగు ధీయుక్తి నెఱింగిరో స్తుతమతీ! యా సర్వముం దత్కృపన్
దగు చందంబున నీ వెఱింగితిగ సూతా! ధీవిశేషాన్వితా! 7

ఉ. స్నేహ సమభ్యుపేతుఁడగు శిష్యునకుం గురువుల్ గడంగి సం
దేహము నుజ్జగించి యుపదేశముఁ జేయుచు నుంద్రు తన్మనో
మోహము వాయునట్లు పరిపూర్తిగ గుహ్యము నైనఁగాని సూ
తా! హరిపాదభక్తికలితా! యెఱిఁగింపుము మాకు నీ వటుల్. 8

క. ఆయుష్మంతుఁడ! నీచే, నా యా పట్టుల వ్యవసితమై పురుషులకున్
శ్రేయస్సాధనమును నిర, పాయము నగు నర్థ మేది పలుకుము దానిన్. 9

క. ప్రాయికముగ నందఱు న, ల్పాయుష్కులు కలియుగంబు నందలి జనముల్
వేయేల? మూఢబుద్ధు ల, పాయయుతులు మందభాగ్యు లలసులును గదే! 10

వ. సంవిభాగంబున శ్రోతవ్యంబులు ననుష్ఠేయంబులు నగు కర్మంబులు పెక్కు గలవు. కావున నో సాధుపుంగవా! ఆత్మప్రసాదకరంబగు తత్సారాంశము సంగ్రహించి భూతశ్రేయంబు పొంఱు వక్కాణింపుము. 11

ఉ. నీ వఖిలం బెఱుంగుదువు నీకు శుభంబగు సర్వభక్తసం
భావనతత్పరుండు భగవంతుఁడు కృష్ణుఁడు దేని సల్పఁగా
దేవకియందుఁ బూజ్యవసుదేవునకుం జనియించె దాని సూ
తా! వినఁగోరు మాకు విశదంబుగఁ దెల్పఁగఁజాలుదీ వెకా. 12

సీ. ఎవని శుభంబగు నవతార మఖిల భూ, తములకు క్షేమాభ్యుదయము లొసఁగు
నెవనిశ్రీమన్నామ మవశతవాకొన్న, భవరుగార్తుఁడు ముక్తిపథముగాంచు
నెవ్వని కతమున హృదయంబు లోపల, భయమును గడుభయంపడుచు నుండు
నెవని పాదము లాశ్రయించి మునీశ్వరుల్, శాంతినికేతులై సంచరింత్రు

గీ. మఱియు స్వర్ణదీ జలములమాడ్కిఁ గడుఁ బ
విత్రులగుచు నిజస్పర్శమాత్రమునన

యితరులను బునీతులుగఁ గావించుచుండొ
యట్టి హరి కథల్ వినఁ గుతూహలము వొడమె. 13

గీ. శుద్ధికాముఁ డెవండు సుశ్లోక గేయ
కర్ముఁ డయిన యాభగవంతుకలిమలాప
హ మగునట్టి నిర్మల యశం బమితమైన
వేడ్క మనమందుఁ జొప్పిలవినకయుండు? 14

గీ. శ్రద్ధ వినఁగోరు మాకునుబ్రహ్మరుద్ర
ముఖ్యమూర్తులఁ దాల్చు నమ్మూల పురుషు
సూరిజన పరికీర్తి తోదార కర్మ
జాలముల నెఱిఁగింపు మోసాధువర్య! 15

చ. మహిని యథేచ్ఛ స్వీయమగుమాయను లీలలు సల్పు నయ్యదూ
ద్వహుని శుభంబులైన యవతారకథల్ వినిపింపు మింక మా
కహహ! పవిత్ర సచ్చరితుఁ డాశ్రితవత్సలుఁడైన యమ్మహా
మహు నురువిక్రమంబు విన మాకు జనింపదు తృప్తి సుంతయున్. 16

వ. అప్పురుషోత్తము విక్రమంబు వినఁగోరు రసజ్ఞులకు ననుపదంబున స్వాదుతరంబై
యుండుఁగాదె? 17

మ. యదువంశంబున గూఢరూపమున మాయామానుషుండై ప్రజా
భ్యుదయప్రాప్తికిఁ గేశవుండు బలరాముంగూడి యుత్సాహ సం
పద మీఱంగ నమానుషంబులగు శుంభద్వీర్యముల్ సల్పెఁగా
అదిరా! యయ్యవి యెల్ల మాకు వినఁగానయ్యెన్ మదిన్ వేడుకల్. 18

సీ. కలియరుదెంచుట కని వైష్ణవమగు నీ, క్షేత్ర మందుం దీర్ఘ, సత్రపరత
నాసీనులమునయిహరి కథాశ్రవణ స, ముత్సుకత్వము గల్గియుంటి మేము
సత్వహరమ్ము దుస్తరమునౌ ఘోరసం, సారవారిధి దాఁటఁగోరు మాకు
కర్ణధారుండు మహార్ణవంబుఁ దరింపఁ, గోరెడు పురుషులకుంబలె నిట

గీ. బ్రహ్మచేత సందర్శింపఁ బడితి వీవు
మహితయోగేశ్వరుండు బ్రహ్మణ్యుఁ డమల
ధర్మ కవచుఁడు నగు హరి తనదు పదవిఁ
జెంద ధర్మమెవ్వని శరణొందెఁ జెపుము. 19

## అధ్యాయము 2.

### సూతకృత భగవత్కథా ప్రశంస

వ్యాసుఁడు:—

క. అని యడిగిన సంప్రశ్నము, విని సంతుష్టాత్ముఁడగుచు విప్రులకుఁ దదు
క్తిని మెచ్చుకొనుచుఁ దా ని, ట్లని చెప్పం దొడఁగె రోమహర్షణి ప్రీతిన్. 20

సూతుఁడు:—

మ. అనుపేతుండు నపేతకృత్యుఁడును సన్న్యస్తుండునై పోవు నె
వ్వని "పుత్రా!" యనుచున్ విరాళి వెతమై వ్యాసుండు బిల్వం బ్రతి
ధ్వనులం దన్మయతం బొనర్చెఁ దరు సంతానంబు లమ్మౌనినా
థుని సద్బోధుని బాదరాయణి భజింతున్ సర్వభూతాత్మకున్. 21

మ. శ్రుతిసారంబుఁ బురాణగుహ్యమును సంస్తుత్యప్రభావంబు న
ప్రతిమానంబును నై విరాజిలెడు దివ్యాధ్యాత్మ దీపంబు నం
ధతమంబున్ హరియింపఁగాఁ దివురు మర్త్యశ్రేణి కెంతే సమా
దృతి బోధించిన వ్యాసపుత్రు గురుమూర్తిన్ నేఁ బ్రశంసించెదన్. 22

క. నారాయణునకు నరునకు, భారతికిన్ వ్యాసునకును భక్తిమెయి నమ
స్కారంబులు చేసి శుభ, ప్రారంభముతోడ జయముఁ బలుకఁగవలయున్. 23

గీ. ఆత్మకుఁ బ్రసాదముం గూర్చునట్టిదైన, కృష్ణసంప్రశ్న మీ ట్లొనరింపఁబడుట
భువనకల్యాణమును గోరుమునివరేణ్యు, లార! లెస్సఁగ నడిగితిరయ్య నన్ను. 24

గీ. హృదికలఁకఁ దేర్చునట్టి యహేతుకంబు, నప్రతిహతంబు నగుభక్తి యచ్యుతునెడ
దేన నుత్పన్నమగునో యతీంద్రులార!, పరమధర్మం బదియ సుమ్ము పురుషునకును.

గీ. స్థిరత భగవంతుఁడగు వాసుదేవుపైఁ బ్ర, యోజితంబైన సద్భక్తియోగ మెన్న
గాఢవైరాగ్యము నహేతుకమగు జ్ఞాన, సంపదను గలిగించును సత్వరంబ. 26

క. తగు చందమున ననుష్ఠిత, మగు ధర్మము పూరుషులకు హరికథలం ది
మ్మగు రతిఁ గూర్పని చోఁ బో, ల్పఁగ నా ధర్మంబు గేవలము శ్రమకెయగున్. 27

గీ. ప్రేమఁ బ్రభవిష్ణువిష్ణుకథామృతాప్తిఁ గరఁగుమది ప్రేముడియుఁ బులకాంకురములుఁ
బొడము తెఱఁగున నుపనిషత్ప్రోక్తమైన, యాత్మతత్త్వంబు విన్నంత నవి పొడమవు.

వ. అపవర్గయుక్తమైన ధర్మంబున కర్థంబు ప్రయోజనకరంబు కానేరదు. ధర్మనియతంబైన యర్థంబునకుఁ గామంబు లాభకరంబు కాదు. జీవన పర్యాప్త సేవ్యంబగు కామంబునకు నింద్రియప్రీతి ఫలంబు కానేరదు. జీవంబునకుఁ దత్త్వజిజ్ఞాస దక్క కర్మసిద్ధి ప్రయోజనంబు కాదు. 29

గీ. అవ్యయంబగు జ్ఞాన మెయ్యదియెసంగుఁ
దత్త్వమని చెప్పుదురు దానిఁ దత్త్వవిదులు
అయ్యదియె బ్రహ్మమని పరమాత్మ యనియుఁ
బరగ భగవానుఁడనియుఁ జెప్పంగఁబడును. 30

గీ. ఆ పరబ్రహ్మమందుఁ బ్రత్యయము నిడుచుఁ
బ్రాజ్ఞులగు మునుల్ జ్ఞాన వైరాగ్యలాభ
సంయుతము భగవత్కథాశ్రవణ జనిత
మైన భక్తి నాత్మం గాంతు రాత్మ యందు. 31

క. యతివరులారా! పూరుష, తతి వర్ణాశ్రమ విభాగతం జేసి స్వను
ష్ఠిత మగు ధర్మంబున కచ్యుత పరితోషణమె సిద్ధి యాలోచింపంగన్. 32

గీ. కాన నేకాగ్రమై యొప్పు మానసమున
భక్త వల్లభుఁ డగు భగవంతుఁడు హరి
అనవరత మాలకింపఁ గీర్తనముఁ జేయ
ధ్యాన మొనరింపఁ బూజింపఁ దగిన వాఁడు. 33

క. చదురులు కర్మగ్రంథుల, యదనుధ్యానాసి కలితు లగుచుం దెగఁగో
యుదురో యాదేవు మహా, భ్యుదయ కథల నెవఁడు ప్రీతినుంచఁడు? చెప్పుఁడీ. 34

గీ. పుణ్యతీర్థ నిషేవణంబునఁ బొడమును, సాధుజనసేవ సంయమిచంద్రులార!
దాన శ్రవణోత్సుకుండు శ్రద్ధాళువు నగు, వాసుదేవ కథారతి వాని కొదవు. 35

క. తనకథలన్ వినువారికి, ననయము హృదయాంతరస్థుఁ డగుచున్ శుభకీ
ర్తనుఁడు సుధీహితుఁడు జనా, ర్దనుఁ డశుభపరంపరలను దలగం ద్రోయున్. 36

గీ. సతతమగు భాగవతసేవకతన నశుభ, ము లవియెల్ల నష్టప్రాయములగుడు నతి
పావన చరిత్రుఁ డగు భగవంతునందు, నిష్ఠ తోడుత భక్తి జనించుచుండు. 37

గీ. పదఁపడి రజస్తమోగుణ ప్రభవములగు, కామ లోభాదికములచేఁ గలఁతపడక
సుస్థిరముగఁ జిత్తంబు సత్త్వస్థితమయి, సుప్రసన్నత్వముం బొందు విప్రులార! 38

గీ. ఈగతిన్ భగవద్భక్తియోగమునఁ బ్ర
సన్నమానసుఁడై ముక్తసంగుఁడైన
పూరుషునకుఁ దోడ్తో సముద్భూతమగుఁ బ
రాత్మ తత్త్వ విజ్ఞాన మో యార్యులార! 39

క. భిన్నములగు హృద్గ్రంథులు, ఛిన్నములగు సంశయము లశేషంబుగ ను
త్పన్నములగు కర్మలు లోఁ, గన్నంతన నాత్మ రూపుఘను నీశ్వరునిన్. 40

గీ. కావునఁ బరేశుఁడగు వాసుదేవునందుఁ
గవులు పరమముదంబునం దవిలి సతము
నాత్మకుఁ బ్రసాదముంగూర్చునట్టిదైన
భక్తిఁ గావించుచుందురు ప్రాజ్ఞులార! 41

చ. ప్రకృతి గుణంబులై పరగుఁ బాయక సత్త్వ రజస్తమంబు లొ
ద్దిక మెయి వానిఁగూడియె ధృతిం బరముండగు పూరుషుండు మూ
ర్తికి నొకఁ డయ్యునున్ హరి విరించి హరాఖ్యలఁ బూను నందు స
త్త్వకలితమూర్తిచేతనె, శుభంబులు కల్గును మర్త్యకోటికిన్. 42

గీ. భౌమమగు దారువునయందు ధూమము ద్ర
యీమయుం డగు నగ్ని యా ధూమమందు
బోలెను దమంబునన్ రజంబును రజమున
బ్రహ్మదర్శకమైన సత్త్వంబు వాడము. 43

క. మును లిక్కారణమున నే, మును భగవంతుఁడును సత్త్వమూర్తియు శుద్ధుం
డు నగు నధోక్షజుఁ గొని రా, మునుల ననుగమించి ముక్తిఁబొందిరి యితరుల్. 44

గీ. భూతపతులను ఘోర రూపులజయించి
దేవతాంతరములను నిందింపఁబోక
శాంతికలిత నారాయణాంశముల భక్తిఁ
గొలుచు చుందు రటుల్ ముముక్షువులు సతము. 45

క. సమశీలురు కాన రజ, స్తమః ప్రకృతులై నవారు సంతానైశ్వ
ర్యములం గోరుచుఁ బితృ భూ, తములఁ బ్రజేశాదులను సదా గొల్తురితమిన్. 46

వ. మఱియు వేదంబులును, యజ్ఞంబులును, యోగంబులును, క్రియలును, జ్ఞానంబును,
తపంబును, ధర్మంబును, గతియును, సర్వంబును వాసుదేవ పరంబు. 47

క. అగుణుఁడు విభుండు నగు నా, భగవంతుఁడె గుణమయం బపారము నగుచున్
నెగడెడు సదసద్రూపం, బగు నిజమాయన్ సృజించె నఖిల జగంబున్. 48

గీ. స్వీయ మాయాపరిభూతంబులై యెసంగు
గుణములందును బరికింప గుణియుఁ బోలె
లోనఁజొచ్చిన వాఁడై వెలుంగు విభుఁడు
చెన్ను మీఱి విజ్ఞాన విజృంభితుఁడయి. 49

గీ. ఒక్కఁ డయ్యును వహ్ని స్వయోను లైన
దారువులఁ బోలెఁ బెక్కు విధములు గాఁగ

విశ్వ రూపకుఁ డగు పరమేశ్వరుండు
దోఁచుచుండును భూత సందోహ మందు. 50

క. స్వ వినిర్మితమ్ములగు భూ, తవితానములందుఁ జొచ్చి తద్గుణముల లో
కవిభుండగు హరి దా నను, భవించు గుణమయము లైన భావము లెసఁగన్. 51

గీ. దేవ నర తిర్య గాది లీలావతార,ములను దా ననురక్తుఁడై భువనసముద
యావనపటిష్ఠుఁ డైన యయ్యాదివిభుఁడు, లీలమై లోకములను బాలించుచుండు. 52

---

## అధ్యాయము 3.

### శ్రీమన్నారాయణైక వింశత్యవతార కథాభివర్ణనము

సూతుఁడు:—

క. ఆదిన్ భగవంతుఁడు మహ, దాది సముద్భూతముఁ బదునాఱు కళల నెం
తేఁ దనరారెడు పౌరుష, మౌ దేహముఁ గొనె జగత్త్రయము సృజియింపన్. 53

గీ. నీటఁ బవళించి యురు యోగనిద్ర నెఱపు
నట్టి యాతని నాభి హ్రదాంబుజంబు
నందు నుండి దా విశ్వసృ డధిపుఁ డైన
ద్రుహిణదేవుండు తొలుతఁ బ్రాదుర్భవించె. 54

గీ. మౌనులార! తదవయవ స్థానములను
జేర్మిఁ గల్పింపఁబడె లోకవిస్తరంబు
శుద్ధసత్త్వమయంబు విస్ఫూర్తియుతము
నైన యదె భగవద్రూపమని తెలియుఁడు. 55

చ. ఉరుతరమున్, సహస్రచరణోరుభుజాస్యవిచిత్రమున్, ధురం
ధరము, సహస్రమూర్ధనయనశ్రవణాధరనాసికంబు, శ్రీ
కరము సహస్రమౌళికనకాంబరకుండలభూషితంబు నౌ
సురుచిరరూపమిద్ది యెదఁ జూతురు మౌనులు జ్ఞానదృష్టులన్. 56

క. నానావతారములకు ని, ధానము స్థిరబీజ మేత దంశాంశములన్
జానయిన దేవ తిర్య, జ్మానవ ముఖ సృష్టి జరుగు మానిత రీతిన్. 57

క. ఆ దేవదేవుఁ డగు హరి, యాదిం గౌమార సర్గమంది ద్విజన్ముం
డై దుశ్చరము నఖండము, నౌ దృఢమగు బ్రహ్మచర్యమునువుగ నడిపెన్. 58

గీ. యజ్ఞవిభుఁడైన హరి ద్వితీయమగు క్రోడ
తనువుఁ దాలిచె వెన రసాతలగతయగు

వసుమతీదేవి నుద్ధరింపఁగోరి
యెల్లలోకంబులన్ సృజియించుపొంటె. 59

గీ. మూఁడవదియైన ఋషిసర్గమున సురర్షి
గాఁగనై కర్మములకు నైష్కర్మ్య సిద్ధి
దేనివలన సిద్ధించు నన్నూనమైన
యట్టి వైష్ణవ తంత్ర మొయ్యన్ వచించె. 60

గీ. అవల నాలవయవతారమందు ధర్మ
జాయయగు మూర్తికి నరనారాయణాఖ్యు
లైన ఋషులుగా జన్మించి యయ్యధిపుఁడు
దమశమాన్విత దుశ్చర తపము సల్పె. 61

గీ. కపిలుఁ డనఁగ సిద్ధేశుఁడై కాల విప్లు
తమగు సాంఖ్యయోగంబును దత్త్వ నిర్ణ
యంబుఁ గావించి బోధించె నాసురికిని
జగ దధీశ్వరుఁ డైదవ సర్గ మందు. 62

గీ. అత్రివలన నపత్యమ వగుము నాకు
ననుచుఁ గోరిన యనసూయ కాత్మజుఁ డయి
ఆత్మ విద్య నలర్క ప్రహ్లాద ముఖ్య
ధీరులకుఁ దెల్పె షష్ఠావతార మందు. 63

గీ. అంత నేడవ యవతారమందు యజ్ఞుఁ
డనఁగ రుచికి నాకూతి యం దవతరించి
యతఁడు యామాది దేవగణాన్వితుఁడయి
పాలనముఁ జేసె స్వాయంభు వాంతరంబు. 64

గీ. ఎనిమిదవ దైన యవతారమునను మేరు
దేవియందు నాభికి నుప్పతిలి యురుక్ర
మాఖ్యుఁ బరఁగి బోధించె సర్వాశ్రమార్చ
నీయమైన మార్గంబును ధీయుతులకు. 65

క. నవ మావతారమునఁ బార్థివ మగు దేహంబుఁ దాల్చి ఋషి యాచితుఁడై
యవనిన్ మహౌషధులఁ బిండె విప్రులారా! విభుండు నేర్పుఁ దలిర్పన్. 66

క. వననిధి సంప్లవసమయం, బునఁ దాఁ బదవయవతారమున మాత్స్యంబౌ
తనువును గొని వైవస్వత, మనువున్ భూనౌకఁ జేర్చి మనిచె విభుఁ డటన్. 67

గీ. దేవ దానవు లబ్ధి మథించు నవసరమున నేకాదశావతారమునఁ గూర్మ
రూపమున మంధరాద్రిని నా పరాత్ప,రుండు పృష్ఠభాగమ్మునందండిఁ దాల్చె. 68

వ. ద్వాదశావతారంబున ధన్వంతరిరూపంబు ధరించె. త్రయోదశావతారంబున
జగన్మోహినీ రూపంబుఁ దాల్చి యసురుల మరులఁ గొల్పి సురల రక్షించె. 69

గీ. ధీరతఁ బదునాలవ యవతారమందు
నారసింహ రూపము దాల్చి క్రూరుఁ డైన
రాక్షసేంద్రుని ఖరనఖరముల నురముఁ
జీరె నేరకములఁ గటకారుఁడు వలె. 70

క. పిదప విభుఁడు పదునేనవ, యదియగు పుట్టువున వామనాకృతి మగుడన్
ద్రిదివంబు నాచి కొనఁగాఁ, బదత్రియము వేడఁబోయె బలి క్రతువునకున్. 71

క. ఆరయఁ బదునాఱవ యవ, తారంబున ధర్మవిరహిత నృపులఁ గని యీ
ధారుణి నిఃక్షత్రముగన్, వారక ముయ్యేడు మా ర్లొనర్చెఁ గుపితుఁడై. 72

గీ. మఱియుఁ బదునేడవ దగుజన్మంబునందు
సత్యవతి యందుఁ దాఁ బరాశరుని వలనఁ
బొడమి యల్పమేధస్కులౌ పురుషుల కయి
నిగమ తరువున శాఖలు నిగుడఁ జేసె. 73

క. అవలం బదునెన్మిదియవ, యవతారమునందు రాముఁడై విభుఁడు మహా
ర్ణవ నిగ్రహాది వీర్యము, లవనిం గావించె దేవతాభ్యర్థితుఁడై. 74

గీ. జగతి నేకోన వింశ వింశతి తమ రుచి
రావతారంబులం బలరామ కృష్ణు
లగుచు వృష్ణి వంశంబున నవతరించి
పరమ పురుషుండు మేదినీభరము నుడిపె. 75

గీ. పదఁపడి కలియుగంబు సంప్రాప్త మగుడు
సుర విరోధులు మోహావాగురలఁ దెరల
బుద్ధుఁ డను నామమున జినపుత్రుఁ డగుచుఁ
గీకటంబులఁ బొడము లోకైక విభుఁడు. 76

గీ. అంత నా దేవుఁడు కలియుగాంతమున న
రాధిపతులు దస్యు ప్రాయులై మెలఁగుడు
విష్ణు యశుఁడు నాఁ బరఁగెడు విప్రునకును
జనన మందును దాఁ గల్కి యనెడి పేర. 77

క. జాలెడలని పెనుగొలఁకునఁ, గాలువ లెటు వేనవేలు కల్గునొ యటు స
త్త్వాలయుఁడగు హరియవతా, రాలియసంఖ్యేయమయి విరాజిలు జగతిన్. 78

క. ఋషులును మనులును మఱి యని
మిష తతియుఁ బ్రజాధిపతి సమేతులు, సుమహా
ధిషణులు నగు మనుసుతులును
హృషీకపతి కళలు గాఁగ నెఱుఁగుఁడు మీరల్. 79

క. ఆవిభుని యంశ కళ లివి, కేవల భగవంతుఁ డొక్క కృష్ణుఁడె సుండీ
దేవారి వ్యాకుల మగు, నీవిశ్వము వీరు ప్రోతు రెల్ల యుగములన్. 80

క. ఏనరుఁడు గుహ్య మగు భగ, వానుని జన్మంబు రేయుఁ బవలును భక్తిన్
ధ్యానించును ముక్తుండగు, నానరుఁడు భవంబు నుండి యతివరులారా! 81

గీ. జ్ఞానమయుఁడు నరూపుండు నైన పరమ
పూరుషున కెన్న నీరూపము మహదాదు
లైన మాయాగుణములచే నాత్మ యందు
విరచితంబయ్యెఁ దెలియుఁడో విప్రు లార! 82

క. వ్యోమమున మేఘపటలము, భౌమంబగు రేణుగణము వాయువునఁ బలెన్
పామరులు ద్రష్టయందు స, దా మోపుచు నుంద్రు దృశ్యతా ధర్మంబుల్. 83

వ. మఱియు నవ్యక్తంబు నపరిణతంబు గుణవిరచితంబు పునరావృత్తిసహితంబు నగు లింగశరీరంబు నాయాత్మయం దారోపింతురు. అవిద్యాశక్తి నాత్మ యందు నారోపితంబులగు నీ సదసద్రూపంబులు రెండుఁ బ్రతినిషిద్ధంబులగుటయ బ్రహ్మ దర్శనం బనంబడు. ఈశ్వర సంబంధినియగు నీ మాయాదేవి యుపరత యగునేని విద్యాసంపన్నుం డగు నని విజ్ఞు లంద్రు. విద్యాసంపన్నుండు స్వమహిమంబునఁ దేజరిల్లు. అకర్తయు నజుండును నంతర్యామియు నగు నా భగవంతుని వేదగుహ్యంబులగు జన్మ కర్మంబు లిట్లు కవీంద్రులు వర్ణింతురు. 84

మ. వినుఁ డీతండె యమోఘ లీలుఁ డయి యీవిశ్వంబుఁ బుట్టించుఁ, బెం
చు నణంగించు నొకింతయుం దగులఁడీచొప్పుఁ దాను భూతవ్రజం
బున నంతర్హితుఁడై స్వతంత్రుఁ డగుచుంబొల్పారి సర్వేంద్రియా
ధి నియంతృత్వము గల్గి మూర్కొను దదుత్కృష్టార్థమున్ హేలమై. 85

వ. నర్తకుండుం బోలె మనోవచనంబులచే నామరూపంబుల విస్తరింపంజేయు జగద్విధాతయగు నాదేవదేవు లీలావిలాసంబులఁ గుమతియగువాఁడు తర్కాది కౌశలంబున నైన నెఱుంగం జాలఁడు.' 86

సీ. నిష్కపటంబును నిరతంబు నగు భక్తి, పారవశ్యమునఁ దత్పాదకమల
గంధంబు భజియించుఁ గడఁక నెవ్వాఁడు వాఁడ, ఖండ వీర్యంబు జగద్విధాత
యగు చక్రపాణి దివ్యం బగు పదవినిఁ, దెలియంగఁ జాలు యతీంద్రులార!
తిరిగి దుష్పరిణతిం బొరయని సర్వాత్మ, కంబగు నాత్మభావంబు నెవ్వ

గీ. రఖిల లోకాధినాయకుఁడైన వాసు, దేవు నందు నిత్తెఱఁగున స్థిరము గాఁగ
సల్పుచుందురో యగ్రజన్ములార!, తలఁప ననఘాత్ములగు వారె ధన్యతములు.

గీ. ఆగమవిదుండు వ్యాసమహర్షి బ్రహ్మ, సమ్మతము నుత్తమ శ్లోకచరితమునయి
యలరు నీభాగవతసంజ్ఞ మగు పురాణ, రాజమును రచియించె నవ్యాజ మహిమ.

గీ. భువన కల్యాణమునకునై పుణ్యదము, శుభావహంబును మహితంబునైన దీని
నాత్మవంతులలో శ్రేష్ఠుఁడైన తనదు, తనయు గ్రహియింపఁ గాఁ జేసె ననఘరీతి.

గీ. సర్వ వేదేతిహాస సంచయము నుండి
యుద్ధృతంబగు సారంబు నిద్ధ ఫణితి
నృప కులాభరణుఁ డగుఁ బరీక్షితునకుఁ
దెలియ వినిపించె నా శుకదేవుఁ డంత. 90

సీ. పరమ యోగీశ్వరపరివృతుఁడై జాహ్న, వీతటిన్ బ్రాయోపవిష్టుఁడైన
యాపరీక్షిన్మహా భూపాలునకును బో, ధించెడు నద్భుత తేజుఁడైన
విప్రర్షి వలన నో విప్రులారా! తదీ, యానుగ్రహంబున నందుఁ జేరి
నేను నెఱింగితి నిశ్చితమతులయి, జిజ్ఞాసఁ బఱగుటఁ జేసి మీకు

గీ. విన్న యది వినిపించెద విస్తరించి
జ్ఞాన ధర్మాది యుతుఁడై నిజ పథమునకు
గృష్ణుఁ డేగఁ గలిన్ నష్ట దృష్టులైన
వారికీ పురాణార్కుండు వసుధఁ బొడమె. 91

## అధ్యాయము 4.

### వ్యాసానుతాపము

వ్యాసుఁడు :—

ఆ.వె. దీర్ఘ సత్రు లగు యతీంద్రుల కిట్లు వా
క్రుచ్చు సూతుఁ గాంచి కులపతియును
నిగమసార వేదియగు శౌనకాభిఖ్య
వృద్ధ సంయమీంద్రుఁ డిట్లు పలికె. 92

శౌనకుఁడు :—

గీ. ఓ మహాభాగ ! సూత ! లోకోపకార
నిరత ! వక్తలలో నతినిపుణమతివి
మున్ను భగవంతుఁడగు శుకముని నుడివిన
దివ్యమగు భాగవతకథఁ దెలుపు మయ్య. 93

గీ. ఏయుగంబున నెచట నేహేతువునఁ బ్ర
వృత్త మయ్యె నియ్యది మఱి యెవని చేతఁ
బ్రేరితుం డయి మౌని వరేణ్యుఁ డైన
వ్యాసుఁ డీసంహితం జేసెనయ్య ? చెపుమ. 94

ఆ.వె. అతని నందనుఁడు మహాయోగి సమదర్శి, నిర్వికల్పకుండు నియతమతి స
మిద్ధతేజుఁడున్ బ్రబుద్ధుఁడు ఘనుఁడు ని, గూఢుఁడు నయి దోఁచు మూఢునట్ల. 95

క. కురు జాంగల దేశములన్, సరగున నున్మత్త మూకజడుల వడువునన్
దిరుగుచుఁ గరినగరంబునఁ, బురజనములచేత నెట్లు పోల్పఁ బడియెనో. 96

చ. తనయుని వెంబడించి మనుతేం జనుఁ దెంచుచు వస్త్రధారియై
కన నగు వ్యాసమౌనివరుఁ గాంచి త్రపాన్వితలై ధరించి రో
య్యన పరిధానముల్ శుకమహార్షి దిగంబరరూపముం గనుం
గొని నపు డవ్విధంబుఁ గయికోరు సురాంగన లెంత వింతయో ! 97

ఉ. ఆరమణీశిరోమణుల నంత మునీంద్రుఁడు జూసి "దీనికిం
గారణ మేమి" యంచు నడుగన్ విని వారలు మౌనితోఁ "దప
స్వీ ! రహిమీఱ స్త్రీ పురుష భేద మెదం గలదయ్య నీకు లే
దారయఁ బూతదృష్టియగు నా శుకదేవున" కంచుఁ బల్కరే ? 98

క. గేహుల గేహంబుల గో, దోహన మాత్రంబ నిల్చి తోడ్తోఁ దద్వ్యా
మోహంబు లెడలఁ దీర్థము, లై హా త్తఁగఁ జేసె వారి యాశ్రమపదముల్. 99

గీ. ఇట్టి మునిచంద్రుతోడ రాజర్షి యైన
పాండవేయునకున్ భాగవత సమాఖ్య
సంహితాత్మకమున్ బ్రశంసార్హమునగు
భవ్య సంవాద మెట్టులు పరఁగెఁ జెపుమ. 100

గీ. ఔత్తరేయుని భాగవతోత్తమునిగఁ, బల్కుచుందురు ప్రాజ్ఞులవ్వసుమతీ ర
మణుని యద్భుతజన్మకర్మముల మాకుఁ, దెలియఁగా జెప్పు మో సూత! ధీసమేత!

ఆ.వె. పాండు వంశ వర్ధనుండగు నాసార్వ, భౌముఁ డేమి కతనఽసామ్రాజ్య మైన
రాజ్య లక్ష్మి విడిచిఽప్రాయోపవిష్టుఁ డై, యుండె నయ్య గంగఽయొడ్డునందు. 102

చ. అరులు వినమ్రు లై, నిరతఽమాత్మ సుఖంబున కై ధనంబులన్
బరువడిఁ దెచ్చి యేనృపతిఽపాద సరోరుహపీఠమున్ భజిం
తురో ఘనవీరమూర్తి తరుఽణుం డగు నావిభుఁ డేల సౌఖ్యబం
ధురమగు శ్రీనిఁ బ్రాణముల ఽ తో విడనాడఁగ నెంచెనో కదా! 103

చ. జగమునకున్ శుభంబు భవఽసౌఖ్యము శ్రీయును గూర్చు పొంటె నె
న్నఁగ భగవత్పరాయణ మఽనస్కులుఁ బ్రాజ్ఞులు జీవనంబు సే
యఁగ గమకింతు రిస్వార్థమునఽకారయ రిల్లు విరక్తిభావముల్
మిగులఁ బరాశ్రయంబగు కఽళేబర మీతఁడు వీడనేలొకో! 104

క. అడిగినది యెల్ల మాకు, న్నుడువుము తలపోయుదుము నిఽనున్ మదిలో నే
ర్పడ ఛాందసేతరం బై, యడరెడు వాగ్జాలమునకు ఽ నభిషిక్తునిఁ గాన్. 105

సూతుఁడు:—

గీ. ధీమహితులార! యుగ పరిఽణామమునఁ దృ
తీయ మగు ద్వాపరంబు వఽర్తిల్లుచుండ
హరి కళం బుట్టె నల పరాఽశరుని వలన
వాసవి యగు సత్యవతికి ఽ వ్యాసమౌని. 106

సీ. ఒక్కనాఁ డతఁడు సూఽర్యోదయ సమయాన, స్వచ్ఛసరస్వతీ ఽ జలము నందు
స్నానాదికంబును ఽ సల్పి యేకాకి యై, విజనస్థలి సుఖోపఽవిష్టుఁ డయ్యెఁ
బిదపఁ ద్రికాల సంఽవేది యమ్మౌని య,గమ్య వేగంబైన ఽకాలమహిమఁ
బ్రతియుగంబున భువింఽబరిఢవిల్లెడు యుగ, ధర్మ సంకరమును, ఽ బేర్మి మీరఁ

గీ. గాల కృత మగు భౌతిక ఽ కాయశక్తి, హాని, నశ్రద్ధధాను లఽల్పాయువులును
దుర్బలులును నిస్సత్వులుఽదుష్టమతులు, నైన జనములనుం గలఽయంగఁ జూచె. 107

గీ. కని యమోఘ దృష్టి యగునాఽమునివరుండు
సర్వ వర్ణాశ్రమముల కోఽజన్ హితంబుఁ
గూర్పఁ గా నెంచి దివ్యచఽక్షువునఁ గడఁగి
ధ్యాన మొనరించె మౌని వఽతంసులార! 108

వ. చాతుర్హోత్రంబును, శుద్ధంబును, వైదికంబు నగు కర్మంబును జూచి ప్రజలకు యజ్ఞ విస్తృతి కొఱకు నేకంబగు వేదంబును చతుర్విధంబుగా నొనరించె. అది

ఋగ్యజు స్సా మాథర్వ నామంబులఁ బరఁగుచుండు. ఇతిహాసంబుఁ బురాణంబును
బంచమవేదంబునని చెప్పంబడు. అందుఋగ్వేదంబును పైలుండును, సామవేదంబును
జైమినియు, యజుర్వేదంబును వైశంపాయనుండును, అథర్వవేదంబును సుమం
తుండును, ఇతిహాస పురాణంబులను నాతండ్రియగు రోమహర్షణుండును ధరించిరి.
ఆఋషులే తమతమ వేదంబుల ననేకవిధంబులుగా విభజించుచు శిష్యులచేతను,
బ్రశిష్యులచేతను, దచ్ఛిష్యులచేతను ధరియింపఁజేసిరి. ఇట్లు వేదంబు లనేక
శాఖా సంపన్నంబులయ్యె. ఆవేదంబులు మందబుద్ధులగు పురుషులచే ధరియింపఁ
బడు నట్లు దీనవత్సలుండును, భగవంతుఁడు నగు వ్యాసుండిట్లు గావించె. స్త్రీ
శూద్ర బ్రహ్మబంధువులకు వేదంబు శ్రవణగోచరంబు కారానిదగుటఁ గర్మ
మూఢులగు వారి కిత్తెఱంగున నిందు శ్రేయంబు సంభవిల్లును. 109

క. అని యీపగిది భువన పా, వన చరితుం డైన వ్యాసభగవానునిచేఁ
గనికరము పేర్మి భారత, మను నాఖ్యానము ప్రణీతమయ్యెఁ గడంకన్. 110

క. ఓతాపసవరులారా!, భూత శ్రేయమున కిట్లుపూనిన మునికిన్
జేతంబు మోదముం గన, దేతద్ఘన కార్యమున నొకించుక యేనిన్. 111

సీ. నాతిప్రసన్నమనస్కుఁడై విమల స, రస్వతీ రమ్య తీరమ్మునందు
విజన స్థలి సముపవిష్టుఁడై తనలో వి, తర్కించుకొనుచు నాధర్మవేది
వ్యాసుఁ డిట్లనె "ధృతవ్రతుఁడ నై నే నన, లంబులన్ ఛందమ్ములన్ గురువుల
నర్చించినాఁడ నిర్వ్యాజానుశాసనం, బింపుమీరఁగ గ్రహియింపఁ బడియె

గీ. డెంద మలర స్త్రీశూద్రాదులుం దెలియఁగ, నను వు జొప్పడునట్లు ధర్మాదికంబు
తెల్లముగ భారత వ్యపదేశమునను, జూపఁ బడియె వేదార్థంబు స్తుత్యముగను. 112

ఉ. ఐనను దేహమందుఁ గల యాత్మ స్వయంపరిపూర్ణమయ్యు న
న్యూనత బ్రహ్మతేజమున నొప్పెడిదయ్యు నతృప్తమైన చం
దానఁ బరంగు భాగవతధర్మము లంతగ నిం దనుక్తముల్
మానుగ నవ్వియే పరమమానులకున్ హరికిం బ్రియంబులౌ. 113

క. అని తన్నిభంగిని వ్య, ర్థుని గాఁ దలపోసి మదిని దురపిల్లెడు వ్యా
సుని యయ్యాశ్రమమునకుం, జనుదెంచెన్ నారదుండు సదమలబుద్ధిన్. 114

క. అతనిఁ గుఱుతించి సత్వర, గతి నెదురేగి కొని తెచ్చి క్రచ్చఱ సురపూ
జితు నా నారదు విధిస, మ్మతముగఁ బూజించె వ్యాస మౌని వినతుఁడై. 115

## అధ్యాయము 5.

### నారదాగమనము

సూతుఁడు:—

క. అంత సుఖాసీనుం డై, శాంతం గూర్చున్న వ్యాసమునినాథుని న
ల్లంతఁ గని దేవముని యొక్కింత నగుచు వీణ చేత నెసఁగఁగఁ బలికెన్. 116

నారదుఁడు:—

వ. 'ఓ మహాభాగ! పరాశరనందనా! నీ శారీరకం బగు నాత్మయు మానసికం బగు నాత్మయుఁ బరితుష్టంబై న జాడ కనంబడదు. సర్వార్థపరిబృంహితంబును, సర్వ ధర్మ సంపన్నంబును, మహాద్భుతంబును, జిజ్ఞాసితంబు నగు భారతంబును రచియించితివి. సనాతనంబగు పరబ్రహ్మంబు నధిగమించితివి. ఐనను నోమహాత్మా! అధన్యుని వలె నిన్ను భావించుకొని యేల శోకించుచుంటివి?' అని నారదుం డడిగిన వ్యాసుం డిట్లనియె. 117

వ్యాసుఁడు:—

ఉ. ఉన్నది చూవె యోపరమయోగివతంసమ! నాకు నిష్ఠ నీ
వన్నది యెల్ల నై నను మదాత్మ ప్రమోదిలకుండెఁ గావునన్
నిన్ను సరోజగర్భసుతు నిం జనవంద్యు నగాధబోధసం
పన్ను నిఁ బృచ్ఛఁ జేసెదఁ గృపం దెలుపంగదె తన్నిమిత్తమున్. 118

గీ. గానములకు లోను గాక నెమ్మనము తోన
జగముల సృజించుఁ బోషించు సమయఁ జేయు
మూల పురుషు సర్వజ్ఞునిం బూన్కిఁ గొల్చు
పరమ గుహ్య మెఱుఁగు దీవు సురమునీంద్ర! 119

చ. అలయక సూఁడు లోకములనర్కునికై వడి పర్యటించుచున్
గలయఁగ నాత్మ సాక్షివయి గాలి గతిన్ మెలఁగాడుచుందు కే
వలము పరావరంబునగు బ్రహ్మము నందును ధర్మయుక్తిఁ బెం
పొలయ వ్రతంబులం బరఁగియొప్పెడు నా కొఱ తేదొ చెప్పుమా. 120

నారదుఁడు:—

క. భగవంతుని విమల తరం, బగు యశము వచింపఁ బడనిదయ్యెన్ నీచేఁ
దగ నతఁ డెద్దానం దృప్తి గనం డద్దాని నెంతువిఫలంబనుచున్. 121

గీ. ధర్మ ముఖ్యంబు లైన, యర్థంబు లెల్లనెట్లు వర్ణింపఁ బడియె మునీంద్ర చంద్ర!
అట్లు వర్ణింపఁ బడదు లోకాధిపుఁడగు, వాసుదేవుని దివ్య ప్రభావ గరిమ. 122

చ. అమలిన మానసుల్ పరమహంస లెటన్ విహరింపకుంద్రో లో
కముల సదా పునీతములు గా నొనరించెడు వాసుదేవు స
ద్విమలయశం బెటం బరిఢవిల్లక యుండునొ యట్టి వ్యర్థవా
క్య మది యుదాత్తచిత్ర పదమయ్యును వాయసతీర్థతుల్యమా, 123

శా. ఏకాగ్రంబగు బుద్ధి సాధువులు తా రెవ్వానినిన్ సంతతం
బాకర్ణింతురు వచింత్రు పాడుదురు నె య్యంబార నయ్యుత్తమ
శ్లోకోదార పవిత్రనామము లెటన్ సొంపారునో యద్దియే
లోకాఘాపహవాక్ప్రయోగమగు నాలోకింప యోగీశ్వరా! 124

మ. నిరవద్యంబు నిరంజనంబు ఘనమున్ నిష్కర్మతారూపమున్
పరమోత్కృష్టమునయ్యు శోభిలదు జ్ఞానంబంతగా నల్ల శ్రీ
హరి భావోదయ వర్జితంబగు చకామ్యంబయ్యునుం గర్మ మీ
శ్వరు నం దర్పణ సేయకున్న నదియున్ వైఫల్యముం బొందెడున్. 125

ఉ. కావున నోమహాశయ! యఖండ యశుండవు సువ్రతుండవున్
బావన ధీవిశేష లసమానుఁడవుం బృథు సత్య శీలివా
నీవు సమాహితుండవయి నేర్పున నచ్యుత చేష్టితంబులన్
భావన సేయుమా యఖిలబంధ విముక్తికి నై యజస్రమున్. 126

వ. ఆ వాసుదేవ చేష్టితమ్ము నకంటె భిన్నదృష్టులగు వారికిఁ దత్కృతరూపనామంబుల దుస్థితిం బొంది బుద్ధి గాలిచేఁ గొట్టఁ బడిన నావవలె నెందును నిలువక చాపల్యంబునుం బొందు. నింద్యమైన కామ్య కర్మాదికంబు స్వభావానురక్తుండగు పురుషునకు ధర్మార్థంబు ననుశాసించుచున్న నీవు గొప్ప వ్యతిక్రమంబుఁ గావించితివి. నీవాక్యంబునం జేసి యిదియే ధర్మంబని వ్యవస్థితిం బొందెఁ గావున జనుండు తన్నివారణంబునకుఁ దలంపఁడు. 127

చ. ఎలమి ననంత లీలుఁడగు నీశు సుఖాస్పదమైన రూపమున్
దెలియఁగఁ జాలుఁ దానయి సుధీమణి కర్మనివృత్తిఁ జేసి కే
వలమగు నీశు చైదము భవాబ్ధి నిపాతితులైన వారికిన్
దెలుపుము నెమ్మి తోడుత యతిప్రవరేణ్య! పరాశరాత్మజా! 128

ఉ. మాని స్వధర్మమున్ విభుని మంజు పదాంబుజమున్ భజించు చ
ద్దాన నపక్వుఁ డౌచుఁ బతితత్వముఁ జెందిన నే నమంగళం
బౌనె యొకించు కంత? పరమాత్ము హరిన్ భజియింపకున్న నే
దే నొక యర్థ మీఁగలుగునే పరికింప స్వధర్మ మేరికిన్? 129

ఉ. మీఁదికిఁ గ్రింది కోలిని భ్రమించుచు నుండెడు జీవకోటి కిం
దేది యలభ్యమో దగ యత్నింపఁగ నా నిపుణాత్ముఁ డయ్యెన
న్యాదృశ మా సుఖంబుఁ బడయన్ విషయాత్మక మా సుఖంబు నా
పాదిలు దుఃఖమ ట్లురుజవంబగు కాలగతిం గ్రమంబునన్. 130

చ. హరిపద సేవియై జనుఁ డొకప్డును బ్రాకృత జన్ముఁడయ్యె నం
సరణమునం జొరం డొరునిమాడ్కి నహో! పరికించి చూడఁగన్
హరిచరణోపగూహన మహత్తర సౌఖ్య రసానుభూతికిన్
మరగిన మానవుండు మఱి ϟ మానఁడుగా యదియే స్మరింపుచున్. 131

వ. మఱియు నెవ్వని వలన నీ విశ్వంబునకు సృష్టి స్థితి లయంబులుఁ గలుఁగు నా భగవంతుం డేతద్విశ్వరూపుండే యగు. అయ్యదంతంబు నీవు స్వయంబుగ నెఱింగితివి. అయినను బ్రాదేశమాత్రింబ నేను నీకుఁ దెల్పితిని. అమోఘ సంకల్పుండవైన నీవు నిన్నుఁ బరమాత్ముండును, బరమ పురుషుండు నగు నీశ్వరుని యంశంబైన యాత్మనుఁగా నెఱుంగుము. ఆత్మ యజంబయ్యును లోకకల్యాణము కొఱకుఁ బ్రిభూతం బై యున్నయది. అయ్యాత్మమహానుభావాది గుణంబులు నీచే వర్ణింపఁబడుగాక. పురుషోత్తమ గుణాభివర్ణనము పురుషునకుఁ దపంబు, శ్రుతంబు, నిష్టాపూర్తంబులు, సూక్త దత్తంబులు మున్నగునవి నిత్యార్థంబుగా కోవిదులచే నిరూపింపఁ బడియె. 132

తరల. వినుము తొల్లిఁటి పుట్టు వందున ϟ వేదవాదుల దాసి నం
దనుఁడ నై జననంబు నొందితిఁ ϟ దాపసోత్తమ! వానకా
రున వసింపఁగ నొక్క తావున ϟ రూఢిఁ గొరెడు నత్తపో
ధనుల సేవకు నై నియుక్తుఁడ ϟ దారకుండను నే నటన్. 133

తరల. అపగతాఖిల చాపలున్ సత ϟ తానువర్తిని, బాలునిన్
స్వపరిచర్యలఁజేయువానిఁ, బ్రశాంతు, దాంతు ననంత భ
క్తిపరుఁ, గ్రీడనకంబు లెల్ల నొకగిన్ ద్యజించినవాని నన్
గృపమెయిం బరికించి రప్డు యతీశ్వరుల్ సమదర్శనుల్. 134

చ. ద్విజుల యనుజ్ఞ నెంగిలినిఁ ϟ దింటిని భక్తిఁదలిర్పఁ దాన నా
వృజినము లెల్లనుం జెడియె ϟ నిల్లు విశుద్ధ మనోంబుజుండఁ ద
ద్భజన పరాయణుండ నయిప్రవర్తిలుచుండెడు నట్టి నాకు వ
ర్కజముగఁ బుట్టె నాత్మరుచి ϟ కప్పిన్ననఁ దత్ప్రభు ధర్మ మందునన్. 135

చ. లలితములైన కృష్ణకథలం దమి గానముఁ జేయుచుండు మా
నుల సదనుగ్రహంబున ననుక్షణమున్ వినుచుండు నాకు న
స్ఖలితము, సుస్థిరంబును, బ్రసన్నమునైన మహానురక్తి య
గ్గలికజనించె నిశ్చయముగాఁ బురుషోత్తమునందు ధీనిధీ! 136

సీ. సర్వేశ్వరునియందుఁ జవిగొన్న నాకు న,ప్రతిహతమగు బుద్ధిప్రభవమయ్యె
దాన స్వమాయాకృతంబును స్థూల సూ, క్ష్మంబు నా యీశరీరంబు నేను
బ్రౌఢి మీఱంగఁ బరబ్రహ్మరూపుఁడనగు,నాయందుఁ గందు సమ్మో యతీంద్ర!
పరఁగ నిట్టులు శరద్వర్షర్తువులు రెండు, ననఘాత్ములైనట్టి మునుల చేతఁ

గీ. బ్రతిదినంబును గీర్తింపఁబడుచు నుండు, విష్ణుదేవుని యద్భుతవిమలయశము
వినుచునుండెడునాకును వెసరజస్తమోపహంబగు భక్తి యుద్భూతమయ్యె. 137

తరల. తెరలి పోవుచు జాలిపెంపున దీనవత్సలులైన యా
వరమునీంద్రులు తానయై భగవంతుఁడే తెలియంగ సా
దరతఁ దెల్పిన జ్ఞానమున్ మహితంబు గుహ్యతమంబుఁ దె
ల్పిరి యథాతథమైన రీతిని వేడ్క నేను గ్రహించితిన్. 138

వ. ఆ జ్ఞానంబుచేతన బ్రహ్మరూపుండును భగవంతుఁడు నైన వాసుదేవుని మాయా ప్రభావంబు నెఱింగితి. ఆ జ్ఞానంబునన కదా నిపుణులు బ్రహ్మపదంబు నందుచుంద్రు. ఈశ్వరుండు, భగవంతుఁడు నగు పరబ్రహ్మంబు నందు నర్పింపఁబడిన కర్మంబు తాపత్రయ నివర్తకం బయి సత్త్వశోధకం బగునని సూచింపంబడియె. ఎద్దాన ననామయంబు వొడము నారోగకారణం బైన ద్రవ్యం బారోగంబును నివర్తింప నేరని భంగి బ్రహ్మార్పితంబు కాని కర్మంబు తాపత్రయంబుఁ బాపం జాలదు. ఇట్లు నరుల క్రియాయోగంబులు పరమేశ్వరార్పితంబులు గాక సంసార కారణంబు లగుచున్న యవి. భగవత్పరితోషకం బగు కర్మంబున భక్తియోగ సమన్వితం బగు జ్ఞానం బధీనంబై యుండు. భగవంతుని శిక్షచేఁ గర్మలు సల్పువారు శ్రీకృష్ణ గుణనామంబులఁ గైకొని స్మరించుచుంద్రు. "వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ,సంకర్షణ రూపుండ వగు నీకు నమోవాకంబు" లని మూర్తి కథనంబున మంత్రమూర్తియు, నమూర్తియు నగు యజ్ఞపురుషుని సాధు దర్శనుం డగు పురుషుండు యజించుచుండు. మదనుష్ఠితం బైన యాత్మబోధంబు నెఱింగి కేశవుండు నాకు జ్ఞానైశ్వర్యంబును, స్వనిష్ఠమైన భావంబు నిచ్చె.

ఉ. కావున వేదపారగ! యఖండ తపోనిధి! యే నెఱింగినన్
గోవిదుఁ డన్యముం దెలియఁగోరఁడొ యట్టి పునీతమైన ల

శ్రీశవిభు కీర్తి గానమునుఁ జేయుము దాన జనుల్ సుఖించుచున్
హావడి లేక యుందురు తదన్యము దుఃఖహరంబు కాదిలన్. 140

---

## అధ్యాయము 6.

### నారద పూర్వజన్మ వృత్తాంత కథనము

సూతుఁడు:—

క. మునిముఖ్యుఁడు సత్యవతీ, తనయుఁడు నగు వ్యాసుఁ డివ్విధమ్మున దివిష
న్మునిజన్మ కర్మములఁ దా, విని వినయము దోఁప నడిగె నెండియు నతనిన్. 141

వ్యాసుఁడు:—

గీ. తివిరి నీకు విజ్ఞానోపదేష్టలైన, భిక్షువుల్ దూరదేశంబు వెడలి చనఁగఁ
బ్రథమమైన ప్రాయంబునం బరగు నీ విఁకేమిచేసితివో వచియింపు మయ్య. 142

క. స్వాయంభువ! యాపిమ్మటి, యాయువునన్ వృత్తి యేది యయ్యెన్ నీకున్
ధీయుత! యెఱిఁగింపుము తుదిఁ, గాయముఁ ద్యజియించి తెట్లు కాలము చెల్లన్. 143

గీ. సకలమునకు లోపము సల్పఁజాలు కాల, చక్ర మెట్టులు నీదు ప్రాగ్జన్మవిషయ
మైనస్మృతిని ఖండింపక యట్లెయుంచెఁ, దెలియఁజేయుము దేవర్షితిలక! నాకు.

నారదుఁడు:—

గీ. తివిరి నాకు విజ్ఞానోపదేష్టలైన, భిక్షువుల్ దూరదేశంబు వెడలి చనఁగఁ
బ్రథమమైన ప్రాయంబునం బరఁగు నేను, వక్ష్యమాణంబు సల్పినవాఁడనయ్య. 145

క. వినుము మదేకాత్మజ మజ్జనని, పడంతుకయు, దాసి జడమతియై తా
నొనరించె స్నేహబంధం, బనన్యగతికుండ సుతుఁడ నగు నాయందున్. 146

క. నా యోగక్షేమంబుల, నాయమ కోరుచు నశక్త యయ్యెన్ జుమి య
న్యాయత్తయగుట దారు, స్త్రీయట్టులు లోకమెల్ల శ్రీశు వశమె కా. 147

గీ. వినుము దిగ్దేశ కాలానభిజ్ఞుఁడనయి, పంచవర్ష వయస్కుండ బాలకుండఁ
బ్రకట జనయిత్రి స్నేహానుబంధమున మెలంగినాఁడ నాబ్రహ్మకులంబునందు. 148

క. మొదవు నొకనాఁడు దాఁ బాల్పిదుకన్ గేహంబునుండి వెడలి చనఁగఁ ద
త్పద తాడితమై కఱచెన్, మదంబనుం గాలచోదనన్ ఫణి పెలుచన్. 149

ఉ. ఏ నదియస్థ భక్తులకు నెష్ట శుభంబును గోరుచుండు శ్రీ
జాని యనుగ్రహంబుగనె స్వాంతమునం దలపోసి తోఁనఁ బ్ర
స్థానముఁ జేసితిన్ వెస నుదగ్దిశ కొంటరినై నితాంతమున్
మానసమందు నాభువన నాథు పదాబ్జము పాదు కొల్పుచున్. 150

వ. ఇట్లు ప్రస్థితుండనై ప్రసిద్ధంబులగు జనపదంబులును, పురంబులును, గ్రామంబులును, గోష్ఠంబులును, వ్రజంబులును, ఆకరంబులును, కర్షకగ్రామంబులును, గిరితటగ్రామంబులును, బుష్పోద్యానవనంబులును, నుపవనంబులును, నరణ్యంబులును, దంతావళభగ్నశాఖంబులగు ద్రుమంబులు గల చిత్రధాతువిచిత్ర పర్వతంబులును, పావనజలంబులగు జలాశయంబులును, జిత్రస్వనంబులగు పతంగములతో భ్రమించు భ్రమరలక్ష్మీసంపన్నంబులు, సురసేవితంబులు నగు తామరకొలంకులును గలిగి యొప్పారు నల, వేణు, శర, స్తంబ, కుచ, కీచక, గహనంబును, ఘోరంబును, ప్రతిభయాకారంబును, వ్యాళోలూకశివాదిక్రీడాస్థానంబు నగు మహారణ్యంబును బొడఁగంటిని. అంతఁ బరిశ్రాంతేంద్రియాత్ముండనై యాఁకలి దప్పుల నలంగి యచ్చటి నదీహ్రదంబున స్నానపానాదు లాచరించి గతశ్రముఁడనైతి. 151

క. జనశూన్యమైన యవ్వన, మునందు నశ్వత్థ మూలమున నుపవిష్టుం
డనయి మును విన్నయట్టులొ, య్యన నిజహృదయస్థు నీశు నాత్మఁ దలఁచితిన్. 152

చ. ఉరుతర భక్తి భావమున నుల్లము ద్రుళ్ళడఁగించి యా పరా
త్పరు చరణాంబుజాతమును ధ్యానముఁ జేయుచు నత్సుకాశ్రువి
స్తర తరళేక్షణుండ నయి తన్మయతం దనరారు నాహృదం
తరమున భక్తకోట్యవనతత్పరుఁ డాహరి తోఁచెఁ దోఁచినన్. 153

ఉ. ప్రేమభరంబు పెంపున శరీరమునం బులకాంకురంబు లెం
తే మొలవంగఁ బిక్కటిలి నిండిన యట్టి ప్రమోద పూరమం
దే మెయి మున్గియుండఁగ మునీశ్వరచంద్ర! పరాశరాత్మజా!
ఆ మెయి నన్నుఁ గాని మఱి యన్యముఁ గాని కనన్ నిజంబుగన్. 154

చ. అలఘు సుఖావహంబును శుచాపహమున్ లలితంబునై విరా
జిలు భగవంతు రూపమును జిత్తము వొంగఁగఁ జూచి భక్తి వి
హ్వలత భరింపరాని యుబలాటము పెంపున దుర్మనుండనుం
బలె నయి లేచినాఁడ జనవంద్య యశోనిధి! సంభ్రమంబునన్. 155

ఉ. క్రిమ్మఱ నమ్మహాత్ముఁ గనఁగాఁ దమకించుచు బుద్ధియందు డెం
దమ్మును బాదు కొల్పి మదిఁ దన్వినిఁ జెందని యట్టు లాత్మత
త్త్వమ్మును దీవ్రయత్న పరతం గనుచుండియుఁ గానవైతిఁ జో
ద్యమ్మిది యేమొ సుంతఁ దెలియంబడ దయ్యెఁ దపస్విపుంగవా! 156

గీ. ఈగతి యతించు నన్నున వాగగోచ, రుఁ డగు నా సర్వలోకేశ్వరుఁడు గభీర
మధురవాక్కుల నా చింత మాయఁ జేయు, వాఁడునుం బలె నిబ్బంగిఁ బలికె ననఘ!

భగవంతుఁడు:—

క. నను నీవీజన్మంబునఁ, గనుటకు నర్హుఁడవు కావు కామాదులఁ బా
యని యట్టి కుయోగులకుం, గనిపింపను నే నొకప్డుఁ గలయం దేనిన్. 158

క. అనఘా! మద్రూపంబుం, గనఁ గోరెడు నీకుఁ జూపఁ గాఁబడె నిది న
న్నును గోరు నరుఁడు మెలమెల్లనఁ గామము లన్నిటిం దొలంగం ద్రోఁచున్. 159

గీ. స్వల్పకాలకృతం బగు సాధుసేవ, నమలమగు బుద్ధి నీకు నాయందుఁ బొడమెఁ
గావునన్ నింద్యమైన యీ కాయము విడ, నాడి యిఁక మజ్జనత్వము నందఁగలవు.

శా. "నాయందున్నలకొల్పఁబడ్డ మతి యెన్నండుండఁగాఁ బోదు సా
పాయంబై, లయకాల మందును మదీయానుగ్రహప్రాప్తి చేఁ
బాయం బోవదు పూర్వ సంస్మృతి తలంపన్ నీకటం" చిట్లు తా
నై యాకాశసమోరుభూత మపు డొయ్యం బల్కెఁ దెల్లంబుగన్. 161

చ. ఘనము, జగన్నియామక, మకారణ, మంబర లక్షణంబు, నై
యెనసిన భూత మిట్లు వచియించి, వెసన్ విరమించె నేను నో
య్యన ననుకంపితుండ నయి యమ్మహితాద్భుత భూతముం జలిం
పని హృదయంబుతో శిరము వంచి, కరంబులు మోడ్చి మ్రొక్కితిన్. 162

ఉ. ఏను గతత్రపుండ నయి యీశుని నామము లుగ్గడింపుచున్
బూనిక తోడ నవ్విభుని పున్నెపుఁ జెయ్దములన్ దలంచుచుం
దేనినిఁ గోరకుండఁ బరితృప్తి మెయిన్ భువిఁ బర్యటించుచున్
మాని మదంబు, మత్సరము మక్కువఁ గాలమె కోరుచుండితిన్. 163

తరల. నిఖిల సంగములం ద్యజించి, వినిర్మలాత్ముఁడ నై యిటుల్
సుఖము దుఃఖమునున్ సమంబుగఁ జూచుచుం జరియించు నా
కఖిలవిత్తమ! ద్వాపరం బయి యంత్యకాలము దోఁచె న
న్ముఖముగాఁ దొలి వానకారునఁ బొల్చు శంప తెఱంగునన్. 164

క. భగవంతుఁడు పరిశుద్ధం, బగు భాగవత తనువది ప్రియంబునఁ దాఁ గూ
ర్పఁగ నుండఁ బాంచ భౌతిక, మగు గత ప్రారబ్ధ దేహ మవనిం బడియెన్.

మ. విను కల్పాంతము నందు నాచికొని యీ విశ్వంబు నేకాకియై
ఘన వారాశి జలంబు నందు సలవోకన్ యోగనిద్రాభిర

క్తిని జెన్నారెడు విష్ణుదేవు ఘనమూర్తిం బవ్వళింపంగ నెం
చిన లోకేశుని లోనఁ జొచ్చితిని శ్వాసింపంగ నీచై ర్గతిన్. 166

ఉ. వేయి యుగంబులుం జనిన పిమ్మట లేచి పితామహుండు తా
నీయది సృష్టి చేయుటకు నెంచఁగ నేను మరీచి ముఖ్య మే
ధాయుతులైన యా ఋషివతంసులుఁ బుట్టితి మాక్షణంబునన్
దోయజగర్భు ప్రాణముల నుండి పరాశరపుత్ర! వింటివే? 167

క. శ్రీహరి యనుగ్రహమున న, నాహతగతి యగుచును బహిరంతరములనుం
బాహాటంబుగఁ దిరుగుదు, మోహము దిగనాడి లోకముల మూఁడింటన్. 168

శా. నాదబ్రహ్మ విభూషితం బయిన వీణన్ దేవదత్తన్ సదా
హ్లాదం బొప్పఁగ మేళవించి హరిగాథాలాపముం జేయుచున్
వేదవ్యాస! చరింతు స్వప్రతిభలం గీర్తించు నాయుల్ల మం
దా దామోదరుఁ డిచ్చు దర్శనముఁ దా నాహూతుఁ డైనట్లుగన్. 169

గీ. అమిత భోగేచ్ఛలన్ వ్యాకులాత్ము లగుచు, సంచరించెడి వారికి జగతియందు
భవ్యమగు హరిచర్యానువర్ణనంబు, భవమహార్ణవ పోతమై పరఁగుఁ జూవె. 170

క. యమ నియమాదిక యోగప, దములను శాంతింప దుగ్రతర కామ క్రో
ధముల న్నిహతంబగు నా, త్మ ముకుందుని సేవ కతన మాడ్కిన్ వింటే! 171

గీ. నీ మనంబునకుం బ్రీతి నింపునట్టి, నాదు జన్మ కర్మ రహస్యమేఁ దెలిపితి
నిర్మలాత్మక! యిదియె చూ నీయడిగిన, దానికిన్ యోగ్యమగు సమాధానమగును.

సూతుఁడు:—

మ. భగవంతుండగు నారదుం డిటుల సంభాషించి జ్ఞానాత్మకుం
డగు నా వ్యాసమునీంద్రు వీడుకొని వీణాలాపముం జేయుచున్
దగురీతిన్ జనియెన్ యథేచ్ఛగ నహో! ధన్యుండు దేవర్షి యీ
జగమున్ శ్రీహరి కీర్తి గాన కలనన్ సంతుష్టముం జేసెనున్. 173

---

## అధ్యాయము 7.

### అర్జునకృతాశ్వత్థామపరాభవము

శౌనకుఁడు:—

క. నారదుఁ డరుగ నమోఘు, ప్రారంభుండైన బాదరాయణుఁడు సదా
చారుఁడు తదభిప్రాయపు, సారము విని సూత! యేమి సలిపెం? జెపుమా. 174

సూతుఁడు:—

సీ. బ్రహ్మనది యగు సరస్వతి పశ్చిమ, తటి ఋషిసత్రవర్ధకమయి చెలు
వారు "శమ్యాప్రాస"మను పేరిటి బదరీ, షండ మండిత శుభాశ్రమమునందు
నాసీనుఁడై వ్యాసుఁడాచమించి నిజమనంబు స్థిరముగ ధ్యానంబుఁ జేసె
భక్తియోగంబునఁబ్రవిమలమును విని, శ్చలముసై యొప్పారుస్వాంతమందు

గీ. నాదిపురుషునిఁ బొడఁగాంచెనాదిఁబిదప, జీవుఁడెద్దాన మోహంబుఁ, జెంది తన్ను
నగుణుఁ ద్రిగుణాత్మకుని గాఁగనరసి చెడునో, యట్టిపురుషాశ్రయ యగుమాయ
నొప్పడఁగనె. 175

చ. చెలఁగి యనర్థముల్ తొలఁగఁజేసెడు శ్రీహరిభక్తియోగమున్
దెలియఁగలేక వర్తిలెడు దీనులపై ననుకంపపెంపునన్
నలలితధీవిశేషుఁ డగు సత్యవతీతనయుండు వ్యాసుఁ డు
జ్జ్వలతరమైన భాగవతసంహితఁజేసె మనోహరంబుగన్. 176

ఉ. ఏది తమిన్ వినంగఁ బరమేశునియం దురుశోక మోహ భీ
త్యాది సమస్తదోష పరిహారకమైన యనన్యభక్తి యా
పాదిలుచుండు నట్టి ఘనభాగవతాఖ్య పురాణమున్ శుభా
పాదకముం జగంబునకువ్యాసమహర్షి రచించె నిమ్ములన్. 177

క. ప్రవిమలమతి వ్యాసుఁడు భాగవతాహ్వయ సంహితం దగంజేసి వివే
క విశుద్ధాత్ము నిజాత్మజు, నివృత్తిపరు శుకమహాముని జదివించెన్. 178

శౌనకుఁడు:—

ఆ. వె. ఆ నివృత్తి రతుఁడువమాని యాత్మారాముఁ, డెల్లెడల నుపేక్షనెనసెడు శుకుఁ
డేమి కారణమున నీ యతివిస్తృత, మైన భాగవతము నభ్యసించె? 179

సూతుఁడు:—

క. మునివరు లాత్మారాముకు, లనయము గ్రంథానపేక్షు లయ్యున్ హరియం
దనిమిత్త భక్తిఁగొందురు, కన నిత్థంభూత సుగుణగణుఁడా హరియౌ. 180

గీ. హరిగుణాకృష్టబుద్ధియై హరిజన ప్రియుండు బాదరాయణిముని యుజ్జ్వలాత్ముఁ
డమ్మహాభాగవత శుభాఖ్యానమునిటు,లధ్యయనముగావించెమహాత్ములార! 181

క. రాజర్షి యగు పరీక్షి, ద్భూజాని ప్రభవకర్మము క్తులఁ బొందు
త్మజాని సుతులప్రస్థితి, నోజన్ వచియింతు హరికథోదయ మెసఁగన్. 182

ఉ. కౌరవ సృంజయుల్ చలముఁగైకొని సల్పిన భండనమ్మునన్
వీరవరేణ్యులెల్లరును వీరగతిం బడయంగఁ గౌరవో

ర్వీరమణుండు భీమతర ✽ భీమగదాపృథుఘాతపాతభ
గ్నోరుతరోరుఁడై నిలువనోపిక లేక ధరిత్రిఁగూలఁగన్. 183

ఉ. భూపతి కిష్టమంచు గురుపుత్రకుఁ డారసి నిద్రవోవు నా
ద్రౌపది యాత్మజన్ముల శిరంబుల నెక్కటిఁద్రుంచెఁ గ్రిక్కునన్
బాప పరీత చిత్తుఁడయి ✽ ప్రాజ్ఞులు దూఱుదు రా జుగుప్సితం
బౌపని యప్రియంబని మహామతులార! నిరంతరంబుగన్. 184

చ. జనని నిసుంగులైన తనుజన్ముల దుర్మరణంబు నప్డు చ
య్యన విని బాష్పపూరితసమాకులలోచనయై కడున్ మనం
బునఁ బరితాపమొందుచును ✽ బోరన నేడిచె నంతఁ గ్రీడి యొ
య్యన ననునయించుచుంబలికె ✽ నా ద్రుపదాత్మజ కిట్లు నేరిమిన్. 185

మత్తకోకిల. ఆతతాయియు, బ్రహ్మబంధువు, ✽ నైన ద్రోణిశిరంబుఁ బ్ర
స్ఫీత గాండివముక్తశాత విశిభీషణ ప్రదరాళిచే
నాతిమిన్నరొ! తెచ్చి యిచ్చెద ✽ నష్టపుత్రవు నీవు వి
ఖ్యాతి దానినిఁ ద్రొక్కియుం జలకంబులాడు ముదంబునన్. 186

చ. అనుచు మనోజ్ఞచిత్రవచ ✽ నావళులం బ్రియ నూఱడించి య
య్యనిమిషనాథసూనుఁ డపు ✽ డచ్యుతసూతుఁడు, కేశరాజకే
తనుఁడు, మహోగ్రధన్వుఁడు నుదంచితవర్ముఁడునై బిరాన స్యం
దనముపఁ గూడఁబాఱె నలద్రోణిపిఱుందన నేపు మీఱఁగన్. 187

చ. తఱుముచు వచ్చుచుండిన పృథాసుతు దవ్వులనుండిచూచి యు
క్కఱి యల బాలఘాతుకుఁడు ✽ గాన ప్రకంపితచిత్తుఁడై వెసన్
బఱచెను ద్రోణనందనుఁడు ✽ ప్రాణములందలి తీపిచేతఁ ద
త్తఱపడి, కృద్ధుఁడైన ప్రమథాధిపుభీతిని బ్రహ్మకైవడిన్. 188

గీ. శ్రాంతవాహనుఁడై తన్నుశరణుగాఁగ
నెపుడు భావించుకొనియెనో ✽ యపుడ బరవ
సమున బ్రహ్మాస్త్ర మాత్మరక్షకముగాఁగ
నాత్మఁ దలపోసికొనియె ద్రోణాత్మజుండు. 189

మ. ఉపసంహారమెఱుంగకుండియును బ్రాణోపప్లవావాప్తిచే
విపరీతంబగుబుద్ధి యుప్పతిల విప్రాత్మజుండంత ని
స్త్రపుఁడై వార్చి సమాహితంబగుమతిన్ సంధించె బ్రహ్మాస్త్ర మ
ల్లపు డుద్దండతరోరు తేజము కడున్ వ్యాపించె నాశాంతముల్. 190

కం. ప్రాణిసమూహంబులకున్, బ్రాణాపదఁ దెచ్చు ద్రోణి బ్రహ్మాస్త్రము గీ
ర్వాణపతిసుతుఁడు గనుఁగొని, రాణన్ వచియించె నిందిరావరు తోడన్. 191

అర్జునుఁడు:—

తరల. అలఘువిక్రమ! కృష్ణ! కృష్ణ! మహాభుజా! నిజభక్త వ
ర్యులకుఁ గూర్తభయంబు నో పురుషోత్తమా! యొకరుండవే
తలఁప నీవు మహోగ్ర సంసృతితాపపీడితులైన వా
రలకు నాపెనుబాధ బాపఁ గరంబు నోపుదుగా! ప్రభూ! 192

సీ. ఆదిదేవుఁడవు సాక్షాదీశ్వరుఁడవు ప్రకృతికిం బరుఁడవునై యొనఁగు దీవు
చిచ్ఛక్తిచే మాయఁ ఛేదించి కేవలమైన యాత్మమునందు నలరుదీవు
మాయా విమోహిత మానసమైన జీవతతికాధారమై పరగుదీవు
ఆత్మవీర్యమున ధర్మాదిలక్షణయుత, శ్రేయోఽభ్యుదయ మొనరింతువీవు

గీ. భూమిభారము హరియింప బుద్ధివొడమి, యన్యభావ వివర్జితులైనయట్టి
స్వజనులకు ధ్యానగమ్యతం బరగుచుండఁ, దాల్చితీయవతారంబు ధర్మమెసఁగ.

కం. ఇదియేదో! యెక్కడిదో!, తుదిమొదలునెఱుఁగ సర్వతోముఖమై బె
ట్టిదమా తేజంబిది దేవ! దేవ! తోతెంచుచుండె భయజనకంబై. 194

భగవంతుఁడు:—

కం. ఇది బ్రహ్మాస్త్రము ప్రాణాపద యాపాదిల్ల ద్రోణి పరగించెం దీ
నిఁ దెలియఁ డుపసంహారము, విదితమ్ముగ నెఱుఁగు దీవు విశ్రుతచరితా! 195

కం. ఈ యస్త్రము నితరాస్త్రం, బేయదియును జాల దడ్డగింపఁగ నో పా
ర్థా! యస్త్రజ్ఞుఁడ వణపు త, దీయోదాత్తాస్త్రమును ద్వదీయాస్త్రమునన్. 196

సూతుఁడు:—

గీ. భగవదుక్తమువిని పరభంజనుఁడగు
ఫల్గుణుఁడు కృష్ణు వలఁగొని భయదమగుచు
మించు బ్రహ్మాస్త్రమున్ నివారించు పొంటెఁ
గెరలి బ్రహ్మాస్త్రముం బ్రయోగించెఁ గడిమి. 197

మ. ఉభయాస్త్రంబుల తేజముల్ ఘనములై యొండొంటినిం బెల్చఁ దా
కి భయోత్పాతముఁ గల్గఁజేయుచు శరాకీర్ణంబులై క్రమ్ముచున్
నభమున్ భూమిని దిగ్దిగంతములఁ గ్రన్నం గ్రీష్మ సూర్యాగ్నిస
న్నిభదుర్ధర్షతరప్రభాపటలి నిండెం దుర్నిరీక్ష్యంబుగన్. 198

చ. కడు భయదంబులౌచుఁ ద్రిజగంబుల నేర్చుచుఁ బెంపుతోడ నొ
ప్పెడు నుభయాస్త్రతేజములు పేర్చినఁ గాంచి తదస్త్రకీలలు
మ్మడిఁ దమ ముట్టఁగా సకలమానవులుం బరితప్యమానులై
యడలుచు నాత్మలందుఁ బ్రళయం బి దటంచుఁ దలంచి రయ్యెడన్. 199

క. మునుకొన్న ప్రజోపద్రవ, మును లోకవ్యత్యయమును బొడఁగని హరి యా
జ్ఞను సల్పె నరుఁడు నతి భా, జనముగ నస్త్రద్వయోపసంహారంబున్. 200

ఉ. ఆయెడఁ గ్రూరకర్ముఁ డగు నా కృపిపట్టిని డాయఁబోయి కొం
తేయుఁ డుదగ్ర కోప ఫణిరీతిం గనుదామర లెఱ్ఱవార న
త్యాయతమైన రజ్జువునఁ దాఁ బశువుం బలె నాయభాగ్యునిన్
బాయక కట్టి వైచెఁ బ్రసభంబునఁ గృష్ణుఁడు "మేలు మే" లనన్. 201

ఉ. లజ్జితుఁడైన యారిపు బలాత్కృతిమై నమరేంద్రసూతి పె
గ్రజ్జువుతోడఁ గట్టి శిబిరంబునకుం గొనిపోఁదలంపఁగా
నజ్జలజాయతాక్షుఁడగు నచ్యుతుఁ డెంతయుఁ గ్రుద్ధచిత్తుఁడై
సజ్జనగణ్యుఁ బార్థుఁగని సమ్మతిఁ జూపక పల్కె నీగతిన్. 202

గీ. నిరపరాధుల బాలుర నిద్రితులను, బలిమిమై నిశిఁ జంపె నీబాలిశుండు
బ్రాహ్మణాధము నితనిఁ గాపాడఁదగదు, సంహరింపుము పార్థ! నిస్సంశయముగ.

క. మత్తుని, జడునిన్, సుప్తుఁ బ్ర, మత్తుని, బాలునిఁ, బ్రపన్ను మగువ, విరథు, ను
న్మత్తుని, భీతుని రిపు నే, నుత్తమధర్మజ్ఞుఁ డాత్మ నొల్లఁడు చంపన్. 204

క. ఖలుఁ డెవ్వఁడు పరప్రాణం, బులచేఁ దనప్రాణములను బోషింపఁగ సి
గ్గిలఁడో తద్వధమున మే, లొలయు నతనికె యటుగాకయున్నఁ బతితుఁడౌ. 205

మత్తకోకిల. "మానినీమణి! నీకుమారుల మట్టుబెట్టిన యట్టి దు
ర్మ్మాని మూర్ధముఁ దెచ్చి యిచ్చెదఁ బ్రాకటంబుగ నీవిఁకన్
మాను శోక" మటంచు నేను వినంగ బాసనొనర్చితో
హా! నరోత్తమ! యాజ్ఞసేనికి నుల్లమందదియెంచుమా. 206

ఉ. పాతకి, యాతతాయి, కులపాంసనుఁడున్, నిజబంధుహంత, భూ
నేతకుఁగూడ నప్రియము నిష్ఠురతం బొనరించెఁ గాన ని
ర్భీతనిఁ బట్టి బల్మి వధియింపుము పాండవ! యిందు నంత నీ
చేతమునందు సందియముచేరఁగనీకుము పూన్కిఁదీర్పుమా. 207

సూతుఁడు:—

ఆ. ఇట్లు ధర్మమును బరీక్షించు కృష్ణుచేఁ, జోదితుఁడయి రిపునిషూదనుండు
ఘనుఁడు పార్థుఁడు సుతఘాతినైనను బూని, గురుసుతున్ వధింపఁగోరఁడయ్యె. 208

ఉ. అంతటఁ గృష్ణసారథి, మహారథి, పార్థుఁడు స్వీయవిక్రమా
క్రాంతుని ద్రోణిఁగూడి శిబిరంబునకున్ వెస నేగుదెంచి యా
వంతయు నోర్వలేక హతులైన తనూజుల సంస్మరింపు చ
త్యంతము వంతఁ గుందు ప్రియకర్పణఁజేసెను ద్రోణనందనున్. 209

ఆ. పశువు భంగిఁ బాశబద్ధుఁడై హేయమౌ, పనినిఁబట్టి తా నవాఙ్ముఖుఁడయి
అట్లు తేఁబడిన మహాపకారిని ద్రోణిఁ,గాంచి మ్రొక్కెఁ గృష్ణకరుణ తనర. 210

మత్తకోకిల. కొంక కిట్టుల కట్టితెచ్చుటకున్ సహింపఁగలేనిదై
పంకజేక్షణ, యాజ్ఞసేని కృపాసమన్వితయున్ నిరా
తంక మానస యౌచు నీ క్రియఁ దా వచించెఁ జలంబుతో
నింక బ్రాహ్మణు నీతనిన్ గురునిప్డు వీడుఁడి, వీడుఁడీ. 211

మ. సరహస్యంబగు చాపవేదము నిస్తంద్రప్రయోగోపసం
హారణోపేతమహాస్త్రకోటియు యదీయానుగ్రహప్రాప్తిఁ జా
తురిమై నేర్చితౌ! నీవు పూజ్యుఁడగు నా ద్రోణుండు పుత్రాకృతిన్
బరగెంజూ మనమోలి నేఁడిచట నశ్వత్థామనామంబునన్. 212

ఉ. ఆతని ధర్మపత్నియుఁ దదర్ధశరీరము, వీరమాతయున్
బూతచరిత్రయైన కృపి పుత్రునిమిత్తము భర్తతోడ వి
ఖ్యాతిగ వహ్నిలోఁబడక యక్కట! యున్నది యింటఁగాన నా
రీతి నెఱింగియే ననికరింపుఁడు సమ్మతి గౌతమీసుతున్. 213

క. కావున నో ధర్మజ్ఞ! సు, ధీవినుతా! పూజ్యముం బ్రతీతంబును స
త్పావనమునైన గురుకుల, మీ వృజినము పొందఁజెల్లునే! తలపోయన్. 214

చ. మృతులగు బిడ్డలం దలఁచి యేనెటు సారెకు నుద్గతాశ్రుపూ
రితముఖినై యిటుల్ పలవరించుచు నేడ్చుచు నుంటినో యటుల్
వెతఁగొని యేడ్వకుండుతఁ బవిత్రచరిత్రసమేత భర్తృదే
వత యగు నాకృపస్వస శుభాన్విత తజ్జనయిత్రి దీనతన్. 215

క. అజితేంద్రియులౌచు మహీ, భుజు లెవ్వరు బ్రాహ్మవంశమును గనలింత్రో
నిజముగ వారల కులము ప,రిజనముతోఁ జెడును శుక్పరీతం బగుచున్. 216

సూతుఁడు:—

ఉ. తాపసవర్యులార! యిటు ధర్మము న్యాయము నిశ్చలానుకం
పాపర మవ్యలీకము సమంబు నుదాత్తమునైన యట్టి యా
ద్రౌపది వాక్యజాలమును ధర్మతనూభవుఁ డాలకించి తా
నాపలుకుల్ గ్రహించె పరమాదర సంభృత మానసాబ్జుఁడై. 217

క. నకులుఁడు, సహదేవుఁడు, సాత్యకియు, ధనంజయుఁడుఁ ద్రిభువననాథుఁడు దే
వకిపట్టి యొరులు నతివలు, సకలజనులు నియ్యకొనిరి సతివాక్యములన్. 218

గీ. క్రోధపరవశుఁడగుచు వృకోదరుండు, పలికె నత్తఱిఁ దనకును బతికిఁ గాక
వ్యర్థముగ సుప్తశిశువులఁ బట్టి చంపి, నట్టి యీతని వధము శ్రేయం బితనికె. 219

వ. అని భీముండు వలుక 220

గీ. అంతటఁ జతుర్భుజుండగు నచ్యుతుండు
విని ద్రుపదపుత్రి పలుకులు భీము నుడులు
చెలిమికాఁడగు సవ్యసాచినిఁ గనుఁగొని
నగుచు నిట్లని వచియించె నయముఁ దోఁప. 221

భగవంతుఁడు:—

ఆ. వె. బ్రాహ్మణాధముఁడును వధ్యుండు కాఁడు వ, ధార్హుఁడౌను జూవె యాతతాయి
నావగు ననుశాసనం బుభయంబుఁ బాలింపుమయ్య పార్థ! పెంపుమీఱ. 222

ఆ. వె. సతిని బుజ్జగించు సమయాన నీచేత, నలుపఁబడిన బాస సత్యముగను
నడుపుమయ్య భీమునకును బాంచాలికి, నాకునుం బ్రియంబొనర్పుమయ్య. 223

సూతుఁడు:—

ఉ. ఆయెడ నర్జునుండు హరిహార్దిక భావము లోనెఱింగి ఖ
డ్గేయకపాణియై ద్విజుని కేశయుతంబగు మూర్ధరత్నము
ద్దోయ హరించి బంధములనూడిచి యాశిబిరంబునుండి వె
ద్రోయఁగఁ జేసె బాలవధదోషహతప్రభు, నిర్మణిన్ ద్విజున్. 224

క. ధనముం గైకొనుటయును వ, పనమున్ స్థానంబునుండి భ్రంశము, నివియే
చను బ్రహ్మబంధునకు వధ, మన దైహికశిక్ష యొప్పదన్యం బెదియున్. 225

ఉ. ఆతఱి ద్రౌపదీ సహితులై యనువొప్ప నపారపుత్రశో
కాతురులైన పాండుసుతులందఱు నటన్ మృతులైన యత్తనూ
జాతులకున్ యథావిధిని సమ్మతి నిర్హరణాదిక క్రియా
జాతము నేర్పు తోడుత శుచాన్వితులై నెరవేర్చి రత్తఱిన్. 226

## అధ్యాయము 8.

### గర్భస్థ పరీక్షిత్పరిరక్షణము. కుంతీస్తుతి

సూతుఁడు:—

సీ. అంతట మృతులగు నాత్మీయులకు నివాపోదకం బిడఁగ నుద్యుక్తులగుచు
స్త్రీల ముందిడుకొని కృష్ణసమేతులై, పాండవుల్ గంగాభవాని దరిసి
విలపించుచున్ జలాంజలుల సమర్పించి, శ్రీహరిచరణాబ్జ రేణుపూత
గంగాజలంబులఁ గ్రుంకి స్నానంబులాడిరి సారెది నయ్యవసరమున

ఆ. వె. అందు సానుజుఁడయి యాసీనుఁడగు కురుభూపుని ధృతరాష్ట్రుఁ బుత్రశోక
కలితచిత్తమైన గాంధారినిం గుంతిఁ, గృష్ణుఁ జూచి నంతఁ గేశవుండు. 227

చ. వరముని యుక్తుఁడై నిహతబంధుల శోకపరీతచిత్తులన్
బోరిఁబోరి నేడ్చువారిఁ గని "భూతగణంబుల యందుఁ గాలవి
స్ఫురణము నిష్ప్రతిక్రియము పోల్చి కనుం"డని బోధఁ జేయుచున్
వెరవున నూరడించెను మునీశ్వరులార! జనార్దనుం డటన్. 228

చ. కితవులచే హృతంబగు స్వకీయ సమున్నత రాజ్యమున్ నయా
న్వితున కజాతశత్రునకు వెండియు నిచ్చియు యాజ్ఞసే న్యసం
స్కృత కబరీభరగ్రహణ కిల్బిషనష్టుల ధార్తరాష్ట్రులన్
హతులుగఁ జేసెఁ గృష్ణుఁ డతులప్రతిమప్రతిభాసమేతుఁడై. 229

గీ. సుమహితములగు నశ్వమేధముల మూఁటఁ, ధర్మజు యజింపఁజేసి శతక్రతునకుఁ
బోలెఁ బావనమైన తద్భూరియశము, విస్తరింపఁగఁ జేసె దిగ్వితతియందు. 230

గీ. పాండుసుతుల వీడుకొని ద్వైపాయనాది, మునులఁ బూజించి వారిచేఁ బూజితుఁడయి
అచ్యుతుండు శైనేయోద్ధవాన్వితుఁడయి, ద్వారకకుఁ బోవ దేరెక్కఁ బయన
మయ్యె. 231

క. అరదంబున నొప్పారెడు, పరమేశ్వరుఁడైన శౌరి పాలికి వెన ను
త్తర భయవిహ్వలయై సత్వరగతి నేతెంచి యిట్లు పలుకఁ దొడంగెన్. 232

ఉత్తర:—

మత్తకోకిల. దేవదేవ! జగత్త్రయాధిపతీ! మహామునిసత్తమా!
నీవు దక్క నిఁక న్యుఁ డెవ్వఁడు నేరఁ డార్తజనావళిం
గావఁగాఁ బెనుమిత్తివాతను గాఁటియంబడు దీనులన్
భావ మొప్పఁగఁ బ్రోతు వీవెగ? పాహి, పాహి జనార్దనా! 233

మత్తకోకిల. ఓ యధీశ్వర! తప్తమైన యయోమయంబగు నట్టి పెన్
సాయకంబు తపింపఁజేయఁగ సాగె నన్నుఁ గృపాప్రపూ
ర్ణా! యథేచ్ఛముగాఁ దహించుత నన్ను నాదగు గర్భ మిం
దే యపాయముఁ బొందకుండఁగ నీవు గావఁగదే ప్రభూ! 234

వ. అని యుత్తర విలపించినంత— 235

ఆ. భక్తవత్సలుండు భగవంతుఁ డాయమ, మొఱను విని కడంక భువనమిది య
పాండవముగఁ జేయఁ బఱపిన ద్రౌణియస్త్రంబు గాఁగ దానిఁ దానెఱింగె. 236

గీ. అపుడ తమకభిముఖములై యప్రతిహత, గతినిఁ బఱతెంచుచున్న యుగ్రంబులైన
పంచసాయకములఁ గాంచి పాండవేయు, లందుకొని రోజఁ దమతమ యాయు
ధముల. 237

గీ. అన్న మెద్దియుఁ గోరక తన్నె గోరు, స్వీయజనముల దుఃఖ మీక్షించి విభుఁడు
స్వమహితాయుధమగు సుదర్శనముచేత, నాశ్రితజనసంరక్షణమాచరించె. 238

ఆ. అఖిల భూతములకు సంతస్థుఁ డాత్మ యో, గేశ్వరుండు నైన కేశవుండు
స్వఘనమాయచేత వైరాటి గర్భంబు, కురుకులాభ్యుదయముఁ గోరి ప్రోచె.

చ. అవితథ మప్రతిక్రియము నయ్యును శాంతిని బొందియుండె న
య్యవసరమందు బ్రహ్మశిరమన్ మహితాస్త్రము పెంపుదక్కి వై
ష్ణవమగు దివ్య తేజము ఘనప్రతిభం దనుఁగప్పఁగా భృగు
ప్రవర! వచింపనేల నిఁక వైష్ణవశక్తి కసాధ్య ముండునే! 240

గీ. ఎవఁడు జన్మాదిరహితుఁడై యీ జగంబు, స్వీయమాయఁ బుట్టించుఁ బోషించుఁ ద్రుంచు
నట్టి సకలాద్భుత నిధానమైన కృష్ణు, నందుఁ దలఁపకుఁ డిదియొక యద్భుతమని.

గీ. బ్రహ్మ తేజోవిముక్తులై బయటఁబడిన, పుత్రకులతోడఁ బాంచాలపుత్రితోడఁ
గూడికొని కుంతి ద్వారకకుం గడంగి, ప్రస్థితుండైన హరిఁ జూచి పలికె నిట్లు. 242

కుంతి:—

మ. హరి విష్ణుం బ్రభవిష్ణు భూతసమవాయాంతర్బహిస్సంస్థితున్
నిరహంకారుని, నిర్గుణుం బ్రకృతికంటెన్ భిన్ను మాయాతిర
స్కరణీఛన్నుఁ బురాణపూరుషు నజున్ సర్వేశ్వరున్, శాశ్వతుం,
బరము, న్నిర్మలు, నిన్ను నజ్ఞనగు నే భావించి సేవించెదన్. 243

చ. క్రమత నటుండు నర్తకుఁడుగా జడదృష్టుల కెట్లుఁ దోఁపఁ డ
ట్లమలిన చిత్తులుం బరమహంసలునైన మహామునీంద్రచం

ద్రములకు గోచరింపవుగదా! యటు లౌటను గూఢ భక్తి యో
గము జగదీశ! యట్టి నినుఁ గాంతల మేముఁ గనంగ నేర్తుమే? 244

ఆ.వె. దేవదేవ! వాసుదేవ! గోవింద! శ్రీకృష్ణ! వరద! దేవకీకుమార!
నందగోపతనయ! మందరధర! యరవిందనయన! నీకు వందనములు. 245

క. పంకేరుహనాభునకున్, బంకేరుహలోచనునకుఁ బరమేశునకున్
బంకేరుహ చరణునకున్, బంకేరుహమాలికిన్ నమస్కృతి శతముల్. 246

చ. ఖలుఁడగు కంసుచేతఁ జిరకాలముఁ దా నవరుద్ధయై శుగా
ర్తుల వసివాడు దేవకి విమోచితయైనటు లేను నాదు సూ
నులును విపత్పరంపరలనుండి జగచ్ఛరణుండవైన నీ
యలఘుకృపన్ విమోచితులమైతిమి సారెకుసారెకుం బ్రభూ! 247

సీ. విషకలితాన్నంబు పెట్టిన యప్పుడు, జతుగృహదాహావసరమునందు
బురుషాశనులు చుట్టుముట్టిన యప్పుడు, కుటిలమనస్కుల కొలువునందుఁ
గాంతారవాస సంకటములం బ్రతియుద్ధమందు ననేకమహారథాస్త్ర
ములనుండి, ద్రౌణ్యస్త్రమునను నీచే మేము, గావంగఁబడితిమి గాదె! మఱియు

గీ. వనముల మెలంగు మాకు శాపంబునిడ సు,యోధననియుక్తుఁడై ముని క్రోధనుండు
త్రిజగములతోడఁగూడ సంతృప్తుఁడయ్యెఁ, గాదె! కూరాకుతోడ నీకరుణఁ గృష్ణ.

క. మగుడ భవబంధములఁ బొం, దఁగనీని త్వదీయపుణ్యదర్శన భాగ్యం
బగుఁగాన మాకు నెడనెడ, నగచాల్లె ఘటిల్లుగాత మఖిలేశ! హరీ! 249

క. ఘనజన్మైశ్వర్య శ్రుత, ధనసంపత్తుల సదా మదాన్విత మతి యౌ
మనుజుఁ డనర్హుఁడు నిష్కిం,చన జనగోచరుని నిన్ను సంస్మరియింపన్. 250

క. భువనేశ! యకించన, ధన, మవు వినివృత్తగుణవృత్తివాత్మారాముం
డవు, శాంతుండవు కైవల్య విభుండవునైన నీకు నభివందనముల్. 251

గీ. భూతసంఘాత మన్యోన్యముఁ గలహించు, భంగి నల్పెడువాని సర్వత్ర సమత
నలరువాని ననాది ననంతు నీశు, నిన్నుఁ గాలస్వరూపుఁగా నేఁ దలంతు. 252

చ. ఎవనికి నొక్కఁడుండు ప్రియుఁ డింకొకఁ డప్రియుఁ డుండఁడో నృకో
టివిషమమైన బుద్ధి పురుడింపఁగ నెవ్వనియందు లేదొ యీ
భువి నృవిడంబనమ్ము నలవోక మొయిం బొనరించునట్టి వాఁ
డవయిన నీదు చెయ్వుల గడంక నెఱుంగఁగ నేరఁ డెవ్వఁడున్. 253

క. అజుఁడ వకర్తవునయ్యు మ, నుజ యాదస్తిర్యగృషి జన్మకర్మము ల
క్కజ మగు గతిఁబూనుటఁ జూ, డ జగదధిప! యదియున్ విడంబనమే కాదా?

మ. దధిభాండమ్మును వ్రయ్యఁజేయఁగ యశోదాదేవి నిన్గట్టఁ ద్రా
డు ధరింపం గని భీతి కేన్ భయముఁ దోడ్తోఁ గూర్చు నీ వచ్యుతా!
యధికంబైన భయాన నంజనపరీతాస్రాపూర్ణమవ్యాకులా
క్షి ధరాస్యంబును వాల్చి నిల్చుదశ గాసిల్లించుంగదే? మోహమున్. 255

చ. శుభదచరిత్రుఁడైన యమసూను యశోవిభవాభివృద్ధికై
యభవుఁడవయ్యు నీ వల పరార్థ్య యదుక్షితిభృత్కులంబునన్
బ్రభ యెసగంగ నమ్మలయపర్వతమందునఁ జందనం బటుల్
ప్రభవమునందినాఁడవని పల్కుదు రార్యులు కొందఱో ప్రభూ! 256

క. కొంద ఱభవ! వసుదేవున, కుం దేవకియందు లోకకుశలంబునకున్
మ్రందింప నసురుల జనన, మందితి వం ద్రజుఁడవయ్యు నమరులు వేడన్. 257

క. పృథుభారమ్మునఁ గ్రుంగెడు, పృథివీభారంబుఁ దీర్ప విధి వేడ మహో
దధిమగ్న నావకుంబలెఁ, బ్రథితంబుగఁ బొడమితం డ్రపరులు పరేశా! 258

క. ఘనసంసృతియం దనిశం, బు నవిద్యాకామకర్మములఁ గ్లేశితులౌ
జనులకు శ్రవణస్మృతులకు, ననువగు కర్మల నొనర్తు వం డ్రొరులు హరీ! 259

ఉ. ఏ జనముల్ నితాంతముఁ ద్వదీహితమున్ వినుచుండ్రో, పాడుచుం
ద్రోజ స్తుతించుచుండ్రో మఱియున్ స్మరియింతురో, సంతసింతురో,
యా జనులే త్వదీయమగునట్టి భవార్ణవతారకాంఘ్రి పం
కేజయుగంబు నెమ్మిఁ బరికించుచునుండ్రు జగన్నియామకా! 260

మ. స్వజనాభీష్ట ఫలప్రదుండవగు దేవా! దేవకీ నందనా!
త్యజియింతే! యనుజీవులన్ సుహృదులన్ ద్వద్భక్తులన్ మమ్మధో
క్షజ! రాజన్యవధోరుపాపహతభాగ్య శ్రీ కులామాకిటన్
నిజమెన్నన్ భవదంఘ్రి పంకజము కంటెన్ దిక్కు లేదెద్దియున్. 261

గీ. యదువులును బాండవేయులనైన మేము, నీ యదర్శనమునను గణించిచూడ
నామరూపాల నెవరము నాథుఁడైన, జీవునిఁ దొలంగినట్టి హృషీకములటు. 262

చ. హలకులిశాంకుశాంబుజముఖాఖిలలక్షణలక్షితంబులై
చెలఁగు త్వదీయ పాదములఁ జిహ్నితమై చెలువొందుచున్న యీ
యిల యిటనుండి నీవు వెసనేగిన యంతనె యో గదాధరా!
సులలిత భాగ్యముల్ దొలఁగి శోభిల కుండును గాదె? సుంతయున్. 263

క. శ్రీరమణ! సుపక్వౌషధి, వీరుధములు నాపగాద్రి విపి నోదన్వ
త్సారము లగు జనపదములు, పేరిమి కనుగాదె? నీ సువీక్షణ గతిచేన్. 264

గీ. విశ్వనాథ! విశ్వాత్మక! విశ్వరూప!, వేదవేద్య! పాండవులందు వృష్ణులందు
నతిదృఢమ్ముగ నామది నలముకొన్న, స్నేహపాశంబుఁ ద్రెంచు మర్చింతు నిన్ను.

గీ. అన్యవిషయంబు లొల్లనిదై మదీయ, బుద్ధి నిత్య మవ్యాహతమ్ముగ ముకుంద!
ప్రీతి నీయందుఁ జేరుచుఁ గాఁత గంగ, తనప్రవాహంబు నలసముద్రమునఁ బోలె.

శా. శ్రీకృష్ణా! యఖిలాత్మ! పార్థసఖ! వృష్ణిశ్రేష్ఠ! సర్వేశ్వరా!
శ్రీకైవల్య పదప్రదాయక! ధరిత్రీద్రోహిభూపాలకా
నీకప్రోద్ధతవంశదావదహనా! నిష్కించనాధీన! సు
శ్లోకా! గోద్విజదేవతార్తిహ! ర విష్ణూ! నీ కివే నా నతుల్. 267

సూతుఁడు:—

క. అనియిట్లు మధురఫణితిం, దనమహిమలఁ బృథ నుతింపఁ దా విని హరి య
ల్లన స్వీయమైన మాయన్, ఘనతరమోహమున ముంచుకైవడి నవ్వెన్. 268

క. ‘బా’గనియాకుంతిని నెల, నాఁగల వీడుకొని హస్తినగరికిఁ జని వే
వేగ, దనపురికిఁ బోను, ద్యోగించు హరిని శమనజుఁ డుడిపెం బ్రీతిన్. 269

వ. అంత నీశ్వర సంకల్పంబు నెఱింగిన వ్యాసాది మునిపుంగవులును, బరమాద్భుత కర్ముండగు కృష్ణుండును, నితిహాసంబుల నెంతేఁగాఁ బ్రబోధించినను శోకపరీత మానసుండై యుధిష్ఠిరుండు కలఁకఁ దేరకుండె. విప్రులారా! మఱియు బంధువధంబును జింతించుచుఁ బ్రాకృతంబైన చిత్తంబున స్నేహమోహ పారవశ్యంబును బొంది యా ధర్మసూనుం డిట్లని వచింపం దొడంగె. 270

సీ. అకట! దురాత్ముఁడనైన నా యెడఁదఁ బై,కొనిన యజ్ఞానంబుఁ గనుఁగొనుండు
పరకీయమున్ వినశ్వరమును నా యీ శరీ,రంబునకై యనేకంబులైన
యక్షౌహిణుల్ హతమయ్యె నాకతమున, బాలుర ద్విజుల సుబాంధవులను
భ్రాతలఁ బితల సంబంధుల గురువుల, సఖుల నిట్టెఱఁగున స్వార్థకలిత

గీ. దుష్టబుద్ధి జంపించిన ద్రోహినకట!, యిట్టికర్కశ చిత్తుడెందేనిఁ గలఁడె
యరసి చూడ నాకున్ నిరయంబునుండి, లక్షహాయనముల కేని మోక్షమున్నె?

సీ. ప్రజలకు భర్తయై పరగెడు జేనికి, ధర్మయుద్ధమున శాత్రవవధంబు
దోసంబు కాదను శాసనవాక్యంబు, నాకుఁ బ్రబోధ మొనర్పకుండె
నా నిమిత్తంబున నష్టబాంధవులగు, స్త్రీలకు గల్గిన తీవ్రమైన
ద్రోహంబుపైకొనం దొడర గృహస్థకర్మములచే దానిని మాన్పికొనఁగ

గీ. గాను దక్షుఁడ నేనుఁ బంకమునఁ బంక,వారి, సురచే సురాకృతం బారయంగ
నెట్లుఁ గాఁ బాయదో భూతహింస వలని, యఘము నట్టులె చెడదు యజ్ఞాదికముల.

## అధ్యాయము 9.

### భీష్మాచార్యకృత శ్రీకృష్ణస్తుతి

సూతుఁడు:—

క. అనియిట్లు ప్రజాద్రోహం,బునకు వెఱచి యెల్లధర్మములఁ దెలియఁగ శాం
తనవుండు పడిన యాయో,ధనభూమికి నంత ధర్మతనయుం డరిగెన్. 273

గీ. అప్పుడతని భ్రాతలెల్ల రుపదంచి తాశ్వ, ములును గాంచనమాలావిభూషితములు
నైన రథముల వ్యాసధౌమ్యాదివిప్ర, సహితులై వెంటఁజనిరి ద్విజన్ములార! 274

క. నరయుతుఁడై నారాయణుఁ,డు రథమధిష్ఠించిచనెఁ గపిధ్వజంబతిభ యుధి
ష్ఠిరుఁ డవ్వారలతో నొ,ప్పె రహిం గుహ్యకులతోఁ గుబేరుఁడు వోలెన్. 275

చ. త్రిదివమునుండి క్రన్నఁబరిచ్యుతి నొందిన వేల్పుభంగి సాం
పిదముగఁ దేజరిల్లుచునుమేదినివ్రాలిన భీష్ముఁజేరియున్
సదమలమైనభక్తిమెయిసానుగులై యల చక్రితోడఁ ద
త్పదములకుం బ్రణామములఁబాండుతనూజులుసల్పి రెల్లరున్. 276

గీ. ఎల్లబ్రహ్మర్షివరులు దేవర్షివరులు, సకలరాజర్షివరులును సంతసమున
భరతపుంగవుఁడైన దేవవ్రతునటఁ, గాంచుటకునై వెసం జనుదెంచిరపుడు. 277

వ. పర్వతుండును, నారదుండును, ధౌమ్యుండును, భగవంతుఁడగు వ్యాసుండును, బృహదశ్వుండును, భరద్వాజుండును, శిష్యగణసమన్వితుండగు రేణుకాసుతుండును, వసిష్ఠుండును, నింద్రప్రమదుండును, త్రితుండును, గృత్సమదుండును, నసితుండును, గక్షీవంతుండును, గౌతముండును, నత్రియును, గౌశికుండును, సుదర్శనుండును మఱియు ననన్యులగు బ్రహ్మరాత ప్రభృతులగు నిర్మలులైన మునులును, కాశ్యపాంగిరసాదులగు ఋషులును శిష్యసమేతులై యచటికిఁ జనుదెంచిరి. 278

గీ. అట్లు గూడియుండిన యమ్మహాత్ములఁగని, దేశకాలవిభాగ విధిజ్ఞుఁడైన
వసువరుఁడు ధర్మవిదుఁడు దేవవ్రతుండు, వారికెల్లరకుం బూజభక్తిఁజేసె. 279

గీ. ఎదుట నాసీనుఁడగు జగదీశుఁగృష్ణు, స్వీయభూరిమాహాత్మ్యపాత్రకాయునభవు
హృదయసుస్థితుఁ బూజగావించెనపుడు, వసువరేణ్యుఁడు తత్ప్రభావజ్ఞుఁడగుచు.

గీ. శాంత నాసీనులగు పాండుపుత్రకులను
బ్రశ్రయప్రేమయుతుల హర్షాశ్రుపూర
ములు సెలంగ నంధీభూతములగు లోచ
నముల భీష్ముఁడు గాంచి నెయ్యమున ననియె. 281

గీ. విప్రధర్మాచ్యుతాశ్రయులై ప్రశస్త, వృత్తిఁ జరియించు మీరు జీవింపనాత్మ
నీయకొనకుంట ధర్మజా! యెంచిచూడ, నక్కటా! యది కష్టమన్యాయముకద.

క. అతిరథుఁడగు పాండుక్ష్మా, పతి పంచతఁ బొందఁ గుంతి బాలాపత్యా
న్విత, వనిత మీనిమిత్తము, వెతలం బొందినదికాదె పెక్కుతెఱఁగులన్. 283

ఉ. ఏ యగచాట్లు మీకు ఘటియిల్లెనొ యాయయి వేళల న్నరేం
ద్రా! యవియెల్లఁ "గాలకృత" మంచుఁ దలంచెద నా మనంబునన్
వాయువశంబులై చదలవర్తిలు నెట్టులు మేఘమాల ల
ట్లే యఖిలప్రపంచము భ్రమించును గాలవశత్వ మందుచున్. 284

చ. ఎచటనుధర్మసూనుఁడు మహీరమణుండొ! తగన్ వృకోదరుం
డెచటగదాగ్రపాణియయి యేపున నొప్పునొ! యస్త్రధారియై
యెచటఁగిరీటి భాసిలునొ యెచ్చటఁ జాపము గాండివంబొ! తా
నెచటసఖుండొ! కృష్ణుఁ డట నిక్కటులయ్యె నిదేమి చోద్యమో! 285

గీ. ఈవిభు చికీర్షితం బేదొ యెవ్వఁడేనిఁ
బురుషుఁ డెఱుఁగంగ లేఁ డొకప్డును మహీశ!
దీనిఁ దెలియంగఁ గోరి యతీశ్వరులును
మోహవారాశిలోఁబడి మున్గుచుండ్రి. 286

గీ. కావున నరేంద్ర! యిదియెల్ల దైవతంత్ర, మనుచు మది నిశ్చయించి నీవరసి దాని
కనుగుణంబుగ వర్తించు చనదలైన, ప్రజలఁ గాపాడు దక్షతన్ భరతముఖ్య! 287

సీ. ఈతఁడు కేవల మీశుఁడు భగవంతుఁ, డాదిపూరుషుఁడు నారాయణుండు
మాయచే మోహింపఁ జేయుచు లోకముల్, వృష్ణులతో గూఢవృత్తి మెలఁగు
నతిగుహ్యతమమగు నితనిప్రభావంబు, భగవంతుఁడైన యాభవుఁడుమఱి సు
రర్షి సత్తముఁడు నారదుఁడు సాక్షాద్భగ, వంతుఁ డౌకపిలుఁడేర్పడఁ దెలియుదు
గీ. రితని మాతులేయుండు సుహృత్తముండు, బాంధవుఁడు ననితలఁతువు ప్రభావమందుఁ
జనువుపెంపున దూతగా సచివుగాఁగ, సారథిగఁ జేసికొంటి గా! శమనతనయ! 288

వ. సర్వాత్మకుండును, సమదర్శనుండును, ననహంకారుండును, ననవద్యుండును, భగవం
తుండు నగు నీకృష్ణునకు నీచోచ్చకృతంబగు మతివైషమ్యం బెందును గానరాదు.

గీ. అయినను నరపాల! యేకాంతభక్తు, లందుఁ జూపు నీతని కృపననయమయ్య!
కృష్ణుఁ డితఁ డసువులఁ ద్యజియింపనున్న, నాకు నిట్లు సాక్షాద్దర్శనంబొసంగె.

చ. అమలిన భక్తి నెమ్మనమునచ్యుతు నందునఁ బాదుకొల్పి హృ
ద్యమగు తదీయ నామము సదా వచనంబున నుచ్చరించుచున్

యమనియమాదియుక్తుఁడగునట్టితపస్వివరుండు దా శరీ
రముఁ ద్యజియించుచున్ వెనఁ దొరంగును దుస్త్యజ కామ్యకర్మలన్. 291

తరల. అమృతమూర్తి చతుర్భుజాఢ్యుఁడు ధ్యానగమ్యుఁడు, సుప్రస
న్నమృదుహాసవికాసితం బరుణ ప్రభాక్షియుతంబునై
కొమరుమీఱు ముఖాంబుజంబునఁ గూడు వాఁడిట నుండు దే
హము నే విడునంతఁ దన్కఁ దయం బ్రతీక్ష యొనర్చుచున్. 292

సూతుఁడు;—

ఆ.వె. అంత ధర్మతనయుఁ డవ్వాక్యమాలించి, సత్యరీతి నంపశయ్యమీఁదఁ
బవ్వళించియున్న వసువరు ధర్మమా, ర్గంబు లెల్ల నడిగెఁ గ్రమము తోడ. 293

సీ. బహువిధధర్మముల్ బ్రశ్నింప ధర్మజ్ఞ, సత్తముండైన యాశాంతనవుఁడు
కలితవర్ణాశ్రమంబుల కనువగురీతి, మర్త్యస్వభావ సామాన్యములగు
నుదితవైరాగ్య రాగోపాధి నిగది తో, భయలక్షణంబులై పరగుచున్న
దాన ధర్మంబులుఁ దగ రాజధర్మముల్, మోక్షధర్మంబులు పొనఁగ స్త్రీల

గీ. ధర్మములు భాగవతపుణ్యధర్మములును, గడఁక ధర్మార్థకామమోక్షములివెల్ల
నోజ సంక్షేపవిస్తారయుక్తులెసఁగ, వర్ణనముఁ జేసి చెప్పె నప్పార్థివునకు. 294

గీ. యతియుస్వచ్ఛందమరణుండునైనయతఁడు, గడఁగియేయుత్తరాయణకాలమర్థిఁ
గోరు నదివచ్చె భీష్మునకును దగన్ యు, ధిష్ఠిరునకు ధర్మంబులుదెలుపుచుండ.

చ. వినుఁ డపు డవ్వివేకియగు భీష్ముఁడు స్వీయములైన వాక్కుల
ల్లన నుపసంహరించి కన్నులం దగ మూసి విముక్తసంగమా
నసముఁ బురస్థితుండు, లసమానయశుండుఁ జతుర్భుజుండుఁ గాం
చనవసనుండునైన జలజాక్షుపయి న్నిలిపెన్ సుధారణన్. 296

చ. అమలిన ధారణన్ బ్రతిహతాశుభుఁడై యల కృష్ణు సత్కృపా
ర్ద్రిమగు సమీక్షచేత విశిఖాయుధ బాధలు వోవ నింద్రియ
భ్రమ మది యెల్లడుల్ల నచిరంబున దేహము నుజ్జగింప డెం
దమునఁదలంచుచున్ ఘను జనార్దను సంస్తుతియించె నీగతిన్. 297

భీష్ముఁడు:—

చ. ఒకపరి నాత్మసౌఖ్యమున నుండియుఁ దాను భవప్రవాహ కృ
త్ప్రకృతినిఁ బొంది క్రీడ సలుపంగఁ గడంగెడు నట్టి లోక నా
యకుఁడు యదూద్వహుండు నధికాద్భుతతేజుఁడునైన కృష్ణునం
దకలుషమున్ వితృష్ణయగునట్టి మతిం దగ నేను నిల్పుదున్. 298

చ. ఖరకరదీధితిప్రకరగౌర వరాంబరముం ద్రిలోకభా
సురముఁ దమాలనీలమయి శోభిలు మేను ధరించి కుంతలో
త్కరకలితాననాబ్జుఁడయి కవ్వడికిం జెలియై చెలంగు న
ప్పురుషునియందు నాదయిన బుద్ధి తిరంబయి నిల్చుఁగావుతన్. 299

చ. తురగఖురోద్ధతధూళికణధూసరచంచలకుంతలంబు ని
ర్భరశ్రమతోయబిందుచయరమ్యమునై యలరారు మోముతోఁ
బరగుచు మన్నిశాతతరబాణతతిప్రతిహన్యమానుఁడై
యరుదుగఁ బొల్చునట్టి హరియందు మదాత్మ సదావసించుతన్. 300

చ. చెలువునిమాటచే నుభయసేనలమధ్యను దత్క్షణంబ తే
ర్నిలిపి విరోధిసైనికవరేణ్యులయాయువులెల్ల వాడిచూ
పుల హరియించుచున్ విజయమున్ వడిఁ గ్రీడికిఁ గల్గఁజేయు నూ
హాలఁ జెలువారు పార్థసఖునందు సదా రతి నాకుఁ గల్గెడున్. 301

చ. నిజరథమందు నిల్చి యటనిండిన యోధులనెల్లఁ గాంచి లో
స్వజనవధంబు దోషమనుభావమునన్ విముఖత్వమొందు న
వ్విజయుని హృద్గతంబయినవిక్లబతన్ విమలాత్మవిద్య న
క్కజముగఁ బాపినట్టి మురఘస్మరునం దనురక్తి నా కగున్. 302

చ. తనప్రతినం దొఱంగియు ఋతంబుగ నాప్రతినం బొనర్ప స్యం
దనమునుండి పెల్చన రథాంగముఁ గైకొని పైపటంబు జా
ఱ నవని కంపిలం బెలుకుఱం గరిఁద్రుంపఁగ వచ్చు సింగమో
యన నని నాపయిం దుముకునట్టి ముకుందుఁడు నాకు దిక్కగున్. 303

చ. శితవిశిఖాహతుండును విశీర్ణలసత్కవచుండు నుద్గత
క్షతజపరిప్లుతాంగుడు నజయ్యుఁడునై యట మద్వధార్థ మ
ప్రతిహతశక్తితోడఁ బ్రసభంబున నన్బయికొన్న యద్భుతా
ద్భుతగుణుఁ డచ్యుతుండు తలపోయఁగ నాకు శరణ్య మయ్యెడున్. 304

మ. మునికోలన్ వలకేలఁబూని హయరశ్ముల్ దాల్చి వేరొంటఁ బా
ర్థుని తే రాత్మకుటుంబ మట్లెసఁగఁ దద్రూపంబు బల్చూడఁ జ
క్కనిదై యుండఁగఁ జూచి యుద్ధనిహతుల్ గైవల్యముం బొందఁ బొ
ల్చిన యద్దేవునిపై ముమూర్షువగు నాచిత్తంబు సంధిల్లెడున్. 305

కవిరాజవిరాజితము. లలితగతుల్ దరహాసములున్ సువిలాసములున్ బ్రణయేక్షణపం
క్తులును సుమంబులుగాఁగఁ దదాత్మతతో హరిపూజలు సేయుచుఁ జె

య్యా లనుకరించుచు గోపవధూటికలున్మదమానస లయ్యెఁ గనం
గలిగిరి తత్పద మాహరియందునుఁగల్గుత నా కనురక్తి యెదన్. 306

చ. శమనజ రాజసూయమునసంయమిశేఖర భూమిపాలకో
త్తమగణసంకులంబగు సదస్సభన్ జనదర్శనీయ ర
మ్య మధురరూపుఁడై తనరియగ్ర్యార్హణముం గొనినట్టి స్వామి నె
య్యా మెసఁగ దృష్టిగోచరతనందుచు నాకుఁ జెలంగుఁ గావుతన్. 307

చ. అవనిభరంబుఁ దీర్పఁగలఁడై యనిలుండనుబోలెఁ దాను గౌ
రవకులమందు భీషణతరంబయి క్రాలెడు నక్షవంశ వ
హ్ని వెలుఁగఁజేసినట్టి జగదీశు శ్రితార్తిహరాంఘ్రిఁ గృష్ణు నా
దవు హృదిఁగౌఁగిలించుకొనియల్లన వీడెద మర్త్యదేహమున్. 308

చ. ఇనుఁ డొకరుం డనేకుల కనేక విధంబులఁ దోఁచునట్టి మా
ద్రిని నిజకల్పితాఖిల శరీరినికాయహృదంతరస్థితుం
డు నజుఁడు సర్వలోకవిభుఁడుం బరమాత్ముఁడునైన యట్టి యా
తని నెఱుఁగంగఁగంటి నెడదం గల మోహము లెల్లఁ బాయఁగన్. 309

సూతుఁడు:—

గీ. ఇట్లు భగవంతుఁడైన శ్రీకృష్ణునందు, వాఙ్మనోదృష్టి వృత్తులన్ బ్రజ్ఞమీఱ
నాత్మఁజొనిపి యంతశ్శ్వాసుఁడగుచుఁ దాను, భీష్ముఁ డుపరతుఁడయ్యెనో విప్రులార!

గీ. అంత నిరుపాధిక బ్రహ్మమందుసొరిది, సంగతునిఁగాఁగ భీష్ము నెఱింగి యెఱిఁగి
యచటివారుఁ దూష్ణీభూతులైరి యల దినాత్యయంబున విహగచయమ్ము వోలె.

గీ. దేవ మానవ కోటివాదితములైన, దుందుభులు మ్రోఁగె నప్పు డమందగతిని
సాధులగు రాజు లమ్మహాశయుఁ బొగడిరి, బోరునంబడె దివినుండి పుష్పవృష్టి.

క. పరమపదముఁ జెందిన నిర్జరతటినీనందనునకు సంస్కారాదుల్
జరపించియుఁ దాను యుధిష్ఠిరుఁ డుండె ముహూర్త మధికచింతాన్వితుఁడై. 313

ఉ. అంబురుహాక్షుఁ గృష్ణుఁ గొనియాడిరి మౌనులు తద్రహస్యనా
మంబులచేఁ బ్రహృష్టతర మానసులై మగుడన్ ముకుందు డెం
దంబునఁ బొదుకొల్పికొని తా రరుదార నిజాశ్రమ ప్రదే
శంబుల కేగి రెల్లరు నసంయమిచంద్రములార! వింటిరే? 314

క. అంత యుధిష్ఠిరుఁడు రమాకాంతునితోఁగూడ నేగి కరిపురికిం దా
నెంతయు నేరిమిఁ దండ్రిని, గుంతిని గాంధారి నాశ్వసింపఁగఁ జేసెన్. 315

గీ. తండ్రిచే ననుమతుఁడయి ధర్మజుండు, వాసుదేవుని సమ్మతిఁ బడసి ధర్మ
యుక్తముగఁ బిత్రుపైతామహోరురాజ్య, మేలె "మే"లని జనములగ్గించుచుండ.

## అధ్యాయము 10.

### శ్రీకృష్ణ ద్వారకానగర ప్రస్థానము

శౌనకుఁడు:—

ఉ. ధర్మపరావతారమగు ధర్మసుతుండు యుధిష్ఠిరుండు దు
ష్కర్ముల నాతతాయులను గౌరవులన్ స్వధనాపహారులం
జేర్మి వధించి సోదరసమేతముగాఁ బృథుభోగలీలలం
దర్మిలి లేక యెట్లు మెలఁగాడె? మఱేమి యొనర్చెఁ జెప్పుమా. 317

సూతుఁడు:—

మ. ఉరువంశోద్భవదావపావకశిఖాత్యుగ్రిచ్ఛటాదగ్ధమా
కురువంశంబున శ్లాఘనీయమగు నంకూరంబుఁ గల్పించి సం
సరణోద్వృద్ధికరుండు కృష్ణుఁడటులన్ స్వప్రాజ్యరాజ్యంబునన్
వెరవొప్పంగ యుధిష్ఠిరున్నిలిపి సంప్రీతాత్ముఁడయ్యె న్గడున్. 318

శా. గాంగేయోక్తము నచ్యుతోదితము నాకర్ణించి జ్ఞానంబుఁ గ
ల్గంగ న్నిర్గతమోహుఁడై యనుజులెల్లం గూడి వర్తించుచుం
డం గుంతీతనయాగ్రజుండు గరిమన్ నాకాధినాథుండు వో
లెం గృష్ణాశ్రయుఁ డాచు నీ పృథివి నేలెన్ సాగరప్రావృతన్. 319

సీ. పర్జన్యదేవుండు బరువడి వర్షించె, మహియును సర్వకామములుఁ బితికె
కుండోధ్నులై పాలగోబృందములు గోష్ఠ,ముల సమృద్ధంబుగ ముంచియెత్తె
నదులు, శైలములు, సంద్రములు, వనస్పతు, లోషధులును వీరుదుత్కరములు
ప్రతి ఋతువందును ఫలియించి ప్రాణికోటులకును సంతృప్తిఁ గలుగఁజేసె

గీ. దైవభూతాత్మములు నిమిత్తములుగాఁగఁ, గలుగు నాధులు, వ్యాధులు గష్టములును
గలుగవయ్యెను నిఖిలజీవుల కొకప్డు, నా యజాతశత్రుండు రాజై తలిర్ప. 320

గీ. ఆప్తజనముల శోకమ్ము నపనయింపఁ, దనదు చెలియలికిం బ్రియంబొనరఁ జేయఁ
గోరి హస్తిపురంబునఁ గొన్ని నెలలు, కృష్ణుఁడుండె బాంధవులకుఁ బ్రియకరముగ.

ఉ. కొందఱిచే ననుజ్ఞఁ గొని కొందఱఁ గౌఁగిటఁ జేర్చి వెండియున్
గొందఱి కర్థి మ్రొక్కి మఱి కొందఱిచేఁ బరిరబ్ధుఁడై యిఁకన్

గొండఱిచేత మ్రొక్కఁబడి కొందఱిచేత మ్రొక్కుచు వీడుకోల్
పొంది ముకుందుఁ డెక్కె రథమున్ స్వపురీగమనాభిలాషియై. 322

కవిరాజ విరాజితము. అతివ సుభద్రయు ద్రౌపది కుంతియు నవ్విదురుండు యుధిష్ఠిరభూ
పతి ధృతరాష్ట్రుఁడు తత్సతియుం దలపంగ యుయుత్సుఁడు ధౌమ్యుఁడు మా
రుతి కవలుం గృపుఁడుం బెఱకాంతలు రూఢిగ నుత్తరమున్నగ న
చ్యుత విరహంబు సహింపని వారయి యుండి రెడందల సందఱటన్. 323

గీ. సాధుసంగంబు కతన దుస్సంగములను, బాసినబుధుండు సజ్జనవర్ణ్యమాన
మగుచుఁ జెవిఁ గూర్చు కృష్ణునియశము మొకింత, విన్న విడువం దలంపఁ డెవ్వెనైన.

గీ. లలితదర్శన స్పర్శనాలాప శయన,భోజ నాసనాదిక కృత్యములను గృష్ణు
నందు నిక్షిప్తబుద్ధులై యలరు పార్థు, లెల్లు దద్వియోగంబు సహింపఁగలరు.

క. అనిమిష నేత్రంబులతో, ననురాగం బుట్టిపడఁగ నందఱు తనిఁ గ
న్గొనుచుం గదలాడి రిటునటు, గొనబు మెయిఁ దదర్పణములఁ గొని తేఱ వడిన్.

గీ. దేవకీతనయుండు మందిరమునుండి, వెడల నుత్కంఠ కతన స్రవించు బాష్ప
కణములాఁచిరి హరి కమంగళము కాక,యుండుతమని హృద్బంధులైన యువిద లెల్ల.

మ. హరిఁ వీక్షించు కుతూహలంబు వొడమన్ హర్మ్యాగ్రభాగంబులన్
గురునారీమణు లెల్ల రెక్కి యెదఁ గోర్కుల్ రేఁగఁ బ్రేమత్రపా
భరయుక్తస్మితపూర్వవీక్షణములం బల్మాఱు వీక్షించుచున్
విరివానల్ గురిపించి రొక్కమొగి నావీరేజపత్రాక్షుపై. 328

సీ. ప్రియతముఁ డైన శౌరికి గుడాకేశుండు, ముక్తికదామ సన్మండితంబు
వరరత్నదండ విభ్రాజమానంబునై, తనరు శ్వేతాతపత్రంబు వట్టె
ననఘుఁ డుద్ధవుఁడు సాత్యకియును గడుభాసు,రములైన వింజామరములుఁ గొనిరి
పూలమొత్తములచేఁ బొదువంగఁ బడుచు వి,రాజిల్లె నా మధుధరావిభుండు

గీ. నిర్గుణుండు గుణాత్ముఁడై నెగడు లోక,పావనుండైన యవ్వాసుదేవునకును
బుడమివేల్పులచేత సంప్రోక్తములయి, వినఁగవచ్చె సత్యాశీస్సు లనువుపడుచు.

క. వీనులవిందై కృష్ణా, ధీనమనస్కలగు పురసతీమణులకు న
న్యోన్యంబుగ నన్యోన్యము, భూనుత సంభాషణం బపుడు పుట్టె నిటుల్. 330

మ. త్రిగుణావిష్కృతికంటె మున్ను నిజశక్తిస్ఫూర్తి లోపింపఁగన్
జగదాత్ముండగు నీశునందుఁ బెలుచన్ సంవర్తకాలంబునం
దొగి జీవుల్ పరివిలీనమైనపుడు దానొక్కండ యెవ్వాఁడు స్త
వ్యగతిన్ భాసిల్లునో పురాణపురుషుం డాతండె యీతండు కా. 331

వ. మఱియు నా యీతండె నిజవీర్యప్రేరితయును, స్వాంశభూత జీవమోహినియునై సృజియింపఁగోరు ప్రకృతిని నామరూపరహితంబగు నాత్మయందు నామరూపంబులుఁ గల్పింప నిచ్చవొడమి, వేదంబుల శాసించుచు ననుసరించె. మఱియు నా యీ పురాణపూరుషుఁడె జితేంద్రియులు, జితశ్వాసులునగు నేసూరిజనంబులు పరమపదంబు నిహలోకంబునఁ బొడఁగాంచుచుందురో భక్తిసంభరిత నిర్మల మనస్కులగువారికి సత్త్వోదయంబుఁ గల్గించుచుండు. మఱియు నో చెలీ! యీ యీతండె. గుహ్యంబులగు వేదంబులయందు రహస్యనిరూపకులగువారిచేఁ గీర్తింపఁబడిన సత్కథాంశంబులు గలవాఁడై యుండు. మఱియు నా యీతఁడె యేకరూపుండు నీశుండునయి నిజలీలా విశేషంబున జగంబున కుత్పత్తి స్థితిలయంబులు గావించుఁగాని యందుఁ దగులంబు నొందఁడు. ఎప్పు డధర్మంబునఁ దమోగుణప్రధానులగు నృపాలకులు మెలంగుచుందురో యప్పుడు లోకస్థితికై ధర్మంబును, సత్యంబును, దయయును, యశంబును బ్రకటించురూపంబులఁ బ్రతియుగంబునఁ దాల్చుచుండు. 332

ఉ. ఔర! యదెంతొ శ్లాఘ్యతమమైనదిగా యదువీరవంశ మీ
పూరుషసింహుఁడైన హరిపుట్టువుచే, మధురాపురీవరం
బారసిచూడఁ బుణ్యతమమైనది గా శుభగాత్రుఁడైన యీ
శౌరిపదాంబుజాతయుగచంక్రమణంబులచే నితాంతమున్. 333

ఉ. ఏ నగరంబునందుఁ బ్రజలెల్లపుడుం గరుణేరితస్మిత
శ్రీనిచితావలోకుఁడగు కృష్ణుని నీతనిఁ గాంచుచుందురో
జానుగ నట్టి ద్వారవతిసర్వ్యశమున్ హరియించి క్షోణిక
న్యానయశంబుఁగూర్చి కడునొప్పెడు బాపురె! చూడఁ జోద్యమై. 334

చ. సకియరొ! యేవ్రజాంగనలు స్వాంతము లచ్యుతునందుఁజేర్చి పా
యక మధురాధరామృతము నానుచుఁ దన్మయతం జరింత్రో, య
మ్మకచెల! వారు శ్రీహరి సమర్చలు చేసినవారెసుమ్ము త
ప్పక తొలిజన్మమందుఁ గడుభక్తి వ్రతాదుల నాచరించుచున్. 335

సీ. ప్రబలచైద్యాదులఁ బ్రౌఢిగెల్చి స్వయంవరమునందు వీర్యశుల్కమునఁగొన్న
ప్రద్యుమ్న సాంబపుత్రలు రుక్మిణీజాంబవతులు సత్యాద్యన్య సతులుమఱియు
నరకాసురవధంబునంగొన్న వేనవేల్, తరుణీమణులుగూడనరసిచూడ
నపగతశౌచం బపాస్తభద్రంబునౌ, స్త్రీత్వము నేని స్వాధుత్వమొంద

గీ. సలిపినారలు చాగురే! సంతతంబుఁ, బుండరీకదళాక్షుఁడీ పుణ్యసతుల
వేశ్మములనుండి యొక్కఁడు వెడలి చనఁడు, తద్విలాసంబులకును బ్రీతాత్ముఁ డగుచు.

సూతుఁడు:—

క. ఈ కరణిం దనమాటలు, వాఁకొను పౌరాంగనలకు బద్మాక్షుఁడు, సు
శ్లోకుఁడు, సస్మితమధురా, లోకంబులఁ గనుచుఁ జనె జెలువుమీఱంగన్. 337

చ. అనఘుఁ డజాతశత్రుఁడు మహామహిమాన్వితుఁడైన కృష్ణుపైఁ
దనకుఁ గలట్టి స్నేహము కృతంబునఁ జేసి తదీయ విద్విష
జ్జనములనుండి శంకఁ గొను స్వాంతముతోఁ జతురంగయుక్తమై
తనరెడు సైన్యముం బనిచెఁ దత్పరిరక్షణపొంటె వెంబడిన్. 338

చ. తన వెనువెంటనే తవిలి దవ్వులకుం జనుదెంచి నట్టి స్నే
హనిబిడచిత్తు లుగ్ర విరహవ్యథమానులునైన పాండుసం
దనులను సాంత్వనోక్తులను దా మరలించి సరోరుహాక్షుఁ డొ
య్యనఁ జనియెన్ స్వకీయ నగరాభిముఖుండయి సమ్మదంబునన్. 339

వ. అట్లు చని కురుజాంగల పాంచాలదేశంబులను, యమునాతీరవర్తిదేశసముపే
తంబులగు శూరసేనదేశంబులను, బ్రహ్మావర్తంబును, గురుక్షేత్రంబును, సరస్వతీ
తీరవర్తి దేశంబులగు మత్స్య దేశంబులను గడచి, మరుధన్వదేశంబులను,
సౌవీరాభీర సైంధవదేశంబుల నతిక్రమించి క్రమంబునఁ బరిశ్రాంతవాహనుండై
యందందుఁ దత్రత్య జనంబులచే నొసంగఁ బడిన యుపాయనంబులఁ గైకొనుచు
సూర్యుఁ డపరాంబుధిఁ జేరు సమయమున కానర్తదేశంబులఁ జేరి సాయంసమయ
మగుట రథంబునుండి డిగి జలాశయంబు దరిసి పశ్చిమదిశ నుపాసించె. 340

---

## అధ్యాయము 11.

### ద్వారకానగర ప్రవేశము

సూతుఁడు:—

క. ఆయచ్యుతుఁడు సమృద్ధాత్మీయానర్తాభిధేయదేశము డాయం
బోయి తనశంఖ మొత్తెం, బాయని తచ్చింత నుడుపువాఁడుం బోలెన్. 341

చ. ఉరురవకారియౌచు ధవళోదరమైన దరంబు శ్రీధరా
ధరమణిరాగరక్తిమయుతంబయి తత్కమనీయపాణితో
యరుహపుటంబునం బరఁగి యత్తఱి శోభిలె నబ్జషండమం
దరుమగఁ గూయుచున్న కలహంసవతంసము వోలె లీలమై. 342

ఉ. అంతట నా జగద్భవభయాపహమైన మహానినాదమున్
బ్రాంతములందు నుండి విని పౌరజనంబులు కృష్ణదర్శనా
త్యంతవిలోలచిత్తులయి యందఱు నడ్డెదు రేగి రుమ్మడిన్
స్వాంతములందు సంతసము జెమ్మిగొనం గడు సంభ్రమంబునన్. 343

సీ. భానుమంతునకు దీపము భంగిఁ గృష్ణమూర్తికి నుపాయనములఁ దెచ్చిన ప్రజ
లెల్లరుఁ బ్రీతిసంఫుల్లముఖాబ్జులై, హర్ష గద్గదిత వాక్యములతోడ
ననఘు నాత్మారాము ననిశంబు నిజలాభమున విరాజిల్లెడు పూర్ణకాము
నఖిలసుహృద్వరు నఖిలావనునిఁ గని, పలికిరి తండ్రి నర్భకులు వోలె

గీ. దేవ! బ్రహ్మాసురేంద్ర వందితము క్షేమ, కరమునగు భవదంఘ్రి పంకజము నేము
భక్తిఁ గొలుతుము కాలమున్ భయముఁ జెంది, దానికి వశంబగుంగాదె తలఁచిచూడ.

శా. నీవే తల్లివి తండ్రివిం గురుఁడవున్ నేస్తుండవున్ భర్తవున్
దేవా! దైవము వెన్న నిన్ను ననువర్తింపంగ మేమో లస
ద్భావా! యెంతయు ధన్యజన్ములము మా పాపంబులం బాపఁగా
రావా! సంసరణాంధకూపగతులన్ రక్షింపవా? మాధవా! 345

శా. స్వామీ! నాకనివాసులౌ సురలకున్ సందర్శనాలభ్యమౌ
ప్రేమస్నిగ్ధశుచిస్మితేక్షణగణోపేతత్వదాస్యాబ్జమున్
శ్రీమంతంబఖిలాంగ సుందరమునై చెన్నారు నీరూపమున్
మేమెప్డుం గనుచుంటధన్యులముసుమ్మీ దేవకీనందనా! 346

ఉ. నేస్తులఁ జూచు వేడ్క మెయి నీవు మమున్ దిగనాడి యచ్యుతా!
హాస్తిపురంబుఁ గాని మధురాఖ్యపురంబును గాని చేర సూ
ర్యాస్తమయంబునం గనుల నంధతమంబులు గ్రమ్మినట్లులై
నిస్తులవిక్రమా! క్షణమె నిక్కము మాకొక కోటియేండ్లగున్. 347

సూతుఁడు:—

క. అనియీవడువునఁ బ్రమదం, బునఁ బలికిన ప్రజల వాక్యముల విని భక్తా
వనుఁడు హరి వారిఁజూడ్కుల, ననుగ్రహించుచు మనోహరాకృతి నెసఁగెన్.

సీ. ఆత్మసదృశబలులగు మధు భోజ వృష్ణ్యంధక కుకుర దశార్హవరుల
చే నాగవీరులచే భోగవతి వోలెఁ, బ్రాభవంబునఁ బరిరక్షితంబు
సర్వర్తువిభవభాస్వరపుణ్యతరులతో, ద్యానోపవన వనాబ్జాకరంబు
వరగోపురద్వారపథకృతకౌతుకాన్యాసతోరణగణయోజితంబు

గీ. వారితాతపచిత్రకేత్వగ్రిముఁబఱి, మార్జితాపణరథ్యామార్గమును సు
గంధజలసిక్తమును, సుమాక్షతఫలావకీర్ణము నగు ద్వారకఁ జొచ్చెఁ గృష్ణుఁడంత.

గీ. శౌరి యిట్టులు ప్రతిగృహద్వారభూమి, నక్షతాదులను, దధిఫల లేక్షువులను
లలితపూర్ణకుంభంబుల బలుల, ధూప, దీపములఁ, బొల్చుపురిఁ జొచ్చి తేజరిల్లె.

సీ. ప్రియతముండైన శ్రీకృష్ణదేవుం డట్టులరుదెంచె ననువార్తనాలకించి
ధీనిధి యగు వసుదేవుఁ డక్రూరుండు, నుగ్రసేనుండు నత్యుగ్రబలుఁడు
బలరాముఁడును మఱి ప్రద్యుమ్నవీరుండు, చారుదేష్ణుండును సాంబగదులు
హర్షవేగసముజ్ఝితాసనభోజన, శయనులై దంతిరాజంబు ముందు

గీ. నలరఁగ సుమంగళద్రవ్యహస్తులగుచు, ద్విజులు చనుదేర శంఖవాదిత్రరవము
లులియఁగా వేదఘోషధ్వనులు సెలంగ, నెదురుఁ జనుదెంచి రరదంబు లెక్కి సారిది.

గీ. ప్రణయకలితసంభ్రమశౌచ్యవారసతులు, కృష్ణసందర్శనౌత్సుక్యమొదలఁ బొదల
శతసహస్రయానంబుల సరభసమున, సందడిగఁ జనుదెంచి రాసమయమందు. 352

గీ. ప్రోల్లసత్కుండలప్రభాభూషిత సుక, పోల భాసుర వదనలసత్సుమాలవిరాజి
లు నట నర్తక గంధర్వులు మఱి సూత, వందిమాగధులును జేరవచ్చిరటకు. 353

గీ. అట్లు చనుదెంచి వారెల్ల నద్భుతములు, స్తుత్యములు నగు నుత్తమశ్లోకుఁడైన
కృష్ణు చారిత్రములను సంప్రీతి యెసఁగ, గానమొనరించి రంత నన్యూనఘణితి. 354

మ. భగవంతుండగు శార్ఙ్గపాణి యచటన్ బంధ్వాళికిన్ స్వప్రియా
నుగ వర్గంబునకున్ యథోచితముగం బొల్పార నత్యంత ర
క్తిగఁ గావించె శిరఃప్రణామములఁ గౌఁగిళ్ళం గరస్పర్శలన్
సాగసా సుస్మితవీక్షణంబులను నస్తోకోరుసమ్మానముల్. 355

క. శ్వపచుండాదిగ నెల్లర, కపు డభిమతవరము లొసఁగి యవ్విభుఁడు గురుల్
విపులాసురులు సపత్నీ, కపౌరులిడు దీవెనలను గైకొనియెఁ దమిన్. 356

ఉ. వందులతోడఁ గూడి యటు ద్వారకఁ జొచ్చి విభుండు రాచబా
టం దగఁ బోవుచుండఁగ నెడందల నాతనిఁ జూడఁ గోరికల్
సందడిఁ జేయుచుండఁగఁ గులప్రమదల్ వెస మేడలెక్కి రా
నందతనూజు నెంతఁగనినం దనివొందరు ద్వారకాప్రజల్. 357

గీ. సిరికి నిలయమ్ము శ్రీహరియురము, ముఖము
ప్రాణిదృక్కోటులకుఁ బానపాత్రమరయ
బాహువులు తావలము లోకపాలురకును
బదకమలము నివాసంబు భక్తులకును. 353

ఉ. చారు సితాతపత్ర మృదుచామర మండితుఁడై పురాంగనా
ప్రేరిత పుష్పవృష్టులు పయింబడుచుండఁ బిశంగచేల మిం
పారఁగఁ గంఠసీమ వనమాల చెలంగఁగ సూర్య చంద్ర వృ
త్తారి ధను స్తటిల్లతల నంబుదుఁడుం బలె శౌరియొప్పెడున్. 359

గీ. పితరుల గృహంబునందుఁ బ్రవిష్టుఁడగుచు, స్వజనములచేతఁ దమిఁ బరిష్వక్తుఁ డగుచు
నడఁకువం దేవకీముఖ్యులైన తల్లు, లేడ్వురకును శిరోనమస్కృతుల్లొనర్చె. 360

క. వారు నొడి నతనిఁ జేర్చి య, పార స్నేహమునఁ జనులఁ బాల్గురియంగన్
భూరిముదజబాష్పాంభః, పూరంబులఁ దడిపిరపుడు పురుషోత్తమునిన్. 361

క. పదునాఱువేల భార్యల, సదమలహర్మ్యములతో నెసంగెడు కామ
ప్రద మత్యుత్తమమునగు స్వ,సదనమునకు హరి యశోవిశాలుఁడు సనియెన్. 362

సీ. ప్రోషితుఁడై గృహంబునకు నేతెంచిన, పతిని వీక్షించి తత్పత్ను లెల్ల
మనముల నుత్సాహమునుమడింపఁగ నాస,నంబులనుండి వేగంబు మెఱయ
ప్రతసమేతముఁగ వ్రీడితలోచనానన, పద్మలై లేచిరి పరవశతను
బిబ్బోకవతు లాత్మవిభుని నంతఃకర, ణములతో నాలింగనము సలిపిరి
గీ. అమిత విశ్లేషసముదితాయాసకలన, లజ్జిత స్వాంతలైన యాలలనలకును
నేత్రయుగ్మమునుండి కన్నీరు దొరలె, నెంతయాచిన నాగక భృగువరేణ్య! 363

ఉ. ఏకతమందుఁ బజ్జ వసియించిన జీవితనాథు నూతన
శ్రీకలితంబు పాదసరసీరుహ యుగ్మ మనుక్షణంబుఁ దా
నే కమలాక్షి ప్రీతి భజియింపక యుండు నొకప్పుడేని సు
శ్లోకునిఁ గృష్ణునిన్ విడువఁజూడదు చంచలయయ్యు లక్ష్మియున్. 364

మ. అవనీభారకరోగ్రసంభవుల నేకాక్షౌహిణీ సైన్యశ
క్తి వివృద్ధోజ్జ్వలతేజు లుద్ధతులునై దీపిల్లు భూపాళికిన్
దవవహ్నిన్ వనిలోన మారుతుఁడు చందానన్ మిథోవైరమున్
రవులంజేసి జనార్దనుండు విరతిన్ గాంచె న్నిరస్తాస్త్రుఁడై. 365

ఉ. ఆ భగవంతుఁ డీక్రియ మహాత్తరమైన స్వమాయచేతఁ దా
నీభువనంబునం దవతరించి సతీమణికూటయుక్తుఁడై
ప్రాభవయుక్తుఁడయ్యు నొక ప్రాకృతపూరుషుఁడుం బలెన్ మహేం
ద్రాభ సమానవైభవమునన్ విహరించె వసుంధరాస్థలిన్. 366

శా. ఏ పూఁబోండ్ల గభీరభావ పిశునవ్యాహాసోల్లసద్ధాసల
జ్జోపేతాక్షివిలాసపాతమున మోహోద్రిక్తుఁడై కంతుఁడున్
జాపంబున్ విడనాడె లోఁబడునొ య్యాచంద్రాస్యలుం గృత్రిమ
వ్యాపారంబులఁ గృష్ణుడెందము మథింపంజాలరైరింతయున్. 367

ఉ. సంగవివర్జితుండయిన శార్ఙ్గధరుం జగదాత్ముఁ గేశవున్
సంగసమేతుఁడై పరవశత్వమునం జరియించు మర్త్యుఁగా
నింగితబుద్ధిలేమి జగమెల్ల స్వసామ్యమునన్గొనున్ సుధీ
పుంగవ! దానఁజేసి యతిమూఢము కాదె జగంబు చూడఁగన్. 368

గీ. ఆత్మనిష్ఠగుణంబులనలరుచుండి, ప్రకృతిఁ జేరియుఁ దత్సంగవశుఁడుకాక
యెసగుటన్నదె యాతనియైశ్వరత్వ,మరయ నెప్పుడుఁబ్రకృతి తదాశ్రయ యగు.

ఉ. ఏకతమందుఁ దమ్మనుసరించి చరించుటస్త్రైణుఁడంచు బి
బ్బోకవతుల్ దలంచిరి విమూఢమనస్కతతోడ నుత్తమ
శ్లోకుఁ గృపావలోకు నతిలోకు సురక్షితభక్తలోకు న
స్తోకచరిత్రుఁ గృష్ణుని నధోక్షజుఁ దన్మహిమానభిజ్ఞలై. 370

---

## అధ్యాయము 12.

### పరీక్షిజ్జన్మము

శౌనకుఁడు:—

సీ. సాగ్రహాశ్వత్థామసముపసృష్టప్రభా, దీపితబ్రహ్మాస్త్రతేజమునను
బ్రతిహతమగు నుత్తరాగర్భ మాకృష్ణు,చే వెండి జీవింపఁజేయఁబడెఁగ
యనఘాత్ముఁడైన యాతని జన్మకర్మముల్, నిధనంబు మాకోగింపఁదెలుపుమయ్య
అదిగాక దేహంబుఁదద్యజియించి యాఘనుఁ, డేమయ్యెఁ బదఁపడి యెచటికేగె?

గీ. ఈయుదంతంబు వినఁగ మేమెంతయు మదిఁ,గోరుచుంటిమి నీవు మాకు నెఱిఁగింప
దలఁతువేని శుకయోగి చేఁదెలుపఁబడిన,దానిఁజెప్పుము మాకు శ్రద్ధాళువులకు.

సూతుఁడు:—

సీ. శ్రీకృష్ణపాదాబ్జసేవానురక్తిమై, నిఖిలకామంబులన్నిస్పృహుఁడును
ధర్మనిష్ఠుఁడునయితండ్రికైవడి నెల్ల, ప్రజలఁ బ్రేమించుచుఁబరఁగుచుండ
శ్రీలు జన్నములు, మహాలోకసిద్ధులు, భార్యలు భ్రాతలు వసుమతియును
బ్రకటజంబూద్వీపరాజ్యసంపద మున్ను, గాఁగ వేల్పులకునుగాంక్షణీయ

గీ. సకలకామితములు నధోక్షజునియందు, మనసునిల్పిన ధర్మసూనునకు ముదము
గొల్పనివియయ్యె నాఁకలిఁగొన్నవాని, కన్నముసకంటె నన్యద్రవ్యగాదులువలె. 372

గీ. అట్లు మాతృగర్భగతుఁడయ్యర్భకుండు, ద్రోణి బ్రహ్మాస్త్రభూరిప్రతాపవహ్ని
దహ్యమానాత్ముఁ డగుచుఁ దద్గర్భమునఁ బు,రుషుని నొకని నంగుష్ఠమాత్రునిఁ
బొడఁగనె. 373

సీ. కమ్రదర్శను స్ఫురత్కనకకిరీటుఁ బ్ర,స్ఫీత తటిద్వాసు శ్రీనివాసు
శ్రీమచ్చతుర్బాహు శ్యామసుందర దేహు, రక్తాక్షు సువిశాలరమ్యవక్షు
తనకు నడ్డెనల గదం గేలఁ గీలించి, తిరుగుచుఁ గొఱవినిఁ ద్రిప్పు నట్లు
త్రిప్పుచు బ్రహ్మాస్త్ర తేజంబు నిజగదన్, భానుండు నీహారపటలము వలెఁ

గీ. బొలియఁజేసెడు వానిఁ దాఁ బొడఁగని, యీతఁడెవ్వఁడని నిసువు పరీక్షఁజేయ
నందె యంతర్హితుండయ్యె హరి యది తొలఁగించి దశమాస్య బాలుఁ డీక్షించు
చుండ. 374

సీ. అత్యనుకూల గ్రహాభ్యుదయాద్యఖి, ల వర గుణోదర్కలగ్నమందు
పాండు వంశోద్ధారకుండయి రెండవ, పాండుఁడో యన బాలకుండు భూరి
తేజంబున జనించె రాజవతంసుఁ డ, జాతశత్రుండు సంప్రీతుఁడగుచు
ధౌమ్య కృపాది సద్బ్రాహ్మణోత్తములచేఁ, బుణ్యాహవచనాదిపూర్వకముగ

గీ. జాతకర్మఁ జేయించి ద్విజన్ములకు హి,రణ్య గోగణ వసుమతీ గ్రామచయ వ
రాశ్వములను మృష్టాన్నము నర్థి నొసఁగెఁ, బాత్రతఁగని పుత్త్రోదయావసరమందు.

సీ. అంత బ్రాహ్మణు లెల్ల సంతుష్టులై పౌత్ర, యాన్వితు నృపుఁగని యనిరి యిట్లు
పౌరవర్షభ! పురువంశ ప్ర జాముల, తంతువైన యితండు దైవనిహతి
నాశంబు నొంది, సర్వేశుఁడౌ విష్ణుచే, స్వాశ్రితులైన మీయందలిదయ
దొలుకాడ, మగుడ రాతుండయ్యెఁగావున, నీతండు దావిష్ణురాతుఁ డనెడు

గీ. పేరనొప్పారుచుండు నీ భువనమందు, నఖిల జన కీర్తనీయుఁ డీయలఘుచరితుఁ
డమల భాగవతోత్తముఁడై యెసంగఁ,గలఁడు లే దిందు సందియమలుపమేని.

యుధిష్ఠిరుఁడు:—

మ. అని యిట్లా ద్విజసత్తముల్ నుడువఁగా నాలించి ధర్మాత్మజుం
డను రాజర్షుల నాత్మవంశ్యులను బుణ్యశ్లోకులన్ నేర్మిమై
ననువర్తింపఁ గలాఁడె? యీతఁడు స్వకీయంబైన యుద్యద్యశం
బును హర్షోత్థిత సాధువాదముల నొప్పన్ లోక మగ్గింపఁగన్. 377

వ. అని యడిగిన 378

బ్రాహ్మణులు: —

సీ. రాజ! సాకఁగలండు ప్రజల నీతండు సా,క్షాన్మనుసంభవేక్ష్వాకువువలె
అతిసత్యశాలి బ్రహ్మణ్యుఁ డగున్ దశ, రథపుత్రుఁడైన శ్రీరాముపగిది
దాతృతామహితుఁ డార్తశరణ్యుఁ డగును న్నౌ,శీనరపతియగు శిబివడువున
లలిజ్ఞాతులయు యజ్వలయుఁ గీర్తిఁ బెనుచు న,త్యంత దక్షతను దౌష్యంతికరణి

గీ. ధన్వివరుఁడీతఁ డర్జునద్వయముఁ బోల్కి, వహ్నిఁ బోలె దుర్ధర్షుఁ డపాంనిధి క్రియ
దుస్తరుఁడు విక్రమియు మృగేంద్రు నివిధమున, సాధు సేవ్యుండు ప్రాలేయశైలమట్లు.

సీ. ఇతఁడు తితిక్షువు క్షితివోలెఁ బితరులు, వోలె సహిష్ణువు పోల్చిచూడ
జలజగర్భుఁడువోలె సర్వభూతసముండు, శర్వుండువోలెఁ బ్రసాదఘనుఁడు
శ్రీనివాసుండైన శ్రీవిష్ణువుంబోలె, నఖిలభూతములకు నాశ్రయుండు
శ్రీకృష్ణు ననుసరించెడు నిమ్మహాభాగుఁ, డఖిల సద్గుణ మహత్త్వాంచితుండు

గీ. రంతిదేవునివలె నుదారచరితుండు, తగ యయాతి బలెం గడుధార్మికుండు
బలివలె నవార్యధైర్యసంపత్కలితుఁడు, హరిసమర్పితబుద్ధి ప్రహ్లాదు పగిది. 380

ఉ. ఈవిభుఁ డశ్వమేధము లనేకము లం బొనరించు వృద్ధ సం
సేవియు నౌను దుష్టజనశిక్షనొనర్చును, రాజయోగులన్
దా వెలయించు, భూమికయి ధర్మముకై, కలి నిగ్రహించు దీ
నావనతత్పరుం డయి, యనారతమున్ మెలఁగున్ యశోరతిన్. 381

గీ. విను యుధిష్ఠిర! ద్విజసుత ప్రేరితుఁ డగు, తక్షక ఫణీంద్రు వలననుదనకుమిత్తి
యగు టెఱిఁగి ముక్తసంగుఁడై యచ్యుతపద, కమలమున్ భక్తి భజియింపఁగలఁ
డితండు. 382

గీ. బాదరాయణి యగు శుకువలన నీతఁ, డాత్మతత్త్వ వివేకంబు నధిగమించి
గంగయం దీతనువుఁ దొలఁగంగ విడిచి, యందఁగలఁ డకుతోభయ హరిపదంబు.

క. అని యయ్యుధిష్ఠిరనృపా, లునకు ద్విజులు, జాతకకుశలులు దెలిపి తద
ర్చనలం గైకొని యందఱుఁ, జనిరి ప్రహృష్టాత్ములగుచు స్వగృహమ్ములకున్. 384

గీ. తాను గర్భదృష్టుని నాత్మఁ దలఁచికొనుచు, నిందు నరులనెల్లరను బరీక్షఁ జేసెఁ
గానఁ దలఁపఁ బరీక్షిత్తునా నితఁడు స,మస్త లోకమునందు విఖ్యాతుఁడయ్యె.

మ. కలలం గాష్ఠలఁగూడ నన్వహము శుక్లంబైన పక్షంబునం
దల ప్రాలేయ గభస్తి చందమునఁ దానాపూర్యమాణాత్ముఁడై
నలువొప్పారఁగ వృద్ధిఁ బొందె నవనీనాథాత్మజుం డంతఁ దం
డ్రులు తన్నున్ బ్రబలానురాగమునఁ దోడ్తో ముద్దుఁగావింపఁగన్. 386

మ. స్వజనద్రోహవికల్బిషంబు శమియింపన్ వాజిమేధంబునన్
యజియింపంగ మదిం దలంచి కరదండప్రాప్త విత్తంబు కం
టె జనాధీశ్వరుఁ డెందలబ్ధధనుఁడై డెందంబునం గుంద న
గ్రజు భావంబు గ్రహించి రత్తఱిని దద్ర్వ్యాతల్ హరిప్రేరణన్. 387

క. ఉత్తరదిశం గ్రతువున మ,రుత్తునిచే విడువఁబడిన రౌక్మము ఘనమై
హత్తఁగఁ గైకొని వచ్చిరి, యత్తఱిఁ బ్రతిలబ్ధ కాముఁడయ్యె నృపతియున్. 388

సీ. జనపతి యావిత్తమునన సంభారముల్, సమకూర్చి యశ్వమేధముల మూఁట
యజ్ఞేశుఁడగు హరిన్ యజియించె నృపతిచే, భగవంతుఁ డాహూతుఁడగుచు నటకు
నరుదెంచి బ్రాహ్మణవరుల కెల్లరకును, వివిధదానంబు లిప్పించి పనిచి
నిజసుహృజ్జనులకున్ బ్రియమును గూర్పఁగఁ, గొరి యందు వసించెఁ గొన్ని నెలలు

గీ. పదఁపడి యుధిష్ఠిరుండు ద్రౌపదియు బంధు, సముదయంబు ననుజ్ఞనొసంగ శౌరి
పార్థసహితుండు యాదవపరివృతుండు, నగుచు ద్వారవతీపురికరిగె నంత. 389

---

## అధ్యాయము 13.

### గాంధారీ ధృతరాష్ట్ర దేహపరిత్యాగము.

సూతుఁడు:—

గీ. తీర్థయాత్రలయందు మైత్రేయువలన, విదితముగ నాత్మగతిని విదురుఁడెఱిఁగి
ఆప్రవిమలాత్మగతిని జ్ఞేయం బఖిలముఁ, దెలిసి పిమ్మటఁ జేరె హాస్తినగరమ్ము.

గీ. ధీయుతుఁడు విదురుండు మైత్రేయు నెదుట, మొదట నెంతమాత్రపుఁ బ్రశ్నములను సల్పె
వానివలననే హరియం దపారభక్తి, యుప్పతిల్లనొండడుగక యూరకుండె. 391

సీ. అట్లు సమాగతుండైన బంధువుఁ జూచి, సానుజుండగు ధర్మసంభవుండు
ధృతరాష్ట్ర మేదినీపతి యుయుత్సుండును, గ్రమత సంజయుండు శారద్వతుండు
కూరిమిఁ బృథయు గాంధారి, ద్రౌపది, సుభ,ద్రయు నుత్తరయుఁ గృపి తలఁపజ్ఞాతి
జాయ లన్యలుఁ బుత్ర సహిత తావనితలుఁ, బ్రీతి సంభ్రమములు పెనఁగొనంగ

గీ. ఆగతం బగు ప్రాణమ్ము నవయవములు, పోలె నెదురేగుదెంచి యాపుణ్యుఁ
బ్రియమె
సంగఁ గదిసియు నిర్భరాలింగనాభి,వాదనాదులచే గౌరవము సలిపిరి. 392

క. విరహోత్కంఠతచేఁ గాతరులగు వారెల్ల సమ్మదాశ్రుకణ పరం
పరలు విడిచిరి కృతాసన, పరిగ్రహుం జేసి విదురుఁ బ్రభుఁ డర్చించెన్. 393

ఆ. వె. కుడిచి విశ్రమించి తోడఁది సుఖాసనాసీనుఁడైన విదురు నానృపుండు
వినయ వినమితుఁడయి తనవారు వినుచుండఁ, బలికె నిట్లు విప్రవర్యులార! 394

యుధిష్ఠిరుఁడు:—

గీ. పగఱవలన విషాదులవలన మాతృ,యుతముగా సత్కృపన్ విమోచితులమగుచు
నీవు ఱెక్కలనీడలన్ బెఱిఁగినట్టి, మమ్ము స్మరియింతురే! మీరు మాన్యచరిత! 395

చ. కువలయ మెల్ల నప్పగిదిఁ గ్రుమ్మరుచుండినయట్టి మీర లే
ప్రవిమలవృత్తిచేత నిరవద్యగతిం జరియించినారలో
భువనమునందుఁ గల్గిన ప్రపూత మహోత్తర తీర్థముల్ ప్రభూ!
యెవి భవదంఘ్రిధూళి స్పృశియింపఁ బవిత్రములయ్యెఁ జెప్పుఁడీ. 396

చ. స్వయముగఁ దీర్థభూతులు భవాదృశ భాగవతోత్తముల్ శుభో
దయచరితా! స్వకీయహృదయాంతరసుస్థితుఁడీశుఁడున్ దయా
మయుఁడు, శ్రితావనోత్సుకుఁడు మాన్యుఁడునైన రథాంగపాణిచే
నియతిని మీరు తీర్థముల నిత్యపునీతములం బొనర్తురా. 397

గీ. వాసుదేవ పరాయణుల్ మా సుహృదులు, బాంధవులునైన యాదవవరుల నెప్పు
డేని కన్నార? విన్నార? యిద్ధచరిత!, వారు తమపీట సుఖమున్నవారె? చెప్పుఁడ.

గీ. అని యుధిష్ఠిరుచే నిట్టుల నడుగఁబడి య,థానుభూతము గాఁగ దత్సర్వము క్రమ
సరణి వర్ణించె యదుకుల క్షయము తక్క, వివిధ దురితాద్రి భిదురుండు
విదురుఁడంత. 399

ఆ. సదయ హృదయుఁడైన విదురుండు తా దుఃఖి,తాత్ములం గనంగ నక్షముఁడయి
స్వయ ముపస్థితం బసహ్యమునగు యాద,వులకునైన క్షయముఁ దెలుపఁడయ్యె.

గీ. స్వజనములు దైవముంబలెన్ సత్కరింపఁ, గుశలపథము జ్యేష్ఠభ్రాతకును దెలుపుచు
నెల్లరకు సమ్మద మ్మావహిల్లఁ జేయు, చట వసించెఁ గించిత్కాల మనఘుఁడు.

క. మునిశాపంబున శతహా,యనములు శూద్రత్వ మొందె యముఁ డందను క
య్యనుఁ డఘకారులకై కొనె, మునుకొని దండము యథార్హముగ శిక్షింపన్. 402

సూతుఁడు:—

సీ. సంప్రాప్తరాజ్యుఁడై శమనతనూజుండు, వంశవర్ధనుఁడగు పౌత్రుఁ గాంచి
నెరి లోకపాలసన్నిభులైన యనుజుల,తో నపార శ్రీలతో నెసంగె
నపుడె యచ్యుతుఁడు తన్ననుగమించెడు సర్వ, బంధులన్ వీడ్కొని వాసవతన
యోద్ధవ శైనేయయుక్తుఁడై సమ్మతిన్, ద్వారకాపురమునకు జేరెఁ గాదె!

గీ. ఇట్లు గృహాసక్తులగుచుం దదీయపాలం బ్రమత్తులై చరియించెడి మానవుల క
లంఘ్యమైన గభీరకాలంబు సుంత, తెలియఁబడక యేమరక యతిక్రమించు. 403

విదురుఁడు :—

సీ. అది యెఱింగి యశేషవిదుఁడగు విదురుండు, ధృతరాష్ట్రధాత్రీపతికి ననియె
రాజేంద్ర ! యింక శీఘ్రమున నిష్క్రమింపు మ, త్యాసన్నమైన భయంబుఁ గనుము
దీనికి లేదు ప్రతిక్రియ యెందేని, నెప్పుడేనియుం గ్రహింపు మధిప!
మనకందఱకును సమాసన్నమయ్యె నీ, భగవత్స్వరూపమై పరఁగు కాల

గీ. మక్కటా! కాలకబళితమగు జనమిది, యతిప్రియప్రాణములచేతనైన నఁగాని
విడువఁబడదు నన్నచో మఱి వేఱచెప్ప, నేల విత్తాదికములైన నితరములను. 404

సీ. తండ్రులున్ భ్రాతలున్ దనయులు మిత్రులు, హతులైరి యకట! ప్రాయంబు చెల్లె
తనువు జరాగ్రస్త మునికి దాయలయింట, మున్నె యంధుండవు వీనులు చెవిటివి
మందబుద్ధివి నైతి మఱియు దంతంబులు, గళితంబులయ్యె నాఁకలి యుడిగె
కఫ మగ్గలంబయ్యెఁ గంఠంబుఁ గప్పెఁ గ, నుడుగని తెవులునఁ బడితి గాదె

గీ. యకట! జంతువునకు జీవితాశయెంత, గాఢతరమైనదో యెఱుఁగంద రంబె
భీముఁ డురవడి బడవైచు పిండముఁ గయి, కొనుచు నుంటివి నీ వింటికుక్కపోలె.

క. ఏ వారి కగ్నిఁ బెట్టితి, వే విషమిడితో యలయించితో భార్యను దు
ర్భావమున సిరినిఁ గొంటివొ, యా వారిడు నన్నముఁ గొను నసువులిఁ కేలా. 406

క. భూనాథా! యిటులైనన్, దీనత జీవింపఁ గోరు దీతనువు జరా
దీనతను జీర్ణమై చెడు, లోనొల్లక యున్న వలువయుం బలె వింటే. 407

గీ. స్వార్థమునకును గాని దేహమును దీని, ముక్తబంధుండు గాఢవిరక్తుఁడునయి
యెటకుఁబోయెడు నదియుఁ దానెఱుఁగకుండ, దిగవిడుచునట్టివానినే ధీరుఁడండ్రు.

గీ. స్వయముగాఁగాని యన్యులవలనఁగాని, జాతనిర్వేదుఁడై యధోక్షజునిఁ జిత్త
మందు నెలకొల్పి తాను గేహమున నుండి, ప్రవ్రజింపఁగవలయు నరప్రవరుఁడు.

క. కావున నుత్తరదిక్కున, కీవు యథేచ్ఛముగఁ జను మహీనాయక! యీ
పై వచ్చు ప్రాయమెన్న గు, ణావళిఁ జెఱచు నికృష్టమై జనములకున్. 410

సీ. అజమీఢవంశజుండగు ధృతరాష్ట్రభూ, నేత ప్రజ్ఞాచక్షువై తెఱఁగున
ననుజుఁడౌ విదురుచే ననుబోధితుండయి స్వ, జనులందు స్నేహపాశముల ద్రుంచి
భ్రాతృ సందర్శితపథుఁడై ధృతిఁగొని, నిలయంబు వెడలి తా నిష్క్రమించె
ప్రస్థితుఁడగు నిజపతిని బతివ్రతయైన గాంధారియును ననుగమించె

గీ. మానవంతులకున్ ఘోరమైనయుద్ధ, మే తెఱంగున నుత్సాహమిచ్చుచుండు
నట్లి న్యస్తదండులకుఁ బ్రహర్షమిడెను, హిమనగంబునుదగఁ జేరిరిట్లువారు. 411

వ. అంత నట నయ్యజాతశత్రుండు సంధ్యవార్చి యగ్నులవ్రేల్చి తిల గో వస్త్ర హిరణ్యదానంబుల విప్రోత్తముల సత్కరించి గురువందనంబునకై గృహంబుసొచ్చి యందుఁ దండ్రులగు ధృతరాష్ట్ర విదురులను సుబలరాజతనయనుంగానక— 412

సీ. అచ్చట నాసీనుఁడైన సంజయు సముద్విగ్నాత్ముఁడగుచు యుధిష్ఠిరుండు
పరిశ్నించె నిట్లు గావల్గణీ! వృద్ధుఁడంధుండు నా మాజనకుం డెచటకుఁ
బోయెను మఱిహతపుత్రయార్తయు నగు,జనని పితృవ్యుండు సఖుఁడునైన
విదురుండు నెచటికి వెడలిరో తెల్పుము, హతబంధుఁడగుచు జాయాయుతుఁడయి

గీ. మందమతినైన యట్టినాయందుఁ గిల్బి, షమును శంకించుచునువిషాదమునమ్రగ్గి
సంజయా! ధృతరాష్ట్రుండుసరభసగతి, గాంగతోయములందుమునింగెనొక్కొ.

గీ. జనకుఁడగు పాండుభూపుఁడు స్వస్థుఁడగుడు, నకట! గతిలేని శిశువులమైన మమ్ము
బన్నములనుండిప్రోచినవారలాపితృవ్య లిటనుండియిప్డు వారెటకుఁజనిరి? 414

సూతుఁడు:—

గీ. స్నేహవిహ్వలతంజాలిచేత విరహ, వేదనన్ సంజయుండు సంపీడితుఁడయి
తనప్రభునిఁగానఁగా లేకధర్మజునకు, నొసఁగఁజాలక యుండెఁ బ్రత్యుత్తరంబు.

గీ. చేతితోనశ్రువులు తుడిచికొనియెట్లొ, యాత్మచేతనె యాత్మ నింపారఁబట్టి
నృపుని పాదంబులను దాస్మరించుకొనుచు,ధర్మసుతునికిట్టులుసమాధాన మొసఁగె.

క. పౌరవ! మీతండ్రులు గాంధారియు నేనిశ్చయమునదరలిచనిరో నే
నేర నదియెఱుఁగ నూరక, వారలచే వంచితుఁడను పార్థివముఖ్యా! 417

గీ. అంతఁ దుంబురుసహితుఁడై యమరమాని, తైన నారదుఁడచటికినరుగుదెంచె
సానుజుండగు సమవర్తిసూనుఁడతని, కెదురుసని మ్రొక్కిపూజించియిట్లుపలికె.

యుధిష్ఠిరుఁడు;—

చ. ధృతిదెలియంగనేరను పితృవ్యగతిన్ భగవత్స్వరూప! మ
త్పిత యిపుడెందుఁబోయె వివరింపఁగదే మఱి యక్కటక్కటా!
హతసుతయాట నార్తయగునంబయు నెక్కడికేగెనో కదా!
యతులకృపారసంబుఁ దొలుకాడఁగ నవ్విషయంబుఁ దెల్పుమా. 419

గీ. భాగ్యవశముననీవుఁ గన్పట్టితిపుడు, మా కపార దుఃఖార్ణవమగ్నులమగు
మమ్ముఁగర్ణధారుఁడువోలె మానివర్య!, పారదర్శివిగానఁ గాపాడుమయ్య. 420

నారదుఁడు:—

గీ. ఎవని కేని శోకింపకుమవనినాథ!, యీశ్వరవశంబు కాదొకో విశ్వమెల్ల
నాతఁడే కల్పుచుండును భూతములను, మఱియు నాతఁడె యెడఁబాపు మహిమమీఱి

సీ. పాలకయుతముగ నీలోకజాల మ, య్యీశుని యాజ్ఞ వహించుచుండు
ముక్కుఁగుట్టిన యుక్షములవోలె సతము వా, క్తంత్రిని నామబద్ధంబులగుచుఁ
బరమేశు వశములై వర్తిలున్ క్రీడోప, కరణంబులకుఁ బోలె నరవరేణ్య!
యొదవుఁ బ్రాణులకు సంయోగ వియోగము, లీశ్వరేచ్ఛం జేసి యెల్లప్రొద్దు

గీ. ధ్రువమిదియటంచు లేక యధ్రువమటంచు, లోకమును మదినిదలంపఁ బోకుమీవు
ధ్రువము నధ్రువమును గాదు భువనమిద్ది, బుద్ధిఁ బరికించి చూచిన భూపవర్య!

ఆ. వె. మోహజనితమైన స్నేహంబు విడిచితి, వేని నీపితరులకీవు దుఃఖ
మందఁదగదు కాన నజ్ఞానకృతమనో, విక్లబత్వమిపుడు విడువుమయ్య. 423

గీ. నన్ను విడనాడి కృపణులనాథులైన, వారలెట్లు వర్తింతురని వగవరాదు
పాంచభౌతికమగు కళేబరమిది, నృప!, కాలకర్మగుణవశంబు కాదె తలఁప. 424

క. జగతి నజగరగ్రస్తుని, పగిది నవశుఁడైనఁ జనుఁడు పరులను రక్షిం
పఁగ నెట్లు తాను దక్షుండగునో యారయుము మదిని నవనీనాథా! 425

క. కరసహిత ప్రాణులకును, గరరహితము లెన్న జీవికయగు మఱిఁ జతు
శ్చరణయుత జంతువులకును, జరణవిరహితంబు లెల్లఁ జను జీవికమై. 426

గీ. అందు నధిక జంతువులకు నల్పజంతు, వులును జీవికమై చెల్లుఁ బుడమి యందు
జీవమున కిట్లు జీవంబు జీవికయగు, నట్టి యీజగము భగవదాత్మకంబు. 427

ఆ. భోక్తృరూపమునను భోజ్యరూపంబునన్, బహువిధములుగా స్వమాయచేత
భూతభావనుండు పురుషోత్తముండు భా, సిలు సతంబు రాజతిలక! చూడు. 428

గీ. ఈపృథివి నా విభుఁడు కాలరూపుఁడగుచు, సురవిరోధి వినాశంబు జరుపు పొంటె
నవతరించి దేవతల కార్యమును దీర్చి, యింక నవశిష్టమును బ్రతీక్షించుచుండె.

ఆ. ఎంతకాలము భగవంతుఁ డిందుండునో, యంతదనుక యుండుఁడయ్య మీర
లాపరాపరేశుఁ డాత్మధామమునకు, జనినయంత మీరుఁ జనుఁడు దివికి. 430

గీ. తమ్ముఁడు స్వభార్యయైన గాంధారియుఁ దన, జాడ రా ధృతరాష్ట్రుండు చనె హిమనగ
దక్షిణమ్మున సప్తవిధముల గంగ, జాలుకొను చోటి ఋషుల యాశ్రమము చేర.

వ. సప్తర్షుల ప్రీతికై వేఱువేఱ వియన్నది సప్తప్రవాహంబులఁ బఱఁగుటం జేసి యాతీర్థంబు సప్తస్రోతంబనం బడు. ధృతరాష్ట్రుం డనుజ గాంధారీ యుతుండయి యందు

స్నానంబు గావించి యథావిధి నగ్నులవేల్చి తోయభక్షకుండును, బ్రశాంత మనస్కుండును, జితాసనుండును, జితశ్వాసుండు నైయిందియ షట్కంబు నివర్తించి యాహరణక్రియంబు బోలంగించి శ్రీహరిధ్యానంబునఁజేసి విధ్వస్త సమస్తరజస్తమస్సత్త్వ మలుండై మనంబును విజ్ఞానాత్మకయగు బుద్ధియందుంగూర్చి యా విజ్ఞానాత్మకబుద్ధిని క్షేత్రజ్ఞునియందుఁ జొన్పి క్షేత్రజ్ఞుని సర్వాధారంబగు బ్రహ్మంబునందు ఘటాకాశంబును మహాకాశంబునందుంబోలె నెక్కొల్పి మాయాగుణవాసనల రూపుమాపి మానసేంద్రియంబుల నిరోధించి సర్వవిధాహారంబులవర్జించి యిప్పుడు స్థాణువువలె వర్తించుచుండెఁ. సన్యస్తాఖిలకర్ముండగు నతని సమాధినిష్ఠ కంతరాయంబు కలుగకుండుఁగాక. 432

క. జననాథ ! నేఁటి కైదవ, దినమున స్వకళేబరంబు ధృతరాష్ట్రుం డో
య్యనఁ బాయంగలఁడు తనం, తన భస్మీభూతమగునుటజ మ్మును వంతన్. 433

గీ. పర్ణశాలాసమేతమై పతి కళేబ,రంబు వహ్నులచే సత్కారంబు దహ్య
మానమగుచుండ వెలుపలం జరఁగు సాధ్వి, పతి ననుగమింపనగ్ని లోఁబడున రేంద్ర!

క. విదురుం డయ్యాశ్చర్యా, స్పద విషయముఁ గాంచి పౌరవర్షభ! మొదలో
ముదమును శోకముఁ బెనఁగొనఁ,బడఁపడి యటనుండి తీర్థపరుఁడై యరుగున్. 435

క. అని తెల్పి నారదుండుం జనియెం, దుంబురునితోడ స్వర్గంబునకున్
మనమున మునివాక్యంబుల, నునిచి యుధిష్ఠిరుఁడు విడిచె నురుశోకంబున్. 436

## అధ్యాయము 14.

### ఉత్పాతశంకిత యుధిష్ఠిర పరిచింతనము

సూతుఁడు :—

ఉ. ద్వారవతీపురంబున సుబంధు సమూహ దిదృక్షచేత సు
శ్రీరమణీయగాత్రుఁడు విశిష్టచరిత్రుఁడునైన కృష్ణు నిం
పారు చికీర్షితంబు దెలియంగను దా నటుపోయి భార్గవా!
చేరఁడు క్రమ్మఱం బురికి జిష్ణుఁడు కొన్ని నెలల్ గతించినన్. 437

సీ. కురుసత్తముఁడు యుధిష్ఠిరుఁ డంత ఘోరరూ,పములైన భీకరోత్పాతములను
దారుమారగు ఋతుధర్మములను మహో, గ్రంబయి తోఁచు కాలగతిని
క్రోధ లోభానృతకుటిలమనస్కులై, పరఁగెడు నరులయొప్పని బ్రతుకును
గపటబాహుళ్య యుక్త వ్యవహారమున్, శాఠ్యమిశ్రంబగు సౌహృదమును

గీ. మాతృ పితృ సుహృద్భ్రాతృ దంపతుల కలహ,రీతులను,గన్యనమ్మతంఁడ్రిని బితరుల
సాకని సుతు, వేదవిముఖశిష్యసురులను, బ్రహ్మవాదుల శూద్రులఁగ్రమతఁగాంచె.

వ. ఏవంవిధంబులైన యత్యరిష్టసూచకములగు నిమిత్తంబులం బొడఁగాంచి కాల
వశంబున నుత్పన్నంబైన నరుల లోభా ద్యధర్మప్రవృత్తిం గనుంగొని నిజాను
జన్ముఁడగు భీమసేనుంగాంచి ధర్మసూనుం డిట్లనియె. 439

యుధిష్ఠిరుఁడు :—

ఉ. ద్వారవతీపురంబునకు బంధుసమూహ దిదృక్షుచేత సు
శ్రీరమణీయగాత్రుఁడు విశిష్టచరిత్రుఁడునైన కృష్ణు నిం
పారు చికీర్షితంబు తెలియంగను బోయి యదేమి హేతువో
మారుతి! రాఁడు పార్థుఁడు క్రమంబుగ నేడునెలల్ గతించినన్. 440

సీ. ఎవని కృపాయుక్తివివిధసంపదలును, రాజ్యంబు భార్యయుఁ బ్రాణములును
గులము ప్రజల్ లోకములు శత్రువిజయమ్ముం, బ్రాప్తంబులయ్యెనో మనకు నట్టి
శ్రీకృష్ణభగవానుఁడే కాలమునఁ దన, కేళీతనువు నుజ్జగింపనెంచు
దేవర్షిచేత నాదేశింపఁబడినట్టి, యాకాల మాసన్న మయ్యెనేమొ

గీ. ధీరసత్తమ! చూడుము దివ్యములును, భౌమములు దైహికములునై పరఁగుచు నతి
సన్నిహితము ఘోరము మోహజనకము నగు, భయము మనకు సూచించె
నుత్పాతములివి. 441

చ. అదరఁదొడంగె వామభుజమక్షియు నూరువు సారె సారెకున్
హృది జనియించుఁ గంప మివియిచ్చు ద్రుతంబున నాకు నప్రియం
బదె యుదయించుఁ బ్రొద్దుకెదురై యఱచున్ వఱ డగ్నివక్త్రియై
బెదరక బిగ్గఱన్ మొఱుఁగు వేపి మదున్ముఖమై వృకోదరా! 442

వ. మఱియుఁ బ్రశస్తంబులైన పశువులు నన్ను సవ్యభాగస్థునిఁ జేయుచున్నవి.
అప్రశస్తంబులగు గార్దభాదులు నన్నుఁ బ్రదక్షిణీకరించుచున్నవి. మఱియు
నో పురుషర్షభా! యశ్వరాజంబులు వాపోవుచున్నట్లు నాకు గోచరించుచున్నవి.
మృత్యుదూతలగు కపోతమును నులూకమును బ్రత్యూలూకమును గుత్సితశబ్దంబుల
నా మనంబును గంపింపఁజేయుచు సమస్తవిశ్వంబును శూన్యంబుగఁ దోపించు
చున్నయవి. ధూళిధూసరంబులగు దిక్కులును బరివేషంబులును లోకంబు
నాక్రమించుచున్నయవి. పర్వతసమేతంబై భూభాగము కంపించుచున్నయది.
గర్జితసమేతంబై నిరభ్రవజ్రపాతంబు గల్గుచున్నయది. రజంబుచే నుగ్రస్పర్శంబై

తమంబును గల్గించుచు వాయువు వీచుచున్నయది. మేఘపటలంబు లెల్లెడల భీభత్సంబుగా రక్తంబును గురియుచున్నయవి. మఱియు సూర్యుం డితరేతర గ్రహసమ్మర్దంబున హతప్రభుండై నభోభాగంబునఁ గన్పట్టుచుండె. సంకులంబు లగు భూతగణంబులచే రోదోంతరాళంబులు మండుచున్నట్లుండె. నదీనదంబులు, సరోవరంబులు, మనస్సులును సంక్షుభితంబులయ్యె. ఆజ్యంబునఁ బావకుండు ప్రజ్వలితుండు కాకుండె. ఈకాలంబేమి చేయనున్నదియోకదా! నిసువులు స్తన్యంబును గ్రోలకుండె. తల్లులు బిడ్డలకుఁ జన్నుఁ గుడుపకుండిరి. గోవులు కన్నీరుఁగార్చుచు గోష్ఠంబున నేడ్చుచుండె. వృషభంబులు దీనంబులై విగతహర్షంబులై యుండె. దేవతావిగ్రహంబు లేడ్చుచున్నట్లు స్విన్నంబులుఁ బ్రచలితంబులునై యుండె. జనపదంబులు గ్రామంబులు పురంబులు నుద్యానంబులు నాశ్రమంబులు జలాశయంబులును హతశ్రీకంబులై యానందం బొనంగక పాపదర్శనంబు లగుచుండె. కావున నీమహోత్పాతంబులచే ధ్రువంబుగ ననన్యగమ్యశ్రీసంపన్నంబులగు భగవత్పాదంబులచే హీనయై భూదేవి దుర్భగయయ్యెనని నేఁదలంతు నని ధర్మజుండు చింతాక్రాంత స్వాంతుండై యుండె. 443

చ. ద్విజవర! యిట్లరిష్టములు పెక్కులు గాంచి విషణ్ణుఁడైన ధ
ర్మజుకడ కప్డు యాదవపురంబుననుండి రయంబునం గపి
ధ్వజుఁ డరుదెంచి యగ్రజు పదంబులవ్రాలె స్వలోలలోచనాం
బుజములనుండి బాష్పజలపూరము వెల్లు స్రవింప వ్యగ్రతన్. 444

ఉ. అప్పుడు ధర్మసూతి తనయద్దుల వ్రాలిన తమ్ముఁగుట్ట దా
నెప్పటియట్లు కాక ధృతియెల్లఁ దొలంగి వివర్ణుఁడై యెదో
చెప్పతరంబుకాని వ్యథఁజెందుటెఱింగి వినన్ సుహృజ్జనం
బప్పురుహూత సూను నిటులడ్గె స్మరించుచు నారదోక్తమున్. 445

యుధిష్ఠిరుఁడు:—

సీ. ద్వారకన్ యదుభోజదాశార్హ సాత్వతాంధకవృష్ణులు మనబాంధవులుసుఖులె?
మాతామహుండును మాన్యుండునగు శూర, సేనునకుందగ క్షేమమె కద?
అనుజసమేతుండు మనమాతులుఁడునైన, యానకదుందుభి హర్షయుతుఁడె?
తత్సుతుల్ మేనయత్తలు మనకేడ్వురుం, గొడుకులతోఁగూడఁ గుశలులె కద?

గీ. సౌఖ్యముప నున్నవారలె? సన్నుమలగు, దేవకీముఖ్యకాంతలు జీవితుండె
యుగ్రసేనుఁ డసత్సూనుఁ డోజసతని, యనుజుఁడగు దేవకుండున్నె? మనికిగల్గి.

గీ. కుశలమే? కృతవర్మ కక్రూరునకు జయంత గద సారణులకును హార్ద్యమెకద?
సత్యజిత్ప్రభృతికులైన సకల యాదవులకు భద్రమె? ఫల్గుణా! తెలియఁ బలుకు.

సీ. భక్తవత్సలుఁడున్ భగవంతుఁడునగు, రాముఁడు చెలంగుచున్నాడె క్షేమగతిని
నఖిలవృష్ణులలోన మహారథుండు, యుద్ధశౌండుండు ప్రద్యుమ్నుఁడుత్సుకుండె. 448

సీ. చారుధేష్ణసుషేణులు జాంబవతి త
నూజుఁడగు సాంబుఁడుం దదన్యులగు కృష్ణ
సుతవరేణ్యులుం బుత్రసం యుతులు ఋషభ
ముఖ్యులున్నారె? సమ్మోదపూర్ణులగుచు 449

క. శ్రుతదేవోద్ధవ ముఖ్యులు, చ్యుతానుయాయులుఁ బ్రమోదయుక్తులె? హార్దా
న్వితులే? బలకృష్ణభుజా, శ్రిత నంద సునందముఖులు ప్రియతమభక్తుల్. 450

సీ. బంధుభావ సుహృద్భావబంధురతర
హృదయముల సొంపుమీఱెడు యదువరేణ్యు
లెల్లరున్ మనకుశలంబు నెల్లవేళ
లందును స్మరించుచుందురే? యన్న! చెపుమ. 451

మ. వరదుం డాశ్రితవత్సలుండు హరిసద్బ్రహ్మణ్యుఁ డీశుండు స
త్కరుణా సంగతి నెల్ల లోకములకుం గల్యాణమున్ క్షేమముం
బరమాహ్లాదముఁగూర్చు పూన్కిని సుహృద్బంధువ్రజోపేతుఁడై
వెరవొప్పంగ సుధర్మయందు సుఖితంబొంపారునే? ద్వారకన్. 452

ఉ. పాయని నెయ్యమొప్పబలభద్రయుతుం డయి యాదిపూరుషుం
డా యదువంశతోయనిధియందు వసించుచునుండెఁగా? తదీ
యాయత పీవరోజ్జ్వల భుజార్గళ గోపితమైన వీట నా
హా! యదుపౌరులెల్లరు సమర్చితులౌచుఁ జెలంగుచుం డ్రిలన్. 453

వ. మఱియుఁ దత్పాద శుశ్రూషణ భాగ్యమునం జేసి సత్యాషోడశ సహస్ర
యోషిల్లలామలు, మహాపౌరుష కార్యంబులఁ జేయుచుఁ బరమానందంబునఁ
గ్రీడించుచుందురు. 454

చ. అతని భుజాబలంబ తమకాదరువై పొసఁగన్ సుపర్వసం
తతుల నని౦ జయించి సురనాథసతీతిలకోచితప్రశ
స్తతర విశిష్టభోగములఁ దారు హరింతురు సారెకున్ మహో
ద్ధతి నకుతోభయాత్ములయి ధన్యులు యాదవ వీరులారయన్. 455

క. శౌరిభుజాబలమున బ్రం,దారక వర్యోచితన్ సుధర్మన్ బల మే
పారఁ బదాక్రాంతం గాఁ, దా రొనరించెదరు ధీరతన్ యదువీరుల్. 456

ఉ. వన్నెఁదొఱంగినట్లు కనవచ్చుచునుంటివి నాదుచూడ్కి కో
యన్న! భవచ్ఛరీర మి దనామయమై పొలుపారుచున్న దే?
మన్ననమాని నిన్ను నవమానముఁజేసిరొ? యెల్ల బంధువుల్
ఖిన్నమనస్కుఁజేసి తమగేహములం జిరకాలముండుటన్. 457

చ. అతిపరుషాప్రియశ్రుతిభయావహవాక్యకశాభిఘాత తా
డిత మతివైతొ? యిట్లటమటింతువు యాచకకోటికిం బ్రతి
శ్రుతమగు నర్థముం బలుకుచొప్పున నీక దురాశపెంపునన్
వితథులఁజేసి నెట్టితివొ? వీరవతంసమ! నాకుఁజెప్పుమా. 458

ఆ. విప్రు బాలు మొదవు వృద్ధు రోగిని స్త్రీని, శరణుఁజొచ్చినట్టి సత్త్వములను
మొదట శరణమిచ్చి పదఁపడి హింసింపఁ, బూనినాఁడవో చెప్పుమ బిరాన. 459

ఆ. కవయరాని వారిఁ గవసితివో మఱిఁ, ద్రోవనోడితొ? యతి దుర్బలులకు
వృద్ధబాలగురులు వెలిగాఁగ సంభోజ్యముల భుజించి నాఁడవో? తెలుపుమ. 460

చ. కడఁగి జుగుప్సితంబయినకర్మ మొదేని నొనర్చి నాఁడవో?
కడుఁబ్రియుఁ డాత్మబంధుఁడు సఖైకనిధానమునైన కృష్ణునిన్
విడుచుటఁజేసి శూన్యమతి "వీఁడెఁడినైతి" నటంచు నిప్డు నీ
వెడఁదఁ దలంచు చుంటివని యెంతు మఱొంట జనించునే వ్యథల్. 461

---

## అ ధ్యా య ము 15.

### శ్రీ కృష్ణ నిర్యాణము

శుకుఁడు:—

చ. జనపతి యీగతిన్వివిధశంకలకిక్కగు నాత్మరూపమున్
గనుఁగొని పెక్కుభంగుల వికల్పముఁజేయుచుఁ బ్రశ్నఁజేయ ఫ
ల్గునుఁ డల కృష్ణమిత్త్రుఁడు ముకుందవియోగభవార్తి శోషితా
ననహృదయాబ్జుఁడై వగపునన్ నిహతప్రభుఁడయ్యె నయ్యెడన్. 462

క. మానసమున నాహరినే, ధ్యానించుచు ననిమిషేశ్వరాత్మజుఁడు పరి
మ్లానుండై ప్రతివచనముఁ, దా నొసఁగన్ నేరకుండెఁ దహతహపడుచున్. 463

మ. పృథుశోకంబును నాచి యొట్టెటులొ యావిర్భూత బాష్పాంబువుల్
వ్యథమైఁ బాణితలంబునందుడిచి యప్రత్యక్షుఁడౌ కృష్ణు సా

రథికృత్యాదికహర్ష సంజనక తత్ప్రద్రాగాదులూహించు చో
లి ధరాకాంతున కర్జునుండిటులు వక్కాణించె గద్గదవ్యాహృతిన్. 464

అర్జునుఁడు:—

క. సురవిస్మితి కరమగు మద్గురుతేజం బపహృతంబుగాఁ జేసి మహీ
వరబంధురూపుఁడగు శ్రీహరిచేతఁ బ్రతారితుండ నైతి నవశతన్. 465

ఆ. ధనవిహీనజనుఁడు దా మృతప్రాయుఁడు, గాఁ దలంపఁబడె మురారి గృష్ణు
క్షణవియోగమున సకలలోక మప్రియ, దర్శనంబ యయ్యె ధరణినాథ! 466

చ. ద్రుపదగృహాభ్యుపాగతమదోద్ధత భూపతి దుష్ప్రతాప మ
ట్లపహృతమయ్యెఁ గాదొకొ! స్వయంవరమం దురుమత్స్యయంత్రమున్
నిపుణత సజ్యచాపమున నెట్టఁబడెన్ మనచేఁ గొనంబడెన్
ద్రుపదతనూజ భక్తవరదుండగు నా హరి యాశ్రయంబునన్. 467

ఉ. ఖాండవ మేనొసంగితిని గాదె? సుపర్వగణాభ్యుపేతు నా
ఖండలు భండనమ్మున నఖండబలంబు చెలంగ గెల్చి యు
ద్దండరిపుప్రకాండములు తల్లడమందఁగ నుల్లమందు న
య్యండజవాహనుండు మనయండయియుండుటఁ జేసి యగ్నికిన్. 468

చ. మయుఁడు కృతజ్ఞతాకలితమానసుడై మనకుం బ్రభూత వి
స్మయకరభూరిశిల్పమయమాయలఁ జెంపెసలారు పెన్సభన్
నయమున నిచ్చె నధ్వరమునం గొని తెచ్చిరి కానుకల్ కకు
ప్చయముల రాజులెల్ల మన సన్నిధి శ్రీహరియుండుటంగదా. 469

ఉ. బంధురకీర్తి సాంద్ర! జనపాలశిరోర్చితపాదుఁడా జరా
సంధుని నీదుతమ్ముఁడు గజాయుతసత్త్వుఁడు ప్రోల్లసత్ప్రరి
స్పంధిహరుండు భీముఁడటఁ జంపె విమోచితుఁలొచుఁ దద్విని
ర్బంధితరాజులిచ్చిరి యుపాయనముల్ హరిదండనుంటనే. 470

చ. హరిపదయుగ్మమందుఁ దనయశ్రులు చిందఁగఁ జేసినంత నీ
గరిత, మఖాభిషేకనుతకమలసత్కబరీభరంబు నె
వ్వరు ఖలులొచు వీడ్వడఁగఁ బట్టిరొ కొల్వున నట్టివారి సుం
దరులు విముక్తకేశలు నరనాథలు నైరిగదా? నరాధిపా! 471

సీ. దుర్యోధనుండంప దుర్వాసుఁడొక్కనాఁ, డయుతశిష్యులతో మహాటవికిని
గుడిచియుండఁ మమును గూర్చుండవచ్చి బోనముఁ బెట్టుమని చెప్పి స్నానమునకు

నదికేఁగ నపుడు కృష్ణప్రార్థితుండయి, యరుదెంచి తోన శాకాన్న శేష
మారగించినయంత నన్నదీమగ్నుల, కడుపులెల్లను నిండఁగాఁ ద్రిలోక
గీ. ములును నత్యంతసంతృప్తములుగఁ నెంచి, తిరిగిచూడక యందుండియరిగి రెల్ల
వారు నీరీతిమునిశాప భయమువాపి, మనలఁ బ్రోచెనుగాదె? యమ్మాధవుండు.

శా. గౌరీయుక్తుఁడు శూలపాణి రణరంగక్షోణిఁ దద్దత్తగం
భీరోదార మహోగ్రతేజమున నే విస్మాపితుండౌచు నిం
పారం బాశుపతంబొసంగె మఱి దిక్పాలుర్ నిజాస్త్రంబులన్
దారై యిచ్చిరి గొంటి నీ తనువునన్ నాకేశపీఠార్థమున్. 473

మ. సురలోకంబున నే విహారపరతన్ శోభిల్లుచుండంగ మ
ద్వరగాండీవధనుర్విభూషితభుజాదండంబు నింద్రాదిని
ర్జరవీరోత్తము లాశ్రయించిరి యుదగ్రారాతులం ద్రుంప శ్రీ
వరుపేర్మింగదె చేరె నవ్విభుఁడు సన్మానించి స్వస్థానమున్. 474

మ. హరిబాంధవ్యముచేత నేకద యనంతాపారమున్ ఘోరదు
స్తర సత్త్వోగ్రమునైన కౌరవమహాసైన్యాంబుధిన్ నే నొకం
డ రథారూఢుఁడ నౌచుఁ జేరి తదగణ్యాంబైన తేజంబునున్
స్ఫురదుష్ణీషచలాంచలంబులును గోవ్యూహంబులుం దెచ్చితిన్. 475

మ. ఘనరాజన్యరథాళియుక్త సముదగ్రద్రోణభీష్మార్కజనం
దనశల్యాదిచమూసమూహములలో నాముందఱన్నిల్చి స్వం
దనమధ్యస్థితయోధనాథుల సముద్యన్మానసోత్సాహశ
క్తిని దేజంబును నాయువుం జెఱుచుఁ జూడ్కిన్ శౌరి నన్ దేర్చుచున్. 476

మ. హరిబాహార్గళ గోపితుండనగు నన్నాచార్య భీష్మార్కజుల్
గురుపుత్రుండు సుశర్మ సైంధవుఁడు శల్యుం డాదిగా వీరశే
ఖరులెల్లం గెలుచన్ నిగిడ్చిన,యమోఘాస్త్రంబులుం దాక వా
సురమాయారచితక్రియల్ నృహరిదాసుం బోలె వ్యర్థంబులై. 477

ఉ. ఎవ్వనియడ్గుదమ్ములు భజింతురు సాధులు మోక్షసిద్ధికై
యవ్విభు జ్ఞానదుం గుమతినై నియమించితి సూతకర్మలన్
నెవ్వగ శ్రాంతవాహనుఁడ నేను మహీస్థలినుండ శాత్రవుల్
క్రొవ్వి రథస్థులయ్యు ననుఁ గొట్టరు తత్ప్రతిభాభిభూతులై. 478

చ. కురువర! పార్థ! యర్జున! సఖుండ! యటంచు జగన్నియంత శ్రీ
హరి యఖిలేశ్వరుండు ప్రియమారఁగ నిచ్చలు నన్నుఁ జీరు నా

సురుచిర చారుసుస్మిత విశోభితముల్ మధురంబులైన సుం
దరతర నర్మవాక్యములు నామనముం గలఁచున్ స్మృతంబులై. 479

చ. పడుకల నాటలం బనులఁ బాటల బోనములందు మాటలన్
నడకలఁ గూడ నైక్యము ఘనంబడ నోచెలికాడ ! సత్యయు
క్తుఁడవని మేలమాడిన ననుగోపము సేయక శౌరియెప్పుడున్
గొడుకును దండ్రికైవడి సఖున్ సఖుఁడుం బలెఁ దప్పఁగాచెడున్. 480

చ. సుహృదుఁడు నాప్తుడుం బ్రియుఁడుఁ జుట్టమునైన విభుండు లేమిఁ జే
సి హృదయశూన్యవృత్తినయి శ్రీహరి యంతిపురంబుఁ బ్రోవనెం
చి హతమనోరథుండనయి చిత్రముగా విజితుండనైతిఁగా
మహిళయుఁబోలెఁ ద్రోవ నధమాధమగోపజనాళిచే నృపా ! 481

చ. ధనువదె యమ్ములల్లవె రథంబదె యశ్వములల్లవే కనుం
గొన నృప ! యాప్రశస్తరథికుండనె శ్రీహరిలేమి నవ్వియె
ల్లను భసితాజ్యముం గుహకలబ్ధము నూషరభూమిబీజమ
ట్లునయి క్షణంబులోపల నిరటుల్ వితయయ్యెను బెక్కులేటికిన్. 482

సీ. అవనీతలేశ ! నీయడిగిన మనబంధు,జనులు మానీశ్వరశాపసంభ్ర
మమున దూషితులయి మద్యపానవిజృంభ, మాణమదోపేత మానసముల
ద్వారకాపురమున నేరకాముష్టుల, నుద్ధతిమీరఁగా నొండొరువుల
మున్నెఱుంగనివారు వోలెఁ జంపుకొనంగ, నలువురేవురటన్మి, గిలిరి తలఁపఁ

గీ. ప్రాయికంబుగ నిది భగవంతుఁడైన
కృష్ణుని విచేష్టితంబని హృదిఁదలంతు
నొండొరులఁజంపుకొను మత్స్యయొండొరులను
బెంచుకొనును భూతంబు లవ్విభునియాజ్ఞ. 483

గీ. జలములవసించువానిలోపలను బెద్ద,వి చిఱువాని భక్షించెడువిధముఁదోఁప
బలరహితులైనవారిఁ బ్రబలులు వారిఁ, దదధికులుఁజంపిరిట్లు మిథఃప్రవృత్తి. 484

ఉ. ఆవిభుఁడీగతిన్ బ్రబలులా యదువీరులచేత దుర్బలుల్
చావ హతావశిష్టులనుస్వాంతములందుఁ బరస్పరద్విష
ద్భావము రేగఁగా దమకుఁదామయిచచ్చెడునట్లు సేసి తా
నీవసుధాభరంబు హరియించె క్షణంబునఁ బార్థివోత్తమా! 485

చ. కురువర దేశకాలములకున్ దగునట్లు పొసంగుచున్ హృదం
తర గత ఘోరతాపశమనంబొనరించుచు నొప్పునట్టి యా

హరివచనామృతంబె యనయంబు స్మరించెదు నాకుఁ గర్ణగో
చరమగుచుండి నాహృదయసారము వే హరియించు నిచ్చలున్. 486

సూతుఁడు:—

క. అని యాచందంబున నతి, ఘనమగు సౌహార్దమున జగత్పతియగు కృ
ష్ణునిఁదలఁచెడి కవ్వడిమతి, జనసుతమున్ విమలమున్ బ్రశాంతమునయ్యెన్. 487

సీ. హరిచరణాంబుజధ్యానసంవర్ధిత, నిర్భరగురుభక్తినిష్ఠచేత
కామాదికాఖిలాఘములు దొఱంగ ని, శ్చలబుద్ధిఁ జెలువారు సవ్యసాచి
భూరిసంగరమూర్ధమున భగవద్గీత, మై కాలకర్మతమోఽవరుద్ధ
మైనజ్ఞానమును దానాకలింతకుఁ దెచ్చి, కొనియెఁ గ్రమ్మఱ ననుకూలబుద్ధిఁ

గీ. బ్రకటమైన బ్రహ్మజ్ఞానమై భవమునఁ, ద్రెంచి సంశయగ్రంథులు ధీరుఁడగుచుఁ
దొలఁగఁగనవిద్య నైర్గుణ్యకలితుఁడు భవ, శూన్యుఁడునగుచుఁ గ్రీడి విశోకుఁ
డయ్యె. 488

క. హరి స్వగతిం జెందుట య, బ్బురముగ యదుకులము నాశముం బొందుటయున్
స్థిరమతి యుధిష్ఠిరుఁడు విని, సురలోకపథంబునందుఁ జొనిపె మనంబున్. 489

ఉ. అంత ధనంజయోక్తముగ నాభగవద్గతిచందమున్ విషా
దాంతగభీరయాదవకులార్ణవనాశము నాలకించి యే
కాంతనితాంతభక్తి మెయి నచ్యుతునందు మనంబుఁ జేర్చి తాఁ
గుంతి యగాధసంసరణకూపవినిర్గతయయ్యె ధన్యతన్. 490

క. ములుముల్లుచేతఁ బలె ని, మ్ములహరి యేతనువుచేత భూభారంబున్
దొలఁగించె దాని విడిచెన్, దలఁపఁగనవి రెండు నీశునకు సమములె కా. 491

గీ. ఓలి మత్స్యాదిరూపముల్ తాల్చి విడ, నాడె నవి నర్తకుఁడుఁబోలె నవ్విభుండు
వసుమతీభారముం బెడబాపినట్టి, యాకళేబరముం ద్యజియించెనిపుడు. 492

చ. హరి శ్రవణీయసత్కథుఁ డుదారయశుండు ముకుందుఁ డెప్పుడీ
ధరను స్వదేహయుక్తముగఁ ద్యక్తముఁ జేసెనొ విప్రులార! స
త్వరగతి నాఁడె చేరెఁ గలి తా నవివేకపరీతచిత్తులౌ
నరుల కమంగళంబుల నొనర్చెడువాఁడయి భూతలంబునన్. 493

వ. అంత యుధిష్ఠిరుండు పురంబున, రాష్ట్రంబున, గృహంబున, మనంబున లోభాసత్య హింసా కౌటిల్యాద్యధర్మచక్రంబగు కలి ప్రవర్తనంబుఁగని సురలోకగమనంబునకు నుద్యుక్తుఁడయ్యె. 494

క. అవనీశ్వరుఁ డంత సుగుణ, నివహంబుల నాత్మసము వినీతుం బౌత్రున్
స్తవనీయు నబ్ధిమేఖల, యప్పు మహి కభిషిక్తుఁ జేసె హస్తిపురమునన్. 495

గీ. అట్లు మధురాపురంబున నా నృపుండు, శూరసేనకుమారు వజ్రుని నిలిపియు
నేమమలరఁ బ్రాజాపత్యనామకేష్టిఁ, జేసి తనయందు నగ్నులఁ జేర్చికొనియె. 496

క. ధరణీనాథుం డచ్చట, నిరహంకారుఁడును మఱియు నిర్మోహుఁడునై
వెరవొప్పంగ దుకూలాభరణంబుల విడిచె ముక్తబంధనుఁ డగుచున్. 497

వ. మఱియు వచనంబును మనంబునందును, మనంబును బ్రాణంబునందును, బ్రాణంబు నపానమందును, నపానంబును మృత్యువునందును, నామృత్యువును బంచభూతైక్యదేహంబునందును హుతంబుఁ గావించె. ఆ పంచత్వంబును గుణత్రయంబున వ్రేల్చి, యా గుణత్రియంబు నేకత్వంబునఁ జొప్పించి యిట్లు సర్వంబు నవ్యయంబును నాత్మరూపంబునగు బ్రహ్మంబునందు లయంబు గావించె. 498

ఉ. చీరవసానుఁడుం గడు వశీకృతచిత్తుఁడు మౌనియున్ నిరా
హారుఁడు ముక్తమూర్ధజుఁడునై శమనాత్మజుఁ డయ్యెడన్ నిజా
కారముఁ దోఁడుతో జడునికైవడి భూతమువోలె వెఱ్ఱియు
ట్లూరక ప్రేక్షకావళికి నొయ్యనఁ జూపుచుఁ దా విరాజిలెన్. 499

గీ. చీఁకువలె నెవ్వరిఁ గనక చెవిటివోలె, నేదియు వినక విశ్వంభరేశ్వరుండు
పుణ్యచారిత్రులగు తన పూర్వులెలమిఁ, జనిన యుత్తరదిగ్భాగమునకుఁ జనియె. 500

గీ. సుదృఢనిశ్చయులగుచుఁ దత్సోదరు లప్పు, డనుసరించి రెల్లరును నిజాగ్రజన్ము
హృదిఁ బరబ్రహ్మమును స్మరియించు చెవరుఁ, దిరిగి సంసృతిఁ జొర రుదగ్దిశకుఁ జనిన.

సీ. తలఁప నధర్మంబు చెలిగాఁ జెలఁగు కలి, చేత సంస్పృష్టులు నస్పృష్టులునయి
ప్రజలు సర్వార్థముల్ పరఁగ నిర్వర్తించి, కృష్ణుని పాదపంకేరుహంబు
శరణంబు తమకని స్వాంతంబునం దను, ధ్యానంబుఁ జేసిరి తాపసులార!
తద్ధ్యానసంవర్ధితవిశిష్టభక్తి శు, ద్ధాత్ములై కృష్ణు పాదంబునంద
గీ. సతతమేకాగ్రమతులై విషయరతులగు, కుమతులకుఁ బొందరాని వైకుంఠగతిని
వ్యపగతరజస్తమోగుణమైనయట్టి, యాత్మచేతన పడసి రయ్యవసరమున. 502

గీ. జ్ఞానియగు విదురుం డధోక్షజునియందు, స్వాంతము న్నెలకొల్పి ప్రభాసమునఁ ద్య
జించి తనదేహమును గృష్ణచిత్తుఁడగుచు, స్వపదమును బొందెఁ బితృగణసహితుఁ
డగుచు. 503

క. తనయెడ పతులయుపేక్షం, గని భగవంతుఁడగు నాజనార్దనునందున్
వినియతమతిఁ జొనిపి ద్రుపద, తనయ తదీయమగు శుభపదంబుం బొందెన్. 504

చ. అకలుషమైన శక్తి నవ్వయం బెవండీ భగవత్ప్రయాణరూ
పక ఘనపుణ్యగాథయును పాండుతనూజుల సంప్రయాణ ము
ద్దిక వినునో యతండు జగదీశ్వరుఁడౌ హరియందు జ్ఞానదీ
పకమగు భక్తిఁజెంది యనపాయ మహోత్తరసిద్ధిఁ బొందెడున్. 505

---

## అధ్యాయము 16.

పరీక్షిత్పట్టాభిషేకము, ధరణీధర్మసంవాదము

సూతుఁడు:—

చ. పదఁపడి ధీరతం బరమ భాగవతుండు పరీక్షితుండు భ
ద్రదమగురీతినేలె మహీసురతాపసముఖ్యుల శిక్షఁజేసి సౌ
ఖ్యదుఁడగుచుండి తజ్జనన కాలమునందును జాతకర్మకో
విదులు వివేకభూషణులు విప్రవరేణ్యులు చెప్పినట్లుగన్. 506

గీ. ధరణిపాలకుఁ డాతఁడు త్తరుదుహిత నిరావతిం బెండ్లియాడి యద్దేవియందు
నెలమి జనమేజయాది పుత్రుల నలువుర, నాత్మతుల్యులఁగల్గించె నధికబలుల. 507

మ. కురువర్యుండు పరీక్షితుండు విబుధుల్ గొండాడ శారద్వతున్
గురునింగా నొనరించి దక్షతమెయిన్ మూఁడశ్వమేధంబులన్
గరిమంజేసెఁ బ్రభూరిదక్షిణలతో గంగాతటిన్ నేత్రగో
చరులై తా రదుదార నొప్పెనఁగి రాజన్యంబులన్ వేలుపుల్. 508

ఉ. వీరజనోత్తముండు పృథువీరమణుండు పరీక్షితుండు స
ద్భూరియశుండు దిగ్విజయమున్ బొనరించెడుపట్ల నొక్కచోఁ
గ్రూరకఠోరపాదహతి గోమిథునంబును గాలఁదన్ను దు
ర్వారుని రాజవేషధరు శూద్రుని నొక్కని నిగ్రహించెఁదాన్. 509

శౌనకుఁడు:—

ఉ. దిగ్విజయంబుఁ జేయుతఱి దేనికినై కలి నిగ్రహించె భూ
భుగ్వరుఁ డట్లు కర్కశతఁ బూనుచు గోవును గాలదన్ను తా
దృగ్విధ రాజవేషము ధరించిన శూద్రుఁ డతం డెవండు? స
మ్యగ్విధి నయ్యుదంతము మహాత్మక! మా కెఱిఁగింపఁగాఁ దే. 510

గీ. హరికథాశ్రయమగునేని నట్లుకాక, తచ్చరణవారిరుహమరందమును గ్రోలు
పుణ్యపురుషులకథలఁ దెల్పునదియేనిఁ, బలుకు కలినిగ్రహము మహాభాగ!
మాకు. 511

సీ. మృత్యువశులు స్వల్పాయుస్సమేతులునయి, మోక్షముం గోరునరులకుఁ బోల్చి చూడ
నాయురాదిదుర్వ్యయమును జేయునన్యములగు గర్హ్యతరాలాపములఁ బనేమి?
గీ. కడఁక మైపశువిశసనకర్మమందు, సూత! యిట కంతకుండు నాహూతుఁడయ్యె
నంతకుండెంతదనుక నిందలరునెందు, నంత మొందఁడేయొక్కఁడునంతదనుక. 513
ఆ. పరమమునులచేత భగవంతుఁడాహూతుఁ, డయ్యె నిందుకొఱకె యరసిచూడ
భళి! నృలోకమందె భక్తిఁ గ్రోలంబడుఁ, దలఁప హరికథాసుధారసంబు. 514
క. మందుఁడు, మందప్రజ్ఞుఁడు, మందాయుష్కుండునైన యమర్త్యునకును రా
త్రిందివములు వ్యర్థమగు ని,ద్రం దుష్కర్మములచేతఁ బ్రాయము సొరిదిన్. 515

సూతుఁడు:—

చ. నిరుపముఁ డాపరీక్షిదవనీరమణుండు స్వసైన్యగుప్తభూ
సురకురుజాంగలంబులను జొచ్చి వడిం గలి యున్నవార్త చె
చ్చెర ననతిప్రియంబగుచుఁ జేరఁగ సంగరశౌండుఁడొట స
త్వరమ శరాసనంబుఁ గొనెఁ దత్కలిపూరుషనిగ్రహార్థమై. 516
ఉ. శ్యామలవాజియోజితము సమ్యగలంకృతసర్వభాగ ము
ద్దామమృగేంద్రకేతన ముదగ్రమునౌ రథమెక్కి యారథి
గ్రామణి స్యందన ద్విప తురంగ పదాతియుతస్వవాహినీ
గ్రామముతోడ వెల్వడెఁ బురంబును దిగ్విజయాభిలాషియై. 517
వ. ఇట్లు పురంబు వెలువడి భద్రాశ్వకేతుమాల భారతవర్షంబులను నుత్తర కురుదేశంబులను గింపురుషాదివర్షంబులను జయించి వానివలనఁ బుష్కల ధనప్రదాన పూర్వికయగు సపర్యంగొనియె. 518
సీ. అచ్యుతభూరిమాహాత్మ్యసూచకములై, యలరారుచుండు మహాత్ములైన
స్వీయపూర్వులయశశ్శ్రీవైభవంబు ల,శ్వత్థామ యస్త్రతేజంబువలన
హరి తన్నుఁ గాచుటయాదవపాండవ, దృఢమైత్రియున్ వాసుదేవునందు
నవ్వారిభక్తియు నవ్వారినటనటఁ, గీర్తింపఁబడ నాలకించుచుఁ బ్రథ
గీ. మానయశుఁడతిసంతుష్టమానసుండు, ప్రీతిసంభృతహృదయుండునై తనర్చి
భూరివిత్తంబులున్ వస్త్రములును రత్న,హారములు పుష్కలంబుగ వారికిచ్చె. 519
ఉ. సారథియున్ సభాపతియు సంగడికాడుఁ బ్రియుండు బాంధవుం
డారయ దైవముం గురుఁడునై హరి నెయ్యురఁ బాండుసూనులన్

జేరి తమిం బొనర్చిన విశేషములన్ వినుచుం జగంబులా
శౌరికి మ్రొక్కుటం దెలిసి సత్పరతిం బతి కృష్ణునందొగిన్. 520

క. అనుదినము స్వపూర్వులవ, ర్తన మనువర్తించు నా ధరాపతి కొకచో
టను జరిగిన యాశ్చర్యం, బును వినుపించెదను వినుము మునికులముఖ్యా.

గీ. ఏకపదమునఁ దిరుగాడు వృషభరూపుఁ, డైన ధర్ముఁడు నష్టసంతానయైన
తల్లిగతి నశ్రుముఖియై హతప్రభయగు, నవని గోరూపిణిం గాంచి యడిగె నిట్లు. 522

ధర్ముఁడు :—

మ. కట! నీమేన ననామయంబె కద? యో కల్యాణి! నెమ్మోము డ
య్యుట నత్యంతవివర్ణమై పరఁగె దయ్యో! లోపలం జిత్తసం
కట మేదో పడుచున్నయట్టు లిచటం గన్పట్టె దీ వట్టి యా
రటముం బొందఁగ నేమికారణమొ? భద్రాకార! వాక్రువ్వుమా. 523

శా. దూరస్థుండగు నెవ్వనే నొకని బంధుం గూర్చి శోకింతువో!
భీరున్ బాదవిహీను నేకపదు నన్వీక్షించి దుఃఖింతువో!
ఘోరా! శూద్రజనోపభుజ్యవగు నీకై నీవు దూపిల్లెదో!
ఆరాదాహృతయజ్ఞభాగుల కమర్త్యశ్రేణికై కుందెదో! 524

సీ. పర్జన్యదేవుండు వర్షింపకున్కి నా, పన్నులౌ ప్రజలకై వందురుదువొ!
రక్షింపఁబడక క్రూరతఁ బీడితాత్ములౌ, స్త్రీబాలురం జూచి చింతిలెదవొ!
కువిధియుక్తబ్రాహ్మకులమున దిగులొందు, వాగ్దేవికొఱకునై వనటఁ గందొ!
ఎన్న నబ్రాహ్మణ్యనృపకులంబున వెతఁ, గొను కులాగ్ర్యులకునై కుములుచుందొ

గీ. కలిపరిస్పృష్టహృదయులౌ క్షత్రియులను, బ్రబలవాయుప్రకంపితరాష్ట్రములను
అన్నపాన మైథున శయనాసనవశులైన జీవులం బొడగాంచి యటమటింతొ! 525

మ. అవనీ! తావకభూరిభారమును దేవాభ్యర్థనం దీర్పఁగా
నవతారంబు ధరించినట్టి హరి తా నంతర్హితుండౌడు ను
త్సవదాయ్యంఘ్రిసరోజుఁడౌ యతనిచే సంత్యక్తవై ముక్తివై
భవధిక్కారి తదీయ కర్మముల సంభావించి చింతిల్లెదో! 526

ఉ. అమ్మ! త్వదాధిమూలమగు నయ్యది యెయ్యదొ నాకుఁ దెల్పుమా
యుమ్మలికమ్ము హెచ్చ నిటులుంటివి కార్శ్యత దోఁప దేన ది
వ్యమ్మయి దేవకోటులకు నర్చితమైన త్వదీయభూరిభా
గ్యమ్ము మహాబలీయమగు కాలముచేఁ బరిభూతమయ్యెనో. 527

ధరణి :—

గీ. లోకసుఖదంబులైన నాలుగుపదముల, నిత్యమును సంచరించెదు నీవు ధర్మ!
నన్ను నెయ్యది యడిగెదో నయవిధాన, మెసఁగ నయ్యది సర్వమీవెఱుఁగుదు కద.

సీ. సత్యంబు దయయును శౌచంబు క్షమయును, త్యాగంబు సంతోషమార్జవంబు
శమము దమంబును సమత తపంబును, శ్రుతముఁ దితిక్షయు స్మృతి యుపరతి
జ్ఞానంబును విరక్తి శౌర్య మైశ్వర్యంబు, బలము తేజంబుఁ గౌశలముఁ గాంతి
ధృతి మార్దవము స్వతంత్రతయుఁ బ్రాగల్భ్యంబు, వినయశీలములు గభీరతయును

గీ. సహము బలము భగంబు నోజంబు స్థిరత, యాస్తికత కీర్తి మానానహంకృతులును
నరుల మహిమఁ బెంచెడు బహ్వితరగుణములు, నిచ్చలుం గృష్ణునందివి నిల్చియుండు.

గీ. గుణనివహాయుక్తుఁడగు నమ్ముకుందుచే వి, సృష్టముం బాపకలి పర్యవేక్షితంబు
నై నలోకంబుఁ బోడఁగాంచి యాత్మయందు, ఘోరశోకభరంబునఁ గుందుచుందు.

గీ. నాకయిసురోత్తముఁడవగు నీకొఱకయి, యమరపితృమునిసాధుబృందములకునయి
మఱియును సమస్తవర్ణాశ్రమములకునయి, యాత్మఁ గడుఁగడు శోకింతునయ్య నేను.

చ. వనజభవాదు లేసతి కృపాపరిపూర్ణకటాక్షవీక్షణం
బును మదిఁ గోరుచున్ సతతమున్ సుతపం బొనరింత్రో! యా శ్రితా
వనపరతంత్ర లక్ష్మియు, స్వవాసము పద్మము నుజ్జగించి వి
ష్ణుని పదపద్మరమ్యతకు సాక్షి భజించు సదానురక్తయై. 532

చ. హలకులిశధ్వజాబ్జవలయాంకుశరేఖలఁ జిహ్నితంబులై
చెలఁగెడు కృష్ణపాదములచే సమలంకృతగాత్రనైన నే
నలఘువిభూతి నా హరి దయం గని మూఁడుజగాలమించి భా
సిలితి నతండు నన్ను విడిచెం బృథుగర్విత నంతమం దిటుల్. 533

మ. మతినెన్నన్ హరి రాక్షసాంశజనితక్ష్మాపాలకాక్షౌహిణీ
శతరూపంబగు మద్భరంబు నుడిపెన్ స్వాతంత్ర్యసంయుక్తుఁడై
గతిహీనుం దురవస్థ నష్టపదు నిన్ గన్గొంచు సంపూర్ణుఁగా
ధృతిఁ గావింప జనించె యాదవులలో దేవుండు రమ్యాకృతిన్. 534

మ. లలితాలోకన మందహాసమధురాలాపాదిశృంగారచ
ర్యల సత్యాదికమానినీమణుల స్థైర్యంబున్ సమానంబుగన్
లలి నెవ్వాఁడు హరించె యచ్చరణముల్ పైనుంచఁగా నామెయిన్
బులకాంకూరము పుట్టెఁ దద్విరహమే పూఁబోడి తా సైఁచెడిన్. 535

క. ఈవడువున నన్యోన్యం, బా వసుధాధర్మములటు లనుకొనునెడ మే
ధావి పరీక్షిన్నామ ధ, రావరుఁడల ప్రాచ్యయగు సరస్వతిఁ దరిసెన్. 536

---

## అధ్యాయము 17.

### కలి నిగ్రహము

సూతుఁడు:—

ఉ. భూరివివేకులార! తలఁపోయఁగ నెందును దిక్కులేనటుల్
క్రూరత హన్యమానమగు గోమిథునంబును దండధారియై
చేరువ రాజచిహ్నములఁ జెన్నలరారెడు నొక్క శూద్రు ధా
త్రీరమణాగ్రగణ్యుఁడు పరీక్షితుఁ డొయ్యనఁ గాంచె నయ్యెడన్. 537

సీ. బిసతంతుధవళంబు వేపమానంబును, భయవిహ్వలము నొక్కపదముతోన
సురిక్కెడు నదియునై శూద్రసంతాడిత, మగుచు దైన్యాన్వితమగు వృషమును
దీనభావఁ బదింబదిగ శూద్రపదహత, బాష్పముఖియు నష్టవత్సకయును
నగుచు హవిర్ధోగ్ధ్రియై యవసముఁ గోరు, గోవును గని నయకోవిదుండు
గీ. స్వర్ణనిర్మితమైన భాస్వద్రథంబు, నందు నారూఢుఁడై యధిజ్యధనుఁడగుచు
జలదగంభీరభాషణంబులఁ జలంబు, వెలయ సంప్రశ్నముం జేసె విప్రులార! 538

శా. ఓరీ! యెవ్వఁడవీవు? మచ్ఛరణమై యొప్పారు లోకంబునం
దీరీతిం బలివై యపేతబలులన్ హింసించుచున్నాఁడ వా
రారా! వేషమునందు నట్టువక్రియన్ రాజైతి కర్మంబునన్
గ్రూరాత్మా! వృషలుండవై యిటు మహాద్రోహంబు గావింతువే. 539

మ. నరయుక్తుండయి లోకరక్షకుఁడు శ్రీనారాయణుం డాత్మసుం
దరధామంబును జేరఁగా నిరపరాధప్రాణులం బట్టి యీ
కరణిన్ హింసనొనర్తువే? యసుర! యేకాంతస్థలంబందు నీ
వరయన్ గ్రూరతమైన వధంబునకు నిర్వధ్యుండ వత్యంతమున్. 540

వ. అని యాతని ఝళిపించి పదంపడి వృషభంబును సంబోధించి— 541

క. చరణములు మూఁడు లేకొక, చరణముతో వదనమున విషాదచ్ఛాయల్
పరఁగ వృషభరూపంబునఁ, దిరిగెదు మము నలఁచు నొక్క దేవుఁడవేమో! 542

చ. కురుపతి బాహుదండ పరిగుప్త ధరాస్థలి నీవుఁ దక్క త
క్కొరులగు ప్రాణికోటుల కొక్కపుడుం బడ వార్తిబాష్పముల్

సురభితనూజ! డెందమున శోకము సేయకు మింక నాత్మ ము
ప్పిరిఁగొనుచున్న యీవృషలభీతియు నీకుఁ దొలంగుఁ జెచ్చెరన్. 543

వ. అని మఱియు సురభి నుద్దేశించి— 544

క. ధరణీస్థలమున సాధుల, నరయుచు ఖలశాసకుండనై నేనుండన్
దురపిలకమ్మా! నీవో, సురభీ! సత్వరమ నీకు శుభమగుఁగాతన్. 545

గీ. ఎవనిరాష్ట్రంబునం బ్రజ లెల్ల ఖలులవలన వెఱఁగుందుదురో యట్టివానిమత్తు
వదలిచనుఁగీర్తి యాయువు భాగ్యము గతి, తెలిసిచూడంగ నిందుసందియము లేదు.

గీ. నిక్కమెన్న నార్తులయార్తినిగ్రహంబ, రాజులకు మహోత్కృష్టధర్మంబుచూవె
కాన నితనిభూతద్రోహుఖలునిఁబట్టి, తప్పక వధింపఁగలవాఁడఁ దదత్క్షణంబ. 547

ఉ. ఓడక నాల్గుపాదములనొప్పెడు నీదగు మూఁడుపాదముల్
వీఁడెవఁడో దురాత్మకుఁడు వీఱిఁడియై విఱుఁగంగఁగొట్టె నె
వ్వాఁడును దుఃఖయుక్తుఁడు భవాదృశుఁ డో వృషరాజ! యుండఁగాఁ
బోఁడు ముకుందభక్తులయి పొల్చెడు రాజుల రాష్ట్రసీమలన్. 548

సీ. సాధులు నకృతాపరాధులు నగుమీకు, భద్రంబగున్ వృషభావతంస!
పార్థప్రతిష్ఠకు భంగకరముగ నీకున్ విరూపత నొడఁగూర్చినట్టి
వానినిఁ జెప్పు మెవ్వాఁడో యిట్లనపరాధజనంబునకు దురితంబుఁ జేయు
వారికిఁగల్గు మద్భయ మెల్లవిధముల, నిరపరాధులయెడం దెగువ నెవఁడు

గీ. వీఁగక నిరంకుశుండయి సేగిఁ జేయు, నతఁడు సాక్షాత్తు నిర్జరుఁడైన నతని
సాంగదభుజంబుఁ దునుముదు నవనిపులకుఁ, బరమధర్మంబు ధర్మస్థపాలనంబు. 549

ధర్ముఁడు:—

మ. నరనాథోత్తమ! ధర్మరక్షకుఁడు శ్రీనారాయణుం డర్థినె
వ్వరి ప్రఖ్యాతగుణాలిబులం దనిసి భావంబొప్ప దౌత్యాదులన్
బెరిమం జేసెనొ యట్టి పాండవుల రావిమీకుం దలంపంగఁ గా
తరలోకాభయదాయివాక్యమిది యుక్తం బెంతయున్ భూవరా! 550

వ. పరమపురుషుండగు శ్రీకృష్ణునివలన మేము క్లేశబీజంబులు గాకుందుము.
అయ్యాదిపూరుషుని వాక్యభేదవిమోహితులై కొంద ఱాత్మరూపుండనియు
మఱికొందఱు దైవంబనియు వేఱొకకొందఱు కర్మస్వభావంబనియు మఱికొంద
ఱితరుఁడ్యాంబు ననిర్దేశ్యుంబు నగుటఁ బ్రభువనియు సందురు. అందో రాజర్షి
సత్తమా! నీవు బుద్ధ్యనురూపంబుగ విమర్శింపుము. 551

క. అని ధర్ముఁడు వచియింపఁగ, విని యా సమ్రాట్టు తాను విగతవ్యథుఁడై
మునివరులార! సమాహిత, మనస్కత నిటులనె మంద్రమంజులఫణితిన్. 552

రాజు:—

చ. 'సొరిది నధర్మకర్ములను సూచనఁజేసెడు వారికేని లో
నరయఁగ వారిస్థానమగు'ననంచిటు ధర్మము పల్కుచున్కి ని
క్కరణి వృషేంద్రరూపమును గైకొని యీ ధరణీస్థలంబునన్
దిరిగెడు ధర్మదేవతవు నీవని యెంచెద ధర్మవిత్తమా! 553

వ. అట్లుకాదేని భూతంబుల వాఙ్మనంబులకు దేవమాయావిలాసం బగోచరంబని
నా నిశ్చయంబు. 554

సీ. తపమును శౌచంబు దయ సత్యమనెడు పదములు కృతమునం గృతంబులయ్యె
అట నధర్మాంగంబులగు స్మయ సంగ మ, దంబులనూఁడు భగ్నంబులయ్యె
ధర్మాఖ్య! యిప్పుడాత్మను ధరింపఁగఁజేయు, సత్యాఖ్యపదమున జరుగుచుంటి
వనృతసంవర్ధితుండయి యధర్మస్వరూ,పుఁడు గలి దాని నిప్డు గొనదలఁచె

గీ. నీ వసుంధరయున్ వాసుదేవుచేత, మహితభారంబు తొలఁగ శ్రీరమ త్తదంఘ్రి
చిహ్నకృతభద్రయిప్డు త్యజింపఁబడి శు,గశ్రువుల విడనాడెడు ననదవోలె. 555

వ. మఱియు నబ్రహ్మణ్యులు రాజవ్యాజులు నగు శూద్రులు నన్నుపభోగింతురని
ఖిన్నమానసయై విన్నఁదనంబున విలపించెడు. 556

క. అని ధర్ముని నవనిని సాంత్వనవాక్కుల ననునయించి తన ఘనఖడ్గం
బునుగొనె మహారథుఁ డధ,ర్మనియుక్తుండైన కలినిఁ బరిహరించుటకై. 557

క. తనుఁ జనుమందలఁచినవా,నినిగా నృపునెఱిఁగి విడిచి నృపలాంఛనముల్
జనవిభుని పాదమూల,మ్మునకుం గలి మ్రొక్కె మూర్ధమున భీతుండై. 558

క. చరణంబులఁ వ్రాలినఁ గని, పరమదయాళుండు దీనవత్సలుఁడు నరే
శ్వరుఁడు శరణ్యుండు కలిం, బరిమార్పక యప్పుడిట్లు పలికెన్నగుచున్. 559

రాజు:—

ఉ. ఓయి! కిరీటికీర్తివిభవోజ్జ్వలులైన నృపాలకోటికిం
దోయిలియొగ్గువార లకుతోభయులై చరియింతురీకాన న
న్యాయి వధర్మబంధుఁడవునై మెలఁగాడెడు నీ వుదంచిత
శ్రీయుతమా మదీయమగు క్షేత్రమున న్నివసింపరాదిఁకన్. 560

సీ. నృపతి దేహమున వర్తించెడు నిన్నను,వర్తించుచుండు లోభం బనృతము
చౌర్యం బఘంబు దౌర్జన్యం బలక్ష్మియు, మాయ కలహము దంభంబు మున్ను

గాఁగ నధర్మసంఘమువు కావున నీవు, ధర్మంబు చరియింపఁదగినదియును
యజ్ఞవితానసంవిజ్ఞులు క్రతువుల, చేత యజ్ఞేశు యజించునదియు
గీ. నైనయట్టి బ్రహ్మావర్తమందు మెలఁగఁ, జనదు వాయువువలెఁ జరాచరజగమున
కాత్మయుం గ్రతుమూర్తియా హరి యజించు, వారికిటఁ బూర్ణకామముల్ వ
భద్రములిడు. 561

సూతుఁడు:—

చ. క్షితిపతియా పరీక్షితునిచే నిటు లానతి యీయఁబడ్డ భీ
యుత పృథువేపథుండు కలియుద్యత దండధరుండువోలె ను
ద్ధృతకరవాలుఁడై యెదుటదీపిలు నా నృపుఁగాంచి ప్రశ్రయా
న్వితుఁడయి దీనవాక్యములనేరుపుదోఁపఁగఁ బల్కె నీగతిన్. 562

శా. నీయాజ్ఞన్ శిరసావహింతు నికపైనే నోనృపాలోత్తమా!
యే యే స్థానములన్ వసింపఁగలనో యీ విప్లు శాసింపుమా
యా యా స్థానములందు నోనృపతివర్యా! యాత్తచాపున్ యశ
శ్శ్రీయుక్తుం బరికించుచుండు నిను వైరివ్రాత గర్వాపహున్. 563

క. కావున ధర్మభృదగ్రణి!, నీవిప్పుడు నాకు స్థాననిర్దేశంబున్
గావింపుము నీయానతి,చే వసియింతునట నియతిఁ జేకొని నిచ్చల్. 564

సూతుఁడు:—

సీ. అని సమభ్యర్చితుఁడయి యప్పుడు కలికి, ద్యూతంబుఁ బానంబుఁ దొయ్యలులును
బ్రాణివధంబు నాఁబరఁగు చతుర్విధా,ధర్మంబుల నొసంగె స్థానములుగఁ
గ్రమ్మఱ యాచింపఁ గాంచనంబు నొసంగె, నవ్వానివలన నయ్యాన నన్నృతము
మదము కామంబును మతి రజంబును బంచ,మమగు వైరమును సంభవములయ్యె
గీ. బొత్తరేయదత్తముల నీకైదుస్థాన,ముల నధర్మప్రభవుఁడగు కలిగ్రహించి
యానృపాలు నాదేశము నాదలన్ ధ,రించి వసియించె నోద్విజశ్రేష్ఠులార! 565

క. కావున నీయైదిఁటి సం,సేవింపఁగఁజనదు బుధుఁడు శ్రేయోఽర్థి మతిన్
భూవరుఁడు ధర్మశీలుఁడు, దా వీనిన్ మొదలె ముట్టఁదగ దెన్నండున్. 566

గీ. తపము శౌచము దయయు నాఁదనరునట్టి, మూఁడుపాదములన్ వృషమునకు విభుఁడు
నిపుణతంబుజ్జగించి సంధించె మరల, నభ్యుదయ కలితంజేసె నవనిఁగూడ, 567

క. గహనంబుంజొచ్చు పితా,మహుఁడగు ధర్మజునిచే సమర్పితమును ధూ
ర్వహ రాజోచితము నయోద్వహమగు నాసనము నపుడతఁడధిష్ఠించెన్. 568

మ. వరరాజర్షియు సార్వభౌముఁడు మహాభాగుండు దివ్యద్యశః
స్ఫురణుండైన పరీక్షితుం డల కురుక్షోణీశలక్ష్మీ సువి
స్తరశోభాలసమానుఁడై యిపుడు నిస్తంద్రప్రభావాతి భా
స్వర తేజః కలితుండునై యెసఁగెడిన్ సన్మునులారా! యిటుల్. 569

క. ఎవఁడతిదక్షత మెఱయఁ బృథివి నేలఁగ మీరు సత్రదీక్షితులై రో
నృవరుఁ డభిమన్యుసుతుఁ డత్యవనీసురులార! యిట్టి యధికుం డెన్నన్. 570

---

## అధ్యాయము 18.

### ఋషికుమారదత్త పరీక్షిచ్ఛాపము

సూతుఁడు:—

సీ. ఎవఁడు ద్రౌణ్యస్త్రవిప్లవమందియుం దల్లి, కడుపున నద్భుతకర్ముఁడైన
హరి యనుగ్రహమున మరణంబు నొందక, జీవించియుండెనో చెలువుమీఱ
ఎవ్వఁడు విప్రశాపేరిత ప్రాణనాశక మహాక్రూర తక్షకునివలన
మనమున సమ్మోహమును గొనండో యనారతము శ్రీహరిసమర్పితమతియయి

గీ. ఆపరీక్షిన్నృపుండు వైయాసికియగు, శుకునిశిష్యుఁడై శ్రీనివాసునిగతిమది
నెఱిఁగి సర్వసంగముఁ ద్యజియించిమించి, యాత్మదేహంబు జాహ్నవియందు విడిచె.

శా. శ్రీకృష్ణాంఘ్రి సరోజయుగ్మమును సంసేవింపుచుం దత్కథా
నీకాస్తోకసుధారసంబు నెదఁ బూన్కిన్ గ్రోలు చయ్యుత్తమ
శ్లోకోదంతమె సంస్మరింపుచుఁ గడున్ శోభిల్లు ధన్యుల్ విని
ర్భీకుల్ పొందరు మోహము న్నిజతనూవిచ్ఛిత్తియం దేనియున్. 572

గీ. ఇలకు నభిమన్యుతనయుఁ డేకైకనాథుఁ డగుచు నెందాఁక ధృతిమీఱ నెగడుచుండె
నంతటం జొచ్చియుం గలి యంతదనుక, స్వప్రభావంబుఁ జూప నశక్తుఁ డయ్యె.

క. ఎప్పుడు హరి భగవంతుం, డిప్పృథివీస్థలము ను ద్యజియించెనో కలి తా
నప్పుడ యధర్మభవుఁడై, తప్పక యనువృత్తుఁ డయ్యె ధరణీతలమునన్. 574

వ. సార్వభౌముండగు పరీక్షితుం డేకలిప్రభావమునం బాపంబులు చేసినఁగాని ఫలిం
చక పుణ్యంబులు సంకల్పమాత్రముననే విశేషించి ఫలించునో యే కలి ధీరులకు
భీరుండు, నధీరులకు శూరుండునునై వృకంబుచాడ్పునఁ బ్రమత్తులగు నరులయందు
నప్రమత్తత వర్తించునో యట్టి కలిని బుష్పసారంబుఁ గ్రోలు మధుపంబునుబలె
ద్వేషింపకుండె. 575

క. మీ రడిగిన శ్రీనాథ క, థాయుతమును బుణ్యతమము నైన పరీక్షి
త్గేయాఖ్యానము వర్ణన, సేయంబడె నిట్లు మౌనిశేఖరులారా! 576

క. ఏయే కథ లతిసంశ్రవ, ణీయచరిత్రుఁడగు హరి విశ్వనిర్మలగుణక
ర్మాయత్తములో సేవ్యము, లా యాకథ లిట శుభార్థులగు పురుషులకున్. 577

ఋషులు:—

క. ధీవిఖ్యాతా సూతా!, జీవింపుము పెక్కులేండ్లు శ్రీకృష్ణయశ
శ్శ్రీవర్ణించితివి సువా, గ్భావంబున మనకది యమృతంబగునుగదా. 578

గీ. కరుణతో నవిశ్వసనీయకర్మమందు, నమితధూమ ధూమ్రాత్ములమైన మమ్ము
నతి మధుర కృష్ణపాదపద్మాసవంబుఁ, గ్రోలఁగాఁ జేసితివి హృదిత్రుప్పాడుల్ల.

క. స్వర్గంబుకాని యల యప, వర్గముగాని హరిపాదభక్తజనసుసం
సర్గ లవసమముకావన, దుర్గంధములుగద నరులతుచ్ఛవిభవముల్. 580

శా. ధీగణ్యుండు రసజ్ఞుఁడెవ్వఁడు మహాధీరాశ్రితాంఘ్ర్యబ్జుఁడౌ
శ్రీ గోవిందు లసత్కథాశ్రుతిని సంతృప్తాత్ముఁడౌ నారయన్
యోగీశుల్ భవతోయజాతభవముఖ్యుల్ నిర్గుణుండైన యా
నాగాధీశ శయాను సద్గుణగణాంతంబుం గనంజాలిరే! 581

ఉ. కావున సర్వభాగవతగణ్యుఁడ వంచిత ధీయుతుండవున్
నీవు మహాత్తమాశ్రిత పునీతపదుండగు విష్ణుదేవు స
ద్భావగభీరశుద్ధచరితామృతమున్ వినఁగోరు మాకు మో
దావహమౌనటుల్ దెలుపుమా పరగం బుధలోకసన్నుతా! 582

ఉ. ఏనము వోని బరీక్షిదవనీంద్రుఁడు భాగవతోత్తముండు మే
ధానిధి వ్యాససూను కథితంబు పవిత్రతరంబునైన యే
జ్ఞానముచేతనొందె? ఘనసౌఖ్యమయం బపవర్గనామ మ
న్యూనమునై చెలంగు పురుషోత్తమ శోభనపాదమూలమున్. 583

ఉ. భూనుత తేజముం బరమపుణ్యము భాగవతాభిరామమున్
మానితయోగనిష్ఠము రమామాధవ సచ్చరితోపపన్న మ
న్యూనమునై పరీక్షితునకున్ శుకుండు వచించినట్టి యా
ఖ్యానము మాకుఁ దెల్పుము ప్రకాశముగాఁగ సుధీవతంసమా! 584

తరల. అవురె! మేము విలోమజాతులమయ్యు వృద్ధజనంబులం
దవిలి కొల్చుటఁ జేసి యిప్డు కృతార్థజన్ములమెన్నఁ జే

ర్మి వెలయంగ నికృష్టవంశనిమిత్త మానసపీడ సా
ధువర గోష్ఠికతంబునం బరిధూతమయ్యెను మాకిటన్. 585

వ. అనంతశక్తిసంపన్నుండును ననంతుండునై మహనీయగుణగరిష్ఠుండునగు నా భగవంతుని నామసంకీర్తనంబుచేసిన దౌష్కుల్యనిమిత్తంబగు మనోవ్యథ తొలంగు ననుట వేఱె చెప్పనేల? నిరతంబుఁ దన్నుఁ బ్రార్థించు బ్రహ్మాదులను బరిత్యజించి రమాదేవి యొల్లకున్నను, నెవ్వని పాదరేణువు భజించుచుండునో యట్టి యనఘుండును, ననతిశయుండును నగు భగవంతుని గుణగణంబు లింతవట్టు సూచించి చాలు. మఱియు నెవ్వని పాదనఖంబునుండి విసృష్టంబై బ్రహ్మ సమర్పితంబగు నర్ఘోదకంబు పాలకసహితంబగు లోకజాలంబుఁ బునీతంబుఁ గావించునో, యట్టి ముకుందునకంటె నన్యుండెవ్వండు లోకంబున భగవత్పదవాచ్యుండగు. ఏ దేవునియం దనురక్తులై విబుధులు దేహాదులయందు సంగాదిమోహంబునుం ద్యజియించి పరమహంసగమ్యంబును, నహింసోపశమ స్వధర్మయుక్తంబగు పరమపదంబునుం బొందుదురో యట్టి పరమపురుషుని మాహాత్మ్యంబును బతంగం బాత్మశక్త్యనురూపంబుగ నెంతమాత్రంబగు నభంబు నధిగమించునో తావన్మాత్రంబ యెఱింగించెదనని చెప్పి సూతుండు మఱియు నిట్లనియె. 586

మ. ఒకనాఁ డా నరనాథసత్తముఁ డరణ్యోర్వీస్థలిన్ సజ్యకా
ర్ముకుఁడై తా మృగయారతిం దిరుగుచుం గ్రూరోగ్ర నానామృగ
ప్రకరంబుల్ వెనువెంటనై తఱుముచున్ శ్రాంతుండు క్షుత్తృష్ణలన్
వికలత్వంబును గొన్నవాఁడునయి యుండెం దాల్మియుం దూలఁగన్. 587

సీ. అందు జలాశయం బెందునుఁ గానక, ప్రాంతస్థితోజ్జ్వలాశ్రమముఁ జొచ్చి
ప్రత్యాహృతేంద్రియప్రాణమనోబుద్ధి, యుపరతుండు నవిక్రియుండు తుర్య
పదముసొచ్చినవాఁడు బ్రహ్మభూతుండు ని, మీలితాక్షుఁడు బోధశాలియునయి
రౌరవంబైన చర్మమ్ము నదాల్చి, విప్పారుజటలచేఁ గప్పఁబడుచుఁ

గీ. దేజరిల్లెడువాని యతిప్రవరుని, నిర్భరసమాధినిష్ఠ మునిఁగినవాని
సెలువు లెండఁగ నాలుక చెమ్మయుడుగ, నీరమున్ వేడె నమ్మేదినీవిభుండు. 588

క. క్షుత్తృడ్వ్యథితుఁడైన పరీ, క్షిత్తున కెన్నఁడును లేనికిన్కయపు డక
స్మాత్తుగ నత్తుకొనెన్ విప్రోత్తముపై మాప్పరానియురవడితోడన్. 599

క. సునిభృత సమస్తకరణుండును మీలితనయనయుగళుఁడునునై యతఁడుం
డెనో కాక క్షత్రియులచే, మన కేమని యిటు మృషాసమాధిఁ బరగెనో. 590

వ. అని శంకించి— 591

క. విగతప్రాణంబగు పన్నగమును దనవింటికోపునను రాజేంద్రుం
డగణితమహాప్రభావుం, డగు ఋషిమూపుపయి నుంచి చయరిగెం బురికిన్. 593

వ. అంత—

క. అతితేజస్సంపన్నుఁడు, యతిసూనుఁడు బాలుఁ డర్భకావళితో స 594
మ్మతినాడుచు నృపపరిభావితుఁగా నిజ జనకు నచటఁ గని యిట్లనియెన్.

వ. బలిభుక్కులుంబోలె బలిష్ఠులై ద్వారపాలకమ్ములగు శునకంబులుంబోలె దాస
భూతులునైన రాజుల యధర్మంబుఁ గంటిరే? బ్రాహ్మణులచే క్షత్త్రబంధువు
గృహపాలకుఁడుగా నిరూపింపఁబడియె. ద్వారస్థితుండు తద్గృహంబున భాండస్థం
బగు నన్నంబు భుజింప నెట్లర్హుండగు? మఱియు నతండు స్వామియుం దఘుకా
కాఁ జెల్లునే? 595

గీ. కుజనశాసకుఁడగు నధోక్షజుఁడు కృష్ణుఁ, డవనినిఁ ద్యజించి చన్న యనంతరంబు
ధర్మమర్యాదలమిమీఱు దుర్మతులను, బ్రాఁధిశాసింతు నిప్పు నాకలముఁ గనుఁడు. 596

క. అని చెలిమికాండ్ర కాఋషి, తనయుండు వచించి రోషతామ్రాక్షుండై
మునులార! కౌశికీజల, మును వార్చి యొసంగె శాపమును తేనిటుల్. 597

ఉ. కూరిరత నాదుతండ్రికి విద్రోహ మొనర్చిన కట్టడిం గులాం
గారుని ధర్మసేతువులఁ గ్రన్న నమీఱిన యట్టివాని క్షో
ణీరమణున్ దురాక్రమణు నేఁటికి నేడవ నాఁడు పూని మ
త్ప్రేరితుఁడైన తక్షకఫణీంద్రుఁడు బూది యొనర్చుఁగావుతన్. 598

గీ. అని నృపు శపించి యాశ్రమంబును బిరానఁ, జేరి గళసీమ వ్రేలు మృతోరగమును
జనకునిం గని దుఃఖితస్వాంతుఁడగుచు, గోలు మనియేడ్చె నెలుత్తి బాలకుండు.

చ. తనయవిలాపనంబు విని తాపసుఁ డాంగిరసుండు మెల్లనన్
గనులను విచ్చి యల్లన స్వకంఠమునన్ మృతసర్పమున్ గనుం
గొని తొలఁగంగఁ ద్రోచి కొడుకుంగని వత్సక! యేడ్వ నేల? నీ
కు నెవఁడు హానిఁ జేసె ననఁగూరిమి పుత్త్రుఁడు తెల్పె సర్వమున్. 600

ఉ. శాపముపొందరాని నృపసత్తము శప్తునిఁగా నెఱింగి య
త్తాపసవర్యుఁ డాత్మజుని దా మదిమెచ్చక యిట్లనున్ మహా
పాపము నీవు సల్పితివి బాలిశ! ద్రోహము స్వల్పమైనను
గోపము పేర్మి నిచ్చితివి ఘోరతరంబగు శిక్ష యాక్రియన్. 601

చ. పరుఁడను ఖ్యాతిఁ జెన్నుఁగను పార్థివముఖ్యు నపక్వబుద్ధి! యీ
నరతతితో సమానుఁగఁ గసంజన దారసి చూడ నీకుఁ ద

ద్గురుతరదివ్యతేజమున గోపితులై ప్రజలెల్లరున్ నిరం
తర మకుతోభయాత్ములయి తద్దయు భద్రములందుచుండ్రుగా. 602

మ. నరదేవుండను పేరఁ బొల్చెడు జగన్నాథుండు కౌమోదకీ
ధరుఁడీపైఁ గనుపింపకున్న విను పుత్రా! చోరబాహుళ్య దు
ర్భరమై లోకము కాపులేని యరణ్యవ్రాతంబునుంబోలె. బా
పురె! చెల్లాచెదురై వినాశగతినిం బొందుంగదే వ్రేల్మిడిన్. 603

చ. అకట! వినష్టనాథమగునట్టి జగాన ధనంబదెల్ల దోఁ
చుకొనఁగఁగల్గు దుష్కృతము చుట్టుకొనున్ మనలన్ గుమార! యా
రక జనకోటులెల్లరుఁ బరస్పర ముగ్రతఁ గొట్టుకొంచు దూ
రుకొనుచు స్త్రీలనుం బసులరొక్కములన్ హరియింత్రు దస్యులై. 604

శా. పాయుంగా నరకోటికప్పుడు లసద్వర్ణాశ్రమాచారని
ష్ఠాయుక్తంబుఁ ద్రయీమయం బతి గరిష్ఠం బార్యధర్మం బిలన్
వేయింకేటికి నర్థకామనిచయావిష్టాత్ములౌ వారి కా
గా యద్దానఁ గపిశ్వజాతులకుఁ జోకన్ వర్ణసాంకర్యముల్. 605

మత్తకోకిల. ధారుణీపరిపాలకుం డురుధర్మపాలుఁడు కీర్తివి
స్తారుఁడున్ హయమేధయాజి యుదారభాగవతుండు గం
భీరమూర్తి నృపర్షి ఋషిత్వముపేతుఁ డాదరణీయుఁ డ
య్యారె! శాపఫలానుభూతికి నర్హుఁడెట్లగు నారయన్. 606

ఉ. పాపము సల్పనిట్ల పరిపక్వమనస్కుఁడు బాలకుండు ని
ష్పాపులనంగఁ జెల్లు నిజభక్తజనంబులయందుఁ గావునన్
బాపుల పాపజాలములఁ బాపఁగఁ జాలిన దీనవత్సలుం
డా పురుషోత్తముండు సకలాత్ముఁడు సైఁచునుగాత మీతనిన్. 607

చ. స్థితమతులౌచుఁ దమ్మొరులు తిట్టినఁ గొట్టిన మోసపెట్టినన్
వెతలకుఁ బాలుచేసినను వేయివిధాలఁ బరాభవించినన్
బ్రతికృతిఁ జేయఁబోరు భగవత్పదభక్త లోకప్పుడున్ సమ
ర్థతగలవారలయ్యు సతతంబును శ్రీహరినే స్మరించుచున్. 608

సూతుఁడు :—

చ. అనియిటులాత్మనందనకృతాఘముచేఁ బరితప్తుఁడై మహా
ముని తనకున్ నృపాలకులముఖ్యుఁడు సల్పిన నేరమున్ మన

మ్మునఁ దలఁపంగఁబోఁ డొరులకు మూలమునన్ సుఖదుఃఖముల్ దొరం
కొనినను మోదఖేదములఁ గూడరు సాధులు విజ్ఞులౌటచేన్. 609

---

## అధ్యాయము 19.

—పరీక్షిత్ప్రాయోపవేశము. శుకాగమనము—

సూతుఁడు:—

శా. ఆధాత్రీపతియంత నాత్మకృత గర్హ్యాధర్మకర్మన్ మనో
వీథిన్ సారెకు సంస్మరించుచిటు లుద్విగ్నాత్ముఁడై యెంచె స
ద్బోధున్ బ్రహ్మమయున్ ఘనున్ నిరపరాధున్ గూఢతేజస్కునిన్
సాధున్ మౌని ననార్యుఁడుం బలె నవజ్ఞంజేసితిం జాల్మతన్. 610

చ. నలిపితి దేవహేళనము సల్పితి భాగవతాపచారమున్
గలుగును దీన నా కనతికాలమునందె దురంతచింత కే
వలమది నాకె వాటిలుతఁ బాతక నిష్కృతికై ధ్రువంబుగాఁ
గలుషపరత్వమున్విడిచి క్రమ్మఱ నిట్టులు చేయకుంటకై. 611

చ. అలఘుప్రకోపిత ద్విజకులానల మిద్ధ సమృద్ధకోశమై
చెలఁగెడు నాదు రాజ్యమును శ్రీని బలంబును బుగ్గిఁజేయుఁ గే
వలమది నా కభద్రునకు వర్తిలుతన్ ద్విజదేవగోగణం
బులపయి వెండియుం గలుషబుద్ధులు నా కుదయింపకుంటకై. 612

చ. అవనిపముఖ్యుఁ డీపగిది నాత్మఁదలంచుచునుండి యంత మౌ
నివరసుతోక్తతక్షక ఫణిప్రభవ స్వవినాశన ప్రవృ
త్తి విని భవప్రసక్తునకు దీవ్రవిరక్తికి హేతువై పొసం
గు వికటతక్షకాగ్ని తనకుం గడుమేలని యెంచె ధీరతన్. 613

మ. అలఘుజ్ఞాన విరాజమాన హృదయుండై యైహికాముష్మికం
బులు లోకంబులు రెండు హేయములుగా మున్నున్ విమర్శించి కే
వల మాతేఁడు ముకుందపాదయుగ సేవాధిక్యమూహించి ని
ర్మల గంగాతటిసీతటిన్విలసిలెన్ బ్రాయోపవేశస్థితిన్. 614

మ. విలసచ్ఛ్రీతులసీ విమిశ్రశుభగోవిందాంఘ్రి రేణూత్కరో
జ్జ్వలతోయోద్వహమై సపాలక జగద్వ్రాతంబులన్ లోపలన్
వెలినిం బూతముఁ జేయు నాసురనదిన్ ధీయుక్తి సేవింపఁడీ
యిలయందున్ మరణోన్ముఖుండయినవాఁడెవ్వాఁడు భావింపఁగన్? 615

శా. పారావారగభీరుఁడా నృపుఁడిటుల్ ప్రాయోపవేశస్థితిన్
స్ఫారస్వర్ణది నిశ్చయించి పరభావంబుల్ విసర్జించి తం
పారన్ ముక్తసమస్తసంగుఁడగుచున్ మౌనవ్రతోపేతుఁడై
శ్రీరంజిష్ణు ముకుందపాదయుగమున్ సేవించె ధ్యానించుచున్. 616

మ. ఘనతన్ లోకములన్ బునీతములుగాఁ గావించు ధన్యుల్ సుధీ
వినుతుల్ మౌనివరుల్ స్వశిష్యయుతులై విచ్చేసిరచ్చోటి కా
య్యనఁ దీర్థాభిగమాపదేశమున నిర్వ్యాజప్రభావాఢ్యు లా
యనఘుల్ తీర్థములం బవిత్రములఁ జేయన్ నేర్తురిగా యారయన్. 617

సీ. అత్రి వసిష్ఠుండు చ్యవనుం డుచథ్యుఁ డ, రిష్టనేమియు మఱి భృగువు గాధి
సూతి యంగిరుఁడును గౌతముండును శర, ద్వంతుఁ డౌర్వుండు మేధాతిథియును
రాముండు మఱియుఁ బరాశరుండును భర, ద్వాజుం డగస్త్యుఁ డింద్రప్రమధుఁడు
ద్వైపాయనుం డిధ్మవాహుండు మైత్రేయుఁ, డార్ష్టిషేణుఁడు పిప్పలాదనుండు

గీ. దైవతర్షి నారదుఁడును దనితరులు సు, రర్షి బ్రహ్మర్షి పర్వ రాజర్షివర్యు
లరుణముఖ్యులుం జేర భూవరుఁడు వారిఁ, బ్రకటభక్తి నర్చించె మూర్ధమున మ్రొక్కి.

చ. అకలుషమూర్తులైన మునులందఱుఁ దన్ను వేడ్కనందుఁ గూ
డుకొని సుఖోపవిష్టులగుడున్ దయితుండు పరీక్షితుండుఁ వా
రికి మగుడన్ జోహారులొనరించి కుఱంగటఁ జేరి దోయిలో
గ్గి కడఁక విన్నవించె స్వచికీర్షితమున్ సువిరక్తచిత్తుఁడై. 619

పరీక్షితుఁడు:—

వ. మహర్షిపుంగవులారా! మహనీయులగు మీ యనుగ్రహంబువడయు సచ్ఛీలురంబు గలవారమగుటం జేసి రాజన్యులలో మేమెంతయు ధన్యతములము. వినింద్య కర్మంబగు రాజకులంబు బ్రాహ్మణపాదశౌచంబునుండి దూరాపాస్తంబగుం గాదె. 620

శా. పాపాత్ముండ నిరంతరంబును గృహవ్యాసక్తచిత్తుండ నా
నాపై నెయ్యము పెంపునం గడుఁ బ్రసన్నత్వమ్మునం బూని యీ
శాపవ్యాజమునన్ విరక్తి గొలుపన్ సర్వేశ్వరుండైన యా
య్యాపన్నావనతత్పరుండు హరి యొయ్యం గూర్చె నాకీవెతన్. 621

చ. నెఱి హరిపాదపద్మ మొదవిల్లి మిమున్ శరణన్నవానిఁగా
నెఱుఁగుఁడు మీరు జాహ్నవియు నిష్ట ద్విజాత్మజచోదితాత్ముఁడై

కఱచుతఁ దక్షకాఖ్యభుజగప్రవరుండు కరాళదంష్ట్రిలన్
వెఱఁబనిలేదు పాడుఁడు త్రివిక్రమగాథల మిక్కుటంబుగన్. 622

చ. ఇఁకపయి వెండి నేను ధరియించెడి జన్మములందు భద్రదా
యకుఁడగు కృష్ణునందును దదాశ్రయులైన జనంబులందుఁ బ్రొం
దికమెయి నాకు సంగము జనించుతఁ గల్గుత భూతకోటిపైఁ
బ్రకటితమైన మైత్రి ద్విజవర్యులకౌతను నా ప్రణామముల్. 623

సూతుఁడు:—

మ. అని యీచందమునన్ వినిశ్చయయుతుండై మేదినీ భారమున్
దనయ స్కంధమునందు మోపి యెడఁదన్ ధైర్యంబు దీపింప దే
వనదీ దక్షిణకూలమందు సరవిన్ బ్రాఙ్మూలదర్భాస్తృతిన్
మనుజాధీశుఁ డుదఙ్ముఖుండగుచు నేమంబొప్ప నుండెన్ ద్విజా! 624

శా. రాజేంద్రుండు పరీక్షితుండిటులు ప్రాయోపవిష్టుండు కాఁ
గా జేజే లుదితప్రహర్షమున నాకాశంబునం గుంపులై
జేజేల్వొట్టుచుఁ గుంభినిం గుసుమవృష్టిం బెల్లువర్షించి ర
ప్డోజన్ సారెకుసారెకున్ మొఱసె నోహో! దుందుభిధ్వానముల్. 625

మ. క్షితిపాలోత్తమునొద్దఁజేరిన మహర్షిశ్రేష్ఠులుం దద్విని
శ్చితకార్యంబును సాధువాదములచేఁజిత్తంబురంజిల్ల స
మ్మతి నగ్గించుచు వాసుదేవ గుణకర్మశ్లక్ష్ణనిర్దుష్ట సూ
నృత వాక్యంబులఁ బల్కిరిట్టులు ప్రజాశ్రేయోఽర్థి సచ్ఛీలురై. 626

మ. విను రాజర్షికులావతంసమ! యశస్విశ్రేష్ఠ! శ్రీకృష్ణు నే
యనువర్తించెడు నట్టి ధన్యులగు మీయం దిద్ది చిత్రంబుగా
దనఘా! రాజకిరీట నూత్నమణిజుష్టాధ్యాసనం బొక్క లి
ప్తన మీపూర్వులు వీడరయ్య? భగవత్పార్శ్వంబుఁ గాంక్షించుచున్. 627

వ. అని రాజునకుం బల్కి తమలోఁ దాము 628

ఉ. శ్రీయుతమూర్తి భాగవతశేఖరుఁడైన యితండు తానిటుల్
కాయము నుజ్జగించి గతకల్మషుఁడై తగ నెంతలోన ని
ర్మాయ మపేతశోకము పరంబగు లోకముఁ జేరు నంతకున్
బాయకయుంద మందఱముచున్నన నిందన భూపుఁడిట్లనున్. 629

రాజు:—

ఉ. మూరితిఁగొన్న యాగమ సమూహము లెల్లను సత్యలోకమున్
జేరినయట్టు లెల్లరును జేరితికిరు మునీంద్రసత్తముల్

గోరుగాదె మంత మదిలో నిహముం బరముం గడంగి ని
ష్కారణయుక్తి నొర్ల కుపకారముఁ జేయుచునుందురు నిచ్చలున్. 630

మ. ఇతికర్తవ్యతఁ గూర్చి నచ్చికను మిమ్మేనడ్గుచుంటిన్ మహా
మతులారా! యతులార! సర్వగతులం జావంగ నున్నట్టివాఁ
డు తగం జేయఁగఁ దగ్గ కార్యమెదొ తోడ్తోడన్ విమర్శించి ధీ
రత నాకుం దెలియంగఁ బల్కుఁడిట మీరల్ కోవిదుల్ గావునన్. 631

వ. అని పరీక్షితుండు యతిపుంగవుల నడుగుచున్నంత. 632

చ. అఁట కరుదెంచె ధీయుతుఁడు వ్యాససుతుండు యథేచ్ఛ భూమిప
ర్యటనముఁ జేయు చర్భకచయంబులు చుట్టును మూఁగివచ్చి ముం
దట వికటాట్టహాసము లొనర్పఁగఁ దా నవధూతవేషుఁడై
స్ఫుటములు కాని చిహ్నములఁ బోల్పఁగరాక స్వలాభతుష్టుఁడై. 633

సీ. సుకుమారపాదహస్తోరుబాహ్వంస క, పోలగాత్రు లసద్విశాలనేత్రు
సలలితోన్నసమశ్రవణసుభ్రూవిను, గమనీయకంబుసంకాశకంఠు
నతిగూఢజత్రు నున్నతపృథులోరస్కు, వళిలసదుదరు నావర్తనాభి
నాజానుబాహు దిగంబరు వక్రవి, స్తృతకేశు దైవతశ్రేష్ఠసముని

గీ. షోడశాబ్దవయస్కు నిసుందరాంగు, మోహితస్త్రీలలాము శ్యాము నభిరాము
గూఢవర్చస్కుఁడై యున్నగుర్తెఱింగి, యెల్లమునులుఁ గ్రక్కున లేచి యెదురుచనిరి.

మ. అతివిఖ్యాతుఁడు విష్ణురాతుఁడును దానట్లాగతుండైన య
య్యతిథిశ్రేష్ఠునకున్ శిరంబున సపర్యల్ పెక్కు గావించె నా
దృతి నప్పచ్చటనుండిపోయి రబుధస్త్రీబాలకుల్ తోన పూ
జితుఁడై తదర్చితోచితాసన మధిష్ఠించెన్ శుకుం డయ్యెడన్. 635

శా. తేజస్వంతుఁడు వ్యాసపుత్రుఁడు మహాధీశాలి బ్రహ్మర్షులున్
రాజర్షుల్ విబుధర్షులున్ గములుగాఁ దన్ముట్టి కొల్వంగ వి
భ్రాజిల్లెన్ గ్రహతారకోడుయుతుఁడై రంజిల్లు రాకానిశా
రాజుం బోలెను బ్రేక్షకాళికిఁ బ్రహర్షంబున్ బ్రసాదించుచున్. 636

మ. కృతియున్ భాగవతోత్తముండగు పరీక్షిద్భూమిపాలుం డుదం
చితమేధాయుతు శాంతరూపుని సుఖాసీనున్ శుకుం జేరి యా
నతశీర్షంబున మ్రొక్కి యత్యవహితుండై దోయిలింబూన్చి సూ
నృతవాక్యంబునఁ దోడుతో నడిగె నీరీతిన్ నయం బేర్పడన్. 637

రాజు:—

గీ. అతిథిరూపంబునన్ మీరలరుగుదెంచి, పరమపూతులఁగాఁ జేయఁబట్టియిపుడు
క్షత్రబంధులమగు మేము సాధులోక, సేవనీయులమహహా! ఋషివర! నిజము. 638

గీ. మనుజులగృహంబు లెవరిసంస్మరణమున న,ఘంబులడఁగ సద్యశ్శుద్ధి గాంచుచుండు
వారి సుపవిత్రదర్శనస్పర్శనోరు, పాదశౌచాసనాదులం బలుకనేల? 639

గీ. యోగివర! భవత్సాన్నిధ్య యోగమహిమఁ, బాతకసముచ్చయము లనల్పంబు లయ్యు
నరుల కారయ సద్యోవినష్టములగు, వాసుదేవునివలన దేవారులువలె. 640

గీ. పృథివి మేనత్తకొడుకుల ప్రీతిగొలుకు, వారి గోత్రంబునకుఁగూడ బాంధవుఁడయి
పాండవప్రియుఁడైన కృష్ణుండు విభుఁడు, నాపయిం బ్రీతుఁడయ్యెఁ గానోపుఁదలఁప.

క. మరణోన్ముఖ నరులకు మా,కరుదుగ గూఢగతివగుచు నలరారెడు నీ
గురుదర్శనమటు కాదేన్, దొరకునెటు లయాచితముగ స్తుత్యచరిత్రా! 642

గీ. అనఘ! మరణోన్ముఖుండైన మనుజునకిట, నెల్లగతుల సల్పఁగఁదగ్గ దేదొ యట్టి
యోగ్యతరసిద్ధి నడిగెద యోగులకును, బరమగురువగు నిన్ను నో భవ్యచరిత. 643

వ. మహాత్మా! పురుషులకు శ్రోతవ్యము జపనీయము స్మర్తవ్యము కర్తవ్యము భజనీయంబునగు నదియెద్దియో వివరింపుము. కాదేని నొండెద్ది చేయవలయునో యెఱింగింపుము. బ్రహ్మస్వరూపా! గృహమేధుల గృహంబునందు గోదోహనమాత్ర కాలంబేని నీయునికి దోఁచకుండుఁగదా! అట్టి నీదర్శనభాగ్యము పురాకృత సుకృత విశేషంబున నాకు సమకూడె. 644

సూతుఁడు:—

క. సుమధురవాక్కుల రాజో, త్తముచే నిట్లడుగఁగఁబడి ధర్మజ్ఞుఁడు భూ
తమయుండు బాదరాయణి, క్రమమునఁ బ్రతివచనమొసఁగె రాజునకిట్టుల్. 645

## గద్యము.

శతావధానులు, ఉభయభాషాప్రవీణులు 'శ్రీరామనృసింహమూర్తి కవులు' అను గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహమూర్తులచే రచింపఁబడిన శ్రీమదాంధ్రభాగవతమునఁ బ్రథమస్కంధము సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## ద్వితీయ స్కంధము

### అధ్యాయము 1.

విరాట్స్వరూప వర్ణనము

శ్రీశుకుఁడు:—

శా. శ్రీతత్త్వార్థవివేకిసమ్మత మతిన్ శ్రేష్ఠంబు భవ్యత్వదీ
యాత్మప్రశ్నము సర్వలోకహిత మెంతే నాత్మతత్త్వానభి
జ్ఞాతృవ్యగ్రగృహస్థపాళికి నిజాగారంబులం బెక్కులౌ
శ్రోతవ్యాదుల నుత్తమోత్తమ మగుం జుమ్మా! నరేంద్రోత్తమా! 1

చ. చను నిసి నిద్దురన్ సతులసంగతిఁ బ్రాయము చెల్లెడుం బవల్
ధనరతులం గుటుంబభృత్యులం గతియించు వినశ్వరాంగనా
తను తనయాది సైన్యసముదాయమునందుఁ బ్రమత్తచిత్తుఁడై
కనియుఁగనండు మానవుఁడు క్ష్మాధవ! యాత్మవినాశకాలమున్. 2

గీ. కాన సర్వాత్మకుఁడు భగవానుఁడు హరి
యీశ్వరుఁడు వినఁ బొగడ స్మరింపఁదగిన
వాఁడగుంజుమ్మి సంసారవాంఛ విడుచు
మానవునకును భరతవంశప్రదీప! 3

ఆ. విమలసాంఖ్యయోగవిధులచేత స్వధర్మనిష్ఠచేతఁ బురుషనిచయములకుఁ
గోరి యంత్యమందు నారాయణస్మృతియే ఫలంబు జన్మమెత్తుటకును. 4

ఆ. విధినిషేధములను విడిచి మునీంద్రులు, ప్రాయికముగఁ దాము బ్రహ్మమందు
హరిగుణానుకథననిరతులై రమియింత్రు, ప్రథితకీర్తిసాంద్ర! పార్థివేంద్ర! 5

క. ద్వాపరయుగమునఁ బితయగు, ద్వైపాయనమునివలన భాగవతము స
ర్వోపనిషత్సారము బ్రహ్మసాదకముఁ జదివితి నుదాత్తమనీషన్. 6

గీ. నిర్గుణబ్రహ్మ పరినిష్ఠ నెలవుకొనియు, నుత్తమశ్లోకలీలలఁ జిత్తమొదవ
నే శుభాఖ్యానమును బఠియించినాఁడ, నుడివెదం దాని విష్ణుభక్తుఁడవు గాన. 7

చ. పరివిమల విష్ణుభక్తియుత భాగవతాఖ్య పురాణరాజమం
దెవనికి శ్రద్ధయూనతని కేర్పడ ముక్తి లభించెడున్ ముము
క్షువులగువారికెల్లఁ దొలఁగున్ భవభీతులు రాజచంద్ర! యో
గివరులకున్ ముకుందపరికీర్తనముల్ విధినిర్ణయంబులౌ. 8

క. తెలియకయే చనియెడి పెక్కులు హాయనములనుఁగలదొకో మత్తునకున్
ఫలితం బెద్దాన శుభము, లొలయునొ తెలియఁబడు నా ముహూర్తమె మేలౌ.

క. ఆయువమితి నెఱిఁగి యశఃకాయుఁడు రాజర్షియైన ఖట్వాంగుఁడు మున్
ధీయుక్తి ముక్తసంగుండై యొకమూర్తమున ముక్తి హరివలనఁ గొనెన్. 10

సీ. ఇదిగాన నీకిఁక నేడుదినంబులు, జీవితావధి పరీక్షిన్నరేంద్ర!
సాంపరాయికవస్తుసామగ్రి సమకూర్పు, మాసన్నమగుచు నిజాంతకాల
మపగతసాధ్వసుఁడగుచు నిస్సంగశస్త్రమున దేహాదికేచ్ఛాప్రతతిని
బురుషుండు వ్రచ్చి మందిరమునుండి ప్రవ్రజితుఁడై ధీరభావము సెలంగఁ
గీ. బుణ్యతీర్థాప్లుతుండయి పూతమగు వివిక్తదేశమునందు విధ్యుక్తకల్పి
తాసనంబున నాసీనుఁడగుచు మనసులోనఁ బ్రణవాక్షరాభ్యాసమూనఁగనగు.

సీ. నిర్జితశ్వాసుఁడై నెఱిఁబ్రణవంబు ధ్యానించుచు మనమును నిశ్చలముగ
నల్పంగఁదగు బుద్ధిసారథియై యింద్రియాశ్వంబులను విషయములనుండి
మరలింపఁగా నగు మనముచే వాసనాక్షిప్తవామనమునుఁ జిక్కఁబట్ట
నగు బుద్ధిబలమున నయ్యెడ నేకాగ్రమైన మనంబున సావయవుని
గీ. విభుని ధ్యానింపనగును నిర్విషయముగ మనంబుఁ జేసి మీఁద నస్యంబు స్మరణ
చేయమి రజస్తమస్తిరస్కృతమగు జడ, మనమెటఁ బ్రసన్నమగుఁ బరమపదమదియ.

గీ. ఎలమి రాజసతామసమలహరమగు, నట్టి ధారణచే ధీరుఁడలరు భద్ర
పదవిలోలుఁడౌ యోగికిఁ బరఁగుభక్తి, లక్షణంబగునురుయోగమాక్షణమున.

రాజు: —

గీ. ఎట్టిధారణచొప్పడు నెచ్చటనది, సమ్మతంబగు నెట్టిదై జగతిఁ బురుషు
మానసికమైన మలమును బూనివేగ, మాన్చునద్దానిఁ దెలుపు బ్రహ్మస్వరూప!

ఋషి:—

గీ. సంగముత్త్యజించి నిర్జించిశ్వాసగతుల, నాసనంబులయందుఁ గృతార్థతఁగని
యింద్రియంబులగెల్చి తదేకబుద్ధి, హరి విరాడ్రూపమంనుంచనగు మనంబు.15

గీ. భూతభావి భవద్రూపమై తనర్చు, విశ్వమిదియెల్ల నే విరాడ్విగ్రహమునఁ
గానఁబడుచుండు స్థూలముకంటె స్థూల,మైనయది వాసుదేవు దేహమ్ముసుమ్ము.

వ. సప్తావరణ సంయుతంబు, నండకోశాత్మకంబగు నీ శరీరంబునందు ధారణాశ్రి యుండును, భగవంతుండునగు విరాట్పురుషుండు వసించుచుండు. ఈ దేవదేవునకుఁ బాతాళంబు పాదమూలంబు, రసాతలంబు పార్ష్ణిప్రపదంబులు, మహాతలంబు గుల్ఫంబులు, తలాతలంబు జంఘలు, సుతలంబు జానువులు, వితలంబునతలంబు నూరుద్వయంబు, మహీతలంబు జఘనం,బునభస్థ్సలంబు నాభి, స్వర్లోకం బురస్థ్సలంబు, మహర్లోకంబు కంఠంబు, జనర్లోకంబు వదనంబు,తపోలోకంబు లలాటంబు, సత్యలోకంబు శీర్షంబు, దిక్కులు కర్ణంబులు, శబ్దంబు శ్రవణేంద్రియంబు, అశ్వినీ దేవతలు నాసాపుటంబులు, గంధంబు ఘ్రాణేంద్రియంబు, అగ్ని ముఖంబు, ఆకాశ మక్షిగోళకంబు, సూర్యుఁడు చక్షురింద్రియము, అహోరాత్రంబులు కనుఱెప్పలు, బ్రహ్మపదము కనుఱెప్పపాటుకాలము, జలంబులు తాలువులు, రసము జిహ్వ, ఛందస్సు బ్రహ్మరంధ్రము, యముఁడు దంష్ట్రిలు, స్నేహకళ దంతములు, జనోన్మాదకరమాయ హాసంబు,దురంతసర్గము క్రీగంటిప్రసారము,వ్రీడ యూర్ధ్వోష్ఠము, లోభమధరోష్ఠము, ఇంద్రాదిదేవతలు బాహువులు, ధర్మము స్తనము, అధర్మపథము పృష్ఠము, ప్రజాపతి మేఢ్రంబు, మిత్రావరుణులు వృషణంబులు, సముద్రంబులు కుక్షి, పర్వతంబు లస్థిసంఘంబులు, నదులు నాడులు, వృక్షంబులు రోమంబులు, వాయువు శ్వాసము, కాలము వయస్సు, కర్మ గుణప్రవాహంబు, మేఘంబులు కేశంబులు, సంధ్య వస్త్రంబు, అవ్యక్తము హృదయము, సర్వవికార కోశంబైన చంద్రుండు మనంబు, మహత్తు విజ్ఞానశక్తి, రుద్రుం డంతఃకరణము, అశ్వాశ్వతర్యుష్ట్రి గజంబులు నఖంబులు, సర్వమృగంబులు పశువులు శ్రోణిభాగంబులు, శుకమరాళమయూరాదిపక్షులు కళానైపుణ్యము, మనువు బుద్ధివిశేషము, మనుజుఁడు నివాసము, గంధర్వ విద్యాధర చారణాప్సరోగణము షడ్జాది స్వరములు, ప్రహ్లాదుఁడు స్మృతి, అసురానీకంబు వీర్యంబు, విప్రుఁడు ముఖంబు, క్షత్రియుఁడు భుజంబు, వైశ్యుం డూరుతలంబు, తమఃప్రధాన కృష్ణవర్ణశూద్రుం డంఘ్రితలంబు, అనేక విధ దేవతాయుత ద్రవ్యాత్మకకర్మంబు యజ్ఞప్రయోగంబు. 17

సీ. ఎన్న నీశ్వరవిగ్రహ \$ నన్ని వేళ, మింతటిదిసుమ్ము నుడివితి \$ నీ విరాట్స్వ
రూపమందు స్వబుద్ధిచే \$ రూఢి మనము, నిల్పఁగల్గిన నింతకం\$టె మఱికలదె? 18

గీ. స్వప్నకల్పిత దేహపుం\$జమును జీవుఁ, డరయు చందాన సర్వాంత\$రాత్ముఁడైత
నర్చు సత్యస్వరూపు నా\$నందమయు భ, జింపనేలగు వేఱొంటఁ\$జెందుఁ గీడు.19

---

## అధ్యాయము 2.

### భగవత్స్వరూప ధారణాయోగప్రకారము

శ్రీశుకుఁడు:—

శా. ఈదృక్షిత్స్థల ధారణాపటిమ వా\$గీశుండు నష్టస్మృతి
ప్రాదుర్భావముఁ జెంది తుష్టిఁ బ్రళయ \$ ప్రాక్కాలభాగంబునం
దే దెట్లో గ్రహియించి సర్వజగమున్ \$ సృష్టించె మున్నిశ్చయా
పాదిప్రోజ్జ్వలబుద్ధియై యవితథ\$వ్యాపారపారీణుఁడై. 20

సీ. శబ్దమయాగమ\$సరణి వ్యర్థములైన, స్వర్గాదినామక \$ సర్వలోక
ముల సౌఖ్యములఁగోరి \$ మూఢుండు దిరుగుచుఁ, దత్ఫల మింత పొం\$దంగలేఁడు
మాయామయంబైన \$ మార్గాన సౌఖ్యవి, భ్రాంతియె కాని లా\$భంబులేదు
కాన విద్వత్కవి\$పూనిక నామ మా, త్రములైన వానిచేఁ \$ దనివి ననక

గీ. అప్రమత్తత సువినిశ్చి\$తాత్ముఁ డగుచు, నన్యవిధమున దొరఁకొన్న \$ నర్థసిద్ధి
శ్రమ యటంచును బరికించి \$ శ్రద్ధఁజేయఁ, డెన్నఁడేని దత్సిద్ధికై\$యిదినిజంబు. 21

సీ. తల్పంబులేల? యే\$తద్విశాలావనీ, భాగంబు లేదొకో \$ పవ్వళింపఁ
దలగడలేల? స్వ\$తస్సిద్ధనిజభుజా, దండంబు లేదొకో \$ దిండు వెట్టఁ
బాత్రింబులేల? స్వ\$భావసంపన్నక, రాంజలి లేదొకో \$ యారగింప
వర దుకూలములేల? \$ ప్రకటదిగ్వల్కలా, దికమును లేదొకో \$ ధృతి ధరింప

గీ. వృక్షరాజి సదాఫల\$భిక్ష నిడదె?, పావన నదీమతల్లులు \$ వారి నిడవె?
యింపగు గుహావళి తగవ\$సింపనీదె, కొలువనేటికి ధనమదాం\$ధులను మునులు.22

గీ. స్వీయచిత్తమునన్ స్వత\$స్సిద్ధుఁ డాత్మ, ప్రియుఁడు నిత్యుఁ డనంతుఁడు\$విభుఁడునైన
వాని భజియింపనగును ని\$ర్వాణయుక్తి, దాన సంసారహేతువుల్ \$దరలిచనును.

క. హరిచింతామృతధారణ, నురక యనాదరముఁజేసి \$ యొప్పని విషమో
త్కరచింతఁగోని యెవఁడు వై, తరణీ పతితుఁడయి ఘోర\$తాపముఁజెందున్?24

వ. కొందఱు తమ దేహంబులోని హృదయావకాశంబుననుండు చతుర్భుజుండును శంఖ
చక్ర గదా పద్మధరుండునగు ప్రాదేశమాత్రపురుషుని ధారణావశంబున స్మరిం
చుచుండ్రు. మఱియుఁ బ్రసన్నవక్త్రుండును, బద్మవిశాలనేత్రుండును, గదంబకిం
జల్కపిశంగవస్త్రుండును, దేదీప్యమాన మహారత్న హిరణ్మయాంగదుండును,
విభ్రాజితమణికిరీటకుండలుండును, మున్నిద్రహృత్పంకజకర్ణికానిలయ సంస్థాపిత
యోగీశ్వర పాదపల్లవుండును, శ్రీలక్ష్ముండును, గౌస్తుభరత్నకంధరుండును,
నమ్లానశోభాన్విత వనమాలాధరుండును, మేఖలాంగుళీయక నూపురకంకణాది
విభూషణభూషితుండును, స్నిగ్ధామలకుంచిత నీలకుంతల ప్రరోచమానాననహాస
పేశలుండును, సుదారలీలాహాసితేక్షణోల్లసద్భ్రూభంగసూచిత మహాప్రసాదుం
డును, ధారణావశుండును నగు నీశ్వరుని మనోధారణచే నిరీక్షింపందగు. 25

గీ. అల గదాధరు పాదాదికాంగములను, బరఁగ నొక్కొక్కదాని యావద్ధసితము
బుద్ధి భావింపఁదగు వశ్యకములఁ ద్యజించి, యరసి చింతింపనొ నితరాంగకముల. 26

గీ. ద్రష్ట విశ్వేశ్వరుండు పరాత్పరుఁడగు, దేవుపైఁ భక్తిరస ముప్పతిల్లుదనుక
పురుష స్థూలరూపముఁ దలఁపఁ బోయఁగనగు, సప్రయత్నముగఁ గ్రియావసాన
మందు. 27

చ. ఎరువని దేహమున్ విడువనెంచెడు యోగి సమాశ్రయించి సు
స్థిరసుఖదాసనంబు నృపశేఖర! కాలమునందు దేశమం
దురవడి డెందమున్ జొనుపఁకుల్లముచేతన నిర్జితాశుఁడై
భరఁపడి ప్రాణవాయువులఁ బట్టఁగనోఁ, బృథుయత్న మేర్పడన్. 28

గీ. అమలబుద్ధిన్ మనోనిగ్రహంబుఁ జేసి, దాని క్షేత్రజ్ఞుఁడగు నాత్మలోన నిల్పి
యాత్మఁ బరమాత్మయందు నైక్యంబుచేసి, ధీరుఁడై శాంతిఁగొను నిరోధించుఁ
గ్రియల. 29

గీ. ఆ పరబ్రహ్మమునకుఁ దక్కరయ లోక, పాలకులకును మఱి దేశకాలములకుఁ
ద్రిగుణములకును మహదహంకృతి ప్రధాన, ములకుఁ గానంగరాదు ప్రభుత్వ
మెందు. 30

క. ఆయాత్మ వ్యతిరిక్తము, హేయము దేహంబు నేతి నేత్యుక్తులచేఁ
బాయవిడిచి విష్ణుపద మ,మేయముఁ బొందుదురు ప్రతినిమేషము విబుధుల్. 31

వ. ఇత్తెఱంగున యోగీశ్వరుండు వ్యవస్థితుండై విజ్ఞాననిర్దగ్ధవిషయవాసనుండై తన
పార్ష్ణిభాగంబున మూలాధారంబును బీడించి ప్రాణానిలమును నాభిస్థానముం

బొందించి నాభిగతంబగుదాని హృదయమునందు నెలకొల్పి యటనుండి యుదానగతిచే నురస్స్థలంబుఁ బొందించి యురంబునుండి జితచిత్తుండై బుద్ధిచే మెల్లన స్వతాలుమూలంబుఁ జేర్చి యటనుండి భ్రూమధ్యభాగంబుఁ బొందించును. ఇట్లు ప్రాణానిలమును షట్చక్రములకుఁ గ్రమంబున లేపి జితశ్రముండై నేత్రశ్రోత్రనాసాముఖంబులను సప్తప్రాణమార్గములను నిరోధించి యర్ధముహూర్తమనపేక్షుండై యుండి యకుంఠితదృష్టితో బ్రహ్మరంధ్రంబును భేదించుకొని దేహేంద్రియాదుల సంగంబు విడిచి పరబ్రహ్మమును బొందును. మఱియు నతండు పయనించు నెడ పరమేష్ఠిస్థానంబుఁగాని, ఖేచరవిహారస్థానంబుఁగాని, యణిమాద్యష్టసిద్ధులంగాని పొందఁ మానసేంద్రియాత్మకంబగు లింగశరీరము నొందును. పవనాంతర్గతాత్ములగు యోగీశ్వరులకు లోకత్రయాంతర్బహిఃప్రదేశంబులు గతియోగ్యంబులని చెప్పుదురు. విద్యాతపోయోగసమాధిభాక్కులగు యోగుల యీ గతిని గర్మములచే నేరునం బొందఁజాలరు. సుషుమ్నాగతుండగు యోగి యాకాశమార్గంబున నగ్నిమండలముం జేరు. తేజోరూపంబైన బ్రహ్మపథంబున నిరస్తపాపపుణ్యుండై యుదఙ్ముఖుండై విష్ణుని శింశుమారచక్రంబును జేరు. మఱియు నేకాకియై బ్రహ్మవేత్తలైన విబుధులు గ్రీడించు మహర్లోకంబున రజోవిరహితమైన సూక్ష్మశరీరముచే మహాకల్పాయుష్కుండై వసించు. పదంపడి యనంతముఖానలదందహ్యమానవిశ్వంబును వీక్షించుటం జేసి తద్దురంతదుఃఖప్రభవానుదర్శనంబువలని కృపచేఁ బొడమిన మనఃపీడ తక్క మఱెచ్చటను శోకజరామృత్యువ్యాధి దుఃఖోద్వేగము లేనిదియును, సిద్ధేశ్వరజుష్టదిష్ణ్యంబునగు పరమేష్ఠిస్థానంబు బడయును. పిమ్మట నిర్భయుండై యయ్యాత్మస్వరూపంబుతో యోగి యాపోరూపుండును, జ్యోతిర్మయుండును, వాయ్వాత్మకుండును నాకాశస్వరూపుండును నై శ్రోత్రాదీంద్రియముల శబ్దాది తన్మాత్రల లయంబుఁ జేయుచుండు. మఱియు నయ్యోగి సూక్ష్మేంద్రియసన్నికర్ష ప్రభావంబును, మనోమయంబును, దేవమయంబునగు విజ్ఞానతత్త్వంబును సంపాదించి యానందమయుండై యవసానంబున నాత్మచే నాత్మనుబొందుచుండు. భగవత్సంబంధినియగు నీగతినిఁ బొందినవాఁడు పునరావృత్తిం బొందఁడు. రాజా! నీ యడిగిన రెండు ప్రశ్నంబులు వేదగీతంబులు పురాణంబులు, తొల్లి భగవంతుండగు వాసుదేవుండు వినతిపూర్వకంబుగ నడుగంబడి బ్రహ్మకుఁ జెప్పె. సంసారంబునఁజొచ్చినవానికి భగవంతుండగు వాసుదేవునియందలి భక్తియోగంబునకంటె శుభప్రదమైన మార్గంబు వేఱొండు లేదు. 32

మ. భగవానుండగు బ్రహ్మదేవుఁడు మదిన్ భావించి మువ్మారుగా
నిగమంబుల్ బరికించి తీవ్రమగు పూర్ణస్థితిన్ భక్తియోగంబు కం

లెఁగడున్ మోక్షపమొందు లేదనుచుఁ జాటెం బుద్ధినూహింప స
ర్వగతుండో హరియే నిరంతరము నారాధ్యుండు లోకాళికిన్. 33

కం. భగవంతుండగుహరి భూతగతుండయి సర్వలక్షితత మహాశక్తిన్
దగ బుద్ధ్యాదులఁ గానఁగ నగు సంసేవ్యుం డతండయ యఖిలజగతికిన్. 34

ఉ. అవ్యయరూపుఁడైన హరి యన్నివిధంబుల నెల్లపొద్దు శ్రో
తవ్యుఁడు కీర్తితవ్యుఁడు సదా నరకోటికి భక్తిమీఱ స్మ
ర్తవ్యుఁడు విష్ణుదేవుని కథామృత మెవ్వఁడు గ్రోలు వాఁడు దా
భవ్యతఁ జెంది తచ్చరణపంకజసన్నిధిఁ జేరు ధీరుఁడై. 35

---

## అ ధ్యా య ము 3.

ఉపాసనాభేద ప్రాప్తోపాసక విభిన్నఫలప్రాప్తి

శ్రీశుకుఁడు:—

కం. మ్రియమాణులైన మానవ, చయమునకున్ మతివిశేషసంపన్నులకున్
నియతి నొనరింపఁదగు విధి, నియమంబులు చెప్పఁబడియె నీప్రశ్నమునన్. 36

వ. బ్రహ్మవర్చసకాముండు బ్రహ్మను, నింద్రియకాముం డింద్రుని, బ్రజాకాముండు ప్రజాపతులను, నన్నాదికకాముం డదితిని, స్వర్గకాముం డాదితేయులను, రాజకాముండు విశ్వేదేవతలను, స్వాతంత్ర్యకాముండు సాధ్యులను, శ్రీకాముండు మాయాదేవిని, తేజస్కాముండు విభావసుని, వసుకాముండు వసువులను, వీర్యకాముండు వీర్యప్రదులగు రుద్రులను, నాయుష్కాముం డశ్వినీదేవతలను, బుష్టికాముండు భూదేవిని, బ్రతిష్ఠాకాముండు లోకమాతలగు రోదోభాగంబులను, రూపాభికాముండు గంధర్వులను, స్త్రీకాముం డూర్వశియను నప్సరసను, సర్వాధిపత్యకాముండు బ్రహ్మదేవుని, యశస్కాముండు యజ్ఞమును, గోశకాముండు వరుణుని, విద్యాకాముండు గిరిశుని, దాంపత్యకాముం డుమాపతిని, ధర్మనిమిత్తకోత్తమ చరిత్రకాముఁడు పితృదేవతలను, రక్షాకాముండు పుణ్యజనులను, నోజస్కాముండు మరుద్గణంబులను, రాజ్యకాముండు మనురూపదేవతలను, శత్రుమారణకాముండు నిరృతిని, గామకాముఁడు సోముని, నకాముఁడు పరమపురుషుని సేవించవలయును. అకాముఁడుకాని సర్వకాముఁడుకాని మోక్షకాముఁడు కాని యా పరమపురుషునే భక్తియోగముచే యజించవలయును. 37

గీ. శతమఖాదుల భజియించుసమయమందు, భాగవతసంగతిని భక్తిభావ మొదవ
సంతతము భగవంతునిస్మరణ చెలఁగు, నేని నిశ్శ్రేయసోదయం బెసక మెసఁగు. 38

గీ. ప్రతినివృత్తగుణోర్మి చక్రమగు జ్ఞాన, మొదవఁజేసి యాత్మప్రసాదోదయంబుఁ
గడు నిహాముత్రసుఖవిరాగంబు నిచ్చు, నట్టి హరికథలన్ హర్షమందఁ డెవ్వఁడు?

శౌనకుఁడు:—

గీ. ఇట్లు చెప్పిన విని భరతర్షభుండు, శ్రీపరీక్షిన్నరేంద్రుండు ప్రీతిమీఱ
యతివరాగ్రణి బాదరాయణి వరగుణి, నన్యమెయ్యది వెండియు నడిగెఁ జెపుమ.

క. శుశ్రూషఁ జేయుమా కా, విశ్రుతహరిపుణ్యకథలు విద్వద్వర! సూ
తా! శ్రుతపటుమతి వివేకద, యశ్రాంతం బార్యసభల నభివర్ణితముల్. 41

ఆ. పరమభాగవతుఁడు పాండవేయుఁడు మహా,రథుఁడు బాలకేళిరతులఁ గృష్ణు
క్రీడనములఁ ననుసరించుచునుండు వాఁ, డిట్టి భక్తుఁ డగుట యేమివింత! 42

గీ. వ్యాసనందనుఁడగు భగవంతుఁడు శుక,యోగియును విష్ణుభక్తిపర్యాప్తుఁ డగుట
భాగవతశేఖరుల సత్సమాగమమున, హరిగుణోదారకథ లిట్టు లలరుటరుదె?

చ. హరికథ లాలకించుచు నిరంతర మెవ్వఁడు ప్రొద్దుఁ బుచ్చు నా
పురుషుని యాయువున్ విడిచి పోరన నన్యుల యాయువుం దివా
కరుఁ డుదయాస్తమానములఁ గైకొని పోవుచునుండఁ దాము పా
మరులయి కొంద ఱుర్వి నపమార్గములం జరియింతు రిచ్చలున్. 44

సీ. బ్రతుకవే? తరువులు బహుళశాఖోపశాఖాభివితానాకీర్ణగగనములయి
శ్వాసింపవే? చర్మభస్త్రిక లనుక్షణ, పరిపూరితోదరభాగములయి
జీవింపవే? పశుశ్రేణులు మేహన,ఖాదనాదిక్రియాకలితములయి
తిరుగవే? గ్రామసూకరఖరశునకాదు, లుదరంభరిత్వదుర్యోగములయి

గీ. ఎవని కర్ణపథంబున నెన్నఁ డేని, శ్రీగదాధరనామవిశేషకీర్త
నములు చొరకుండునో యట్టి నరపశువు వి,హారభుక్త్యాదులందు నవ్యర్థజీవి. 45

సీ. వీనులా? యవి రమావిభుకథల్ వినకున్న, ఘోరంబులగు కొండగుహలు గాని
నాలుకా? యది జగన్నాథుపేరనకున్నఁ, జుల్కనయగు కప్పనాల్క గాని
కన్నులా? యవి యురుక్రముహొయల్ గనకున్నఁ, గొనతోఁకనగు నెమ్మికనులు గాని
పదములా? యవి శౌరివరనిధుల్ చనకున్న, వితతంబులగు చెట్లవేళ్లు గాని

ఆ. విష్ణుపాదతులసివిశ్రుతగంధంబు, మూర్కొనన్ దలఁపని మూర్ఖజనుఁడు
ఊరకూర్పుపుచ్చుచున్న శవమె కాని, మనుజుఁడా? యతండు మానివర్య! 46

సీ. వరకిరీటాన్వితశిరము భారంబె యౌ, మక్కువ శౌరికి మ్రొక్కకున్నఁ
గాంచనకంకణకరము నిర్జీవమౌఁ, గోర్కి శ్రీనాథునిఁ గొలువకున్న

నాభరణస్ఫురితాంగము శవమె యరయఁ, దమి భక్త పదధూళిఁ దాల్పకున్న
నఖిలభోగాంచితవ్యక్తి పెన్మ్రొద్దె యరయఁ, గమలేక్షణుఁడన హృదిఁ గరఁగకున్న

ఆ. విష్ణుభక్తిలేక వెంగలియై తను, ధనసుతేషణంబులను మరగుచు
పాదయుగముతోడి పశువుచందంబున, మొనసి తిరుగు బ్రతుకు మొండిబ్రతుకు.

గీ. ప్రియమున ననుకూలమగు మాట వినిచి తీవు, భాగవతశేఖరుండగు వ్యాసపుత్రుఁ
డాత్మవిద్యావిశారదుఁ డగుచు నృపతి, యడుగ మీఁదట నేమేమి యానతిచ్చె ? 48

---

## అధ్యాయము 4.

### శుకయోగికృత శ్రీహరిస్తుతి

సూతుఁడు:—

క. తనకు ఘనతత్త్వనిశ్చయ, మును జేసిన శుకునివాక్యము విని పరీక్షి
జ్జనపాలుఁ డౌత్తరేయుఁడు, తనబుద్ధిని గృష్ణునందుఁ దగ నెలకొలిపెన్. 49

క. త్రైవర్గికమగు కర్మ య, థావిధి విడనాడి మృత్యుతత్త్వ మెఱిఁగి తా
నా వాసుదేవు నందు బ్ర, భావ ఘనుండగుచు నాత్మభావము నొందెన్. 50

మ. తన జాయాసుతబంధుమిత్ర పశుసద్మద్రవ్యరాజ్యంబులం
దును గాటంబుగ నాటుకొన్న మమతం దోడ్తో విసర్జించి యొ
య్యన నన్నిప్పుడు వేడ్క మీ రడిగినట్లా ఱేఁడు కృష్ణాను కీ
ర్తనగాథాశ్రవణోత్సుకుం డగుచు సంప్రశ్నంబుఁ జేసెన్ శుకున్. 51

రాజు:—

క. నాకై హరికథలను సు, శ్లోకంబుగ నుడువుచుంటి శుకయోగీంద్రా!
నీకల్యాణోక్తు లఖిల, లోకతమము బాపెడు నతిలోకములగుచున్. 52

వ. మఱియును దెలియఁగోరెద. లోకపాలురకుం దురవగాహమైన యీ విశ్వంబు భగవంతుఁ డాత్మమాయచే నెట్లు సృజించు? ఎట్లు పాలించు? ఎట్లు పొలియించు? పరమశక్తిసమేతుండగు నీశ్వరుం డేయేశక్తుల నాశ్రయించి బ్రహ్మాదులఁ గ్రీడింపఁ జేయుచుఁ దాను గ్రీడించుచునుండు. అద్భుతకర్ముఁడును భగవంతుఁడునగు హరిచేష్టితము కవులకుఁగూడ భావింపరానియట్లు వెలుంగుచుండు. ఈశ్వరుఁ డేకస్వరూపుఁడై యవతారంబులఁ బెక్కుకర్మంబు లాచరించుచుఁ బ్రకృతిగుణంబుల నొక్క మొగిం గ్రహించునో క్రమంబున గ్రహించునో యీ సందిగ్ధవిషయంబును సర్వజ్ఞుండవగు నీవు వివరింపుము. 53

సూతుఁడు:—

క. అనియిట్లు హరిగుణానుక, థనమునకై రాజుచేతఁ బ్రార్థితుఁడై
మునితిలకుఁడు శుకుఁడు జనా, ర్దను మది స్మరియించి యివ్విధంబున నుడివెన్.

శ్రీశుకుఁడు:—

మ. ఘనశక్తిత్రియయుక్తుఁడున్ భువన సర్గస్థానసంహారఖే
లనలోలుండు నజాదినిర్జర వరాలభ్యోరువర్త్ముండు యో
గినుతుండుం బరముండు నీశ్వరుఁడు లోకేశుండునై దివ్యవ
ర్తనలం బొల్చెడు నట్టి దేహినిచయాంతర్వర్తికిన్ మ్రొక్కెదన్. 55

సీ. శిష్టపాపహరుండు దుష్టసంహరకుఁ, డఖిలసత్త్వస్వరూపాంచితుండు
పరమహంసాశ్రమప్రవర్తిత సంయమి, వర్గ్యుల కాత్మతత్త్వప్రదుండు
సాత్వతశ్రేష్ఠుఁ డసాధుదుర్లభుఁడు ని, రస్తసామ్యాతిశయవిభవుండు
స్వస్వరూపబ్రహ్మ సంక్రీడనపరుండు, నిరవధికానందనిర్మలుండు

ఆ. ఎవనికీర్తనంబు నెవ్వానిస్మరణంబు, నెవని వీక్షణంబు నెవని మ్రొక్కు
నెవనిపూజ యెవని శ్రవణంబు లోకపా, పము లణంచునట్టి భద్రుఁ గొలుతు. 56

ఉ. కోవిదు లేమహామహుని కోమలపాదయుగంబుఁ గొల్చి చి
చ్ఛావిధి నాత్మలో నుభయసంగములం దొలఁగంగఁజేసి తా
రేవెతలేక బ్రహ్మగతి నేర్పడఁ జెందుచునుందురో జగ
త్పావనుఁడైన యావిభుని భద్రయశస్కుని గొల్తు నిచ్చలున్. 57

ఉ. దానపరుల్ తపస్వులు నుదారులు కీర్తిధనాభిలాషులున్
మానులు మంత్రవేత్తలు సుమంగళవృత్తు లనన్యభక్తిమై
నే నిగమాంతవేద్యుఁ దనియింపక క్షేమముఁ బొందఁజాలరో
వానికి భద్రకీర్తికి శుభాఖ్యున కేను నమస్కరించెదన్. 58

చ. యవన పుళింద పుల్కస శ్వపాదులుఁ గంకకిరాతహూణ సం
భవులుఁ దదన్యపాపులును బాయక యెవ్వనిభక్తకోటిఁ జే
రి విమలచిత్తులై భువిఁ జరించుచునుందురొ యట్టి లో
కవిభుని భద్రకీర్తిని నఖండసుఖాస్పదు నాశ్రయించెదన్. 59

ఉ. ధీసుఃకాత్ములై యెవఁ డధీశ్వరుఁడున్ నిగమాత్మకుండునా
సారససూతిశంభుముఖసర్వసుపర్వులు నిర్వ్యళీకులై
తారు యదీయమూర్తిని వితర్కముఁ జేసి మదిం గ్రహింపఁగా
నేరరొ నాకు నా భువననేత పరంబుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 60

గీ. అల శ్రియఃపతి, భూపతి యజ్ఞపతియు, బుద్ధిపతియుఁ, బ్రజాపతి భువనపతియు
వితతయదువృష్ణిభోజసంతతికిఁ బతియు, గతియునగు విష్ణుఁ గొల్తునేకాగ్రబుద్ధి. 61

ఉ. పూనిక యుప్పతిల్లఁ గవిపుంగవు లుత్సుకులై యదంఘ్ర్యభి
ధ్యానసమాధిధౌతమగు ధన్యమతిన్ మహితాత్మతత్త్వమున్
గాన వలంతులౌదురొ యనర్గళశక్తులఁ బల్కనేర్తురో
యా నిపుణుండు శౌరి యనయంబును నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. 62

చ. అజునకు నాత్మసృష్టివిషయస్మృతి గూర్పఁగఁ గోరి యే యధో
క్షజుఁడు సరస్వతిం బనుపఁగా మును నామె స్వలక్షణాఢ్యయై
నిజపతిఁగా వరించి యతనిన్ ముఖమందునఁ జొచ్చి యాజగ
త్సృజనకుఁ దాను దోడ్పడెనొ శ్రీధవు నా హరి నేనుఁ గొల్చెదన్. 63

ఉ. ఏవిభుఁ డీతనూపురములేర్పడఁ గూరిచి భూతరాజిచేఁ
దా వసియించి యందు నతిదక్షత షోడశరూపుఁ డౌచు లీ
లావిధితోడ షోడశకళాకలితుండయి యొప్పునట్టి యా
దేవుఁడు నాదువాక్యసమితిం గయిసేయుతఁ బ్రేమమూర్తియై. 64

క. ఏనైష్టికు ముఖకమల, జ్ఞానమరందంబుఁ గ్రోలి సౌమ్యులు పరిపూ
ర్ణానంద మందిరో యా, ధీనిధి బ్రహ్మసము గురు నుతింతున్ వ్యాసున్. 65

వ. అనియిట్లు దైవ గురువందనంబుఁ జేసి శుకయోగి రాజేంద్రున కిట్లనియె. 66

క. కేవలము తనకు నెయ్యది, శ్రీవిభుఁ డెఱిఁగించెఁ దొల్లి సృష్టి మొదల నీ
యావిషయ మాత్మభవుఁడును, దేవర్షికి నారదునకుఁ దెల్పె నరేంద్రా! 67

---

## అ ధ్యా య ము 5.

### ప్రపంచోత్పత్తి కథనము

నారదుఁడు:—

గీ. దేవ దేవ! జోహారులు పావనుఁడవు, భూతసృష్టికరుండవు పూర్వజుండ
వాత్మతత్త్వనిదర్శనమైనజ్ఞాన, మేదియో దాని లెస్సఁగ నెఱుఁగఁ జెపుమ. 68

క. ఏరూపము కలయది? యే, యారంభము కలది? సృష్టమైనదెట? యదా
ధార మెటనణఁగు? యత్పర,మారయ నెదో తెల్పు తత్త్వమున నిక్కముగన్. 69

క. దేవ! త్రికాలేశుఁడ విది, యీ వెఱుఁగుదు నీకు విశ్వమెల్లను విజ్ఞా
నావసితమయి చెలంగును, భావె కరామలకముగ బుధులు మది మెచ్చన్. 70

సీ. పొడమె విజ్ఞాన మెయ్యెడనుండి? నీకు నా, ధార మేదింక యత్పరుఁడ వగుదు?
యత్స్వరూపుండ వీ వాత్మమాయను భూత, ములచేతనే భూతములఁ సృజింతు
వాత్మశక్తినిఁ బూని యలవోక నక్రమం, బున నూర్ణనాభియుఁ బోలెఁ జెలఁగి
పరిభవింపక వాని భావింతు వాత్మలోఁ, బరమపావనమైన చరణితోడ

గీ. గాన నీకంటె నధికునిఁ గాన నమునినా, మరూప గుణప్రధానంబయినది
యరయ మఱి సదసద్రూపమైనయదియుఁ, గానఁజూమి నేను సర్వలోకైకనాథ!

ఉ. ఘోరతపంబుఁ జేయు టెది గోరి సమాహితబుద్ధితోడ త
త్కారణమేమొ మాకు నెఱుఁగంబడకున్కని ఖేద మయ్యెడిన్
సారసగర్భ! యీవిధము సర్వముఁ దెల్పుము బొల్పుమీఱ నే
తీరున నీ ప్రబోధము మదిన్ వికసింపఁగఁ జేయుదో యజా! 72

బ్రహ్మ:—

ఉ. కారుణికుండ వీ వగుటఁ గాదె భవద్విచికిత్సితంబు సం
సారరుజోజ్జ్వలౌషధవిచారణకారణ మయ్యె నోసుతా!
యారయ ధర్మమా భగవదద్భుతవీర్యము విస్తరింపఁ ద్వ
త్ప్రేరితబుద్ధినై తి నిది పెంపగు భాగ్యము కాదె చూడఁగన్. 73

చ. విశదముగాఁగ మత్పరుని విష్ణు నెఱుంగక నారదా! చతు
ర్దశభువనాధిపత్య మది తత్ప్రతిపాదితమాచు నిట్లు నా
వశమయి యుం డెఱుంగక యుఁ బల్కెద వీ విటు నన్నధీశుఁగా
నిశితమతిం గనుంగొనిన నీపలుకంతగఁ గల్ల కాదుగా. 74

గీ. స్వప్రకాశాత్మరోచిప్రభాసితమగు, జగము వెలిగింతుఁ గాని స్వశక్తిఁ గాదు
భానుపగిదిని మఱి శీతభానుపగిది, ననలుపగిదిని దారకాగణముపగిది. 75

మ. అవిజేయంబగు నే మహామహుని మాయాశక్తిచేత న్ననున్
భువనాధీశునిగాఁగఁ జెప్పుదురొ యాభూతేశునిన్ వాసుదే
వు విభుం గొల్తుఁ దదీయ దృష్టిపథముం బొందంగ సవ్రీడయ
య్యు విజృంభించెడు మాయచే జడులు దా ముంద్రెప్పు గర్వోష్ఠులై. 76

క. ఓలిం ద్రవ్యముఁ గర్మముఁ, గాలంబు స్వభావమును దగన్ జీవుఁడు వే
రేల? యల వాసుదేవుఁడె, గాలించిన లేదు వానికంటెఁ బరమెటన్. 77

క. నారాయణాంగజులు దను, జారులు జ్ఞానగతి వేద క్రియ యజ్ఞ తపంబుల్
నారాయణపరములు మఱి, నారాయణ నియమములు కనన్ లోకంబుల్. 78

సీ. అఖిలాత్మకుఁడు ద్రష్టయధిపుఁడు గూటస్థుఁడగువాని వీక్షచేఁ దగఁ బ్రచోది
తుండనై తొలుత సృష్టుండనై నేను సృజింపనౌ జగము సృజించుచుందు
నిర్గుణుండగు విభునికి గుణత్రయము మాయాగృహీతంబయి యఖిలలోక
సృష్టిసంస్థితిలయక్రియలకుఁ బాల్పడి, కార్యకారణకర్తృగతిని నిత్య
గీ. ముక్తు మాయికు జీవుని బాదివియుండి, ద్రవ్యమును జ్ఞానమును గ్రియం దవిలి కట్టు
జీవుబంధించు తల్లింగచేష్టలను స్వలక్షితగతియా హరిపరాలక్షితుఁడయి. 79

వ. సర్వంబునకును నాకునుఁ బ్రభువు, మాయావిభుండునగు హరి స్వమాయచే దైవయోగంబున దనయందుఁ బ్రాప్తంబైన కాలజీవాదృష్టస్వభావంబుల వివిధంబులుగాఁ జేయందలంచి గ్రహించె. తనచే నధిష్ఠింపఁబడిన కాలంబువలన గుణక్షోభంబును, స్వభావంబువలనఁ బరిణామంబును, మహత్తరమైన కర్మంబువలన జన్మంబునుగలిగె. రజస్సత్త్వములవలనఁ బ్రేరేపఁబడిన మహత్తత్త్వమునుండి తమఃప్రధానంబును, ద్రవ్యజ్ఞానక్రియాత్మకంబునగు నహంకారము పొడమె. ఆ యహంకారము రూపాంతరమునొందుచు సాత్త్విక రాజస తామస భేదంబుల ముత్తెఱంగులయ్యె. అదియే ద్రవ్యశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తియనియుం జెప్పఁబడును. వికారముంబొందు తామసంబగు భూతాదికంబునుండి యాకాశంబయ్యె. ఆ యాకాశమునకు సూక్ష్మరూపంబు భూతదృశ్యమునకు బోధకమైనగుణంబు శబ్దంబు. వికృతింబొందు నభంబువలన స్పర్శగుణకంబగు ననిలంబు కలిగె. ఆ యనిలంబునకుఁ బరాన్వయంబున శబ్దంబును గుణంబగు. ఆ వాయువు శరీరగతంబగుటం జేసి ప్రాణధారణయోగ్యంబై యోజస్సహోబలంబులు కలిగియుండు. అట్టి వాయువువలనఁ గాలకర్మ స్వభావంబునం జేసి రూప స్పర్శ శబ్దగుణకంబైన యగ్ని యుత్పన్నంబయ్యె. ఆ యగ్నినుండి రసరూపస్పర్శ శబ్దగుణకంబగు జలంబుద్భవించె. ఆ జలంబువలన గంధరసరూపస్పర్శ శబ్దాత్మకంబగు పృథివి కలిగె. వైకారికంబగు సాత్త్వికాహంకారంబువలనఁ జంద్రదేవతాకంబైన మనంబు జనియించె. మఱియు దిక్కులు, వాయువు, నర్కుఁడు, వరుణుఁడు, నశ్వినీదేవతలు, నగ్ని, యింద్రుఁడు, నుపేంద్రుఁడు, మిత్రుఁడు, ప్రజాపతియును దశదేవతలును గలిగిరి. తైజసమయిన రాజసాహంకారంబువలన దిగ్వాతార్క ప్రచేతోశ్వివహ్నీంద్రోపేంద్రమిత్రక ప్రజాపతి దైవతంబులగు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాగ్ఘస్తపాదగుదగుహ్యేంద్రియముల నెడి దశేంద్రియంబులును, బుద్ధిప్రాణంబులును గలిగె. ఇట్టుల శ్రోత్రాది దశేంద్రియములతోఁ గూడిన భూతేంద్రియ మనోగుణంబులు పృథక్త్వంబున బ్రహ్మాండ శరీరనిర్మాణమున నశక్తములైనప్పు

డాత్మపరిభావప్రచోదితంబులై యేకీభవించి వ్యష్టిసమష్టిత్వ మంగీకరించి చేతనా చేతన సంయుతంబగు బ్రహ్మాండనిర్మాణమునకు శక్తిమంతంబులయ్యె. అట్టి బ్రహ్మాండము వర్షాయుత సహస్రాంతపర్యంతము జలంబులందుండె. కాలకర్మ స్వభావంబుల నధిష్ఠించియుండు పరమాత్మ యట్టి యచేతనమును సచేతనముఁ గావించె. ఆ పరమపురుషుఁడే యందుండి యండంబు భేదించి సహస్రోర్వంఘ్రి బాహ్వక్షుండును, సహస్రానన శీర్షుండునునై నిర్గమించె. మనీషులా పరమపురుషుని యవయవంబులచే లోకంబులఁగల్పింతురు. అందు కట్యాదులచే నధోలోకంబులేడును, జఘనాదులచే నూర్ధ్వలోకంబులేడును విభక్తంబు లయ్యె. ఆ పరమ పురుషుని పాదంబుల భూర్లోకంబును, నాభివలన భువర్లోకంబును, హృదయమున స్వర్లోకంబును, నురస్థలంబుచే మహర్లోకంబును, గ్రీవమున జనర్లోకంబును, స్తనద్వయంబువలనఁ దపోలోకంబును, మూర్ధంబువలన సత్యలోకంబనంబడిన సనాతన బ్రహ్మలోకంబును, నా విభు కటితలంబున నతలంబును, నూరువుల వితలంబును, జానువుల సుతలంబును, జంఘలఁ దలాతలంబును, గుల్ఫంబుల మహాతలంబును, ప్రపదంబుల రసాతలంబును, బాదతలంబులఁ బాతాళంబును గల్పితంబులయ్యె. ఇట్టులా పరమపురుషుండు లోకమయుండయ్యె. పాదంబుల భూలోకంబును, నాభిని భువర్లోకంబును, మూర్ధంబున స్వర్లోకంబును గల్పింపఁబడెననియు లోకకల్పనంబు కలదు. 80

---

## అధ్యాయము 6.

### విరాడ్విభూతి దృఢీకరణము

బ్రహ్మ:—

వ. వాక్కులకు, వహ్నికి, విరాడ్మూర్తియగు నా భగవంతునిముఖము నిలయంబు. మఱియు గాయత్ర్యాది ఛందస్సులకు త్వగాదిసప్తధాతువులును, సర్వరసంబులకు హవ్య కవ్యామృతాన్నంబులకు జిహ్వయును, సర్వప్రాణంబులకు వాయువులకు నాసాపుటంబులును, మోదప్రమోదములకు నశ్వినులకు ఘ్రాణంబునుఁ రూపములకుఁ దేజస్సులకు సూర్యునకుఁజక్షురింద్రియంబును, దద్గోళకంబులును దిక్కులకుఁదీర్థములకు నాకాశశబ్దంబులకుఁగర్ణంబులును,తద్గోళకంబులును,వస్తుసారముల సౌభాగ్యమునకుఁ దద్గాత్రంబును, స్పర్శమునకు యజ్ఞమునకుఁ ద్వగింద్రియంబును, యజ్ఞసంభారకములగు నుద్భిజ్జజాతులకు రోమంబులును, శిలాలోహాభ్రవిద్యుత్తులకుఁ గేశశ్మశ్రునఖంబులును, బ్రాయికముగ క్షేమకర్ములగు లోకపాలకులకు

బాహువులును, భూర్భువస్స్వర్లోకములకు క్షేమశరణంబులకుఁ బాదన్యాసంబును,
సర్వకామవరమునకు హరిచరణమును, జలములకు వీర్యమునకు సృష్టికి మేఘునకుఁ
బ్రజాపతికి శిశ్నంబును, ప్రజాత్యానంద నిర్వృతికి నుపస్థమును, యమునకు
మిత్రునకు మలత్యాగమునకుఁ బాయువును, హింసకు నిరృతికి మృత్యువునకు
నిరయమునకు గుదస్థానమును, పరాభవమునకు నధర్మమునకు తమఃపటలమునకుఁ
బృష్ఠభాగంబును, నదీనదంబులకు నాడులును, గోత్రంబులకు నస్థిసంఘాతములును,
నవ్యక్తరససింధువులకు భూతములకు నిధనమునకు నుదరంబును, మనమునకు
హృదయంబును, ధర్మమునకు నాకును నీకును సనకాది కుమారులకును, రుద్రునకు
విజ్ఞానమునకు సత్త్వమునకు నాత్మయుం ముఖ్యక్షేత్రంబులు. 81

సీ. నేనును నీవును నీలకంఠుండుఁ ద్వదగ్రజుల్ మునులు సురాసురులును
నర ఖగ మృగ పశు నాగ సరీసృప, గంధర్వ భూతోరగ వ్రజంబు
చారణ యక్ష రక్షః పితృ విద్యాధ, రాప్సరస్సిద్ధ ద్రుమావళులును
మఱియు జలస్థలాంబరభాగవాసి నానావిధ జీవసంతానములును
ఆ. స్తనిత వైద్యుతములు తారాగ్రహర్క్షము, లాదిగా జగంబు హరిమయంబు
పుత్ర! యతనియందు భూతభవద్భావి, యైన విశ్వమెల్ల నమరియుండు. 82

గీ. అర్యముఁడు నిజమండలమట్లు తన వి, తస్తి నిముడు వైరాజ సమస్తజగము
వెలుపలన్ లోపలన్ నిండి వెలుఁగఁజేయుఁ, బరమపురుషుండు స్వప్రభాపటలితోడ.

ఆ. అభయమైనయట్టి యమృతంబునకు విభుఁ, డతని మహిమ లెన్న నలవియగునె
యతిభయాన్వితంబులగు కర్మఫలముల, ధృతి నతండు ధిక్కరించి వెలుఁగు. 84

గీ. స్థితిపదుండును బూరుషశ్రేష్ఠుఁడైన
యీశు పదముల భూతము లెల్ల నుండు
నట్టి త్రిశిరస్కుఁడైన యాశ్రయధిపు త్రిశిర
ములను క్షేమాభయామృతములు వెలుంగు. 85

క. అప్రజుల యాశ్రమంబులు, దీప్రములగుచుండు వెలినిఁ ద్రిజగంబులకున్
క్షిప్రగతి నాజగత్త్రయి, నప్రథితవ్రతులు గేస్తులణఁగుదురు సుతా! 86

గీ. కడఁక క్షేత్రజ్ఞుఁడగు పురుషుఁడు చెలంగి, వివిధ భోగాపవర్గ లబ్ధికిని సాధ
నమ్ములైన కర్మోపాసనావిధులను, జెంది దక్షిణోత్తరగతులందు మెలఁగు. 87

ఉ. ఈవిభు నాభిపద్మమున నేను జనించియు నొక్క యజ్ఞమి
చ్ఛావిధిఁ జేయఁగాఁ దలఁచి సజ్జనపువస్తువు లెందుఁ గన్న నా

కేవియుఁ గానరామి మది నెంతయుఁ జింతిలి యీశు రూపమున్
భావన సేయఁ దోఁచెఁ గెలనం బురుషావయవంబు లెన్నియేన్. 88

ఉ. ఆ పురుషాంగకంబులను యజ్ఞపశూత్కరముల్ కుశాదులున్
యూపములున్ వసంతఋతు వోషధులున్ బహువస్తుజాతమున్
లోపము గల్గకుండ రసలోహజలంబులు స్నేహమృత్తులున్
దీపిత ఋగ్యజుస్సులును దీర్ఘము సామము లాదిసర్వమున్. 89

క. ఈరీతిని సంభృతసం, భారుఁడనై పూరుషుని యవయవతతుల నా
పూరుషు యజ్ఞేశ్వరు నిం, పార యజించితిని నిశ్చయాంచితబుద్ధిన్. 90

క. పిమ్మట నీసోదరు లీ, తొమ్మండుగు రగు ప్రజాపతులు ఘనతాత్ప
ర్యమ్మున యజించి రతిహృ, ద్యమ్ముగ గతిఁ బరమపురుషు వ్యక్తావ్యక్తున్. 91

క. మొనకొని తగుకాలంబున, మనువులుఁ బితరులును మును లమరులును దనుజుల్
మనుజులు సర్వేశు య, జనమునఁ బూజించి రంత సద్భక్తి మెయిన్. 92

క. అగుణుండు నిజము భావిం, పఁగ సృష్ట్యాదిన్ గృహీతమాయాగుణుఁడై
భగవంతుఁ డట్టిహరియం, దొగి విశ్వ మధిష్ఠితం బహో! కనుగొంటే. 93

ఉ. ఆవిభుచే నియోజితుఁడనై సకలంబు సృజింతు నేను గా
రీవరుఁడున్ జగంబును హరించును దద్వశుఁడై యమేయ మా
యావిభవంబు లోఁగొని సమస్తము విశ్వముఁ దాన యేలెడున్
బావనమైన యాపురుషభావముతో విబుధర్షిసత్తమా! 94

గీ. నీవు న న్నది యడిగితో నిపుణమతిని, నుడివితిం దాని నీకు నేర్పడఁ గుమార!
కలుగ దీక భగవంతునికంటె భావ్య,మైనది యితరము సదసదాత్మకంబు. 95

శా. నే నౌత్కంఠ్యముతోడ భక్తసులభున్ జిత్తంబునం దుంచుటన్
మౌనీంద్రా! యనృతత్వ మొందదు సుమీ మద్వాక్యపుంజంబు నుం
తేని న్నాహృదయం బసత్యపదవిం జేబట్టఁగాఁ బోదిఁకన్
బూనం బోదు హృషీకరాజి యపథంబుం బెక్కులింకేటికిన్. 96

ఉ. వేయునుఁ జెప్ప నేమిటికి విన్మది నేను దపోమయుండ నా
మ్నాయమయుండ యోగనిపుణస్థిరమానసుఁడం బ్రజాపతి
ధ్యేయుఁడ సత్సమాధియుతధీవిభవాఢ్యుఁడ నయ్యు నెచ్చటన్
నా యుదయంబొ తద్వివరణంబు నెఱుంగఁగ లేకపోయితిన్. 97

చ. పరమపవిత్ర మాశ్రితభవచ్ఛిదురంబు సుమంగళంబు త
చ్చరణము భక్తిపెంపున సాగిలి మ్రొక్కెద జ్ఞానసిద్ధికై

యురుమహిముం డతండె తన ✽ యుజ్జ్వలమాయ నెఱుంగఁ జాలఁ డం
బరము నిజాంతముం గనని ✽ భాతి నటన్న నొరుల్ గ్రహింతురే? 98

చ. ఎవని పవిత్రమార్గతిని ✽ నేనును మీరును వామదేవుఁడున్
వివరముగాఁ నెఱుంగమన ✽ వేయు నిఁకేల యెఱుంగ నేర్తురే?
ధ్రువముగ నన్యు లావిభుని ✽ దుర్లభమాయను జేసి నిర్మితం
బవు భువనం బెఱుంగుదుము ✽ స్వాత్మసమంబుగ మూఢబుద్ధితోన్. 99

క. మముబోంట్ల మెవనియవతా, రములనుఁ దత్కర్మములనుఁ ✽ బ్రస్తుతిఁ గావిం
తుమొ వాస్తవముగ యన్మహి, మము లెఱుఁగమొ వానికి న్న ✽ మస్కృతిశతముల్

క. తనయందుఁ దన్నుఁ దానే, యనువుగ సృజియించుఁ బెంచు ✽ హరియించుఁ గ్రమం
బునఁ బ్రతికల్పంబున న, య్యనఘగుణుం డాదిపురుషుఁ ✽ డజుఁడు కుమారా! 101

ఉ. సత్యము నిర్గుణంబు గత ✽ సంశయ మద్వయముం బ్రపూర్ణమున్
నిత్యము నిర్వికారమును ✽ నిర్మలముం బ్రకటం బనాద్యమున్
స్తుత్యమునైన యాత్మను ఋ ✽ షుల్ గనుఁగొందురు శాంతచిత్తులై
ప్రత్యయదూరులై విషమ ✽ వాదములం జెడి కానలే రొరుల్. 102

వ. మఱియు వినుము. ఆద్యావతారపురుషుండును బ్రకృతిప్రవర్తకుఁడును నగు భగవంతుని
వలనఁ గాలస్వభావంబులును, గార్యకారణాత్మకమైన ప్రకృతియు, మహత్తత్త్వం
బును, మహాభూతంబులును, నహంకారంబును, సత్త్వరజస్తమోగుణంబులు నను
సమష్టిజగత్తును, స్థావరజంగమాత్మకమైన వ్యష్టిజగత్తును గలిగె. పెక్కేల? నేనును,
రుద్రుండును, యజ్ఞుండును, నీ దక్షాది ప్రజాపతులును, భవదాదులును, స్వర్లోకపాల
కులును, ఖగలోకపాలకులును, నృలోకపాలకులును, పాతాళలోకపాలకులును,
గంధర్వవిద్యాధరచారణపతులును, యక్షరక్షోగరుడోరగనాథులును, ఋషిశ్రేష్ఠు
లును, బితృదేవతలును, దైత్యేంద్ర, సిద్ధేశ్వర, దానవేశ్వరులును, ప్రేత, పిశాచ,
భూత, కూశ్మాండ, యాదోమృగపశుపతులును నుద్భవించితిమి. ఐశ్వర్యవం
తము, తేజస్వంతము, నోజస్వంతము, మనశ్శక్తిమంతము, బలోపేతము నగు ప్రతి
పరమాణువును, బరతత్త్వస్వరూపంబ. శ్రీమంతము, హ్రీమంతము, విభూతి
మంతము, నాత్మవంతము, నద్భుతార్థము నగు పరతత్త్వంబు రూపవంతము, నరూ
పవంతము నగు. 103

గీ. నారదా! యాదిపురుషు న ✽ నంతభవ్య, దివ్యలీలావతారముల్ ✽ దెలియఁ బఱుతుఁ
గర్ణదోషనివారణ ✽ కరములును మ, నోజ్ఞములు నగు వీని వి ✽ నుము కుమార? 104

## అధ్యాయము 7.

### హరి లీలావతార వర్ణనము

బ్రహ్మ:—

మ. అతిబాహాబలదర్పితుండయి హిరణ్యాక్షుండు భూగోళము
ద్ధతశక్తిం గొనిపోయి భీషణ సముద్రాంతర్నిమగ్నుండుగాన్
క్షితిభాగోద్ధరణార్థ ముద్యమితుఁడై శ్రీ యజ్ఞదంష్ట్రిక్వరా
కృతి వజ్రంబు మహీధ్రముంబలె విదారించెన్ విభుండాఖలున్. 105

ఉ. భూతగణార్తి వెల్లణఁచు పొంకపు సుయజ్ఞసమాఖ్యతోడ నా
కూతిరుచిప్రజాపతులకున్ సుతుఁడై సుయమాఖ్యనిర్జర
వ్రాతముఁ బుట్టఁజేసి ప్రియురాలగు దక్షిణయందుఁ బ్రీతితోన్
దాతయినట్టి యమ్మనువు తన్భగవంతుఁడనంగ భాసిలెన్. 106

ఉ. ఆ నుతమూర్తి కర్దమగృహంబునఁ బుట్టియు దేవహూతికె
ద్దాన గుణోత్థపంకము విదల్చి విముక్తిపదంబుఁ గాంతురో
స్త్రీనవకంబుతోడి జననీమణి కా గురువిద్యఁ దెల్పి వి
జ్ఞానము సాంఖ్యయోగజముఁ జాటె భువిన్ గపిలాహ్వయంబునన్. 107

మ. మును యత్పాదసరోరుహద్వయరజఃపూతాత్ములై యోగవృ
ద్ధి నిహాముత్రసుఖాత్మముం గనిరొ రక్తిన్ యాదవుల్ హైహయుల్
తనయాపత్యముఁగోరు నత్రికిని నేదత్తుండనంచా జనా
ర్దనుఁడే వాని నాటఁగోలె వర దత్తాత్రేయ సంజ్ఞం గొనెన్. 108

చ. తపమొనరించినాఁడ వివిధంబగు లోకసిసృక్షుఁ దొల్లి మ
త్తపమునఁజేసి నాకు హరి తాను జతుస్సనుఁడౌచు దేనినిం
దపసులు జూతు రాత్మలనుదాని లయావసరంబునందు న
ష్టపడిన యాత్మతత్త్వమును జక్కఁగ బోధ యొనర్చె నల్వురై. 109

వ. వారలే సనక సనందన సనత్కుమార సనత్సుజాతులనంబరఁగిరి. 110

ఆ. దక్షు పుత్రికయనుధర్ముని సతియైన, మూర్తియందు హరి తపోనిరూఢ
సారవిశ్రుత నరనారాయణులనంగ, జెలఁగె ద్వివిధరూపకలితుఁడగుచు. 111

ఆ. ఏ పరేశు నియమలోపంబుఁగల్పింప, న య్యనంగసేనలప్సరసలు
బహుకళావిలాసప్రౌఢిమన్నె ఆపియు, విఫలలైరొ యట్టివిభునిఁగొలుతు. 112

ఉ. ఏపునఁ గోపదృష్టి దహియింతురు కాముముఁ గాని ధీరులా
కోపము తమ్ముఁ గాల్పఁ గయికోరది మాన్పతలంపు నిక్కవం

బాపరమేశ్వరేశ్వరుని యాత్మ పునీతముగాన దానిలోఁ
గోపముఁ గామముం జోరవుకుంఠితమార్గములై యణంగెడున్. 113

మ. గురుదీక్షన్ ధ్రువుఁడీసునన్ సవతిపలుక్కుల్ ముల్కులై నాట భూ
వరు సాన్నిధ్యమునుండి ఘోరవనికిం బ్రత్యగ్గతుండై తప
శ్చరణంజేసి నుతింప విష్ణుఁడు ధ్రువస్థానంబు నర్పించె సా
దరుఁడై దివ్యులు తారుఁ గందురు తదూర్ధ్వస్థంబు నీచైస్స్థితిన్. 114

చ. అపథగతుండు వేనుఁడు ద్విజావళివాక్పవిదగ్ధపౌరుషుం
డపగతభాగ్యుఁడౌచు నిరయస్థుఁడు కా మును లీసువేడఁ బు
త్రపదమునంది పున్నరకతాపముణంచెఁ బృథుండునా నతం
డ పితికె భూమిగోవును మహావసురత్నము లుజ్జ్వలౌషధుల్. 115

చ. అమలమతుల్ యతుల్ పరమహంసపదంబనియంద్రు దేని న
శ్రమపరిముక్తసంగుఁడు బహిఃశాంతహృషీకుఁడు స్వస్థుఁడు స్నితాం
తము సమదర్శనుండునగు నాభిసుదేవిసుతుండు దాని ను
త్తమజడయోగచర్యను సదా నెఱపెన్ ఋషభాఖ్యుఁడత్కళన్. 116

చ. అల తపనీయవర్ణుఁడు మఖాత్మకుఁడు న్నిగమాత్మకుండు కే
వల భగవంతుఁ డాతఁడె సుపర్వగణాత్మకుఁడౌచు మున్నుఁ దా
వెలసె మదీయసత్రమున వేడ్కమెయిన్ హయశీర్షుఁడై తదు
జ్జ్వలతర నాసశ్వాసల లసన్నిగమోక్తులు పెక్కువెల్వడెన్. 117

మ. మనుదృష్టుండు ధరామయుండు హరి శ్రీమత్స్యాకృతిన్ సర్వజీ
వనికాయాశ్రయదివ్యరూపుఁడయి విస్ఫారాంబురాశిన్ మదా
ననమందుండి యుగాంతవేళఁ బెలుచన్ స్రస్తంబులైనట్టి ప్రా
మినుకుల్ దెచ్చి యొసంగి సల్పె నచటం బేర్మిన్ విహారక్రియల్. 118

శా. క్షీరాబ్ధిన్ సురదైత్యకోట్లమృతసంసిద్ధ్యర్థమై ద్రిచ్చుచో
నీరంబందున మంథరాద్రి మునుఁగన్ విష్ణుండు దాఁ గచ్ఛపా
కారుండై నిజపృష్ఠభాగమున వేడ్కం దాల్చి నిద్రాసుఖుం
డై రాజిల్లెఁ గుభృత్పరిభ్రమణకార్యావాప్తకండూతియై. 119

మ. అమరానీకభయాపహంబు నురుదంష్ట్రాభీలవక్త్రంబు ను
ద్భ్రమమాణభ్రుకుటీయుతంబునగు నుగ్రశ్రీ నృసింహస్వరూ
పము నయ్యీశుఁడు దాల్చి భూరిగదతోఁ బైవచ్చు దైత్యేంద్రు దు
ర్దము నాత్మోరువులందుఁ జేర్చి నఖవ్రాతంబులం జీలిచెన్. 120

సీ. ఉరుబలంబగుగ్రాహ ◌ మొడిసి పాదముఁబట్ట, గజయూథనాథుఁ డుత్కటత రార్తి
నంబుజహస్తుఁడై ◌ "యాదిపూరుష! లోక, నాథ! శ్రవశ్శుభ నామధేయ!
తీర్థశ్రవా! దేవదేవా!" యటంచుఁ ద, న్నానియాడ శరణార్థి కూయినివిని
యప్రమేయాత్మకుఁడగు భగవంతుఁడు,వరచక్రపాణియుఁబక్షిరాజ
గీ. వాహనుఁడునౌచు వేగఁ దద్గ్రాహముఖము, చక్రమునఁ జీల్చి హస్తిరా, జమును గరముఁ
బట్టియెత్తెను వరసత్కృపాతరంగి, తాత్ముఁడగుచు వియచ్చరులభినుతింప. 121

సీ. అదితిపుత్రులలోన ◌ నవరజుండయ్యు గు,ణావళిం బెద్దయై ◌ యజ్ఞవిభుఁడు
ధర్మపథప్రవర్తకుని యాచనఁ దక్క, దఘు లల్లార్పంగఁ దగదు కాన
వామనాకృతిఁగొనిబలినిఁ బదత్రయ, వ్యాజంబునన్ భూమినడిగి పడసి
మూఁడుపాదంబులమూఁడులోకంబుల, ముట్టి స్వర్లోక విభుని కొసంగె
గీ. నాత్రివిక్రము పాదపవిత్రజలము, నెవఁడు తలఁదాల్చె వెండియు నెవ్వఁడరికి
స్వప్రతిజ్ఞాతమునకు శీర్ష మిడె నట్టి, బలికి న్యూనత కాదె దేవపతిపదవి! 122

వ. మఱియు నో నారదా! హంసావతారంబున నతివివృద్ధభక్తిభావంబునఁ బరితుష్టుండైన భగవంతుఁడు యోగశాస్త్రంబును, మఱియు వాసుదేవశరణులైన వారు శీఘ్రంబ గ్రహించిన భగవత్సంబంధమును నాత్మతత్త్వప్రదీపకంబునునగు జ్ఞానంబును నీకు లెస్సగ నుపదేశించెనుగదా! మనురూపధరుండైన భగవంతుఁడు దశదిశల వ్యాప్తంబైన స్వతేజోరూపచక్రంబును మన్వంతరంబులఁదాల్చి తన చరిత్రంబులన్ వెలుంగు స్వకీర్తిని లోకత్రయపృష్ఠభూతంబగు సత్యలోకంబున విస్తరింపఁజేయుచు దుష్టరాజనిగ్రహంబొనర్చె. ఇఁక ధన్వంతరి యవతారంబున భగవంతుఁడు కీర్తిమంతుండై నామస్మరణమాత్రంబున బహువిధరోగులైన నరుల రోగంబుల శీఘ్రంబ వాపు. అమృతాయుష్కుండై యజ్ఞంబున భాగంబు నొందు. ఆయుర్వేదంబును శాసించు. 123

మ. అవనీకంటకులన్ విధీరితుల బ్రహ్మద్రోహులన్ ధారుణీ
ధవులం బ్రోజ్ఝితమార్గుల న్నరకబాధాలిప్సులన్ ధీరతన్
బవితుల్యంబగు గండ్రగొడ్డటను శుంభత్త్రోధి ముయ్యేడుమా
ర్లు వధించెన్ భృగురాముఁడై విబుధవర్యుల్ మెచ్చగా నారదా! 124

ఉ. మాకుఁ బ్రసాదదృష్టినిఁ గమన్నన లిచ్చిన యా రమేశుఁ డి
క్ష్వాకుకులంబునందుఁ బొడగట్టి నిజానుజయుక్తుఁడున్ సప

త్నీకుఁడు నాఁడు దా గుహ నిషాదేశమునన్ వనిఁ జొచ్చినట్టి సు
శ్లోకునితోఁ బగంగొని ఖలులంతు చెడెన్ దశకంఠుఁ డయ్యెడన్. 125

చ. త్రిపురములం దహించు హరదేవునికై వడి విక్రమించి వై
రిపుర దిధక్షువై యపరు శ్రీరఘురాముని రోషతామ్రని
ష్కృపకటుదృష్టిత ప్తజలజీవము నూఢభయాంగకంబునై
విపులతరార్ణవంబు రఘువీరునకుం వెసనిచ్చె మార్గమున్. 126

మ. పృతనామధ్య సముజ్జ్వలత్పృథు ధనుస్సర్విస్ఫూర్తులన్ ధీరుఁడై
సతినిన్ మృచ్ఛిలినట్టి పంక్తిముఖు పక్షుస్పర్శ నిర్భగ్నుఁడై
వతరాడ్దంతి రదానుకారిత కకుప్పమ్యగ్జయ శ్రీమదో
ద్ధతహాసంబును బ్రాణసంయుతముగా దా మాపు శ్రీరాముఁడై. 127

చ. సురరిపుకోటి పీడిత వసుంధరఁ బ్రోవఁ గళాసమేతుఁడై
నెరి సితకృష్ణకేశత జనించి జనానుపలక్ష్యమార్గుఁడై
యురుమహిమావబోధక మహోజ్జ్వల విస్తృతకర్మము న్నిజే
శ్వరతకు ముఖ్యహేతువయి వర్తిలనొప్పగలండు కృష్ణుఁడై. 128

సీ. చిఱుతయై పూతనాజీవముల్ గొనుటయుఁ, ద్రైమాసికుఁడయి పదంబుచేత,
శకటదానవునిఁ గొంకక కూలఁదన్నుట, జానుగుండయి యాకసంబునంటు
యమళార్జునముల నడిమికిఁ జయ్యనఁ బోయి, పెకలించుటయుఁ గడువింతకాదె
వ్రేపల్లెలోపల విషతోయములఁ ద్రావి, పడిన గోపాలురఁ బశుచయముల

ఆ. స్వప్రసాదదృష్టివర్షంబుచే జీవింపఁజేసి నదినివిమలపఱప
భీకరవిషవీర్యుఁడౌ కాళియుని నది,నుండి వడి గెడపఁ గలం డతండు. 129

మ. అతిలోకంబగు దివ్యకర్మమిది దావాగ్నిజ్వాలజ్వాల లు
ద్ధతి గ్రీష్మర్తువనంబు నేర్చుతఱి సంత్రస్తాత్ములై గోపసం
తతియెల్లన్ మృతి తప్పదంచుఁ దలపం దాలాంకుతో దుర్గ్రహ
ప్రతిభుండై కనుమూయఁజేసి వెసఁ గాపాడంగలం డెల్లరన్. 130

చ. సుతుఁడగు నా మహామహు యశోద యులూఖల బద్ధుఁ జేయఁగా
జతపడ నెన్ని రజ్జువులు సాచిన పొట్టకుఁజాలకుండు నా
యతివయె యావులింపఁగఁ దదాస్యమునందు సమస్తలోకసం
తతిఁ గని శంకితాత్మయయి తత్ప్రతి బోధితయౌను గ్రమ్మఱన్. 131

ఉ. వారక నందునిన్ వరుణపాశభయార్తి విముక్తుఁ జేసెడున్
శూరత గోపకాళిమయసూనునిచే బిలపాతితంబుగా

గాఁ దహింపఁ బ్రోచెదుం బవలు కార్యపరంబయియుండి రేయి ని
ద్రారతమైన గోకులముఁ దార్చు వికుంఠపురంబు నర్మిలిన్. 132

ఉ. జన్నము గోపకుల్ సెఱప శక్రుఁడు గోకులవిప్లవార్థము
త్పన్నరుషం బ్రవృష్టిఁ బ్రతిభం గురియం బశుకోటి రక్షకున్
వెన్నుఁడు సప్తవర్షుఁ డవనీధ్రము ఛత్రములీలఁ బట్టుఁ దా
ఖిన్నతఁ దాల్పఁ బోక యొకకేలన సప్తదినంబు లున్నతిన్. 133

శా. బృందారణ్యమునందు శీతకరదీప్తిస్ఫీతమై యొప్పు రే
యందున్ రాసరతోత్సుఁడై హరి సముద్యన్మూర్ఛనా సంగతిన్
గందర్పజ్వర పీడితాంగ లవుటన్ గ్లాంతాత్మలౌ వ్రేతలన్
బందింబెట్టిన శంఖచూడుని శిరోభాగంబుఁ దున్మాడెడిన్. 134

చ. ఖర ముర కేశ్యరిష్ట నరక ద్వివిద ద్విప సాల్వ కంస శం
బర యవన ప్రలంబ శిశుపాల జరాసుత దంతవక్త్ర ద
ర్దుర, వృష మల్ల పల్వల విదూరథ పౌండ్రక రుక్మిముఖ్యులౌ
సురరిపుకోటులం దునిమి శోభనముం గలిగించు నుర్వికిన్. 135

మ. కలసన్ విక్రమశాలులై యొసఁగు లోకఖ్యాతు లుద్యచ్ఛరా
సులు కాంభోజక, మత్స్య, సృంజయ, కురుక్షోణీపతుల్ కేకయుల్
బలభీమార్జునకైతవాఖ్యుఁడగు నాపద్మాక్షుచే సత్కళా
నిలయంబైన వికుంఠధామము నయాన్వీతంబుఁ బ్రాపింత్రొగిన్. 136

గీ. కాలగతి నల్పమతియు స్తోకాయువుగల
నరులకున్ దుర్గమంబు స్వాగమామ్నాయ మనుచు
వ్యాసుఁడై సత్యవతియందు నవతరించి
వేదతరువును విభజించు విటపములుగ. 137

చ. నిగమపథంబునందుఁ గడునిష్ఠఁ జరించెడు దానవావళుల్
దెగి మయనిర్మితంబులు నదృశ్యజవంబులునౌ పురాళిచే
జగములనొంచుచుండఁ బెలుచన్ మతిమోహమతిప్రలోభవే
షగతులు కూర్చి బుద్ధుఁడయి యనల్పగలం దుపధర్మబోధమున్. 138

ఉ. ఏతఱిఁ గల్గవో బుధులయిండ్లను విష్ణుకథల్ ద్విజన్ములున్
బాతకులౌదురో ధరణిపాలకులై వృషలుల్ చరింత్రో స్వా
హాతతవాక్కులుం జెలఁగవా కలికాలమునన్ మహామహుం
డీతఁడు ధర్మశాసనము నేర్పడఁ జేయును గల్కిమూర్తియై. 139

సీ. సృష్టినిఁ దపమేను ఋషులేడ్వురును బ్రజాపతులు తొమ్మండ్రును బరఁగుదు మొగి
స్థితిని ధర్మంబును గ్రతురూపవిష్ణువు, సుర మను నృపతులు వరలుచుండ్రు
యంతంబున నధర్మహరమన్యువశదాన,వాదులు నియమితులగుచునుండ్రు
బహుళశక్తిధారియౌ భగవంతుని యమేయ,లలిత మాయావిభూతులివిసుమ్ము
గీ. యిసుకరేణువులన్ గణియించుఁగాని, సత్యలోకంబు వ్యాపించు శక్తివలన
సర్వముధరించునట్టి యా జగదధీశు, వీర్యగణనము నెవఁడు గావింపఁగలఁడు ?
గీ. ఏను నీమును లాద్విజుల్ పూని యాది,పురుషుమాయాబలాంతంబు నెఱినెఱుఁగమ
టన్న నన్యులు నేర్తురె ? యాదిశేషుఁ,డానన సహస్రములఁ గొనియాడలేఁడు.
చ. అపగతసర్వచింతుఁడు సమాశ్రితపాదుఁడు నిర్వ్యళీకుఁడై
యెప్పుడు జనుండు తద్భజనమేర్పడఁ జేయునొ శ్రద్ధధానుఁడై
యప్పుడ విభుండు చూపు దయనాతనిపై శ్వసృగాల భక్ష్యమౌ
వపువున మోహమున్ విడుచు వారు తరింతురు మాయశక్తులన్. 142

వ. నారదా! ఆ పరముని యోగమాయను నేనును మీరును భగవంతుఁడైన శివుండును, దైత్యవర్యుండైన ప్రహ్లాదుండును, మనుపత్నియైన శతరూపయు మనువును దత్పుత్రులును బ్రాచీనబర్హియు, ఋభుండును, నంగుండును, ధ్రువుండును, నిక్ష్వాకుండును, నైలుండును, ముచికుందుండును, విదేహుండును, గాధియు, రఘువును, నంబరీషుండును, సగరుండును, గయుండును, నహుషాదులును, మాంధాతయు, నలర్కుండును, శతధన్వుండును, రంతిదేవుండును, దేవవ్రతుండును, బలియు, దిలీపుఁడు, సౌభరియు, నుతంకుండును, శిబియు, దేవల, పిప్పలాదులును, సారస్వతుండును, నుద్ధవుఁడును, బరాశరుండును, భూరిషేణుండును, విభీషణాదులును, హనుమదాదులును, నుపేంద్రుండును, దత్తుండును, బార్థుండును, నర్ష్టిషేణుండును, విదురుండును దెలిసి యతిక్రమింతుము. 143

శా. శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాదనా
ధీనైకాత్మత నొప్పు నేని నెలమిం దిర్యక్తతుల్ పక్షిసం
తానంబుల్ వనితాజనంబులును శూద్రమ్లేచ్ఛహూణవ్రజం
బైనం దారు తరింతు రా విభుని మాయారూపపాథోనిధిన్. 144

గీ. నిత్యశాంతస్వరూపంబు నిర్మలంబు
నభయమున్ జ్ఞానరూపంబు నాత్మపదము
సమము సదసదాత్మమగు బ్రహ్మమును గాంచి
లజ్జపడి మాయయెప్పుడు తొలఁగుచుండు. 145

ఉ. నేరుపుకోడ నిర్మలముగనిత్యసుఖంబు విశోకమైన యా
పూరుషవర్యు దివ్యపదమ్ముం దగ బ్రహ్మముగా నెఱుంగుచున్
ధీరులు పూన రన్యములుగనిక్కమ యింద్రియము లుయ్యు ద్రవ్వఁగాఁ
గోరి ఖనిత్రకంబు గయిగోని విధంబునఁ బూర్ణకాములై. 146

క. ఫలదుఁడు భగవంతుం డుజ్జ్వల శక్తియుతుండు సర్వజగదీశుఁడునై
కల దేహములు చెడినను దానలరును శాశ్వతముగా విహాయసము క్రియన్. 147

క. హరికంటె సదసదాత్మము, పరమొద్దియు లేదు వాస్తవంబిది పుత్రా!
యురువిశ్వరూపుఁడగు నా, పరమేశు విభూతి దెల్పఁబడియె న్నీకున్. 148

క. భగవంతుఁడు నాకుఁ బ్రియ,మ్మగ నీభాగవతముం బ్రబోధించె సుతా!
భగవద్విభూతిసంగ్రహ, మగు దీనిని విస్తరింపుమా సద్భక్తిన్. 149

క. సకలాధారుఁడు సకలా, త్మకుఁడగు హరియందు భక్తి దనరునటుల్ పు
త్రక! యెంచి దీని నరులకు, నీక వర్ణింపఁగదె లోకహితయుతమతివై. 150

మ. అపవర్గప్రదుఁడైన కృష్ణునెడ వీతాపాయమా భక్తి ధ
ర్మపరీతంబయి యొప్పకున్న నరజన్మంబందు సంతుష్టి సుం
తుపలబ్ధంబగునొక్కొ దేహగతమోహాత్సేకయుక్తంబులౌ
యపమార్గంబులఁ దాఁ బ్రవర్తిలుట యాయాసంబు మాత్రంబెయా. 151

మ. సకలాఘాఘ నివారకుండును లసచ్చారిత్రుఁడున్ సర్వమో
దకరాకారుఁడునౌ ముకుందుపయి యుద్యద్భక్తి లేకున్న నే
టికి వర్ణాశ్రమధర్మకోటి పరిపాటిన్ దానకర్మంబు లే
టికిఁ జింతింపఁగ సత్తపోవిధులు దా ఢిల్లపోవఁగా నేటికిన్. 152

క. హరిలీలలు వర్ణించిన, గురుభక్తిన్ వినిన నీయకొనినన్ విను మా
నరుల మనము పెనుమాయం, బొరయక యత్యంతసుఖముఁ బొందు మునీంద్రా!

---

## అ ధ్యా య ము 8.

### పరీక్షిన్మహారాజ సంప్రశ్నము

రాజు:—

ఉ. నారదుఁ డారమేశుని గుణంబులు దెల్పుటకై పితామహ
ప్రేరితుఁడౌచుఁ దత్వసమభిజ్ఞత నెవ్వరికెట్లు దెల్పె వి

స్తారముగాఁగ దీని నెఱకదం దెలియన్ గమకించుచుంటి నా
శౌరికథల్ దలంపఁగఁ బ్రశస్తము లద్భుతముల్ యతీశ్వరా! 144

ఉ. ఏ నెటు లాత్మరూపుఁడగు కృష్ణునియందు మనంబునిల్పి యీ
మేనుఁ ద్యజింతు నత్తెఱఁగు మేకొని నాకు ననుగ్రహింపు మౌ
ధీనిధి! శ్రద్ధతో నతని దివ్యవిలాసములన్ వచించినన్
వీనులవిందుగా వినిన విష్ణుఁడు వేగమ సొచ్చు నాత్మలోన్. 155

క. తనభక్తుల హృత్పద్మం, బును జయ్యనఁ గర్ణరంధ్రములఁ జొచ్చి జనా
ర్దనుఁడు శరదృతువు జలమల, మును గైవడిఁ జిత్తమలినము నపహరియించున్. 156

చ. తెరువరి గ్రీష్మతాపమున దేహము తప్తముగాఁగ డస్సి మం
దిరమును జేరి దాని విడనేరనికైవడి వీతఖేదుఁడై
పురుషుఁడు క్షాళితాత్ముఁడయి మోదముతో హరిపాదమూలమున్
స్థిరముగ నాశ్రయించియుఁ ద్యజింపఁ దలంపఁ డొకప్పు డేనియున్. 157

ఆ. సకల భూతకోటి సంసర్గశూన్యమా, యాత్మకెట్లుఁగలిగె నదియె మఱల
నిర్ణిమిత్తముగనొ నిజకర్మవశతనొ, యా క్రమంబుఁ దెలుపవయ్య నాకు. 158

వ. ఎవని యుదరమునుండి లోకసంస్థాన లక్షణంబగు పద్మంబు వొడమె? అందు సర్వావయవస్ఫూర్తిగల బ్రహ్మదేవుం డుదయించి భూతమయుండై భూతంబుల నెవ్వాని యనుగ్రహంబున సృజించె? నాభిపద్మసముత్పన్నుండై తద్రూపం బెట్లు గాంచె? విశ్వ సృష్టిస్థితిలయకర్తుండైన యప్పురుషోత్తముఁ డాత్మమాయం ద్యజించి సర్వగుణాశ్రయుండై మాయేశుండై యెచ్చట శయనించు? పాలక సహితంబులగులోకంబులాపురుషోత్తమునవయవంబులచేఁ బూర్వకల్పితంబులె. సపాలకంబులగు లోకంబులచే నీపురుషావయవంబులు కల్పితంబులనియు విని యుంటిని. కల్పమన వికల్ప మననెట్టివి? కాలం బెట్లూహింపఁబడు? నా సత్త్వ స్వరూపునకు భూత భవిష్య ద్వర్తమానాత్మకంబగు నాయుర్మానమేది? అణు రూపంబును బృహద్రూపంబును నగు కాలానుగతి యెట్లు లక్షింపఁబడు? కర్మ గతు లెంతపరిమితిగలవి? ఎట్టివి? పరిణామమునుగోరు గుణములయు గుణులయు కర్మసముదాయ మెవనియం దెట్లు దేనిచే గ్రహింపఁబడు? భూపాతాళ దిగ్వ్యోమ గ్రహ, నక్షత్ర, పర్వతములయు; సరిత్సముద్రద్వీపములయు, తద్వాసులయు సంభవం బెట్లు? బాహ్యాభ్యంతర భేదంబువలన నండకోశంబు ప్రమాణంబు, మహనీయుల చరిత్రము వర్ణాశ్రమనిశ్చయము నెట్లు జరుగును? ఆ విభుని యాశ్చ ర్యతమంబగు నవతారచరిత్ర మెప్పుడు కలుగు? బ్రతియుగంబున యుగములు

యుగమానములనువాని ధర్మములెయ్యవియైయుండు? నరుల సాధారణధర్మంబేది? విశేషధర్మంబేవి? రాజర్షిశ్రేష్ఠుల ధర్మంబులును, కృచ్ఛ్రజీవనుల ధర్మంబులును నెట్టివి? మహదాదితత్త్వముల సంఖ్యయుఁ దల్లక్షణంబులును, దద్ధేతులక్షణంబులును నెట్టివి? పురుషోత్తమారాధనవిధియు, నాధ్యాత్మికయోగవిధియు నెట్టిది? యోగేశ్వరుని యైశ్వర్యగతియు యోగుల లింగశరీరభంగమును వేదోపవేద ధర్మేతిహాస పురాణంబుల స్థితియు నెట్టివి? సర్వభూతోపప్లవంబును మహాప్రళయంబును నెట్టివి? ఇష్టాపూర్తంబులును, గామ్యకర్మంబులును, ద్రివర్గంబును నెట్టివి? జీవసృష్టియు, పాషండమతసంభవంబును, నాత్మకు బంధమోక్షంబులును, స్వరూపంబున నెట్టివై యుండు? ఆత్మమయుండైన భగవంతుఁ డాత్మమాయచేఁ గ్రీడించుచు మాయనువిడిచి యెట్లు సాక్షిరూపంబున నుదాసీనుఁడై యుండు? ఇదియెల్ల నే నెఱుఁగఁగోరితిని గాన నో మహామునీంద్రా! ప్రసన్నుండవగు నాకు వాస్తవముగ నెఱింగింప నీవ యర్హుండవు. ఇందు నీవును నాత్మభవుండగు పరమేష్ఠియుఁ బ్రమాణంబు. అన్యులును బూర్వజకృతంబగు పూర్వులమార్గము ననుసరింతురు.
• ఓ బ్రహ్మస్వరూపా! భవన్ముఖపద్మమునుండి వినిస్రుతంబగు వాసుదేవ నామామృతమును గ్రోలుచున్న నా యీ ప్రాణంబులు నిరాహారంబువలనఁ బరాధీనంబులుగాక వశంబులై యున్నయవి. 159

సూతుఁడు:—

చ. అని నృపశేఖరుండడుగ । నా శుకయోగి ప్రహృష్టచిత్తుఁడై
వనరుహసూతికట్లు భగ । వంతునిచే మును బ్రహ్మకల్ప వే
ళను దెలుపంగఁబడ్డ విమ । లంబగు భాగవతాఖ్య సంహితన్
వినిచె నిటుల్ మహీరమణ । పృష్ట తదన్యమునుం గ్రమంబునన్. 160

---

## అధ్యాయము 9.

### శ్రీహరి నిత్యవిభూత్యాది వర్ణనము. వైకుంఠలోక వర్ణనము

శ్రీశుకుఁడు:—

గీ. భూతహితుఁడును జ్ఞానసమేతుఁడు నగు, ప్రాణికెట్లగు దేహసంబంధమన్న
స్వప్నముంగనువానికి । స్వప్నదేహ, మట్లు హరిమాయలేక దేహముకలుగదు.

క. బహురూపమైన మాయన్, బహురూపము కల్గినట్లు । పరగును దనువుల్
అహహా! యీమాయాగుణ,మహిమలఁగూడఁగ నహంతమమతయుఁగలుఁగున్.

గీ. "ఇట్టి జీవునకును ముక్తి యెట్లు గలుగు?", నన్న జీవుండు కాలమాయాతిగమగు
నాత్మరూపము ధ్యానించి యస్తమోహుఁ, డగుచుఁ గ్రీడించెడు భవభయంబు
విడిచి. 163

గీ. అవ్యళీకవ్రతాదృతుం డగుచు విభుఁడు, స్వస్వరూపంబుఁ జూపుచు బ్రహ్మకాత్మ
తత్త్వసిద్ధికినై పవిత్రతరమైన, వాక్యము లియ్యది పల్కె నా వాక్కు వినుము. 164

గీ. భజనపరుఁడు గురుండగు బ్రహ్మ నిజగృహాట్టమందుండియు సిసృక్షు నరసెఁగాని
విశ్వనిర్మాణవిధి దేన వెలయు నట్టి, సృష్టిసమ్మతదృష్టిని జెందఁడయ్యె. 165

గీ. సృష్టికై చింతఁ జేయుచు స్రష్ట వినియె, నుదకమం దొకనాఁడు ద్విరుదితవాక్కు
స్పర్శముల షోడశైకవింశాత్మక "తప", యను నకించనధనమైన దివ్యాక్షరంబు.

గీ. దీని వినియుఁ దద్వక్తృ దిదృక్షు దెసలఁ, గనియు నందన్య మెద్దియుఁ గానరామి
స్వనిలయముఁ జేరి యరసి తపంబు నందు, నియమితుఁడువోలె మనమును నిలిపె శ్రద్ధ.

వ. ఇట్లు బ్రహ్మదేవుం డమోఘదర్శనుండును, జితానిలాత్ముండును, జితోభయేంద్రియుండు నునై సమాహితబుద్ధితో నఖిలలోకతాపకరంబగు తపంబు గావించె. అంత భగవంతుండు సభాజితుండై యవ్విరించికిఁ గ్లేశవిమోహసాధ్వసరహితంబును సద్భాగధేయులగు విబుధులచే వినుతంబును నిరతిశయంబునగు స్వలోకం బగు వైకుంఠంబుఁ గనంబఱచె. ఆ వైకుంఠంబున రజస్తమంబులుకాని రజస్తమోమిశ్రంబగు సత్త్వంబుకాని కాలవిజృంభణంబుకాని ప్రవర్తింపదు. మఱియు నందు మాయాబలంబునకుఁ దావులేదు. ఇతరంబులగు రాగలోభాదు లందుఁ గలుగవని వేఱ చెప్పనేల? యాపరమపదంబున సురాసురాభ్యర్చితులును, హరిపాదామృతరసపానాభినిరతులును, ముక్తులును, నగు పుణ్యులుందురు. వారు శ్యామావదాతులు, శతపత్త్రలోచనులు, పీతాంబరధరులు, మనోహరకాంతిభాసితులు నగు సుందరులునై యొప్పుదురు. మఱియు నందఱుఁ జతుర్భుజులు, నుజ్జ్వలన్మణిభూషణభూషితులు, సువర్చసులునై వెలుంగుదురు. మఱియు విద్రుమవైడూర్య మృణాళవర్చస్కులు, విస్ఫురత్కుండలమాళివిరాజమానులు నై ప్రకాశింతురు. అమ్మహాత్ముల విభ్రాజమానవిమానశ్రేణులచే నంతట విరాజిల్లుచుఁ గాంతాజనకాంతంబయి విద్యోతమానంబగుచు విద్యుదభ్రావళీసమేతంబగు నభంబువోలె నప్పురంబు దేజరిల్లుచుండు. అందు మూర్తిమతియై శ్రీదేవి పెక్కువిభూతుల నాభగవంతుని పాదపద్మపూజను గావించుచుండు. మఱియు నా శ్రీదేవి యాందోళికాధిష్ఠితయై వసంతానుగంబులగు భ్రమరంబులచే విగీయమానయై తాను శ్రీహరి ప్రియకర్మకలాపంబును, గానముఁ జేయు

చుండు. అం దఖిలపార్షదులకు విభుండును, శ్రియఃపతియు, యజ్ఞపతియు జగత్పతియునగు నాభగవంతుని బ్రహ్మ పొడగాంచె. సునంద నందప్రబలార్హణ ప్రభృతులగు నిజపార్షదముఖ్యులచేఁ బరిసేవితుండును, విభుండును, భృత్యప్రసాదాభిముఖుండును, బ్రసన్నహాసారుణలోచనాననుండును, దృగాసవుండును, గిరీటకుండలాలంకృతుండును, జతుర్భుజుండును, బీతాంబరుండును, లక్ష్మీలక్షిత వక్షస్స్థలుండును, నభ్యర్హణీయాసనుండును, జతుష్షోడశ పంచశక్తి పరివృతుండును, స్వకీయైశ్వర్యయుక్తుండునునై యాఘుణ్యధామంబునఁ గ్రీడించు నీశ్వరు నిట్లు సందర్శించి యాభగవద్దర్శనాహ్లాదపరిప్లుతాంతరంగుండును, హృష్యచ్ఛరీరుండును, బ్రేమభరాశ్రులోచనుండునునై విశ్వస్రష్టయగు చతుర్ముఖుండు పరమహంసపథంబునఁ బ్రాపింపఁదగిన తత్పాదాంబుజద్వంద్వంబునకు నమస్కరించె. అంత- 168

ఉ. ప్రీతమనస్కుఁడై విభుఁడు ప్రేమఁ దలిర్పఁగ మందహాసరుక్
స్ఫీతమృదూక్తులం దరికిఁ జేరిన బ్రహ్మను లోకసృష్టిని
ర్మాతృపదోచితుం గని కరంబునఁ దట్టుచు నిట్లు పల్కె నే
నీ తపముం గడుం బరిగణించి ప్రహృష్టుఁడనైతిఁ బద్మజా! 169

భగవంతుఁడు:—

గీ. పెద్దకాలము ఘనతపోవృత్తి లోక, సృష్టి నర్థించి యొనఁగు నీచేత నధిక
తోషితుఁడనైతిఁ గపటమతులగుయతుల, విధముఁ గని తుష్టిఁ జెందనో వేదగర్భ.

చ. వరదుఁడ నాదు నీకు నభివాంఛితముం గడు భద్రదంబునౌ
వరమును గోరు మిచ్చెదను వారిజసంభవ! లోకమం దిటుల్
పురుషులకున్ శుభంబులను బొందుటకై పడు పాట్లు మన్మహ
త్తరశుభదర్శనావధులు తథ్యము నమ్ముము నాదు వాక్యముల్. 171

క. ఏకతమున నానుడి విని, నీకుఁ దపముసేయ నయ్యె నిక్కము మఱి మ
ల్లోకావలోకనంబును, జేకుఱె మత్కృపను దపముచేఁగా దరయన్. 172

చ. కమలజ! కర్మముగ్ధుఁడవు కాఁగ నినుంగని జాలివుట్టి యీ
యమలతపంబుఁ దెల్పితిసుమా యది నాహృదయంబు కేవలం
బమరుదు నా తపంబునకు నాత్ముఁడనై తపమూని సర్వలో
కమును సృజింతుఁ బెంతు నణగార్తుఁ దపంబిది దుశ్చరంబగున్. 173

వ. అని భగవంతుఁడగు విష్ణుండు తపోమాహాత్మ్య ముగ్గడింప విని సరసిజగర్భుండా పద్మనాభున కిట్లనియె 174

బ్రహ్మ:—

వ. ఓ భగవానుఁడా! సర్వభూతాధ్యక్షుండవై హృదయగుహాయందుఁ జేరి యప్రతిరుద్ధంబైన ప్రజ్ఞానంబునఁ జికీర్షితంబగు దానిఁ దెలిసి కొంటి. ఐనను నరూపివైన నీ పరాపరరూపం బెట్లెఱుంగుదునో నిన్నర్థించుచుంటిఁగాన నా కా ప్రార్థితార్థంబు నెఱింగింపుము. నాథా! యాత్మమాయాయోగంబున వివిధశక్త్యుపబృంహితంబగు విశ్వంబును, సృజించుచుఁ బెంచుచు సంహరించుచుఁ స్వయంబుగ బ్రహ్మాదిరూపంబుల గ్రహించుచు నూర్ణనాభి తంతువులతోడం బలె నమోఘసంకల్పుండవై క్రీడింతువు. కావున మాధవా! తద్విషయికమైనబుద్ధిని నాయందుఁ బ్రసాదింపుము. అనలసుండనై భవచ్ఛిక్షితంబును నేనుగావింతును. భవదనుగ్రహంబునఁ బ్రజాసర్గంబును జేయుచున్నను నహంకారామల బద్ధుఁడఁగాకుండుదును. ఓ యీశా! సఖుండు సఖునకుంబలె నీవు నా కాదరంబుఁ జూపితివి. కాని ప్రజాసర్గంబున నీ నియోగంబునంజేసి జనంబును నుత్తమమధ్యమాధమభేదంబుల సృజించునంతఁదనుక బ్రహ్మాత్వాభిమానినగు నాకు సముత్కటమదంబు జనింపకుండుఁగాక యనివేడిన. 175

భగవంతుఁడు:—

ఆ. పరమగుహ్యమగుచుఁ బరఁగు జ్ఞానంబు వి, జ్ఞానము సరహస్యకంబులగు త
దంగములును దెల్పెదంగద వానిని, సంగ్రహింపు మయ్య జలజగర్భ! 176

సీ. నాస్వరూపంబును నాస్వభావంబును, నా నామగుణములు నాదు కర్మ
మెఱుఁగుటయే గణియింపఁగాఁ దత్త్వవిజ్ఞానమనంబడు దాని నీవు
మదనుగ్రహంబున విదితుండవగుదు వీ, వాది నేనొక్కఁడనై చరింతు
సదసదాత్మకమైనయది యన్యమేదియు, నాకంటెఁ బరముఁ గానంగ రాదు
గీ. సృష్టికాలమున నేను వసింతు నేది, మిగిలియుండునో యది నేను నిగమగర్భ!
యేదిలేకయు వడిఁదోఁచు నేదియుండి, తోఁప దదియెల్ల నాదుమాయారూపదంబు.

వ. ద్విచంద్రాదికంబును, దమఃప్రభాసితంబును, నిందులకు దృష్టాంతంబై యుండు. మహాభూతంబులు ఘటపటాదివస్తుజాలంబునందుఁ బ్రవిష్టంబులయ్యు నప్రవిష్టంబులగునట్లు యేనును నీ సకలభూతంబులఁ బ్రవిష్టుఁడనయ్యుఁగాకుండు. తత్త్వజిజ్ఞాసువులకు నన్వయవ్యతిరేకంబుల సర్వదా సర్వత్ర యివ్విధంబున నెఱుంగనగు. పరమంబగు సమాధిచే నీ మత మవలంబింపుము. కల్పవికల్పంబుల నెన్నఁడేని మోహంబును బొరయంజాలవు. అని మఱియు శుకుండిట్లనియె. 178

శ్రీశుకుఁడు:—

క. అని యిట్లు పద్మభవునకు, వనజదళాక్షుండు బోధపఱచి యతండున్
గనుచుండఁ దనదురూపం,బు నదృశ్యముఁ జేసె బ్రహ్మ సుగ్రుఁడు కాఁగన్ 179

క. అంతర్హిత రూపుఁడగు ము,రాంతకునకుఁ బద్మజుఁడు గృహీతాంజలియై దా
నంతటఁ దొల్లిఁటివలె ని,శ్చింతగ నీవిశ్వమును సృజించె నరేంద్రా! 180

గీ. ధర్మపతియా ప్రజాపతి తాను స్వార్థ
కామ్యనిరతుఁడు కాక యొక్కదినమందు
బ్రజలభద్రంబు తనదు భావమునఁ గోరి
యమనియమములఁ బాటించి యలరుచుండె. 181

ఉ. మాయనెఱుంగఁగోరుచుఁ గుమారులలోఁ బ్రియుఁడున్ గుణాఢ్యుఁడున్
ధీయుతుఁడైన నారదుఁ డతిప్రకటంబగు శీలసంపదన్
బాయని ప్రశ్రయంబునను భక్తిని సేవలు చేయుచుండి యా
తోయజగర్భునిన్ జనకుఁ దుష్టిపరీతునిఁ జేసె భూవరా! 182

క. స్వపితయు నజుఁడును లోక, ప్రపితామహుఁడునగు బ్రహ్మఁ బ్రముదితుఁ గని ని
ష్కపటత నారదుఁ డడిగెను, నిపుణత నను నీవుపోలె నృపతివరేణ్యా! 183

క. భాగవతపురాణ మ్మిది, యాగమసమము దశలక్షణాఢ్యము హరిచేఁ
దా గదితము బ్రీతుండయి, వేగమ పుత్రునకుఁ దెలిపె విధి వివరముగన్. 184

చ. తెలిపె సరస్వతీవిమలతీరమునం దిది నారదుండు ని
ర్మలమతి బ్రహ్మతత్త్వముఁ గరంబును ధ్యానముచేయుచున్న య
త్యలఘుతరోరుతేజుఁడగు వ్యాసునకింక వి౦ంట్వరూపమం
దెలమి జగత్తతుల్ పొడముటెట్లని నీవనుదానిఁ దెల్పెదన్. 185

---

## అధ్యాయము 10.

### జీవాదితత్త్వసృష్టి

శ్రీశుకుఁడు:—

వ. రాజా! సర్గంబును, విసర్గంబును, స్థానంబును, బోషణంబును, నూతులును, మన్వంతరంబులును, నీశానుకథలును, నిరోధంబును, ముక్తియు, నాశ్రయంబు నను దశలక్షణంబుల నీ మహాపురాణం బొప్పారుచుండు. దశమలక్షణంబగు నాశ్రయంబు విశుద్ధార్థంబు. మహాత్ములు నవలక్షణంబుల వర్ణింతురు. పంచభూతంబు

లయు, పంచతన్మాత్రలయు, నింద్రియబుద్ధులయు జన్మంబు సర్గంబనంబడు. పరమేశ్వరువలన గుణవైషమ్యమునంజేసి పొడము చరాచరభూతసృష్టి విసర్గంబనంబడు. భగవంతుండగు వైకుంఠుని విజయంబు స్థానమనంబడు. సృష్టంబులగు వానిఁ బాలించుట పోషణంబనంబడు. కర్మవాసన లూతులనంబడు. మన్వంతరానుష్ఠేయమార్గ ధర్మంబులు మన్వంతరంబు లనంబడును. బహువిధాఖ్యానోపబృంహితంబులగు శ్రీమన్నారాయణుని యవతారచరిత్రము లీలానుకథలని చెప్పంబడు. శక్తులతోఁగూడ నాత్మనిరోధము నిరోధంబనంబడు. అన్యవిధరూపము త్యజించి స్వస్వరూపమునం బలియునికి ముక్తి నాఁబడు. ఆభాసంబును, నిరోధంబును నెచ్చట ప్రకాశించునో యా పరబ్రహ్మ మాశ్రయమనంబడును. అదియ పరమాత్మయనియుఁ జెప్పఁబడును. ఆత్మ, యాధ్యాత్మికము నాధిదైవికము, నాధిభౌతికమని ముత్తెఱంగులై యుండు. ఈ మూఁటియందొకటి లేకున్న మఱియొకటి గానంబడదు. ద్రష్టృదృగ్దృశ్యరూపంబులఁ ద్రివిధంబులై యుండు నీ యాత్మ నెవ్వఁడెఱుంగు నతఁడ పరమాత్మాశ్రయుండగు. ఎప్పుడు పురుషుండండంబు భేదించుకొని వినిర్గతుండయ్యె నప్పుడాత్మసుఖ నివాసంబును గోరుచు శుచియై తొలుతఁ బరిశుద్ధంబులైన జలంబుల సృజించె. స్వసృష్టంబులగు నా జలంబులయందు సహస్రవర్షంబులు వసించె. కావునఁ బురుషోత్తముండు నారాయణుఁ డనం బరఁగె. ద్రవ్యంబును, గర్మంబును, గాలంబును, స్వభావంబును, జీవుండును, నాత్మానుగ్రహమునంజేసి కలుగుచుండు. తదుపేక్షచే లేకుండు. అట్టి యేకస్వరూపుండయిన పరమేశ్వరుం డనేకత్వము నభిలషించుచు యోగతల్పంబునుండి సముత్థితుండై వీర్యగర్భంబును, హిరణ్మయంబునగు దేహంబును ద్రివిధంబులుగ విభజించె. దాని వివరించెద వినుము. విచేష్టమానుండగు పురుషుని యండరూపము శరీరాంతర్భాగమునం బలి యాకాశంబుననుండి యోజస్సహోబలంబు లుత్పన్నంబులయ్యె. వానివలన మహత్తరమైన ప్రాణవాయువు జనించె. సర్వజంతువులయందుఁ బ్రాణేంద్రియంబులు రాజును భృత్యులువలెఁ జేష్టలుచేయు వాని ననుసరించుచుండు. శరీరాంతరాళంబునఁ జలించుచున్న ప్రాణంబుచే క్షుత్పిపాసలు పురుషున కావిర్భవించు. పిపాసితుఁడును, బుభుక్షితుఁడునగు వానికిఁ దొలుత వక్త్రంబు నిర్భిన్నంబగు. ఆముఖంబునుండి తాలువు లేర్పడును. అందు జిహ్వ యుత్పన్నంబగు. జిహ్వాయుతుఁడగువానికి నానారసంబు లుదయించు. వక్తుకామంబగు ముఖంబునుండి వహ్నియు, వాగింద్రియంబును, నవ్వానివలన భాషణంబును జనించు. జలంబుచే నీ వహ్నికిఁ బెద్దకాలంబు నిరోధంబు కలిగె. ప్రాణవాయువు దోధూయమానంబగుచుండ గంధవహుండగు వాయుదేవుం

షును, ఘ్రాణేంద్రియంబును గలిగె. ప్రకాశ శూన్యంబైన దేహంబును, నితరవస్తు నివహంబును జూడఁగోరునతనికి నేత్రంబులు నిర్భిన్నంబులయ్యె. అప్పుడు జ్యోతీ రూపుఁడగు నాదిత్యుఁడును, చక్షురింద్రియంబును, రూపగుణ గ్రహణంబును సంభవించు. ఋషులచే బోధింపఁబడునది విన గోరువానికిఁ గర్ణంబులు నిర్భిన్నంబులయ్యె. అందు దిక్కులు, శ్రోత్రేంద్రియంబు శబ్దగుణ గ్రహణంబుఁ గలిగె. వస్తుమార్దవ, కాఠిన్య, లాఘవ, గౌరవోష్ణత్వ, శీతలత్వంబులు గ్రహియింపఁగోరువానికిఁ జర్మంబేర్పడె. అందు వృక్షాధి దైవతంబులగు రోమంబులుదయించె. అందె యంతర్బహిర్భాగంబులఁ జర్మలబ్ధస్పర్శగుణంబయి వాతంబావరించియుండు. పెక్కుకర్మలం జేయఁగోరునాయాత్మకుఁ గరంబులు మొలిచె. ఆ కరంబులకు బలవంతుండగు నింద్రుండధిదేవత. ఆదానంబు గర్మంబు. గమనంబుఁ గోరువానికిఁ బాదము లావిర్భవించె. పాదములకు విష్ణువే స్వయముగ నధిష్ఠాతృరూపంబుననుండె. వీనికి గతి కర్మంబు. ప్రజానందామృతంబునుగోరువానికి గుహ్యంబు నిర్భిన్నంబయ్యె. ప్రజాపతి యధిదైవతము. ప్రజారతులు కర్మంబులు. ధాతుమలంబును విడువఁగోరువానికి గుదంబు నిర్భిన్నంబయ్యె. మిత్రుం డధిదైవతము. ఉత్సర్గంబు కర్మంబు. ఈ దేహంబునుండి దేహాంతరంబులఁ బొందఁగోరు నాత్మకు నాభిద్వారంబు నిర్భిన్నంబయ్యె. నాభిద్వారమునుండి యపానంబును, నపానంబునుండి మృత్యువునుగలిగె. అపానమృత్యు ప్రయోగంబువలనఁ బూర్వాకాయోత్తరకాయ పృథక్త్వం బేర్పడు. నాభియందుఁ బ్రాణాపానబంధ విశ్లేషంబు మృత్యువగు. అన్నపానంబులు తీసికొనఁగోరు నాత్మకుఁ గుక్షియుఁ బ్రేవులు, నాడులుఁ బొడమె. వానికి నదీసముద్రంబు లధిదేవతలు. తుష్టిపుష్టులు తదాశ్రయంబులు. ఆత్మమాయ నెఱుంగ నిరంతరముఁ జింతించువానికి హృదయంబు నిర్భిన్నంబయ్యె. దానివలనఁ జంద్రాధిష్ఠితంబగు మనంబును దానివలన సంకల్పకామంబులును గలిగె. మఱియు జగత్సృష్టిసేయు నీ విరాడ్రూపంబువలనఁ ద్వక్చర్మ, మాంస, రుధిర, మేదో మజ్జాస్థిరూపంబులగు సప్తధాతువులును, భూమ్యప్తేజోమయంబులైన సప్తప్రాణంబులును, వ్యోమాంబు వాయుసముత్పన్నంబులును గుణాత్మకంబులునగు నింద్రియంబులును భూతాది ప్రభవంబులగు గుణంబులును సర్వవికారాత్మకమైన మనంబును, విజ్ఞానస్వరూపిణియగు బుద్ధియునుగలిగె. ఇది భగవంతుని స్థూలరూపంబుగ నాచే నీకుఁజెప్పంబడియె. మఱియు నిది భూమ్యాద్యష్టావరణంబులచే బహిర్భాగంబున నావరింపంబడె. 186

గీ. అధిప! యింక సూక్ష్మదేహ మవ్యక్తముచు న
నాదిమధ్యాంతమును నిత్యమైనయదియు

వాఙ్మనములకు దూరమై యొప్పఁగునదియు
నతి విలక్షణమును నగు నరసిచూడ. 187

గీ. పార్థివా! స్థూలసూక్ష్మరూపంబులైన, పరమపురుషుని దేహముల్ వరుస నీకుఁ
దెల్పఁబడియె నీ రెండును ధీనిధుల్ గ్ర, హింపరేద మాయచే సృజియింపఁబడుట.

గీ. వాచ్యవాచకతన్ భగవంతుఁ డజుఁడు, బ్రహ్మరూపధరుండయి ప్రకటమాయఁ
గర్మసముపేతుఁడును గతకర్ముఁడునయి, నామరూపక్రియల్ నిరంతరముఁ దాల్చు.

సీ. మను దేవపితృగణ దనుజ ప్రజాపతి, భూతపిశాచక ప్రేతసమితి
సురనాగయక్షకింపురుష రక్షస్సిద్ధ, చారణవిద్యాధ్రసర్పవితతి
గంధర్వకిన్నరగరుడవినాయక, మాతృగణాప్సరోమానిప్రతతి
భేతాళకూశ్మాండయాతుధానగ్రహ, ఖగమృగపశ్వనోకహాగిరితతి
గీ. ద్వివిధములుఁ దలపఁగఁ జతుర్విధములునగు, స్థలజలాభ్రౌకసంబులౌ జంతుజాల
మోలిమైఁ గుశలాకుశలోభయంబు, లైన కర్మలఫలముల నందుచుండు. 190

క. సురనరనారకు లొగి స, త్త్వరజస్తమములను భిన్నభావంబులతోఁ
బరఁగుచుఁ దత్తదుచితమా, పరిణతిఁ బొందుదురు సుమ్ము పార్థివముఖ్యా. 191

మ. అకలంకస్థితి బ్రహ్మయౌచు జడతిర్యగ్జ్ఞానవాదిత్వ రూ
పకమా విశ్వము సృష్టిఁ జేయు హరిరూపంబూని ప్రోచున్ శివా
త్మకుఁడై నాశముఁ జేయు దక్షతను దత్కాలంబునన్ వారిద
ప్రకరంబుం బృథులానిలంబుగతి నాపద్మాక్షుఁ డుర్వీశ్వరా! 192

గీ. పరఁగ భగవంతుఁడును భగవత్తముఁడగు, పరమపురుషు స్రష్టృత్వాదిభావములను
దెలిపితిని నిత్యసూరులుం దెలియలేరు, కేవలమ్ము నేవంరూపస్వభావములను. 193

గీ. ఈజగత్సృష్టికర్మయం దీశునకును, లేదు కర్తృత్వమనునది లేశమేని
మాయచేతనె యిద్ది సమగ్రముగఁ బ్ర, కాశితమ్మగు నిజము క్షోణీశవర్య!194

వ. బ్రహ్మసంబంధియగు నీకల్పంబు వికల్పంబుతోడ సంక్షిప్తవిధంబున నీకెఱిం
గించితి. ప్రాకృత, వైకృత, సృష్టిప్రకారంబులుఁ, దత్పరిమాణంబులుఁ, గాలకల్ప
లక్షణంబులు, విగ్రహంబు, నవాంతరకల్పము, మన్వంతరాదిభేదంబులు సవిస్త
రంబుగ నెఱింగింతు వినుము. అనిన సూతుం గాంచి శౌనకుండిట్లనియె. 195

శౌనకుఁడు: —

ఉ. భాగవతోత్తముండు భగవత్సముఁడౌ విదురుండు బాంధవ
త్యాగముచేసి యీవసుధయందుఁ గలట్టి సమస్తతీర్థముల్

వీఁగక యెల్లు గ్రమ్మఱఁ బవిత్రమనస్కత నాత్మతత్త్వ మె
వ్వేగతి భక్తిభావమున నెవ్వనిచే నుపదేశముం గొనెన్. 196

వ. మఱియుఁ గౌషారవియగు మైత్రేయునకు క్షత్త్రియగు విదురునకు నధ్యాత్మ సంశ్రితంబైన సంవాదం బెచ్చట సంవృత్తంబయ్యె? ఆ విదురునిచేఁ బ్రశ్నింపఁబడి భగవంతుండగు మైత్రేయుం డేతత్త్వంబును దెలిపె? మఱియు— 197

గీ. శీలయుతుఁడగు విదుర విశ్చేష్టితములు, బాంధవత్యాగ హేతు వేర్పడ వచింపు
మాతఁ డెందెందుఁదిరిగి పునీతమతినిఁ, గ్రమ్మఱఁగవచ్చెఁ దెల్పుమా క్రమము
సౌమ్య! 198

సూతుఁడు:—

గీ. అలపరీక్షిన్నరేంద్రుచేనడుగఁబడి మ, హామునీంద్రుఁడు శుకుఁడు నెయ్యమున నేది
చెప్పె దానిని మీకు వచింతు వినుఁడు, ధారుణీధవు ప్రశ్నానుసారముగను. 199

గద్యము.

శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, 'శ్రీరామనృసింహమూర్తి
కవులు' అను గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహమూర్తు
లచే రచింపఁబడిన శ్రీమదాంధ్రభాగవతమున
ద్వితీయస్కంధము సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## తృతీయస్కంధము

### అధ్యాయము 1.

ఉద్ధవవిదుర సంవాదము

శ్రీశుకుఁడు :—

మ. సకలాధీశుఁడు శౌరి పాండవులకున్ సాచివ్యముం బూని యే
గి కురుక్ష్మాపతిసౌధమున్ విడిచి యే గేహంబునుం జొచ్చెఁ బి
ల్వక యే యట్టి సమృద్ధమా గృహము హేలన్ వీడి యేతెంచి కా
నకుఁ దానై విదురుండు చేసె మును ప్రశ్నం బిట్లు మైత్రేయుతోన్. 1

రాజు:—

క. ఎట మైత్రేయునితో ము, చ్చటగా విదురునకు నయ్యె సంగమలాభం
బట నెప్పుడు సంవాదము, స్ఫుటముగ జరిగె నది దెల్పు మునివర! నాకున్. 2

క. అమలమతియైన విదురుని, యమూల్యమగు ప్రశ్నమందు నల్పంబగు న
ర్థము కల్గునె పరికింపఁగ, సుమహితతత్సాధువాద శోభిత మగుటన్. 3

సూతుఁడు:—

గీ. ఈగతిం దాఁ బరీక్షిన్నరేంద్రుచేత, నడుగఁబడి తాపసోత్తముఁ డఖిలవేత్త
ప్రీతచిత్తుఁడు శుకయోగి యాతనిఁ గని, క్షితిప! వినుమని యిట్లు వచింపఁ దొడఁగె. 4

శ్రీశుకుఁడు:—

చ. తన సుతులన్ దురాత్ముల నధర్మపథప్రవినష్టదృష్టియై
మును ధృతరాష్ట్రభూవిభుఁడు పోషణ సేయుచు భ్రాతయైన పాం
డునృపుని పుత్రవర్యులఁ గడుంగడు వెంగలియాచు లక్కయిం
ట నిడి దహింపఁ బంచె నకటా! యిదిఁ యెంతటి క్రూరకార్యమో! 5

మ. జనవంద్యుండగు నయ్యుధిష్ఠిరున కోజం బట్టపుం దేవియై
తన దుఃఖాశ్రువులన్ విరోధిజనకాంతామండలీపీవర
స్తనకాశ్మీరమడంచు కోడలి శిరోజస్పర్శనోద్యుక్తనం
దను గర్హ్యంబగు కర్మ నంధపతి మాన్పంజాలెనే? సుంతయున్. 6

ఉ. ద్యూతమునం దధర్మమున నోటమిఁగొన్న పవిత్రమూర్తి స
త్యాతతచిత్తుఁడైన శమనాత్మజుఁ డోర్పు మెయి న్వనాగతుం
డై తన భాగముం దరుణమం దడుగంగఁ దమోవిమూఢుఁడై
యాతఁ డజాతవైరి కకటా! యిసుమంతయు నీఁ గడంగెనే? 7

ఉ. పార్థుఁడు కోరిపంపఁగ సభాస్థలి శౌరి జగద్గురుండు స
త్యార్థములైన వాక్యములు తా నుడివెన్ క్షతపుణ్యలేశుఁడా
పార్థివునందు నా నుడులు వ్యర్థములయ్యెను బూరుపాళికిన్
సార్థకతాప్రదంబు లమృతాయతనంబులు నయ్యు నయ్యెడన్. 8

క. మంత్రమునకు నగ్రజుఁ డా, మంత్రింప గృహమ్ముఁ జొచ్చి మంత్రవిదుఁడు స
న్మంత్రంబుఁ దెల్పె నిట్లా, మంత్రమె వైదురికమందు మంత్రిశ్రేష్ఠుల్. 9

వ. ఇట్లా ధృతరాష్ట్రుచేఁ బిలువంబడిన విదురుఁ డగ్రజుంగాంచి 10

మ. ధరణీనాయక! దుస్సహా త్వదపరాధంబోర్చుచున్నట్టి ధ
ర్మరతుండైన యజాతవైరి కిడు పిత్ర్యాంశంబు కాకున్న భీ
కరభీమాహి సహానుజంబయి యుదగ్రక్రోధమై యూర్చు చ
త్యురుసంత్రాసమునీకుఁ గూర్చు మదిలో నూహింపు మీవింతయున్. 11

క. క్షితిసుర సురరూపుఁడు ని, ర్జితసకలనృపాలచయుఁడు శ్రీపతి పార్థ
ప్రతతిం జేకొనుచు నిజా, యతనము నందుండె నిఖిలయదుపూజితుఁడై. 12

ఉ. ఆకృతిఁగొన్న దోషము గృహంబున జొచ్చె ముకుందవైరియై
యీ కలుషాత్ముఁడుండుటయే హేతువు దీని కపత్యబుద్ధితో
సాకుదు వీ సుయోధనుని శౌరివిదూరుఁ డభాగ్యుఁ డౌటచే
వీకఁ ద్యజింపు నింద్యుఁడగు వీనిఁ గులాభ్యుదయంబుఁ గోరుచున్. 13

చ. అని వచియించు నవ్విదురు నార్యజనస్పృహణీయశీలభా
జనునిఁ దిరస్కరించుచు నిజానుజసౌబలకర్ణయుక్తుఁడై
కనుఁగవ జేవురింపఁ దనుకంపముపుట్ట సుయోధనుండు చ
య్యనఁ జటులోగ్రరోషచలితాధరుఁడై యను నిట్లు తెంపునన్. 14

చ. కొసరి యెవండు వీని నిటకుం బిలిచెన్ గుటిలాశయుండు దా
సి సుతుఁడునైన వీఁడు త్రపఁజెందక మచ్చలిపుష్టుఁడయ్యె నా
దెసఁ బ్రతికూలుఁడై జడమతిం బరపక్షము వల్కుచుండెడున్
వెస పురినుండి గెంటుఁడిఁక వీనినిఁ బ్రాణచయావశిష్టుగాన్. 15

మ. ధృతరాష్ట్రుండువినన్ శరీరకటు వచోదారింఛోళులన్ మర్మతా
డితుఁడయ్యుం బృథుమాయశక్తియని రోషధీన్ బుద్ధి నూహించుచున్
గతఖేదుండయి ద్వారదేశమున వేగం గార్ముకంబుంచి ని
ర్గతుఁడయ్యెం బురినుండి యవ్విదురుఁ డోరాజన్య చూడామణీ ! 16

ఉ. కౌరవపుణ్యలబ్ధుఁ డనఁగాఁదగు నవ్విదురుండు సామజా
ఖ్యోరుపురంబునుండి చనియొయ్యన నుర్వి సహస్రమూర్తియై
శ్రీరమణుండు దా నధివసించిన తీర్థమహాస్థలంబులన్
జేరెను బుణ్యకర్మములు సేయు తలంపున సంయతాత్ముఁడై. 17

మ. అతిపుణ్యోపవనాద్రికుంజయుతనానారణ్యదేశంబులన్
గతపంకామలతోయసంగతసరిత్కాసారభాగంబులన్
సతతోద్భ్రాజదనంతలింగనిచయాంచత్పుణ్యతీర్థంబులన్
ధృతిమీఱన్ విదురుండు గాఢమగుభక్తిం బర్యటించెన్నృపా. 18

చ. క్షితినిటు పర్యటించుచుఁ బ్రకృష్టపవిత్రవివిక్తవర్తనో
ద్యతుఁ డవధూతవేషుఁడు నధశ్శయనుండు సదాప్లుతుం డసం
స్కృత వివిధాంగకుండగుచు స్వీయజనావళి కేనిఁ దా నల
క్షితుఁడయి చేసెఁ బెక్కులగు శ్రీహరితోషణ కృద్వ్రతంబులన్. 19

ఉ. భారతవర్షమందిటులు పర్యటనంబు నొనర్చుచుండి యా
ధీరమనస్కుఁ డెప్పుడు ప్రతీతియుతంబుఁ బ్రభాసతీర్థముం
జేరె యుధిష్ఠిరుండపుడు శ్రీపతి యానతి నేలుచుండె వి
స్తారతరోరురాజ్యము నుదంచిత శక్తి నిరస్తశత్రుఁడై. 20

చ. అట విదురుండు వేణుజనితానలదగ్ధవనంబు కైవడిన్
జటుల పరస్పరప్రకటశాత్రవబుద్ధి కతంబునన్ సుహృ
త్పటలి వినష్టమౌట విని స్వాంతమునందుఁ దటస్థభావమున్
దిటముగఁ బూని యచ్చటను నిల్వక చేరె సరస్వతీతటిన్. 21

క. ఆనదిఁ ద్రిత భార్గవ వై,శ్వానర మను పృథు సుదాస వాయు యమ మహా
సేనాసిత గో.నామము, లైన మహాతీర్థ సంచయము సేవించెన్. 22

క. ఇతరములగు క్షితిసుర సుర,తతి రచితములైన బహువిధముల విష్ణ్వా
యతనములఁ గొలిచెఁ గృష్ణ, స్మృతికరముల శంఖచక్రచిహ్నాఢ్యములన్. 23

సీ. పిమ్మట సమృద్ధమగు సురాష్ట్రమ్ము దాటి
వెనుకఁ గురుజాంగలముల సౌవీర మత్స్య
దేశములఁ ద్రొక్కి యమునకేతెంచి యందు
భాగవతు నుద్ధవుం గాంచెఁ భావమలర. 24

ఉ. ఆ నయభాగ్యశాలి వినయాఢ్యుఁడునా విదురుండు వాసుదే
వానుచరుం బ్రశాంతుని బృహస్పతిశిష్యుని సుప్రసిద్ధునిన్
జ్ఞానవినోదు నుద్ధవుని గాఢముగాఁగఁ గవుంగలించి శ్రీ
జానికిఁ బోషణీయులగు జ్ఞాతుల సేమము నడ్గెఁ బ్రీతితోన్. 25

చ. ఇలకు శుభంబుఁ గూర్ప మది నెంచి స్వనాభిసరోజజాతుఁడౌ
నలినభవుండు ప్రార్థన మొనర్పఁగ దానికిఁ బ్రీతి నియ్యకోల్
దెలిపి పురాణపూరుషులు దేవగణార్చితులైన రామకృ
ష్ణులు జనియించి రా ఘనులు శూరగృహంబున భద్రములే గదా ? 26

చ. పరమసఖుండు మాకుఁ గురువంశ్యులకాత్మసహోదరీ సము
త్కరమున కీప్సితంబు లిడు దండ్రియుఁ బోలె మహావదాన్యశే
ఖరుఁడు ఘనుండు భావుకుఁడు కంజదళాక్షుని తండ్రి యాత్మమం
దిరమున నున్నవాఁడె ? వసుదేవుఁడు నిత్యసుఖానపేతుఁడై. 27

మ. తొలిజన్మంబునఁ బుష్పబాణుఁడగు ప్రద్యుమ్నాఖ్యునిన్ రుక్మిణీ
లలనారత్నము వాసుదేవువలనన్ శ్లాఘార్హుఁడౌ పుత్రుఁగా
నెలమిన్ విప్రసపర్యచే నభిమతంబీడేరుటం గాంచె న
బ్బలియుం డున్నె? ప్రమోదియై యదుచమూవర్గాధిపత్యంబునన్. 28

మ. శతపత్రాయత లోచనుం డెవనినిన్ సంత్యక్త రాజ్యాశు ని
ష్కుతుకున్ రాజ్యపదంబునందు నభిషిక్తుంజేసె మున్నట్టి సా
త్వతవృష్ణ్యంధక భోజముఖ్యవిభుఁడై వర్తిల్లుచుం బ్రాభవా
న్వితుఁడౌ ధీయుతుఁ డుగ్రసేనుఁడు సుఖోపేతుండె యశ్రాంతమున్. 29

ఉ. పూర్వజనిం బ్రభావపరిపూర్ణుని గర్భమునందుఁ దాల్చె నా
పర్వతరాజపుత్రి యటు పై వ్రతనిష్ఠితయై ముదం బెదన్
బర్గగఁ గాంచె జాంబవతి మాన్య గుహాఖ్యున్ సుతుఁగా గుహాత్ముఁడై
యుర్వి నెసంగు నా పృథుజయుండగు సాంబుఁడు సౌఖ్యవంతుఁడే? 30

చ. హరిమృదుపాదసేవల నయాదవకోటులకున్ దురాపమై
నిరుపమమా తదీయగతి నిన్ ధృతిఁ జేకొనఁ గల్గె బుద్ధిమ
ద్వరుఁడయి సన్నుతింగను చు ఫల్గుణలబ్ధధనూరహస్యుఁడై
ధర నతిఁ గొన్నయట్టి యుయుధానుఁడు సాత్యకి భద్రయుక్తుఁడే? 31

చ. హలకులిశాతపత్ర జలజాంకుశచక్ర యవాది రేఖలన్
బొలుపగు కృష్ణుపాదములు మోపిన పట్టులనున్న పాంసురా
సులు మెయినిండ భక్తిపరిశుద్ధమతిన్ భగవత్ప్రపన్నుఁడై
యలరు శ్వఫల్కపుత్త్రుఁడు మహాత్ముఁడు మోదపరీతచిత్తుఁడే? 32

చ. అమలమతిం ద్రయీజననియజ్ఞమయార్థము వోలె స్వీయగ
ర్భమున ముకుందుఁ దాల్చిన సుభవ్య సతీజనసేవ్య పూరుషో
త్తముఁడగు దేవకేశసుత తా సురమాతగతిన్ హరి ప్రజా
త్వమహిత దేవకీసతి శుభాన్వితయౌచుఁ జెలంగుచుండునే? 33

ఉ. నాలవ సత్త్వతత్త్వము మనఃప్రతిభాసము శబ్దయోనియం
చోలి సురవ్రజం బెవని నొద్దికమై నుతియించుచుండ్రు స
చ్ఛీలుఁ డతండు సాత్వతులశ్రేణికి కామదుహుండు సత్క్రియా
లోలమనస్కుఁ డా ఘనబలుం డనిరుద్ధుఁడు క్షేమమే గదా. 34

గీ. ప్రియమున నిజాత్మదైవమౌ కృష్ణదేవు, విడువక యనన్యవృత్తి సేవించు భవ్య
తేజులు హృదీక సత్యాత్మజ చారు, దేష్ణ గద ముఖ్యులెల్ల సుప్రీతియుతులె? 35

చ. తనకుఁ గ్రియాసమర్థ పృథుదక్షిణవామభుజంబులట్లుగాఁ
దనరెడు కృష్ణపార్థులు సతంబును గార్యమహాభరంబు దీ
ర్పను గదనంబులన్ జయపరంపర గూర్పను జాలఁగా సుయో
ధను నడికించు ధర్మజుఁడు ధర్మపథంబును నిర్వహించునే? 36

చ. గదనుధరించి యబ్బురముగా బహువైఖరులం జరింపఁ ద
త్పదపృథుఘాతఘట్టనలభండనభూమి సహించలేకఁ బె
ల్లదరెఁ గృతాఘకౌరవులయం దహిభంగి నమర్షఁ గొన్న బె
ట్టిదుఁడు వృకోదరుం డిపుడు డించెనె దీర్ఘతరప్రకోపమున్. 37

చ. కృతకకిరాతరూపుఁడు గిరీశుఁడు యద్విశిఖచ్ఛటాతిరో
హితపృథుగాత్రుఁడై చను బ్రహృష్టతఁ బాశుపతాస్త్రమిచ్చె న
య్యతిరథశేఖరుండును మహాయశుఁడున్ జితసర్వశాత్రవ
ప్రతతియునైన గాండివశరాసనుఁ డర్జునుఁ డున్నె? భద్రుఁడై. 38

చ. జనని వియోగమంది పృథక్స్తన్యముఁ ద్రావి నిజాగ్రజుల్ సదా
కనులను రెప్పలుంబలెనుఁ గావ సురేంద్రముఖస్థమా సుధన్
గొనిన ఖగేంద్రుకైవడినిఁ గొబ్బున వైరులనుండి రాజ్యల
క్ష్మిని గయికొన్న యీ కవలుఁ గ్రీడనొనర్తురె? మోదయుక్తులై. 39

చ. అతిరథుఁ డేకవీరుఁడు మహాబలశాలి ధనుర్ద్వితీయుఁడై
ప్రతిభను నాల్గుదిక్కుల నరాతిబలంబుల నుక్కడంచి పె
న్ధృతి జయమందెఁ బాండుజగతీపతి యావిభుఁ బాసి కుంతి దా
సుతులకునై యహో! యిప్పు డసుప్రకరంబు ధరించియుండుగా. 40

మ. అకటా! కుందుదు దేని దుర్గతికినై యస్తంగతుండైన భ్రా
తకు ద్రోహంబొనరించె నాపగిది నంధక్ష్మావిభుండట్లు పు
త్రికదుర్వృత్తుల కియ్యకోల్దెలుపుచుం దమ్మున్ ననున్ వీటనుం
డి కఠోరంబుగ నెట్టివైచె వెలికా నింద్యుండు మేల్పొందునే? 41

చ. మనుజవిడంబనంబున నమానవకోటులకెల్ల దృక్పథం
బును భ్రమియింపఁజేయు యదుముఖ్యుని దివ్యకృపారసంబుచే
తన గతవిస్మయుండ నయి తత్పదవిం గనుచున్ సుఖస్థితిన్
జనులకుఁ గానరాక యనిశంబుఁ జరించుచునుందు నుద్ధవా! 42

చ. త్రిమదవిజృంభణోత్పథచరిష్ణువులై క్షితినెల్ల సారెకున్
జముపుల దాడిచేఁ గలచు క్ష్మాపతులన్ వధియింపఁజేసి నె
య్యమునఁ బ్రపన్నకోటి విపులార్తిహరించు తలంపుతో రమా
రమణుఁడు కౌరవేంద్రు నపరాధ ముపేక్ష నొనర్చెఁ గొల్వునన్. 43

ఉ. పుట్టువులేని యీశ్వరుఁడు పుట్టుట యుత్పథగామికూటమున్
నెట్టనఁ గిట్టఁజేయుటకె నిర్గతకర్ముఁడతండు కర్మచేఁ
బట్టుట యెల్లఁజూడ జనవర్గము కర్మలఁ జేయుపొంటెగా
కెట్టిఁకుగాని యాత్మవిదుఁ డెంచునె కర్మముఁ జేయ సుంతయున్. 44

క. తనశాసనమున మెలఁగుచు, వినతులయిన లోకపాలబృందముల ప్రయో
జనమునకయి యదువంశం,బున బొడమిన హరి యుదంతమును దెలుపు సఖా! 45

## అ ధ్యా య ము 2.

### —ఉద్ధవకృత శ్రీకృష్ణ బాలలీలావిశేషాభివర్ణనము—

శ్రీశుకుఁడు:—

క. అని విదురుఁడు ప్రియజనవా, ర్త నుద్ధవున్ భాగవతవతంసు నడుగఁ గృ
ష్ణునిఁ దలఁచి మదిని బెంగం, గొని మాటాడంగ లేక క్రుంగె నతంఁడున్. 46

సీ. అయిదేండ్లప్రాయంబునందు బాలక్రీడ, నొకబాలుఁ గృష్ణుఁగానుండఁ బనిచి
కల్పితపూజోపకరణంబులను భక్తి, యుక్తిమై నద్దేవు నుద్ధవుండు
పూజలు గావించుచో జనయిత్రి య, చ్చట కేగుదెంచి వాత్సల్యమొప్ప
నోగిరంబును గొననేగుదెమ్మన భక్తి, పరవశతన్ మారువలుకఁడయ్యె
గీ. నిప్పుడాతని సేవలవృద్ధుఁడైన, యుద్ధవుఁడు భక్తిభావ సమృద్ధికలిమి
వార్తలడుగఁ గృష్ణస్మృతిస్ఫూర్తియొదవ, నెట్లు ప్రతివచనంబు తా నీయఁగలఁడు?

శా. శ్రీకృష్ణాంఘ్రిసరోరుహద్వయమధుశ్రీనిర్వృతాత్ముండు న
స్తోకాత్యుజ్జ్వలభక్తియోగ ఘనపాథోరాశిమగ్నుండునై
యా కంసాంతకభక్తుఁ డుద్ధవుఁడు నెయ్యంబారఁ దూష్ణీస్థితుం
డై కన్పట్టె ముహూర్తకాలమల బాహ్యజ్ఞానశూన్యాత్ముఁడై. 48

చ. పులకితసర్వగాత్రుఁడయి మూసినకన్నులనుండి యశ్రుధా
రలొలుకుచుండ స్నేహవిసరప్లుతమానసుఁడౌచు నుద్ధవుం
డలరెను బ్రాజ్ఞుఁడౌ విదురుఁడాతనిఁ గన్గొని నెమ్మనమ్మునం
దలఁచె నతండె యిద్ధరఁ గృతార్థుఁడటంచు సమాదరంబునన్. 49

మ. భగవల్లోకమునుండి యుద్ధవుఁడు సద్భక్తాగ్రగణ్యుండు మె
ల్లగఁ బ్రత్యాగతుఁడై నృలోకమునకున్ గ్లానిం దొలంగించి ద్రు
గ్యుగమొయ్యం బెడ కేలనొత్తుకొని సద్యోజాతవిస్ఫూర్తితో
భగవల్లీలల నెన్నుచున్ విదురుతో వాక్రుచ్చెఁ దా నీగతిన్. 50

ఉద్ధవుఁడు:—

గీ. అనఘ! వినుము కృష్ణార్యముఁడ స్తమింపఁ, బృథుల కాలాజగరముచే మ్రింగఁబడి య
పాస్తభాగ్యములైన మా యాలయములఁ, గుశలమేమని నీకు వాక్రువ్వఁగలను?

గీ. కటకటా! దుర్భగమ్ము లోకమ్ము దాని, కంటె యాదవతతి యభాగ్యతర మకట!
కూడిచరియించియును వారు కూళలగుచు, నెఱుఁగరైరి హరిన్, మీలు హిమ
కరువలె. 52

గీ. ఇంగితజ్ఞానయుక్తు లహీనమతులు, నతిశయప్రౌఢు లేకవిహారులనఁగు
సాత్వతులు సాత్వతర్షభు సకలభూత, నిలయుఁగాఁ గృష్ణునెఱిఁగిరి నిపుణమతిని. 53

గీ. యాదవులు కృష్ణుమాయచే వ్యాప్తులగుచుఁ, గొందఱుందు రసద్భావకుంఠితులయి
యాత్మసహాయుఁడౌ హరియందు స్వాంతమిడిన, మాదృశులమతి బ్రమయ ద
మతుల నుడుల. 54

చ. తపమొనరింపకున్కిఁ బరితప్తతదృక్కులు గానివారికిన్
నెపమున నింతవట్టు తననిర్మలరూపముఁజూపి యా రమా
ధిపుఁ డల లోకలోచనముధీరతఁగైకొని యాత్మసత్కళా
నిపుణతతో మహాభువననేత తిరోహితుఁడయ్యె నయ్యెడన్. 55

చ. మనుజవిలాసయోగ్యము స్వమాయ మహత్తరశక్తిఁ జూపు న
య్యనఘునిచే గ్రహింపఁబడినట్టిది యుజ్జ్వలవిస్మయప్రథా
జనకము వైభవాస్పదము శస్తము భూషణభూషణాంగమై
తనరెడు నాత్మరూపము ప్రధానమొనర్చెను శౌరి యోగతిన్. 56

చ. యమసుతు రాజసూయమున నక్షిరసాయనమైన యేస్వరూ
పముఁ గని మూఁడులోకములు వారిజగర్భుని సృష్టినిర్మితి
క్రమసముపన్నకౌశలముగా దొకొ యీయది యంచు విస్మితిన్
దమ హృదయంబులందలఁచెఁ దచ్ఛుభమూర్తి ముగించె నీశుఁడున్. 57

మ. అనురాగప్లుతహాసరాసరసలీలాలోకనప్రాపితో
ద్ఘనమానాభ్యుదయాఢ్యలైన వ్రజకాంతారత్నముల్ దృప్తి జెం
దని పెన్ జూడ్కులతోడఁగూడి వెనువెంటన్ బుద్ధులుంబోవఁ దీ
రని కార్యంబులనుండి పోయి రట కౌరవ్యాన్వయగ్రామణీ! 58

గీ. తీవ్రమూర్తులచేత బాధింపఁబడెడి, తనదు శాంతరూపంబులు దయఁదలఁచుచు
నభవుఁడయ్యుసంజాతుఁడై యగ్నిపోలె, నొప్పనాహరిమహదంశయుక్తుఁడగుచు.

చ. నెఱి వసుదేవునింటను జనించుటయున్ మఱి గోకులంబునన్
బెఱుగుటయున్ విరోధిజనభీతిని బట్టణమందునుండి యే
డ్తెఱ నెటకేనిఁబోవుటయు దీనతలిట్టివియెట్లు కల్గెనో
యఱిముఱి దేవదేవున కటంచు గుమారిలుచుందు నిచ్చలున్. 60

చ. పితరులపావనాంఘ్రులకుఁ బ్రీతిని మ్రొక్కి మహాత్ములార! యా
దృతిమెయి మీకుఁ బూజలొనరింపక కంసభయంబుచే మెలం

గిరి మఱి దవ్వుదవ్వులను గీడ్పడి మమ్ము ననుగ్రహింపఁ డం
చతివినయంబుతోడ హరియాదు నుడుల్ దలఁపన్ విషాదమా. 61

ఉ. వారక విస్ఫురద్భ్రుకుటివల్లి కృతాంతుఁడుగాఁగ ధారుణీ
భారము మాన్పఁజాలినఁ బ్రభావధురంధరుఁడైన యట్టి యా
శ్రీరమణీమనోహరుని శ్రీయుతపాదసరోజరేణువున్
మూరుకొనంగ నేరిచినపూరుషుఁ డావిభు విస్మరించునే? 62

మ. విదురా! కంటిరిగాదె మీకును హరిన్ ద్వేషించు చైద్యుండు సాం
పిదమాసిద్ధిని శౌరిచేఁ బడసె నుర్విన్ రాజసూయంబునం
దది యోగీంద్రులు యోగమార్గమున నొయ్యం బొందఁగా నాత్మఁ గో
రెద రట్లాట నెవండు తద్విరహనిర్వేదంబు సైరించెడున్. 63

చ. ఇతర నృలోకపాలకులు నిట్టులె యాహవరంగమందు నా
ద్యుతి నయనాభిరామమగు శ్రీవరుదివ్యముఖారవిందర
మ్యతఁ గనుదోయి జుఱ్ఱుచు నరాస్త్రనికాయపునీతులౌచుఁ ద
ద్గతిని గనంగ జాలిరి గదా విదురా! యిఁక వేయు నేటికిన్. 64

ఉ. ఆప్తుఁడు భక్తకోటి కనన్యమహాతిశయుం డపవర్గరాజ్యల
క్ష్మ్యాప్తసమస్తకాముఁ డసురారి త్రిమూర్తులకున్ విభుండు ప
ర్యాప్తముగాఁగఁ గప్పముల నర్పణచేయు నృపాలకోటి సం
దీప్తకిరీటరత్నతతిదీధితిభాసితపాదుఁడై తగున్. 65

ఆ. విను సార్వభౌమపీఠియం దయ్యుగ్రసేను నునిచి శౌరి తాను భృత్య
భావమున మెలఁగుట సేవకులగు మాకు, స్వాంతమందు నురువిషాద మొదవె.

క. తనుఁ జంపఁదలఁచి పూతన, స్తనముల విషమున్ ధరించి చను గుడుపంగా
జనయిత్ర్యుచితగతి నొసం, గె నెవం డీక రక్షకుండు కృష్ణునికంటెన్. 67

చ. అసురులు గూడ భాగవతులంచుఁ దలంతును యుద్ధభూమిఁ దా
ర్క్ష్యసుత భుజాధిరూఢుఁ బృథుచక్రసముజ్జ్వలు నింద్ర్యధీశునిన్
వెనఁబడి వచ్చువానిఁ గని నిర్భరకోపపరీతచిత్తులై
విసువక చూచి రేగతిని విష్ణునిఁ గాంచిన మేలు సేయదే? 68

క. ఈవసుధకు సుఖశాంతులు, గావింపం దలఁచి కంసు కారాగృహమం
దావిభుఁడు దేవకీవసు, దేవులకుం బుట్టె శతధృతిప్రార్థితుఁడై. 69

క. జనకుఁడు వసుదేవుఁడు నం, దనుఁ గంసుని భీతిఁ జేర్చె నందవ్రజ మొ
య్యన హరి యేకాదశహా, యనములు గూఢముగ సబలుఁడై యటనుండెన్. 70

మ. ఛలవృత్తిన్ వహియించి కేశవుఁడు కూర్జత్సశ్చిసంతానసం
కులితానోకహరాజమానయమునాకూలస్థితోద్యాన భూ
ముల గోపార్భలతోడ వత్సనిచయంబున్ మేపఁగాఁ జేయుచున్
విలసత్ప్రౌఢివిహారకేళులను గావించెన్ విలాసార్థియై. 71

గీ. కంసుచేత నియుక్తులై కామరూప, ధరుల మాయావులం గ్రూరదానవులను
వారివారినిఁబట్టి యవ్వారి శౌరి, బాలకుండాటబొమ్మలపగిదిఁ జదిపె. 72

శా. శ్రీరమ్యామలరూపమై వ్రజనివాసిప్రేక్ష్యమై యొప్పు శా
మారావస్థను జూపుచుం గొదమసింహాంబట్లు శోభిల్లె నా
పై రాజత్సితగోగణంబు ముదమొప్పన్ మేపుచున్ గోపగో
వారంబున్ రమియింపఁజేసె హరి దా వాయించుచున్ వేణువున్. 73

గీ. ఉగ్రతరకాళియాహినినిగ్రహించి, విషజలవిపన్నగోగోపవితతినెల్ల
లీలబ్రతికించి హరి యవలీలమడుగు, జలము నిర్విషమొనరించి కలఁకఁదేర్చె. 74

గీ. విప్రవర్యులచేత నవ్విభుఁడు గోప, నందు గోసవమనెడు జన్నంబొనర్పఁ
బనిచె మిగులసమృద్ధమాధన చయంబు, నెల్లసద్వ్యయమొనరింపనిచ్చువాఁడమి.

క. ఉరుకోపంబున నింద్రుఁడు, కురియ బెగడి దిగులువడెడి గోగోపతతిన్
ధరణీధ్రచ్ఛత్రమునన్, బరిరక్షించె నలశౌరిభద్రప్రదుఁడై. 76

క. శరదిందుకరంబుల భా, సురమై రజనీముఖంబు శోభిల్లఁగ నా
దరమిడి స్త్రీ జనరత్నా, భరణంబయి శౌరి గానపరతఁ జెలంగెన్. 77

---

## అధ్యాయము 3.

### ఉద్ధవకృత శ్రీకృష్ణ ప్రౌఢలీలా విశేషాభివర్ణనము

ఉద్ధవుఁడు :—

చ. నిజపితృ దేవసౌఖ్యమునునెమ్మి నొనర్పఁదలంచి శౌరి యా
వ్రజపురినుండి తాను మధురాపురికిన్ బలరామయుక్తుఁడై
స్వజనముమెచ్చవచ్చి నిజశత్రునిఁ గంసుని గద్దెనుండి య
క్కజముగ నేలకుందిగిచికాలునివీటికిఁ బుచ్చెఁజెచ్చెరన్. 78

ఉ. ఆ పరమేశ్వరుం డల షడంగయుతంబగు నాగమంబు సాం
దీపునియొద్ద నుజ్జ్వలమతిం బఠియించి గురూరుదక్షిణా

వ్యాపృతుఁడౌచుఁ దత్సుతుని బంచజనాసురగర్భసంస్థితున్
ధీపటిమం బెసంగ వెస దెచ్చి యొసంగె సమాహితాత్ముఁడై. 79

శా. శ్రీతుల్యాకృతియైన భీష్మకసుతన్ జేదీశముఖ్యావనీ
నేతల్ గైకొన నెంచి రా నప్పుడు నిర్నిద్రప్రభన్ దద్రిపు
వ్రాతంబున్ వెసగెల్చి తార్క్ష్యుఁడు సుధాభాండంబుఁ గొన్నట్టు లా
నాతిన్ జేకొనెఁ బేర్మిఁ గృష్ణుఁ డతఁ డెన్నన్ మర్త్యమాత్రుండొకో! 80

ఉ. ముక్కులుగుట్టకున్కఁ గమిఁ బోత్రము జెందిన యేడునజ్జులన్
గ్రక్కున నుక్కడంచి యలనాగ్నజితిన్ శుభలక్షణాన్వితన్
మక్కువతో స్వయంవరమునన్ హరి పెండిలియై నృపాధిప
న్యక్కృతరాజకోటిఁ గలనన్ గెలిచెన్ వడిఁ దన్ను మార్కొనన్. 81

గీ. ప్రభువు తా నయ్యె శౌరి శ్రీపరుఁడు వోలె, సతికిఁ బ్రియ మొనరింపఁగా స్వర్గమునకు
నేగి ఘనపారిజాతంబు లాగి తెచ్చెఁ, దన్ను వెన్నంటు సురపతి దటిమి వైచి. 82

ఉ. స్నేహపరీతయై వసుధ చేరి సునాభసమాఖ్యచక్రధా
రాహతదేహు నాత్మసుతుఁ డా నరకుం గని విహ్వలించి తో
డ్తో హరి వేడ నాతని సుతున్ భగదత్తుని రాజ్యమందు న
వ్యాహతరీతి నిల్పి యతఁ డంతిపురంబును జొచ్చె నంతటన్. 83

ఉ. ఆ నరకాసురాపహృతలైన యభాగ్యలు మర్త్య దేవ క
న్యానివహంబు లా హరిని నార్తజనావళిబంధుఁ గాంచి యున్
దీనత డించి లేచి యతనిం గొనిరాత్మలలోఁ బ్రహర్ష ల
జ్జానుపమానురాగ విభవాన్విత దృష్టులచేత నింపుగన్. 84

క. ఒక్కముహూర్తంబున నే, యక్కన్యల వివిధగృహములందు స్వమాయం
బెక్కులు రూపులు గొని పె, న్మక్కువఁ బాణిగ్రహణ మొనర్చె విభుండున్. 85

గీ. సర్వవిధముల యందాత్మసదృశులైన, పుత్రకుల వారియందొగిఁ బొడమఁ జేసె
నొక్కొకతె యందుఁ బదుగురనుర్వి లోనఁ, బ్రకృతివిస్తార మొనరించు భావ మెసఁగ.

చ. ఉరుతర సేనలం భుజబలోద్ధతి మీఱఁగ నొక్కపెట్టునన్
బురి నరికట్టు కాలయవనుండును సాల్వుఁడు మాగధుండు నాఁ
బరఁగెడువారి నన్యులను బల్మి మెయిం బొలియించెఁ దానయై
పురుషులకున్ స్వకీయులకు భూరియశంబును దేజమిచ్చుచున్. 87

ఆ. బాణ, శంబర, మురపల్వల, ద్వివిదుల, దంతవక్త్ర, ముఖ తదన్యరిపుల
హతులఁ జేసె హలధరాదిసమేతుఁడై, శ్రీ విభుండె సుమ్ము ప్రసిద్ధమింత. 88

మ. క్షితి కంపించెనుగాదె నాడలకురుక్షేత్రంబునం జేరు ను
ద్ధత సైన్యావళి పాదఘాతములచే దద్ధాత్రి తత్ప్రత్యర్థి సం
గతులై భూపతులెల్లఁ దా రుభయ పక్షంబుల్ వెసంజేరియున్
హతులై రారయ దీనికంతకు నిదానం బా రమేశుండెగా. 89

మ. మఱిదుశ్శాసన కర్ణసౌబలుల దుర్మంత్రోరుశక్తిన్ బలం
బఱి శ్రీ, యాయువుఁదక్క సానుచరుఁడై యా భీముచే నట్లు రూ
పఱి భగ్నోరుతరోరుఁడై వసుమతీభాగంబునం బడ్డ య
మ్మొఱకున్ నీచసుయోధనుం గనియుఁ దా మోదింప కీశుండెదన్. 90

మ. 'అల ద్రోణార్జునభీమభీష్మముఖులట్లష్టాదశాక్షౌహిణీ
బలమున్ మాపుటయెంత? దాన నవనీభారంబు శాంతించెనే
యిలలోఁ బెక్కురచే మదంశజులచే నేపారు నుద్యద్యదూ
జ్జ్వల సేనాబలముండెఁ గాదె భువిఁ దచ్ఛౌర్యం బవార్యమ్ముగన్. 91

గీ. మధుమదాతామ్రనేత్రులై మత్తుఁ గొన్న, యాదవులకుఁ బరస్పరవాదమొదవు
నదె వధోపాయమింక నన్యంబు లేదు,మడియుదురు తారె నేనుద్యతుఁడనఁగాఁగ'.

మ. అని చింతించి రమావిభుండు నిజరాజ్యంబందు నా ధర్మపు
త్రుని స్థాపించి కృతార్థతం గనుచు సాధుశ్రేణికిన్ ధర్మసా
ధనమార్గంబును నెమ్మిఁ జూపుచు సుహృద్వర్గంబు నానందవా
ర్ధి నిమగ్నాత్ములఁగాఁగఁ జేసెఁ గరమర్థిన్ నిర్జరుల్ మెచ్చఁగన్. 93

గీ. పరఁగ నభిమన్యుచేఁ బూరువంశ మోలి, నిల్పఁబడియె నుత్తరయను నెలఁతయందు
నదియు ద్రౌణ్యాస్త్రసంభిన్నమగుడు శౌరి,యుద్ధరించె మరలఁ దత్పరోక్షమందు.

గీ. ధర్మసుతుచేత నశ్వమేధత్రయంబు, నెమ్మిఁ జేయించె శ్రీరమణీవిభుండు
ధర్మసుతుఁడును క్షితిని సోదరులఁ గూడి, రక్షసేయుచు హరి యాదరంబువడసె.

మ. భగవంతుండును విశ్వరూపుఁడుఁ దయ్యోగాభాస్వత్పథాలంబియున్
త్రిగుణాతీతుఁడు లోకవర్తనుఁడునై శ్రీకృష్ణుఁడా ద్వారకన్
మొగి సాంఖ్యాహ్వయ యోగమందలరుచున్ భూతాత్ముఁడై కామముల్
దగ సేవించె నసక్తుఁడౌచు బుధసంతానంబు శ్లాఘింపఁగన్. 96

మ. విమలస్నిగ్ధశుచిస్మితార్ద్రశుభసంవీక్షన్ సుధాకల్పవా
క్సమితిన్ సాధ్వనవద్యహృద్య విలసచ్చారిత్రచిత్రంబులన్
రనుకుం బట్టగు భవ్యదేహమున శ్రీనాథుండు దా మర్త్యలో
కము నాముత్రికమున్ యదువ్రజము వేడ్కం దన్ని క్రీడించెమున్. 97

మ. క్షణదాదత్తశుభక్షణుండగుచు రాసక్రీడలన్ గోపికా
గణముంగూడి తటిల్లతాకలితమేఘంబట్లు భాసిల్లుచున్
గణనీయంబగు నాణిముత్తెములసాంగత్యంబునన్నీల స
న్మణియుంబోలె వెలుంగు చవ్విభుఁడు బృందావీథులం బొల్చెడున్. 98

వ. ఇట్లనేక హాయనంబులు యథేచ్ఛన్ గ్రీడించున ద్దేవదేవునకు గృహసంబంధమైన
కామోపభోగాదియోగంబులందు విరాగంబుజనియించె. స్వాధీనకాముండగు
భగవంతుఁడే యిట్లు విరాగంబుఁ జెంద దైవాధీనకామంబులయెడ భగవద్భక్తుఁ
డెట్లు విశ్వాసంబుంచు ? 99

చ. పురమున నొక్కనాఁడు యదుభోజకుమారకు లాడుచుండి త
త్పరిసరభూమికిన్ మునివ్రతంసులు రాఁ గని గేలిసేయ దు
ర్భర పృథుకోపయుక్తులయి వారు శపించిరి యంతఁ గొన్నినా
ళ్లరుగఁ బ్రభాసతీర్థమున కందఱుఁ జేరిరి దైవదుర్గతిన్. 100

ఉ. తానములాడి దేవపితృతర్పణముల్ ఋషితర్పణంబుఁ దా
రా నదినీటిచే నెఱపి యంచితగోవుల విప్రకోటికిన్
దానముచేసి రింక రజతంబు హిరణ్యము శయ్య వస్త్రముల్
కానుకలిచ్చి రప్పు డధికంబగు భక్తి యెడంద నిండఁగన్. 101

చ. కరిరథఘోటకంబులను గన్యల వృత్తిదభూమిభాగముల్
సరగున నిచ్చి యత్యురురసంబగు నన్నము వారికిన్ శుభం
కరమతి నీశ్వరార్పణముగాఁగ నొసంగిరి తోన ధేను భూ
సుర నిచయార్పితాసులయి శూరులు సాగిలి మ్రొక్కి రయ్యెడన్. 102

---

## అధ్యాయము 4.

### విదురమైత్రేయ సమాగమము

ఉద్ధవుఁడు:—

చ. పడఁపడి వారి యాజ్ఞఁ దలపై ధరియించి భుజించి మద్యమున్
ముదమునఁ ద్రావి దాన మదమోహితులై తమదైన జ్ఞానసం
పద యుడుగంట యాదవులు మర్మములన్ స్పృశియించున ట్లరుం
తుద కఠినోక్తులన్ మిగులఁ దూఱుకొనంగఁ గడంగి రొండొరుల్. 103

గీ. వారుణీదోషమునఁ జేసి వారువిషమభావులై మత్తతన్ వేణువనముఁబోలెఁ
దాకిరి పరస్పరంబు యుద్ధంబుసేయ, నర్కభగవాను నస్తమయంబువేళ. 104

క. తన మాయాశక్తినిఁ గని, యనఘుండు సరస్వతీ మహానది సాయం
దినవిధులు నెఱపి నేమ,మ్మునఁ దానొకవృక్షమూలమునఁ గూర్చుండెన్. 105

క. తన కులసంహారక్రియ,కును గడఁగు రమావిభుఁడు ముకుందుఁడు నన్నున్
గని బదరీవనమునకుం, జనుమని మున్నానతిచ్చి చనెఁదా ననఘా! 106

మ. తదభిప్రాయమెఱింగి యేను నట నిస్తంద్రాత్మతం గూడి త
త్పదరాజీవవియోగతాపమున సోర్వన్ లేక వెన్వెంట నే
గి దయారూపు రమేశు శ్రీనిలయు శ్రీకృష్ణున్ సుఖాసీను సా
ఖ్యదసారస్వతతీరవాసు నగృహుం గన్గొంటి నేకాకినిన్. 107

ఉ. శ్యామలశుభ్రదేహు విరజస్కుఁ బ్రశాంతునిఁ జారులోచనున్
గోమలదోశ్చతుష్కమునఁ గూడినవానిని బీతవస్త్రినిన్
వామశుభోరుభాగమున భాసురదక్షిణ పాదముంచి స
త్ప్రేమను లేతరావికిని వెన్నునుజేర్చిన వెన్నుఁగాంచితిన్. 108

క. ఆయెడకుం బుణ్యుఁడు ద్వై,పాయన సుహృదుండు సఖుఁడునగు సిద్ధుఁడు మై
త్రేయుఁడు వుడమిందిరుగుచు, ధీయుతుఁడచ్చోటి కరుగుదెంచె యదృచ్ఛన్. 109

ఉ. మానివరేణ్యుఁ డత్యమలమానస,సంయుతుఁడుం బ్రమోదభా
రానతకంధరుండు నగుచానతఁ డొగిన్ వినుచుండ నన్ను నెం
తే ననురాగసుస్మిత నవమీక్షఁ బథిశ్రమమెల్లఁ బాపుచున్
దాను ముకుందుఁ డిట్లనె యథార్థసముజ్జ్వల భాషణంబులన్. 110

శ్రీ భగవానుఁడు:—

చ. నీ హృదయేప్సితం బిపుడు నేనుగ్రహించితి దానినిత్తు న
మోహపరీతచిత్తులగు మూఢులు దానినిఁబొందలేరు సం
దేహ మిఁకేల నోవసువ! నీవల తొల్లిటిబాముననన్ వసు
వ్యూహముసేయుసత్రమునఁ బూనిక నన్ను యజించియుంటిగా. 111

చ. అమలమనీషజన్మములనంత్యమటంచును దీనినిం దలం
పుము మదనుగ్రహాతిశయముల్ లభియింపఁగఁ గల్గుటన్ రహ
స్యముగ నృలోకమున్విడిచి యాత్మపదంబును జేరు నన్ను భా
గ్యముకతనం గనుంగొనఁగఁ గల్గితి నిర్మలభక్తి సంపదన్. 112

ఉ. ఏ నల సృష్టికాది వచియించితి మన్మహిమప్రకాశక
జ్ఞానముతొల్లి మద్విమలనాభిసరోజనిషణ్ణుఁడైన యా

ధీనిధి బ్రహ్మదేవునకు ధీవరులెల్లరు నా పునీతమౌ
జ్ఞానమునే సుభాగవతసంజ్ఞ వచింతురు పారదర్శులై. 113

ఉద్ధవుఁడు:—

చ. అనియిటు లామహాపురుషుఁ డాదృతిఁ బల్కి ప్రతిక్షణంబు న
న్నను గృపఁ జూడ నిట్లుఁ దదనుగ్రహపాత్రుఁడ నౌచు సంతసం
బున మెయినిండఁ బుల్కలొగి మొల్కలిడన్ స్ఖలితాక్షరుండనై
కనుఁగవ బాష్పధార లొలుకన్ హరిఁ గంటిని మోడ్పుఁ గేలుతోన్. 114

ఉ. ఏది సుదుర్లభంబగు మహిన్ బురుషార్థచతుష్టయంబునన్
నీదు పదాబ్జయుగ్మము ననేమమునన్ భజియించు వారికిన్
శ్రీదయితా! యదైనను వరింపను నేఁ బురుషార్థమున్ భవ
త్పాదసరోజసంభజనతత్పరనిస్పృహ మానసుండనై. 115

ఆ. అక్రియునకుఁ గర్మ్మలజునకు జన్మ కా,లాత్మున కరిభయపలాయనాదు
లాత్మరతికి నీకు నసంగనాశ్రియమును, బొడముటది కలంచు బుధులమతిని. 116

చ. ప్రవిమలతత్త్వబోధుఁడవు ప్రాజ్ఞతరుండవునైన నీవు మం
త్రవిధులు సల్పు నయ్యవసరంబున నన్నను జీరి యజ్ఞన
ట్లవహితబుద్ధి సర్వవిషయంబులు పృచ్ఛయొనర్చియున్న వాఁ
డవుకద దేవరా! యిది విడంబనమో మఱియేమొ దెల్పుమా. 117

క. జ్ఞానంబెది నీవు కమల,యోనికి నుడివితివొ తొల్లి యో ప్రభు! నాకుం
దానినెఱిగింపు మర్త్యుఁడ, నేనిన్ దానఁదరియింతు నెల్లకలుషముల్. 118

చ. హృదయగతాశయంబుఁ బరమేశున కీగతి విన్నవింప శ్రీ
ప్రియుఁడు గురుండునైన భగవంతుఁడు వారిజలోచనుండు దా
సదయత నాకుబోధనము సల్పె నిజాత్మరహస్యతత్త్వమున్
ముదమున నేను నాహరి సుబోధములన్ మదియందుఁ జేర్చితిన్. 119

ఉ. పూజితపాద! సద్గురు సుబోధమునన్ ఘనతత్త్వ సత్పథం
బోజ గ్రహించి తచ్చరణయుగ్మమునుం బ్రణమిల్లి యమ్మహా
తేజుఁ బ్రదక్షిణించియుఁ దదీయ వియుక్తికి నాతురుండనై
వ్యాజములేనిబుద్ధి నిటు వచ్చితి నో విదురా! శుభాహ్వయా! 120

క. ఆతనిదర్శనమున సం,ప్రీతియు విరహమున నార్తి పెనఁగొన హరికిం
బ్రీతిదమౌ బదరీవనిఁ, జేతోముద మొదవ నేను జేరెదనింకన్. 121

క. నరనారాయణులను మునివరులు మహామహులు లోకపావను లచటన్
స్థిరమును దీవ్రము మృదువును, జిరతరమును నైన తపముఁ జేసిరి ప్రతిభన్. 122

శ్రీశుకుఁడు:—

క. అనియిట్లుద్ధవువలనన్, విని దుస్సహ బంధువధము విదురుఁడు జ్ఞానం
బునఁ బాపికొనియె నెయ్యం, బునఁ బొడమిన దుఃఖభరము బుధవరుఁ డగుటన్. 123

గీ. కౌరవాగ్రణి విదురుండు గౌరవమునఁ, బరమభాగవతుం గృష్ణపరిగృహీత
జనములం గడు ముఖ్యునిఁ జనెడువాని, నుద్ధవున్నిల్పి విస్రంభ మొప్పఁ బలికె.

విదురుఁడు:—

మ. గురుయోగేశ్వరుఁ డీశ్వరుం డెలమి నీకుం దెల్పియున్నట్టి యా
త్మరహస్యప్రతిపాదకంబయిన బ్రహ్మజ్ఞానము న్నాకు సు
స్థిరబుద్ధిం దెలుపంగఁ జాలుదువు లక్ష్మీనాథభక్తుల్ నిరం
తరకాలంబు స్వకీయభృత్య నిచయార్థంబై చరింత్రిమ్ములన్. 125

ఉద్ధవుఁడు:—

గీ. అవనిలోకజిహాసుఁడౌ యధిపుచే వి, ధేయుఁడైన మైత్రేయుఁ డాదిష్టుఁ డయ్యెఁ
గావునన్ నీకు విదుర! నిక్కముగ నతఁడ, ప్రణుతతత్త్వార్థగతికి నారాధ్యుఁడు సుమి.

చ. అనివచియించి యుద్ధవుఁడుయాదవవర్యుఁడు విశ్వరూపు పా
వనగుణ కీర్తనామృత నివారితమానసతాపుఁడౌచు యా
మునపులినమ్మునందుఁ గురుపుంగవ సంయుతుఁడై నిశన్ క్షణ
మ్మునుబలె వేగఁ జేసి యతిమోదముతోఁ జనెఁ దాను బిమ్మటన్. 127

రాజు:—

చ. అతిరథయూథప ప్రభువులైన యదూత్తములెల్ల నొండొరుల్
హతులయి రూపఱంగ మతియాదవశేఖరుఁ డుద్ధవుండు నే
గతి నవశిష్టుఁడయ్యె ననఘా! భగవంతుఁడు కృష్ణుఁడున్ సమం
చిత నిజచారురూపముఁ ద్యజించెఁ గదా యిదియేమొ దెల్పుమా. 128

శ్రీశుకుఁడు:—

గీ. బ్రహ్మశాపకైతవకాలబలముచే న
మోఘ సంకల్పుఁడగు శ్రీవిభుండు ప్రథిత
మైన స్వకులంబు హరియించి యాత్మదేహ
మెలమి విడుచుచు నిట్టులూహించె మదిని. 129

క. ఈనరలోకమునుండియు, నేనిఁక నుపరతుఁడనగుదు నేనియు బ్రహ్మ
జ్ఞానముఁ బూనఁగ నాత్మ, ధ్యానపరుం డుద్ధవుం డయ్యర్హుఁడు గాదే. 130

గీ. స్వగుణములచేత నొరులకు బాధ నిడని, యుద్ధవుఁడు లేశమేని మదన్యుఁడగునె
కాన మద్విషయంబైన జ్ఞానము నల, వోక బోధించు నాతఁ డీలోకమునకు. 131

గీ. ఈగతిఁ ద్రిలోకగురుఁ డఖిలాగమోప, దేష్టయగు హరిచేత సందిష్టుఁడగుచు
బదరికాశ్రమమును జేరి భక్తి నుద్ధ, వుఁడు సమాహితుఁడై హరిపూజఁ జేసె. 132

గీ. విదురుఁ డుద్ధవుచేఁ గేళివిగ్రహుఁడగు, కృష్ణపరమాత్ము శ్లాఘ్యచారిత్రకథలు,
ధీరులకు ధృతికరము నధీరులకు శ్ర, మాస్పదము నగు తత్తనుత్యాగము వినె. 133

ఉ. శ్రీనిలయుండు కృష్ణుఁ డెడఁ జింతనఁ జేసిన యాత్మరూపమున్
ధ్యానముఁ జేయు చుద్ధవుఁడు ధన్యుఁడు భాగవతుండు క్రన్ననన్
దా నరుగంగఁ బ్రేమకతన న్విదురుండపు డేడ్చె నెట్టి సు
జ్ఞానికి నేని దుర్భరము సాధుజనాళి వియోగభారముల్. 134

క. కృతకృత్యుండగు విదురుఁడు, కతిపయదినములు వసించి కాళిందిన్ స
మ్మతిఁ బాసి పుణ్యచయ సం, గత నమ్మైత్రేయుఁ డున్న గంగన్ డాసెన్. 135

---

## అధ్యాయము 5.

### మహదాదిసర్గము. హరిస్తుతి.

శ్రీశుకుఁడు:—

క. కురువృషభుండగు విదురుఁడు, సురనదిద్వారమునఁ గూరుచున్న సుబోధ
స్ఫురణుఁ గృతహరిస్మరణున్, వరగుణు మైత్రేయు నడిగె బంధురఫణితిన్. 136

విదురుఁడు:—

ఉ. కర్మలఁ జేయు లోకము సుఖంబులఁ గోరునుగాని దానిచే
శర్మముగాని దుఃఖలవశాంతియుఁగాని లభింపకుండు నా
కర్మలచేతనే మఱి యకారణ దుఃఖము నొందుచుండు నా
కర్మము మర్మముం దెలుపఁగాఁ దగుదీవు మునీంద్రసత్తమా! 137

ఉ. దైవవశంబుచేతన యధర్మపరంబును దుఃఖమున్ స్వయం
భూవిముఖంబునైన జనముం గని తత్పదనుగ్రహార్థమై
శ్రీవిభుభక్తిచేఁ జెలఁగు సిద్ధులు మీరలు జ్ఞానపూతులై
యీ వసుధాస్థలంబునఁ జరించుచునుందురు కాదె నిచ్చలున్. 138

శా. ఏవర్త్మంబునఁ బూజితుండగుచు లోకేశుండు భక్త్యుజ్జ్వల
ద్భావంబందునఁ జక్కనిల్చి గురుతత్త్వద్యోతమానంబు యో
గావిర్భాతమునైన జ్ఞానమును నైశ్వర్యంబొప్పగా నిచ్చునో
యావర్త్మంబు నెఱుంగఁజెప్పుము మహాత్మా! సాధులోకోత్తమా! 139

వ. అని మఱియు విదురుం డిట్లనియె. ఆర్యా! కృతావతారుండైన భగవంతుఁ డాత్మతంత్రుండై త్రిగుణాత్మకమాయం గైకొని యే యే కర్మంబులం జేయు? నిష్క్రియుండై జగంబు నెట్లు సృజించు? జగద్వృత్తిని స్థాపించి యెట్లు పాలియించు? మఱియు నిజ్జగంబు స్వకీయహృదయాకాశంబున నివేశంబుఁజేసి నివృత్తవృత్తియై యోగమాయయం దెట్లు శయనించు? యోగీశ్వరాధీశ్వరుండును నేకస్వరూపుం డును నగు భగవంతుఁ డీజగంబున ననుప్రవిష్టుండై యెట్లు వైవిధ్యంబుననుండు? భూసుర, గో, సురాదుల క్షేమమునకై యవతారభేదంబులఁ గ్రీడించుచు నేయే కర్మంబు లాచరించు? లోకాధీశ్వరుండైన యద్దేవుం డేతత్త్వభేదంబులచే లోక పాలకసహితంబులైన లోకంబులను, నలోకంబులను గల్పించు? ఎచ్చట సర్వసత్వ నికాయభేదుండై యధికరించియుండు? విశ్వస్రష్టయు నాత్మయోనియు నగు నారాయణుం డేప్రకారంబున జీవులకు స్వభావ, కర్మ, రూప, భేదంబులం జేయు? ఓ విప్రవర్యా! యదియంతేయు మాకు నెఱుంగంబడునట్లు వివరింపుము. ఓ భగవత్స్వరూపా! వ్యాసముఖంబునుండి పలుమారు చాతుర్వర్ణ్య ధర్మంబులు వినియుంటిని గాని కృష్ణకథామృతప్రవాహంబు లేమింజేసియు, క్షుద్రసుఖా వహంబగుటంజేసియు వానివలనఁ దనివి జనింపదు. యుష్మత్సమాజంబులందలి సూరిజనగేయమానంబగు శ్రీకృష్ణకథామృత ప్రవాహంబునుండి యెవ్వఁడు తనివిఁజెందును? పురుషునిఁ గర్ణనాడింబ్రవేశించి భగవంతుఁడు భవప్రదాయకం బగు గేహరతిని విచ్ఛిన్నంబుగావించు. భవత్సఖుండగు కృష్ణద్వైపాయన మునీంద్రుండు మాకు భగవద్గుణంబుల బోధింపఁదలంచి భారతము వక్కాణించె. అజ్ఞాన గ్రామ్యసుఖానువాదంబుల మానవులబుద్ధి చొనుపంబడి హరికథాకర్ణ నానక్తంబయ్యె. ఇట్టి హరికథయందు శ్రద్ధాళువగు పురుషునిబుద్ధి వివృద్ధింజెంది యితర గ్రామ్యవిషయంబుల విరక్తింబూను. హరికథానుస్మృతి నిర్వృతుండైన మానవునకు నైశంబ సమస్తదుఃఖనివృత్తి యేర్పడు. ఏ మానవులు హరికథా విముఖులై వర్తింతురు శోచ్యాశోచ్యానభిజ్ఞులగు వారింగూర్చి నేను మిగుల దుఃఖింతును. వాదోపవాదంబుల వృథాకాలక్షేపముం జేయు నభాగ్యుల యాయువును గాలస్వరూపుండగు దేవుండు వ్యర్థంబుగ హరించు. కావున నో

మైత్రేయమునిపుంగవా! సుఖప్రదాయకంబగు నవ్విష్ణుదేవుని కథాసారంబును బుష్పంబులనుండి మకరందంబుంబలె నుద్ధరించి మాకు శ్రేయోభివృధ్యర్థంబు కీర్తింపుము. జగదుత్పత్తిస్థితి సంహారార్థంబు కృతావతారుండు గృహీతమాయుండునై యీశ్వరుం డతిపూరుషంబులగు కర్మంబుల వేనినాచరించె నవ్వాని నాకునై విశదీకరింపుమని విదురుండు మైత్రేయునడిగెనని శుకుం డిట్లనియె. ఇట్లు భగవంతుండగు మైత్రేయుండు విదురునిచే నడుగంబడి యవ్విదురు నభినందించుచు మానవశ్రేయస్కాముండై యిట్లు చెప్పందొడంగె. 140

మైత్రేయుఁడు :—

చ. అనఘ! యధోక్షజాత్ముఁడగు నాత్మ యశంబును లోకమందు నొ
య్యనఁ బ్రకటించి దాన భువనావనమున్ మదిఁ గాంతుఁజేయు నీ
వనుపమబుద్ధితోడ వినయంబును గైకొని నన్నుఁ బృచ్ఛఁజే
సినవిధ మన్నిటం గడుఁ బ్రసిద్ధము సుమ్ము కురుప్రజోత్తమా. 141

క. హరినీశు ననన్యమతిన్, స్మరియించెడు కృతివి వ్యాసమానీంద్రుని భా
స్వరవీర్యజాతుఁడవు చె, చ్చెర నీ విట్లడుగుటిది విచిత్రమె? విదురా! 142

క. మును మాండవ్యుని శాపం, బున శమనుఁడు దాను వ్యాసముని వలన జనిం
చెనుగా భ్రాతృక్షేత్రం, బన నొప్పు భుజిష్యయందు ననఘా! నీవై. 143

క. జ్ఞానోపదేశవిధికిన్, నే నాదేశింపఁబడితి నీకై హరిచేఁ
గాన భగవంతునకు నీ, వే నిజముగ సమ్మతుఁడవు విదురా! వింటె. 144

క. జగదుత్పత్తి స్థితిలయ, సుగమములై యోగమాయ సొంపారెడు నా
భగవల్లీలలు సక్రమ, ముగ వర్ణించెదను వినుము మోదంబెసఁగన్. 145

గీ. ఆత్మవిభుఁడైన యాపరమాత్ముఁ డరయ, సృష్టికిం దొల్త నొక్కండు చెలువు మిాఱు
నాత్మమాయోరుశక్తి ఛాయావిధంబు, ననుకరింప ననేకత్వమణఁగియుండు. 146

గీ. అప్పుడతఁడొక్కఁడే ద్రష్టయద్వయుండు, దృశ్య మితరంబుగాన రాదింతయేని
సుప్తమాయాతిశక్తి యసుప్తదృక్కు, నగుటఁదన్ లేనియట్టులున్నట్లుదలఁచు.

గీ. ప్రథమమున నెంచిచూడ సద్ద్రిష్టృశక్తి, సదసదాత్మికమాయ సృష్టయయినెగడె
దానిచేతఁ జరాచరాత్మకజగంబు, లోలి నిర్మింపఁబడియెఁ జుమ్మో మహాత్మ!

గీ. కాలగతిచేతఁ ద్రిగుణాత్మిక యగు మాయ, యందుఁ బురుషోత్తముండు వీర్యాంచితుండు
స్వీయవీర్యంబు నుంచెఁ గృషీవలుండు, సారమగుక్షేత్రమందు బీజంబునట్లు. 149

వ. కాలచోదితంబైన యవ్యక్తంబనంబరఁగు మాయాశక్తినుండి మహత్తత్త్వంబు
జనియించె. విజ్ఞానాత్మకంబును దమోనివారకంబును, సంశ, గుణ, కాల,
స్వరూపంబును నగు మహత్తత్త్వము భగవద్దృష్టిగోచరంబై విశ్వంబు సృజించు
తలంపున నాత్మదేహస్థంబైన విశ్వంబును బ్రకటించుచుఁ దన్ను వికారయుక్తం
బుఁగావించుకొనె. అట్లు వికృతింబొందిన మహత్తత్త్వంబునుండి కార్యకారణ
కర్త్రాత్మకంబు భూతేంద్రియమనోమయంబునగు నహంకారంబు వొడమె.
వైకారికంబును, దైజసంబును, దామసంబునని యహంకారంబు ముత్తెఱంగులై
యుండు. వైకారికంబైన యహంకారమునుండి మనంబును దేవగణంబును
జనియించె. అర్థాభివ్యంజనంబగు దానంజేసి దేవతలు వైకారికు లనంబడుదురు.
జ్ఞానకర్మమయములైన యింద్రియంబులు తైజసాహంకారమువలన నుదయించె.
తామసాహంకారంబువలన భూతసూక్ష్మంబులును నాకాశంబును నాత్మలింగ
శరీరంబును జనియించె. కాలమాయాంశయోగంబున సర్వాధ్యక్షుండగు
భగవంతునిచే నభంబు వీక్షింపంబడె. నభంబునుండి యనుసృతంబై స్పర్శంబును
జేయుచు ననిలంబుత్పన్నంబయ్యె. వికృతంబైన యనిలంబు నభోబలంబున
రూపతన్మాత్రకంబును లోకప్రకాశంబునగు తేజస్సును సృజించె. భగవదీక్షి
తంబై వికృతింబొందిన యనిలబలోపేతజ్యోతి రసతన్మాత్రకంబగు జలంబు
నుత్పాదించె. కాలమాయాంశయోగంబున బ్రహ్మవీక్షితంబై జ్యోతిర్బలో
పేతంబగు వికృతింబొందిన జలంబు గంధతన్మాత్రకంబైన భూమిని గల్గించె.
ఆకాశాదిభూతంబులకుఁ బరాపరకార్యంబేదికలదో దానిని యథాసంఖ్యంబుగా
విష్ణుదేవుని యంశరూపులు కాలమాయాంశ సూక్ష్మరూపులగు దేవతలెఱింగిరి.
నానాత్వంబునఁజేసి స్వకర్మాసమర్థులైన దేవతలు ప్రాంజలులై పరమేశ్వరునిఁజేరి
యిట్లు ప్రార్థింపఁదొడంగిరి. 150

దేవతలు :—

ఉ. ఓపరమేశ! యే పదపయోరుహమూలము నాశ్రయించి యా
తాపసు లుగ్రసంసృతిగతవ్యథలెల్లను నిస్తరింత్రో యా
పాపనివారకంబును స్వభక్తజనప్రియమై ప్రపన్నతా
పోపశమ త్వదంఘ్రియుగ్మమున్ భజియింతుము మేము నిత్యమున్. 151

శా. ఈసంసారమునం ద్రితాపహతులై యీజీవులెల్లన్ రవం
తే సౌఖ్యంబును బొందనేరరుగదా యేప్రొద్దు భావింపఁగా
నో సర్వేశ్వర! యాశ్రయించెదము మోహోద్వేగముల్ వీడి వి
ద్యాసంయోజితమైన నీయడుగుఁజాయన్ భక్తిరంజిల్లఁగన్. 152

ఉ. నీ మృదులాననాంబురుహనీడములౌ నిగమాహ్వయాండజ
స్తోమముచే నెఱింగి శుభశీలయుతాభ్రసరిన్నివాసమున్
గోమలమైన నీపదముఁ గోరి ప్రపన్నుల మేము నిత్యమున్
మా మది నాశ్రయింతుము రమాహృదయేశ! యనుగ్రహింపవే. 153

క. హృదయము శ్రద్ధాభక్తుల, నదలించి వైరాగ్యయుతమహాజ్ఞానసుసం
పద బుధవర్యులు గను త్వ, త్పదవారిజపీఠి నేముఁ బ్రార్థింతు మజా! 154

క. స్మృతమై యేది స్వభక్త, ప్రతతికి నభయంబొసఁగుఁ గృపన్ నిఖిలజగత్
స్థితిసర్గనాశకరోగ్ర, ద్యుతమగు నా నీపదంబు నర్చింతు మొగిన్. 155

ఉ. దేవ! రమేశ! తుచ్ఛమగు దేహమునందు నహంమమత్వదు
ర్భావదురాగ్రహాత్తులయి వర్తిలు పూరుషకోటి కాత్మయం
దే వసియించుచున్న మది నెన్నఁగ వారలకున్ సుదూరమై
పోవు త్వదంఘ్రిపంకరుహమున్ భజియింతుము మేము భక్తితోన్. 156

ఉ. శ్రీరమణా! బహిర్ముఖ హృషీకగణంబులచేత నిచ్చలున్
దూరపరాహృతాత్ములగు దుష్టులు కానరు నిన్నుఁ ద్వత్పద
శ్రీరమమాణచిత్తులయి శీఘ్రముగాంచెద రుత్తముల్ సదా
ధీరతనాశ్రయింతుము సుధీనుత! యట్టి భవత్పదాబ్జముల్. 157

చ. అనఘ! భవచ్ఛుభప్రదకథామృతపానవివృద్ధభక్తిచే
తన విమలాత్ములై బుధులు దారు విరక్తియుతప్రబోధమున్
గని తదనంతరక్షణమ కాంతురుగాదె వికుంఠధామమున్
వినుతపునీతనామము సువిభ్రమ మక్షియుగాభిరామమున్. 158

చ. అగణితసత్త్వులైన విమలాశయు లాత్మసమాధియోగశ
క్తిఁ గొని బలిష్ఠమైన ప్రకృతిన్ ధృతిమీఱ జయించి నిన్నుఁ బొం
దఁగలుగుచుంద్రు గాదె యతిదక్షతఁ ద్వత్పదపద్మసేవచే
సుగమముగాఁగఁ దోఁచు నది సుంత శ్రమం బుదయింపఁ దయ్యెడన్. 159

శా. దేవా! సత్త్వరజస్తమోభియుతశక్తిన్ లోకనిర్మాణ దీ
క్షావైశద్యముచేత మమ్ము నలవోకన్ సృష్టిఁ గావించియుం
టీ వే మిప్డెడఁబాటుఁజెంది యకటా! యీవిశ్వనిర్మాణమున్
గావింపంగఁ గడున్ వలంతులముగాఁ గాకుంటిమో సత్ప్రభూ. 160

సీ. పరమేశ! నీకెట్లు బలినొసంగుదుమో మే, మెట్టు లన్నంబు భుజించఁగలమొ
లోకేశ! నీకెట్లు లోకముల్ బలియిచ్చు, నెట్టులన్నము భుజియింపఁగలవొ

సాన్వవాయులమైన యమరులమగుమాకు, నరయఁ గూటస్థుఁడ వాద్యుఁడవును
దగ నధిష్ఠాతవై నెగడెదునీవల, గుణకర్మయోనివై కొమరుమిగులు
ఆ. నట్టి జననరహితమగు మాయయందుంచి, తాది వీర్యము మహదాదిరూప
మందువలన మేము నావిర్భవించితి, మెలమి సృష్టిశక్తి నిమ్ముదేవ! 161

---

## అధ్యాయము 6.

### విరాట్స్వరూప వర్ణనము

మైత్రేయుఁడు:—

సీ. ప్రవినష్టలోకతంత్రములగు మహదాది, కోరు స్వశక్తు లొండొంటితోడఁ
గలియకయున్నఁ దద్గతిని నిరీక్షించి, జగదీశ్వరుఁడు కాలసంజ్ఞమగుచు
ద్యోతనశీలమై తోఁచు శక్తినిఁదాల్చి, తగఁద్రయోవింశతితత్త్వగణము
నొక్క మొగిం జొచ్చె నురవడినట్లు ప్ర, విష్టుఁడై పరముండు చేష్టలొప్ప
గీ. సుప్తకర్మను మేల్కొల్పుచును విభిన్న, గణము సంయోజనముఁ జేసెఁ గ్రమము తోడ
నిద్ధగుణుచేత నిట్లు ప్రబుద్ధకర్మ, మగుచుఁ దగఁ ద్రయోవింశతికగణము తనరె.

వ. ఇట్లు భగవత్ప్రేరితంబై యది స్వమాత్రలచే విరాట్స్వరూపంబును సృష్టించె. ఎందుఁ జరాచరలోకంబులు వొడమె నట విశ్వంబును సృజించు నా తత్త్వగణము మాత్రిచేఁ దమయం దావేశించిన పరమాత్మునివలన నొండొంటిం దాకి క్షుబ్ధం బయ్యె. హిరణ్మయుండగు నా విరాట్పురుషుండు సర్వసత్త్వోపబృంహితుండై సహస్రవత్సరంబు లండకోశంబున జలంబుల వసించె. విశ్వసృజంబులైన తత్త్వంబులకు గర్భరూపుండును, నాత్మశక్తిమంతుండును, దైవకర్ముండగు నా విరాట్పురుషుండు విశ్వముంబొందిన తనచేఁ దన్ను నేకవిధంబుగను; దశవిధంబులుగను ద్రివిధంబులుగను విభజించె. సర్వభూతగ్రామాశ్రయుండై యశేషసత్త్వంబుల యాత్మాంశంబై పరమాత్మ యాద్యావతారంబునై విరాట్స్వరూపం బొప్పారు. అది "సాధ్యాత్మము, సాధిభూతము, సాధిదైవము" నని ముత్తెఱంగులగు. విరాడ్రూపము ప్రాణంబుచే దశవిధంబులును, హృదయంబుచే నేకవిధంబునగు. విశ్వసృట్తత్త్వంబులకు నధీశుండైన యధోక్షజుం డేతద్ద్వైవిధ్యంబు కొఱకు స్వతేజంబున విజ్ఞాపితంబగు విరాట్స్వరూపంబును దపింపంజేసె. అనంతరంబున నభితప్తంబగు నా విరాట్స్వరూపంబునకుఁ బెక్కు దేవాయతనంబులు

నిర్భిన్నంబులయ్యె. వాని వివరింతు వినుము. ఆ విరాడ్రూపుని నిర్భిన్నమైన యాస్యస్థానమును లోకపాలకుండైన యగ్ని స్వవక్తవ్యంబును బ్రతిపన్నంబుఁ జేయు స్వాంశంబైన వాగింద్రియంబుతోడఁజొచ్చె. వాని నిర్భిన్నంబైన తాలువులను లోకపాలకుండైన వరుణుండు రసప్రతిపాదకమగు స్వాంశంబైన జిహ్వతోఁ బ్రవేశించె. నాసాపదంబులను నశ్వినీదేవతలు గంధంబుం బ్రతిపన్నంబుఁజేయు స్వాంశంబైన ఘ్రాణేంద్రియంబుతోఁ జొచ్చిరి. నేత్రస్థానములను లోకపాలకుండైన త్వష్ట రూపప్రతిపాదక స్వాంశచక్షురింద్రియంబుతోఁ బ్రవేశించె. మఱియు నితని చర్మస్థానముల లోకపాలకుండైన యనిలుండు స్పర్శంబును బ్రతిపాదించు స్వాంశంబైన ప్రాణేంద్రియంబుతోఁ బ్రవేశించె. కర్ణంబుల దిక్కులు శబ్దంబును బ్రతిపన్నంబుఁజేయు స్వాంశంబైన శ్రోత్రేంద్రియంబుతోఁ జొచ్చె. త్వక్కును నోషధులుఁగండూతిం బ్రతిపాదించు స్వాంశంబైన రోమంబులతోఁ బ్రవేశించె. మేఢ్రంబును బ్రజాపతి యానందంబును బ్రతిపాదించు స్వాంశంబగు రేతస్సుతోఁ బ్రవేశించె. విరాట్పురుషుని నిర్భిన్నంబగు గుదస్థానమును మిత్రుఁడు విసర్గంబును బ్రతిపాదించు స్వాంశంబైన పాయ్వింద్రియముతోఁ బ్రవేశించె. వినిర్భిన్నంబైన హస్తంబులను స్వర్లోకనాథుండైన యింద్రుండు వృత్తిప్రతిపాదక స్వాంశంబైన వార్తతోఁ బ్రవేశించె. స్వస్థానంబులగు పాదంబులను విష్ణుదేవుండు గంతవ్యంబును బ్రతిపాదించు స్వాంశంబైన గతితోఁ జొచ్చె. హృదయస్థానంబును జంద్రుండు వికారంబును బ్రతిపాదించు స్వాంశంబగు మనంబుతోఁ బ్రవేశించె. బుద్ధిస్థానంబును వాగీశుండు బోద్ధవ్యప్రతిపత్తిగల స్వాంశంబగు బోధంబుతోఁ జొచ్చె. ఆత్మను నభిమానంబు కర్తవ్యప్రతిపాదకంబగు స్వాంశంబగు కర్మంతోఁ బ్రవేశించె. సత్త్వంబును మహత్తత్త్వము విజ్ఞానప్రతిపాదకంబగు స్వాంశంబైన చిత్తంబుతోఁ బ్రవేశించె. ఈ విరాట్పురుషుని శీర్షంబువలన స్వర్గంబును పాదంబులవలన భూమియు నాభివలన నాకాశంబును నుత్పన్నంబులయ్యె. వానియందు గుణవృత్తులును సురాదులును బ్రతీయమానులగుచుండిరి. ఆత్యంతికమైన సత్త్వ గుణంబుతో దేవతలు దివంబును బొందిరి. రజస్స్వభావంబున మానవులు భూమిం బొందిరి. తమస్స్వభావంబున వ్యోము, రుద్ర, పారిషదగణంబులు ద్యావాపృథివ్యంతరంబగు భగవన్నాభి నాశ్రయించిరి. బ్రహ్మ పురుషునిముఖంబునుండి యున్ముఖుండగుటంజేసి వేదంబును, వర్ణముఖ్యుండై గురువైన బ్రాహ్మణుండును బుట్టె. అతని బాహువులనుండి క్షత్రధర్మంబును, దాని ననువర్తించుచుఁ గంటక క్షతంబులైన పురుషసంబంధంబులగు వర్ణములను గాపాడుచుండునట్టి క్షత్రియుండును నుదితుండయ్యె. ఊరుభాగంబులనుండి లోకవృత్తికరంబులైన జీవికా

హేతువులతో వైశ్యుండుపొడమి నరుల జీవికను బ్రవర్తింపఁజేసె. భగవంతుని పాదములనుండి కర్మసిద్ధికొఱకు శుశ్రూష జనించె. దాన శూద్రుండు పొడమి యేవృత్తిచే హరి సంతుష్టుండగు నట్టివృత్తిని బ్రవర్తింపఁజేసె. ఆత్మవిశుద్ధ్యర్థంబై వృత్తులతోఁగూడ జనించి యీచతుర్వర్ణంబులు స్వగురుండగుహరినిస్వధర్మంబున యజించుచుండు. దైవకర్మాత్మరూపియగు భగవంతుని యోగమాయా బలంబున నుపపన్నంబైన యీ విరాడ్రూపంబును సాకల్యంబున నిరూపించుటకు నెవ్వఁడు సమర్థుఁడై యిచ్ఛగింపఁదలఁచు? అయినను యథాశ్రుతంబుగా బుద్ధికొలఁది యితరకీర్తనంబులచే నపవిత్రంబైన వాక్కును, బునీతంబుగావించుటకు విష్ణుదేవుని యమేయమైన కీర్తిని గీర్తించుచుంటి. విద్వాంసులచే శ్రోత్రంబులం జొనుపఁబడిన హరికథాసుధారసము నాస్వాదించి సుశ్లోకోత్తముఁడగు నాభగవంతుని గుణకీర్తనంబునేయుట నిశ్చితమైన లాభంబుగాఁ దద్విదులు చెప్పుచుందురు. 163

గీ. హాయన సహస్రములయంతఁ గుందు విమల, యోగపరిపక్వ ధీవిశేషోన్నతిఁ గొని
యాదికవిమైన యయ్యంబుజాసనుండు, నాత్మమహిమఁదెల్పఁగ నసమర్థుఁడె
యగు. 164

మ. భగవన్మాయ యమేయమాను మదిలోఁ భావింప మాయావులన్
మొగి మోహింపఁగఁజేయు దాని మహిమంబున్ శ్రీవిభుండేనియున్
దగ నేతాదృశమం చెఱుంగఁడనినన్ దదద్భూరిమార్గం బెఱుం
గఁగ నేరేని వలంతులయ్యెదరొకో కౌరవ్య వంశాగ్రణీ! 165

చ. హృదయముతోడ వాక్యముల నేనును సర్వసుపర్వసంఘముల్
సదమలరూపుఁడైన హరి శక్తి నెఱుంగఁగలేక భ్రాంతిఁబొం
దెద మన నవ్య లేపగిది దేవవిభుండగు నాదిదేవు న
త్పదమెఱుఁగంగనేర్తు రలపావనమూర్తికి నా నమస్కృతుల్. 166

---

## అధ్యాయము 7.

### విదురకృత వివిధప్రశ్నావళి

శ్రీశుకుఁడు:—

క. అనిపలికెడు మైత్రేయుని, గని ద్వైపాయనసుతుండు ఘనుఁడు విదురుఁడా
వ్యాసవినయమధురవాక్కులఁ, దనియించుచునిట్టులనియెఁ దత్పరమతితోన్. 167

విదురుఁడు:—

మ. అనఘాత్మా! యవికారి నిర్గుణుఁడు జ్ఞానాత్ముండునౌ దేవదే
వునికిన్ లీలఁగనైన నెట్టులు గుణాంశంబుల్ కర్మముల్ గల్గు? బా
లునకుం గ్రీడల నన్యవస్తుమతి గల్గుంగాని యెబ్భంగి ని
త్యనివృత్తుండు స్వతోభితృప్తుఁడు విభుం డన్యం బపేక్షించెడున్. 168

ఉ. ఆభగవంతుఁ డీశుఁడు గుణాత్మకమౌ నిజమాయచేతఁ దా
నీభువనవ్రజంబు సృజియించెను దత్ప్రభుమాయచేతనే
ప్రాభవధుర్యుఁడౌచుఁ బరిపాలనసేయుచునుండు వెండి నీ
శ్వాధర మొప్ప నాశనముసల్పు నశేషముగా బుధోత్తమా! 169

వ. మఱియు దేశకాలంబుల సకలావస్థల స్వాయముగఁగాని యన్యంబులచేతఁగాని యెన్నఁడేని నవిలుప్తజ్ఞానస్వరూపుండగు నద్దేవుండు మాయచేఁ గూడు టెట్లు? ఏకరూపుండగు నీభగవంతుండే సర్వక్షేత్రంబుల నవస్థితుండై యుండుగదా? యట్టి యీతనికి దుర్భగంబుగాని, కర్మకృతంబగు క్లేశంబుగాని గలుగు టెట్లు? ఓ విద్వచ్ఛిఖామణీ! యీ జ్ఞానసంకటంబున నామనంబు ఖేదపడుచున్నయది. బ్రహ్మస్వరూపా! మహత్తరమైన యీ నా మానసిక కశ్మలంబును బోగొట్టుము. 170

శ్రీశుకుఁడు:—

క. ఈవిధమున నావిదురుం, డావిషయము నెఱుఁగఁదలఁచి యడిగినయంతన్
భావనమతి మైత్రేయుఁడు, ధీవిభవం బొప్ప నిట్లు దెల్పె ముదితుఁడై. 171

మైత్రేయుఁడు:—

క. ఈయది భగవన్మాయను, నీ యారయఁ దర్కమునకు నిది నిలువదు గా
యా యీశ్వరునకు ముక్తున, కేయెడ బంధనము కలుగ దెఱుఁగుము విదురా! 172

మ. జనుఁ డుత్స్వప్నగతంబులైన నిజశీర్షచ్ఛేదనాదిక్రియల్
తనయాత్మన్ నిజమంచు నెంచినను దథ్యం బెట్లు కావచ్చె యీ
శునకుం గర్మగుణానుబంధనములుం జూడంగ మాయాబలం
బున నున్నట్టులు దోఁచుచుండు నిరతంబున్ సుంతలేకుండియున్. 173

చ. జలముల బింబితుండయిన చంద్రునకుం దలపోయఁ దత్కృతం
బులయిన కంపనాదు లెటు బుద్ధికిఁ దోఁచియు వాస్తవంబుగాఁ
గలుగక యుండు నట్లు గుణకర్మము లా పరమాత్మునందు న
గ్గలముగఁ దోఁచుచుండెడిని గాని యథార్థముగా నొకింతయున్. 174

చ. విమలనివృత్తిధర్మమున విష్ణుదయం బరమేశుభక్తియో
గమునఁ దిరోహితంబగునుగాదె యవిద్య శనైర్గతిన్ రమా
రమణునిఁ గాంచినంతన విరామముఁ జెందెడి నింద్రియాళి గా
ఢమగు సుషుప్తియందుఁ బరికటవ్యథలన్నియుఁ బాయుకైవడిన్. 175

ఉ. ఆ మురవైరి సద్గుణకథామృత సంశ్రవణంబు పెక్కులౌ
బాములఁ బాపుచుండుఁ బ్రసభంబునఁ దచ్చరణారవింద సే
వామలభాగ్య మబ్బిన సమస్తసుఖంబులు లభ్యమౌను జు
మ్మో మహితాత్మ! కాన విభునూర్జితభక్తి భజించుటొప్పగున్. 176

విదురుఁడు: —

శా. ఓ మైత్రేయమునీశ్వరా! యిప్పుడు నీసూక్తాసిచే సాంద్రమా
నా మోహోర్మిలతావితానములు ఛిన్నంబయ్యె దేవుండు ని
స్సీమంబైన స్వతంత్రతం జెలఁగుటల్ జీవుండు దుష్పారతం
త్ర్యాముగ్ధుండయి యుండుటల్ విన మనంబౌత్సుక్యముం బొందెడున్. 177

క. మునిచంద్ర! విష్ణుదేవుని, ఘన మాయావిలసనంబు గడుఁ బ్రీతిని నా
కును దెల్పినాఁడ వా మా, యను లేనిది యున్నయట్టులగపడు ననుచున్. 178

గీ. ఎవఁడు మూఢతముండగు నీజగమున, విపులబుద్ధియుతుండయి వెలయు నెవఁడు
వారలిరువురె కాంతు రపారసుఖము, నంతరితుఁడైన జనుఁడు పెన్వంతఁ జెందు. 179

వ. మునీంద్రా! ప్రతీతమానంబగు నవిద్య యయథార్థత్వము నిశ్చయించి యే భాగవతసేవచే భగవంతుండును గూటస్థుండును మధుద్విషుండునగు మురారి పాదంబులయందు వ్యసనాపనోదకంబగు తీవ్రంబైన ప్రేమోత్సవంబు సంభవించునో యట్టి యుష్మచ్చరణకమలసేవచే నేను దానిఁ దొలఁగించుకొందు. ఎందు దేవదేవుండగు జనార్దనుండు నిత్యంబు కీర్తింపఁబడుచుండు నట్టి విష్ణుమార్గంబులయందు సేవ యల్పతపస్సుచే దుర్లభంబైనదయ్యును నాచే సంప్రాప్తంబయ్యె. సవికారంబులైన మహదాదితత్త్వంబులను బ్రథమంబున ననుక్రమంబుగ సృజించి యందుండి విరాట్స్వరూపంబు నుద్ధరించి విభుండు దానియందుఁ బ్రవేశించె. సహస్రపాదోరుబాహువులుఁగ నే యాద్యపురుషునిఁ జెప్పుదురో యెందీ సమస్త లోకంబులు సవికాసంబుగ వసించియుండునో, యేస్వరూపంబునం దింద్రియార్థేంద్రియసంయుతంబై త్రివిధంబైన ప్రాణంబు కలదో, నీచేఁ జెప్పఁబడిన వర్ణంబు లెందుఁ బొడమినవో, యెచ్చటఁ బుత్ర, పౌత్ర, ప్రపౌత్ర, గోత్రజులతోడం గూడి విశ్వవ్యాప్తులై విచిత్రాకృతులైన ప్రజలు వొడమిరో తద్విభూతుల

న్నాకు నెఱుంగఁ జెప్పుము. ప్రజాపతీశ్వరుండైన మాధవుం డేయే ప్రజాపతులను, సర్గంబులను, ననుసర్గంబులను మనువులను మన్వంతరాధిపతులను సృజించె? వీరి వంశంబులను, వంశానుచరితంబులను భూమికి నుపర్యథో భాగంబుల నే లోకంబులు కలవో వానివాని స్థితులును భూలోకపరిమాణంబును వర్ణింపుము. తిర్యఙ్నర, దేవ, సరీసృప, పక్షిగణంబులయు గార్భాండజస్వేదజోద్భిజ్జంబులయు సృష్టివిభాగంబులు దెల్పుము. బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపంబులచే విశ్వంబునకు సృష్టి, స్థితి, లయాశ్రయంబులు కల్పించు శ్రీనివాసుని యుదారవిక్రమంబు వక్కాణింపుము. రూప, గుణ, స్వభావంబుల వర్ణాశ్రమవిభాగంబులును ఋషుల జన్మ కర్మంబులును, వేదవిస్తారంబును, యజ్ఞవితానంబులును, యోగపథంబులును, నైష్కర్మ్యతంత్రంబును, భగవత్ప్రోక్తంబగు సాంఖ్యంబును పాషండపథవైషమ్యంబును బ్రతిలోమకుల విభాగంబును గుణకర్మజంబులైన జీవగతులును, నవిరోధంబులైన ధర్మార్థకామమోక్ష నిమిత్తంబులును, వార్తా, దండనీతి, వ్రత, పృథగ్విధానంబులును, శ్రాద్ధవిధులును, పితృదేవతాసృష్టియు, గ్రహ, నక్షత్ర, తారాగణంబుల కాలావయవసంస్థితియు, దానతపఃఫలంబులును, నిష్టాపూర్త ఫలంబులును బ్రబలధర్మంబును నాపద్ధర్మంబును ధర్మయోనియు, భగవంతుండగు జనార్దనుండు దేనిచే సంతసించు దేనికి ననుగ్రహించుఁ దత్సర్వంబు నోయనఘాత్మా! నా కెఱింగింపుము. అనువ్రతులగు శిష్యులకుఁ బుత్రులకు దీనవత్సలులైన గురువు లడుగకున్నను హితంబుఁ జెప్పుచుందురు. ఓ భగవత్స్వరూపా! మహదాదితత్త్వంబుల ప్రళయం బెన్నివిధంబులు? ఆప్రళయంబున నీపరమేశ్వరుని నెవ్వరు సమీపించియుందురు? అతని ననుసరించి యెవరు శయనింతురు? మఱియు జీవుని తత్త్వంబును బరమేశ్వరస్వరూపంబును నా జీవేశ్వరుల కెద్దాన నైక్యంబు ఘటిల్లు నట్టి నిగమాత్మకజ్ఞానమును జెప్పుము. సూరిప్రోక్తంబులగు నా యోపనిషదికజ్ఞాన నిమిత్తంబులను దెలుపుము. పురుషులకు స్వతస్సిద్ధముగా నెందుండి భక్తి, జ్ఞాన, వైరాగ్యంబులు కలుగు? మహాత్సేవలేక యివి కలుగ నేరవు. శ్రీమన్నారాయణుని కర్మవైవిధ్యము నెఱుంగఁ గోరి యడిగిన నాయీ ప్రశ్నంబుల మాయామోహితదృష్టినై యంధప్రాయుండనుగానున్న నాకు సఖుండవగుటం జేసి వివరింపుము. సర్వవేదంబులు సర్వయజ్ఞంబులు సర్వతపోదానంబులును జీవాభయప్రదానాల్పాంశంబునుం బోలవు. 180

శ్రీశుకుఁడు:—

ఉ. అని యిట్లాకురుపుంగవుండు వినతుండై యుత్సుకత్వంబుతో
ఘన పౌరాణికకల్పమంతయు నెఱుంగం గోరి సమ్యగ్గతిం

దనుఁ బ్రశ్నింపఁగఁ బ్రీతచిత్తుఁడయి మిత్రాసూనుఁడున్ లోకనా
థుని సంపూర్ణకథానువర్ణనవినోదుండై వచించెం దగన్. 181

---

## అధ్యాయము 8.

### బ్రహ్మోత్పత్తి, తపశ్చరణము

మైత్రేయుఁడు:—

ఉ. శ్రీరమణీమనోహరచరిత్రపరంపరలోలిసారెకున్
సారె కనుక్షణంబును నచంచలబుద్ధినిఁ గ్రొత్తసేయుచున్
బారముముట్ట భాగవతవర్యుఁడవైతివి నీకతంబునన్
బూరువరాన్వయంబు పొలుపుం గనియెన్ బుధసేవనీయమై. 182

చ. అవరసుఖంబుఁ గోరుచు మహత్తర దుఃఖము నొందుచున్న మా
నవ నివహోరుదుఃఖముల నాశ మొనర్చుటకై మహాముని
ప్రవరుల కింపుమీఱ భగవంతుఁడు మున్ను వచించినట్టి భా
గవతపురాణరాజమును గ్రమ్మఱఁ దెల్పుదుఁ గౌరవోత్తమా. 183

గీ. భూతలాసీను భగవంతు నమూలపురుషు, నవితథజ్ఞాను సంకర్షణాఖ్యు దేవు
వాసుదేవతత్త్వ మెఱుంగఁ బ్రశ్నఁ జేసి, రా సనత్కుమారాదికులైన మునులు. 184

గీ. వాసుదేవాభిధంబగు స్వాశ్రయంబు, నాదరించుచు విబుధోదయంబుకొఱకు
నిర్వృతాంతర్ముఖీకృత నేత్రపద్మ, కోశ మించుక తెఱచె లోకేశుఁడంత. 185

చ. అహిపతికన్యలందఱు వరార్థము ప్రేమయుతోపహారముల్
బహువిధముల్ వెసం గొనుచు స్వర్గధునీవిమలోదకంబులన్
ముహురభిషిచ్యమానమయి పొల్చు జటాళిఁ దదంఘ్రిమత్సరో
రుహమును గొల్చుచుండిరి సుప్రకటోజ్జ్వల భక్తిసంపదన్. 186

సీ. ఆభగవత్తముఁడైన సంకర్షణ, దేవుండు దెల్పె ముక్తిపథతత్ప
రుఁడగు సనత్కుమారునకు సనత్కుమారుఁడును నిత్యవ్రతారూఢుఁడైన
సాంఖ్యాయనునకు నోజఁ దెల్పెఁ బారమ, హంస్యముఖ్యుండగు నాతఁ డెలమి
భగవద్విభూతివివక్షమాణుండయి, యస్మద్గురూత్తముఁ డనుగతుండు

గీ. నగుపరాశరమునికి బృహస్పతికినిఁ, జెప్పెను బులస్త్యకథితుఁడై చెలువుమీఱ
నాద్యమైన పురాణంబు నాపరాశ,రుండు తెలిపె నాకదియె వాకొత్తు నీకు. 187

సీ. అహిరాజతల్పశయానుఁ డొక్కండును, స్వాత్మరతిం దృప్తుఁ డక్రియుండు
నఖిలజగంబు జలాప్లుతంబగుచు దా, యోగనిద్రన్ నేత్రయుగము మూసె

నంతశ్శరీర సక్తమర్పితభూతుఁడై, కాలశక్తిరణ్యకతనఁ జేసి
రుద్ధవీర్యుఁడయి దారువులవహ్నియుఁబోలె, స్వపదమైయొప్పెడిసలిలమందుఁ
గీ. దగవసించెను దాఁజతుర్యుగసహస్ర, కాలమప్పాలఁబవళించికాలశక్తి
ప్రాప్తకర్మతంత్రుండయియుఁగియున్న, నఖిలజగములఁగని స్వదేహంబునందు.

వ. సూక్ష్మార్థాభినివిష్టదృష్టియగు నా నారాయణుని నాభిదేశమునందుండి యంతర్గతంబగు సూక్ష్మార్థంబు కాలానుగతంబగు రజోగుణంబుచేత విద్ధంబై వినిర్భిన్నంబయ్యె. ఆత్మయోనియగు నప్పద్మకోశంబు నిజకాంతిచే సూర్యుండునుంబోలె విశాలంబగు నా యుగాంతసలిలంబును బ్రకాశింపఁజేయుచుఁ గర్మప్రబోధకంబగు కాలంబుచే వేగంబ యుత్థితంబయ్యె. సర్వగుణప్రకాశకంబును దిగ్లోకాత్మకంబునగు నాపద్మమునందు మహావిష్ణువు నిజకళాంశంబుఁ బ్రవేశింపఁజేసె. అందుండి స్వయముగ వేదమయుండును, విధాతయునగు స్వయంభువుండైన బ్రహ్మయుదయించె. అప్పద్మకర్ణికయం దవస్థితుండై లోకంబును గానక యాకాశంబున నేత్రంబులు ద్రిప్పుచు నలుదిక్కులఁ జూచుటం జేసి నాల్గుముఖంబులంబడసె. ప్రళయకాల ప్రభంజనఘూర్ణిత మహాకల్లోలమయ సలిలప్రరూఢ పద్మంబు నాశ్రయించియు నాత్మలోకతత్త్వంబు నంతయుఁ దెలియఁజాలకయుండె. అబ్జపృష్ఠంబుననున్న యీ నే నెవండను? నీయబ్జంబెటనుండి యనన్యంబై యీ జలంబులఁదోఁచె? ఈ పద్మంబున కధోభాగంబున నూర్ధ్వభాగంబున నేమేమి కలవు? అని యిట్లు పరికించి తత్పద్మనాళనాడీ భాగంబులనుండి యంతర్జలంబునఁ బ్రవేశించె. తీక్ష్ణమైన యా నాభి నాళముబొంది యంతట వెదకుచు నజుండెద్దియుఁ దెలియనేరండయ్యె. విదురా! యపారంబగు తమఃపుంజంబునందు నాత్మసర్గంబును గవేషించుచున్న బ్రహ్మకు నేవిష్ణుకాలచక్రంబు దేహభాక్కులకు భయంబును బెంపొందించుచు నాయువును క్షీణింపఁజేయునో యట్టిమహాస్త్రమగు కాలంబుగతించె. పిమ్మట నప్రతిలబ్ధకాముండై స్వస్థానంబునుంబొంది యద్దేవుండు క్రమ్మఱ జితశ్వాసుండును, నివృత్తచిత్తుండును నారూఢసమాధి యోగుండునునై యుపవిష్టుండయ్యె. అయ్యజుండు పురుషాభిప్రవృత్తయోగంబైన కాలంబున విశేషసముత్పన్నజ్ఞానుండై పూర్వము వెదకియు నెవ్వానిఁగనజాలకుండెనో యట్టి నిజాంతర్హృదయమునఁ బ్రకాశించు పరమపురుషుని సందర్శించె. 189

చ. విపులఫణాతపత్రసముపేతశిరోమణిదీధితిచ్ఛటా
క్షపితతమశ్చయంబగు యుగాంతజలంబునఁ దా మృణాలగా

రపృథుల దేహ శేషఫణిరాజఫణాతల తల్పమందు యో
గపరతఁ బవ్వళించినయొక్కఁడగు పూరుషుఁ గాంచె నర్మిలిన్. 190

సీ. సాంధ్యకాలాభ్రముచ్ఛాయ రమ్యోజ్జ్వల, పీతాంబరంబు శోభిల్లుచుండ
సౌవర్ణశిఖరంబుచాడ్పునఁ గాంచనాం, చితకిరీటంబు భాసిల్లుచుండ
ప్రపతత్ఝరోదధారలభంగి విమలమౌ, క్తిక హారతతులు వర్తిల్లుచుండ
వితతదివ్యౌషధీవ్రాతములగతిఁ దుల, సీదామములు విరాజిల్లుచుండ
గీ. వృక్షశాఖలక్రియ బాహువితతి యలర, తటజవృక్షంబులట్లు పాదములు దనర
మరకతోపల శిఖరిసామ్యంబుఁ గొన్న, శ్యామలాకారు సుగుణాభిరాముఁ గాంచె.

శా. ఆయామంబున విస్తరంబున నమేయంబై జగత్సంగ్రహం
బై యత్యుజ్జ్వల దివ్యభూషణమకుటాలంకృతంబై ఘనా
మ్నాయాంత ప్రతిపాద్యమానమయి సౌమ్యంబై సుధీగమ్యమై
శ్రీయుక్తంబయి యొప్పు దేహలతచేఁ జెన్నారు దివ్యంగనెన్. 192

మ. స్వమనోభీప్సితకామ్యసిద్ధికి నజస్రంబున్ బవిత్రోజ్జ్వలా
గమమార్గంబులఁ గొల్చుపూరుషులకుం గామప్రదంబున్ నఖేం
దుమయూఖస్ఫుర దంగుళీదళము సంస్తుత్యంబు నా స్వీయపా
దము సంపూర్ణకృపారసంబు మొలకెత్తన్ జూపు నీశున్ గనెన్. 193

చ. అమలవిలాసముం ద్రిభువనార్తిహరస్మితరోచిభాసమా
నము నయనాభిరామ మరుణాధరబింబవిరాజితంబు నా
స్యము మణికుండలాభరణమండితమున్ సునసంబు సుభ్రుయు
క్తమునగు మోముతో స్వజనతర్పకుఁడౌ వనజాక్షునిం గనెన్. 194

గీ. నవకదంబ కింజల్కసుందర పిశంగ, వస్త్రమేఖలాలంకృతోజ్జ్వలనితంబు
మొనసి శ్రీవత్సయుత వక్షమున ననర్ఘ్య, విపులహారంబుఁ దాల్చిన విభునిఁ గాంచె.

మ. ఉరుపుష్పాఢ్య సహస్రశాఖలుగఁ గేయూరాత్తదోర్దండముల్
పరఁగన్ శ్రీ మహదాది రూపమగు నవ్యక్తంబు మూలంబుగా
వరలన్ శేషఫణీంద్ర భోగవిలసద్వల్గ్వంఘ్రియై యొప్పి సుం
దరలోకద్రుమరాజమై తనరు సుజ్ఞానాత్ము నీశున్ గనెన్. 196

చ. వరఫణి రాజబంధువు నపారచరాచర సంశ్రయుండు భా
సురసలిలోపగూఢుఁడగుచున్ స్వకిరీటచయంబు స్వర్ణసుం
దరశిఖరంబులట్లలర దర్శిత కౌస్తుభరత్నగర్భుఁడై
వరలుచుఁ బర్వతాధిపువిభంగిఁ జెలంగెడు నీశ్వరుం గనెన్. 197

చ. శ్రుతిమధుపావృతంబు స్వ యఽశోవిభవంబునఁ దేజరిల్లు నా
యతవనమాల కంఠమునఽయందు ధరించినవాని నాయహా
ర్పతి రజనీపతి శ్వసనఽవహ్నిదురాపుఁ ద్రికాలధామ సం
గత రణ సాధనంబుల నఽగమ్యు హరింగనె బ్రహ్మ యత్తఱిన్. 198

ఉ. అన్నలినాసనుండు భువనఽనాళికి సృష్ట జగద్విసర్గ దృ
ష్టిన్నయమొప్ప నప్పుడె వఽడిన్ ఘననాభి సరస్సరోజమున్
దన్ను జలంబు వాయువును ఽ నాకమునుం బొడఁగాంచెఁగాని దా
నెన్నివిధంబులం గనినఽనెందును గానఁడిఁకం దదన్యమున్. 199

శా. అంతన్ ధాత రజోయుతుండగుచు మాఽయావిభ్రమానీతమా
పుంతన్ స్వాంతముఁజొన్పి తోడన ప్రజాఽవ్యూహంబు సృష్టింపఁగా
నింతే త్రోవని లోకసర్గమునకున్ ఽ హేతుత్వముంజూచి వి
భ్రాంతిన్మాని విసర్గసమ్ముఖత నాఽభవ్యున్ నుతించెన్ ధృతిన్. 200

---

## అధ్యాయము 9.

### బ్రహ్మస్తుతి.

బ్రహ్మ:—

దండకము. శ్రీదేవదేవా! యమేయప్రభావా! లసద్భావ! శ్రుత్యంత సీమంత ముక్తామణీ! దైవచూడామణీ! భక్తరక్షామణీ! తాపసగ్రామణివ్రాతసంపూజితాంఘ్రిద్వయా! యద్వయా! నిత్యసత్యస్వరూపా! విరూపాక్షముఖ్యామరశ్రేణి నీ యుజ్జ్వలద్భూరి మాయాలతాపాశ సంబద్ధులై ముగ్ధులై వ్యగ్రులై నిన్నుఁగానంగ లేరన్న నీ దేహధారుల్ భవల్లీలలంగాన నెట్లోర్తురో లోకనాథా! ప్రపూర్ణానుకంపాసనాథా! యనాథాళికిన్ నీవు దిక్కౌదు కాదే మహాభాగ! నాచేత నీ విప్డు జ్ఞాతుండవైతవ్యయా! శుద్ధమాయాగుణక్షోభముం జేసి నానాత్వముం జెంది భాసిల్లుచుందీశ్వరా! యింతియేకాని నీకంటె నన్యంబు వేఱొండు లేదో ప్రభూత్తంస! నీనాభిపద్మంబునందుండి నేఁబుట్టి యానందమాత్రం బనావిద్ధ తేజంబు భూతేంద్రియాత్మంబు నేకం బవిశ్వంబు విశ్వాత్మకంబైన నీ దివ్యరూపంబుఁ బ్రాపించితిన్ లోకకల్యాణ సంధాయకా! నీపదోపాసక శ్రేణికిన్ శ్రేయముం గూర్పఁగా నిట్టిరూపంబు వ్యక్తంబుగావించియున్నట్టి నీకున్ నమోవాకముల్ స్వామి! యెవ్వారలామ్నాయ గంధానిలానీతమై యొప్పునీదివ్య పాదాబ్జ కోశోజ్జ్వలద్గంధముం బ్రీతి మూర్కొందురో భక్తి నీపాదపంకేరుహద్వంద్వముం గొల్తురో నాథ! యాపూరుషశ్రేణి

చిత్తాంబుజాతంబులందున్ వసింతీవు లోకేశ్వరా! మానవశ్రేణి దామెంత పర్యంతము నీ పదాబ్జంబు సేవింప భావింపరో యంతపర్యంతమే క్షేత్ర దేహార్థ గేహాదిజంబౌ భయంబో సుమా యంతపర్యంతమే శోకమున్ లోభమున్ మోహమున్ గానుమున్ గల్గుచుండున్ జగన్నాథ! సర్వాశుభవ్రాత నిర్వాపకంబైన నీసత్ప్రసంగంబునందుండి వైముఖ్యముం జెందు దీనుల్ సదా కామసౌఖ్యంబు లేశంబు నాసించి లోభాభిభూతాత్ములై హానిఁ గల్పించు కార్యంబులం జేయుచుండ్రో రమాలోల! క్షుత్తృట్త్రిధాతువ్యథాపీడ్యమానాత్ములై కష్టశీతోష్ణవాతాతపక్లిశ్యమానాంగులై దుర్భరక్రోధకామాది దుశ్శక్తులన్ మ్రగ్గుచున్నట్టి యేతత్ప్రజావ్రాతముం గాంచఁగా నాదుచిత్తంబు పెన్తత్తరంబందెడున్ దివ్యరూపా! భవద్యోగమాయాబలోత్పన్న దేహేంద్రియవ్రాతముం బోల్ప నాత్మంబు కంటెన్ విభిన్నంబుగా నెంచు పర్యంతమీ ఘోరసంసారమున్ దుఃఖసంఘాతమున్ మానకుండుం బగల్ వ్యాపృతాంతర్బహిర్భూత సర్వేంద్రియవ్రాతులై రేయి నిద్రాభరవ్యాప్తులై యుండి నానావిధాలోచనాభంజితోత్సుప్తులై దుష్టదైవాహతుల్ దివ్యమానీంద్రులేనైన యుష్మత్ప్రసంగంబునం దోలి వైముఖ్యముం బొంది సంసారదావాగ్ని దందహ్యమానాత్ములై గుందుచుండ్రింక భూతేశ! శ్రోత్రేక్ష్యమాణోరుమార్గుండవై పూరుషశ్రేణి సద్భక్తి యోగక్రియా శోధితంబౌ మనఃపద్మకోశంబునం దింపుతోడన్ వసింతీవు నీభక్తకోటుల్ సదా బుద్ధి నేయేమహారూప మూహించి ధ్యానింతురో నీవును న్వారికై సుప్రసన్నాత్మతం గూడి తత్తచ్ఛరీరంబులం దాల్చుచుందీశ! నానాజనస్థుండవై యంతరాత్ముండవై ప్రాణబంధుండవై దుర్జనశ్రేణికిం బూనఁగారాని భూతానుకంపం బ్రసన్నుండవైనట్లు సంబద్ధకాముల్ సురల్ పెక్కులౌ కాన్కలన్ నిన్ను సేవించుచున్నం బ్రసాదింపఁగా రావుగా పూరుషుల్ సర్వకర్మంబులన్ సర్వధర్మంబులన్ సర్వదానంబులన్ సత్తపోనిష్ఠలన్ సద్వ్రతవ్యాప్తులన్ నీసమారాధనంబే తలంపంగ సర్వోత్తమంబౌను లేదందు నాశంబు శశ్వత్స్వరూపోరుచైతన్యశక్తిం బరావృత్తభేదుండవై వీతమోహుండవై జ్ఞానరూపుండవై యొప్పు నీకున్ జోహారుల్ త్రయీరూప! విశ్వోద్భవస్థానసంహార కేళీనిమిత్తంబులౌ లీలలం గ్రీడలం జేయు యోగీశుఁడౌ నీకు మ్రొక్కుల్ సురాభ్యర్చితా! నీదు లీలావతార ప్రసిద్ధోరుకర్మంబులన్ సద్గుణంబుల్ లసద్దివ్యనామంబులుం బ్రాణనిర్యాణకాలంబునన్ మానవశ్రేణి దాముచ్చరింపం గృతానేకపాపౌఘముల్ బాసి కైవల్యలక్ష్మీసమాశ్లేషసౌఖ్యంబులం గాంతుర్గా యట్టి దివ్యావతారుండవౌ నీకు నానందనంబుల్ రమాధీశ! యేనున్ గిరీశుండు నీవుం బ్రసాదంబులై యాత్మమూలంబునందుండి యావిష్కృతిం జెంది యోలిన్ జగచ్ఛ్రేణి కుత్పత్తినాశస్థితుల్ పేర్మిఁ

గావింతుమా లోకవృత్త్యాత్మకత్వంబునం బొల్చు నీకుం బ్రణామంబు లో లోకనాథా! భవత్పూజలందుం బ్రమత్తంబు స్వక్షేమకర్మానభిజ్ఞంబునై యెంతపర్యంత మీలోకముండుం బ్రభూ! మాధవా! యంతపర్యంతమున్ దానికిన్ జీవితాశాలతల్ గోసి కాలాత్మతన్ వెల్గు నీకున్నతుల్ శ్రీపతీ! సర్వలోకోపరిస్థంబై పరార్ధద్వయస్థాయిధిష్ణ్యంబునందుండి పెక్కేండ్లు దివ్యత్తపోనిష్ఠఁ గావించియు న్నిన్నుఁ గానంగ లేకేను సంభీతచిత్తుండనై యుండి నిర్హేతుకంబౌ భవన్నిత్యపూర్ణానుకంపన్ భవద్దివ్యరూపంబుఁ గన్గొంటిగా యట్టినీకు న్నమస్కారముల్ దీనబంధూ! దయాభావసింధూ! సతిర్యఙ్మనుష్యాదితేయాదికంబైన యాజీవయోనివ్రజంబందు నాత్మేచ్ఛచే లబ్ధదేహుండవై యాత్మనిర్ణీతమౌ కర్మమర్యాదఁ గాపాడఁగా నెంచి వీతస్పృహన్ వెల్గుచున్కింగదా పూరుషశ్రేష్ఠుఁడంచంద్రుని న్నట్టి నీకున్నతుల్ దివ్యరూపోజ్జ్వలా! పంచపర్వాఢ్యయా యుజ్జ్వలావిద్యచే వంచనం బొందకీలోకముం గుక్షిలో లీలమైఁ దాల్చుచున్ భీమకల్లోలమాలాకులాంతర్జలంబందు దోగిన్ మానవశ్రేణికిన్ సౌఖ్యసద్రీతులం దెల్పుచున్ శేషతల్పంబునన్ నిద్దురం జెందు నీనాభిపంకేజగేహంబునందుండి యేనుద్భవం బంది లోకత్రయీసృష్టిఁ గావింప నర్హుండనై యొప్ప నద్యోగనిద్రావసానోల్లసన్నేత్రపద్ముండవున్ స్వీయకుక్షిస్థసర్వప్రపంచుండవున్ వేదవేద్యుండవౌ నీకు నాప్రార్థనల్ సత్యచిన్మోదరూపా! సమస్తప్రపంచాప్తమిత్రుండవై స్తోత్రపాత్రుండవై యేకమాత్రుండవై లోకనేత్రుండవై సచ్చరిత్రుండవై యాత్మరూపుండవై విశ్వము న్నెమ్మి రంజింపఁగాఁ జేయుదే శుద్ధసత్త్వంబునం దాన నన్నుం బ్రసాదింపుమా పూర్వమట్లీజగంబున్ సృజింపంగ దక్షత్వమిమ్మా! ప్రసన్నాననాబ్జుండవై యారమాశక్తిచేతన్ గుణోపేతలీలావతారుండవై దేనినే సృష్టిఁ గావింతునో వేగఁ దత్పూర్తి యాగావుతన్ నాకు నీయాజ్ఞచేతన్ జగత్సృష్టిఁ గావించు నాచిత్తమెల్లప్డు నీయందు సంయుక్తమైయుండుతన్ దానిచే కర్మమాలిన్యమెల్లం బటాపంచలై పోవుగాతన్ భవన్నాభికాసారనీరంబునందుండి సంపూర్ణవిజ్ఞానశక్తిం బ్రసాదించి యత్యద్భుతంబైన నీరూపమున్ విశ్వరూపంబుగాఁగం బ్రపంచించు నావేదవాక్సంహతిం బెంపుగాఁ వింపు ప్రేమార్ద్రమున్ సత్కృపాయుక్తమున్ రమ్యమైనట్టి నీనేత్రపద్మంబు విప్పారఁగాఁ జేసి ద్రాక్షాగుళుచ్ఛోపమానోక్తులన్ నావిషాదంబుఁ బోగొట్టి యీలోకకల్యాణసంధాయివై లెమ్ము సమ్మోదమిమ్మా శుభాకారధీరా! సురాహార్యగంభీరవీరా! జగత్సంచయాధార! దివ్యోజ్జ్వలాకార! జ్ఞానప్రదీపాహతాజ్ఞానగాఢాంధకారా! నమస్తే నమస్తే నమస్తే నమః. 201

మైత్రేయుఁడు :—

వ. విదురా! పద్మగర్భుండిట్లు నిజోత్పత్తికారణభూతుండగు నప్పురుషోత్తమునిం గని మనోవాక్కులకు నందినంతవరకుఁ దపోవిద్యాసమాధుల స్తుతించి ఖిన్నుండైనట్లు విరతుండయ్యె. పదంపడి మధుసూదనుండు ప్రళయోదకంబునం జేసి విషణ్ణహృదయుండై తన లోకసంస్థానవిజ్ఞానంబున భ్రాంతియుతుండగు బ్రహ్మకేయం బెఱింగి గంభీరవాక్కులఁ దత్కశ్మలంబును శమింపం జేయుచున్న వాఁడుం బోలె నిట్లు పలుకందొడంగె. 202

శ్రీ భగవానుఁడు:—

గీ. బెదరి యలసతఁ జెందకు వేదగర్భ!, సృష్టియం దుద్యమంబు వహింపుమింక
దేనినిప్పుడు నీవు ప్రార్థించుచుంటి, పూర్వమే యిచ్చితిని దానిఁ బొసఁగ నీకు. 203

గీ. వెండియుఁ దపంబు నీవు గావింపుమఱియు, వెరవున మదాశ్రయంబైన విద్యఁ గనుము
చెలఁగి సత్తపోవిద్యల చేత వివృత, జగములం గాంచఁగల్గు దోయజగర్భ! 204

వ. భక్తియుక్తుండవై సమాహితచిత్తుండవై లోకంబులందు వ్యాపించిన పరబ్రహ్మస్వరూపుఁడనగు నన్నును నాయందు సమస్తజీవులను జూడఁగలవు. దారువులయం దగ్ని వోలె సర్వజీవులయందు నంతర్యామిత్వంబున వెలుంగుచున్న నన్ను లోకం బెప్పుడు గాంచునో యప్పుడ కశ్మలంబును విడనాడు. భూతేంద్రియ గుణాశ్రయ రహితంబైన యాత్మను స్వరూపంబున నన్నుఁ గాఁ జూచుచు మోక్షంబుఁ గాంచు. నానాకర్మవితానంబులచే బహువిధప్రజలను సృజింపఁ దలఁచు నీకు నాత్మజ్ఞానంబు క్షీణింపనేరదు. అట్టి నీయందు మదనుగ్రహంబు మెండై యుండు. ప్రజలను సృజించు నీమనంబు నిర్బంధంబుగ నాయందు మెలంగు నేని పాపిష్ఠంబైన రజోగుణం బాదిఋషివైన నిన్ను బంధింపఁజాలదు. నీవు భూతేంద్రియ గుణాత్మయుక్తునిగ నన్నెఱింగితి గావున దేహులకు దుర్జ్ఞేయుండనయ్యు నేనిప్పుడు నీచే నెఱుంగఁబడితిని. మద్విచికిత్సచేఁ బద్మనాళంబు వెంబడి తన్మూలంబును జలంబున వెదకుచున్న నీకు నా యాత్మస్వరూపంబు బహిర్భాగంబునఁ జూపంబడె. మత్కథాభ్యుదయాంకితంబగు నీ నా స్తోత్రంబుఁ జేయుటయు నీకు తపస్సునన్ గరిష్ఠనిష్ఠయు నివియెల్ల మదనుగ్రహంబుగా నెఱుంగుము. నీకు శుభంబగు. లోకవిజయేచ్ఛచే గుణమయుండను నిర్గుణుండను నగు నన్ను వర్ణించుచు స్తుతించితివి. కావునఁ బ్రీతుండనైతిని. నీకు భద్రంబగు. ఏపురుషుండు నన్ననవరతము స్తోత్రరూపంబున స్తుతించుచు భజించునో వానిని సర్వకామవరప్రదాయకుండనై యనుగ్రహింతును. ఇష్టాపూర్తంబులచేతను, దపస్సుచేతను, యజ్ఞంబులచేతను,

దానంబులచేతను, యోగంబులచేతను, సమాధిచేతను నేశుభంబు పురుషులచేఁ బొందంబడు నదియెల్ల మత్ప్రీతియని తత్త్వవిదులెఱుంగుదురు. పరమేష్ఠీ! నేనాత్మల కాత్మ్యుండను, బ్రియులకుఁ బ్రియతముఁడను. కావున యెవ్వని నిమిత్తము దేహాదికంబు ప్రియంబగునో యట్టి నాయందనురాగముఁజేయుము. సర్వవేద మయంబును నాత్మయోనియు నగు నాత్మంబుచేత నాయందు విలీనమైయున్న విశ్వప్రజలను బూర్వంబువలె సృజింపుము. 205

మైత్రేయుఁడు :—

గీ. అనుచు నిట్లు జగత్స్రష్టయైన యాస, రోజగర్భునకున్ మహాతేజుఁడైన
పరమపురుషుండుసృజ్యప్రపంచమునొగిఁ, దెలిపి నిజరూపగతుల నదృశ్యుఁడయ్యె.

---

## అధ్యాయము 10.

—దశవిధసర్గము—

విదురుఁడు:—

గీ. ఆ రమేశుఁ డంతర్హితుఁడైనయంతఁ, దామరసనూతి లోకపితామహుండు
కడఁగి దైహిక మానసికప్రజాళి, నెన్ని తెఱఁగులఁ దా సృజియించెనోలి. 207

క. నా యడిగిన ప్రశ్నము మైత్రేయా! వివరింపు నాకుఁ దెలియన్ ఘన మే
ధాయుతుఁడవీవు ఛిన్నముఁ, జేయుము నాసంశయము లశేషమునీషన్. 208

శ్రీశుకుఁడు:—

గీ. ఇట్లు విదురుఁడు తన్నుఁ బ్రార్థించినంత, హృష్టుఁడగుచు మైత్రేయ మునీశ్వరుండు
భావమున నెలకొన్న సంప్రశ్నములను, సంస్మరించుచుఁ బల్కె రాజన్యవర్య!

మైత్రేయుఁడు:—

క. శ్రీపతియెట్టులు చెప్పెనొ, యాపగిదిన్ మదిని విష్ణునందునిలిపి తా
నాపరమేష్ఠి తపము దీ, ప్తాపరుఁడయి దివ్యవర్షశత మొనరించెన్. 210

చ. జలజజుఁ డాలయావసరసమ్యగుదంచిత వీర్యసంయుతా
నిలజవకంపితాంబురుహనీరములం బొడఁగాంచి సత్తపో
బలమున నాత్మసంస్థితినిభాసిలుచుండెడు విద్యచేత న
గ్గలమగు జ్ఞానశక్తిఁ బెనుగాలినిఁగ్రోలె నొగిన్ జలంబుతోన్. 211

గీ. అంబరవ్యాప్తమగు పుష్కరంబుఁగాంచి, యందు లీనంబులైన లోకాళిఁగూర్చి
పరమపురుషుచేఁ గల్పింపఁబడితి నేన, టంచు నెమ్మనమందు విరించితలఁచె. 212

క. నలువ హరిచోదితుండయి, పలుతెఱఁగుల ముత్తెఱఁగులఁ బదునాల్గు తెఱం
గుల నేకము విభజించెన్, జలరుహకోశంబుఁ జొచ్చి చతురతమీఱన్. 213

శా. శ్రీవిష్ణుస్మరణ ప్రభావమున రాజీవాసనుం డిట్టు లే
తావన్మాత్రతనజీవలోకతతి సంస్థాభేదనిర్మాణమున్
గావించెన్ వివరించినాఁడ నది యో కౌరవ్య! నిష్కామధ
ర్మావిర్భూతఫలాత్మకుం డరయ నీరాజీవగర్భుండగున్. 214

విదురుఁడు:—

గీ. బ్రహ్మరూప! మైత్రేయ! యవ్యాజకరుణ, గదుర బహురూపుఁ డద్భుతకర్ముఁ డైన యె
నంగు కాలాఖ్యు నీశులక్షణముఁ జెప్పి, తింక దానిని వివరింపు మెఱుఁగఁ బడఁగ. 215

మైత్రేయుఁడు:—

వ. మహదాది పరిణామంబును నిర్విశేషంబునగు కాలంబు ప్రతిషితంబయ్యె. పురుషుండు త దుపాదానంబగు నాత్మను లీలగా సృజించె. బ్రహ్మాత్మకంబైన విశ్వం బవ్యక్తరూపుండును, గాలాత్మకుండును నగు నీశ్వరునిచేఁ బరిచ్ఛిన్నంబై విష్ణు మాయాసంస్థితంబై యుండు. భూతభావిభవద్రూపంబై కాలంబు వెలుంగుచుండు. అక్కాలంబునఁ బ్రాకృత వైకృతరూపంబగు నవవిధసృష్టి యొప్పారుచుండు. కాల ద్రవ్యగుణంబులచే నది త్రివిధంబై యుండు. ఆత్మగుణవైషమ్యంబగు మహత్సర్గం బాది సృష్టియనంబడు. ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబగు నహంకారసర్గంబు ద్వితీయ సృష్టియగు. తన్మాత్ర ద్రవ్యశక్తిమంతంబగు భూతసృష్టి తృతీయంబగు. జ్ఞానక్రియాత్మకంబగు నింద్రియసర్గంబు చతుర్థంబు. వైకారికంబగు దేవసర్గంబు మనోమయంబగు పంచమసృష్టియగు. అజ్ఞానకృతంబగు తమస్సర్గంబు షష్ఠంబు. ఇవి యాఱును బ్రాకృతసర్గంబులనంబడు. ఆ వైకృతసర్గంబులంగూడ నెఱింగింతు వినుము. రజోగుణభాక్కును సంసారకరుండునగు భగవంతునిలీలయై యొప్పు సప్తమసర్గంబు షడ్విధమై పరఁగు. వనస్పతులును, నోషధులును, లతలును, ద్వక్సారంబులగు వేణ్వాదులును, వీరుధద్రుమంబులును, నూర్ధ్వస్రోతంబులు, తమఃప్రాయంబులు, నంతస్స్పర్శంబులు, విశేషయుతంబులు ననునది షడ్విధమైన సప్తమ సర్గంబు. తిర్యగ్జంతువుల యష్టమసర్గంబు యష్టావింశద్విధంబై పరఁగు. శ్వస్తనజ్ఞాన శూన్యంబులును, నాహారాది జ్ఞానమాత్రనిష్ఠంబులును ఘ్రాణజ్ఞంబులును దీర్ఘానుసంధానశూన్యంబులును నై తిర్యగ్జంతువులు పరంగును. మహిషాజ గో మేష కృష్ణ సూకర గవయ రురూష్ట్ర ప్రభృతిక నవవిధ ద్విశఫ జంతువ్రాతంబులును ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమరీ ముఖ షడ్విధైకశఫజంతు సముదయంబును

సారమేయ సృగాల వృక శార్దూల మార్జాల శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధాదిక ద్వాదశవిధ పంచనఖ భూచరజంతువ్రజంబును మకరాది సప్తవింశతి విధ జలచరనిచయంబును, గంక గృధ్ర బక శ్యేన భాజ భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూకాది ఖగంబులును నష్టమసర్గంబగు. అర్వాక్స్రోతంబై రజోధికంబయి కర్మపరంబయి దుఃఖంబునందును సుఖంబును గోరు మానవసృష్టి నవమ సర్గమనంబడు. ఈమూఁడును వైకృతంబులగు. ప్రాకృత వైకృతోభయాత్మకంబగు కౌమారసర్గంబు దేవ సర్గాంతర్గతంబయగు. దేవసర్గంబష్టవిధంబులై యొప్పు. దేవతలు, పితృదేవతలు, గంధర్వులు, రాక్షసులు, నప్సరసలు, సిద్ధులు, యక్షులు, రక్షస్సులు, చారణులు భూత ప్రేత పిశాచంబులు, విద్యాధరులు, కిన్నరాదులు, విశ్వస్రష్టచే నిర్మింపఁబడిన దశమసర్గంబు. ఇట్లుదశవిధసర్గంబుల నెఱింగించితి. ఇఁకమీఁద వంశంబులను మన్వంతరంబులను జెప్పుదు. ఇట్లు రజోగుణయుక్తుండగు స్రష్ట కల్పాదియందు నమోఘసంకల్పుండై యాత్మను నాత్మచేత నాత్మయందు సృష్టించును. నదియందు భ్రామ్యమాణంబగు నావర్తంబుపగిది నీ కల్పంబునఁ గీర్తింపఁబడు దేవాసురాదుల పౌర్వాపర్యంబు వ్యక్తంబుగాకుండు. వారే మన్వంతరాంతరంబున నామరూపంబుల నొప్పారిరి. 216

---

## అ ధ్యా య ము 11.

### కాలప్రమాణము

మైత్రేయుఁడు:—

వ. కార్యసముదాయావస్థలం బొందక నణులకు నైక్యభ్రమంగల్పించుచు విశేషాంశంబులం జరమాంశంబై యుండునది పరమాణువనంబడు. స్వరూపావస్థితంబైన సత్పదార్థంబునకుఁ గేవలంబును, బరమంబును, నవిశేషంబును నగు కాలంబు మహాన్నామకంబై యుండు. ఇట్లు కాలంబు సూక్ష్మంబున స్థూలంబున ననుమేయంబై యుండు. భగవంతుండైన విభుండు స్వస్థానభుక్తియు వ్యక్తభుక్తియు నగు. వ్యక్తభుక్తిగల కాలంబు పరమాణువనియు, విశేషభుక్తిగలకాలంబు మహత్తనియు వ్యవహరింపంబడు. రెండుపరమాణువులొకయణువగు. అణుత్రయం బొక త్రసరేణువనంబడు. గవాక్షప్రవిష్టార్కరశ్ములం దోఁచి యతిలాఘవంబున భూమిం బొందక గగనంబున నెగయునది త్రసరేణువు. అట్టి త్రసరేణుత్రయము త్రుటియగు. అట్టి త్రుటిశతంబొక వేధ. వేధత్రయంబు లవంబు. లవత్రితయము నిమేషంబు. నిమేషత్రయము క్షణంబు. క్షణపం

చకంబు కాష్ఠ. అట్టి కాష్ఠలు పదునైదు లఘువు. పదునైదులఘువులు నాడియగు. నాడీద్వయము ముహూర్తము. ముహూర్తషట్కము ప్రహారంబు లేక ముహూర్తసప్తకము యామం బనంబడు. స్వర్ణమయంబులైన చతుర్మాషంబుల చతురంగుళాయామశలాకారూపంబున నిర్మింపంబడిన దానిచేఁ గృతచ్ఛిద్రంబైన షట్పలతామ్రవిరచిత పాత్రింబునందుఁ బ్రస్థమాత్రిజలంబెంతకాలం బుననిండు నంతకాలంబు నాడికయగు. నాల్గుయామంబు లొకపగలు. అంతియ రాత్రి. దివారాత్రింబులు మర్త్యుల కొకదినము. పదునైదుదినంబులు పక్షంబు. అది శుక్ల, కృష్ణపక్షభేదంబుల ద్వివిధంబై యుండు. అట్టి రెండుపక్షంబు లొక మాసంబు. ఆమాసంబు పితృదేవతలకు రేయుంబవలు. ఆమాసంబులు రెండైన నొకఋతువు. మాసషట్క మయనము. దక్షిణోత్తరంబులని యయనంబు ద్వివిధంబు. అట్టి యయనద్వయంబగు ద్వాదశమాసంబు లొకసంవత్సరంబగు. ఈసంవత్సరము దేవతల కహర్నిశంబులు. అట్టి సంవత్సరశతంబు నరులకుఁ బర మాయువుగా నిరూపింపఁబడె. గ్రహర్క్ష తారాచక్రస్థుండును, ననిమిషుండును, గాలాత్మకరూపుండునగు సూర్యభగవానుఁడు ద్వాదశరాశ్యాత్మకంబగు భువనకోశంబును బరమాణ్వాది సంవత్సరావసానంబునం బరిభ్రమించుచుండు. సంవత్సరమనియుఁ బరివత్సరంబనియు, నిడావత్సరంబనియు, ననువత్సరంబనియు, వత్సరంబనియు, దీని నైదు తెఱంగులఁ గాలవిదు లెఱుంగుదురు. కాలరూపంబైన స్వశక్తిచేత నంకురాది తద్విషయబీజాదిశక్తిని బహువిధంబులఁ గార్యాభిముఖంబుగావించుచు, స్వఃకాములైన పురుషులకు గుణమయస్వర్గాదిఫలంబును, యజ్ఞంబులచే విస్తరింపఁజేయుచు, మహాభూతవిశేష తేజోమండలరూపుఁడగు సూర్యుండు పురుషుని మోహనివృత్తికొఱకై యంతరిక్షంబున నాయురాదివ్యయంబున విషయాసక్తిని నివర్తించుచుండు. వత్సరపంచక ప్రవర్తకుండగు నా సూర్యభగవానుకొఱకు బలిప్రదానంబు సేయుము. 217

విదురుఁడు:—

క. పితృదేవ నరులయాయు, ర్గతిమానముఁ దెలిపి తీవ్రుకడుముద మయ్యెన్
యతివర! కల్పబహిస్థిసత, గతియును నాకెఱుఁగఁజెప్పుకారుణ్యమునన్. 218

వ. మఱియు భగవంతుండు భగవత్స్వరూపంబగు కాలగతినెఱింగె. ధీరులయినవారు యోగసిద్ధంబైన దృష్టిచే విశ్వంబును గనుగొనుచుందురు. అట్టి కాలగతిని నాకు వివరింపుమని విదురుండు వేడిన మైత్రేయుఁ డిట్లనియె. 219

మైత్రేయుఁడు:—

వ. కృత, త్రేతా, ద్వాపర, కలియుగంబు లనుపేర్లంబరగు చతుర్యుగంబులు దివ్య ద్వాదశవర్ష సహస్రంబుల నిర్ణీత మయ్యె. యథాక్రమంబునఁ గృతాదియుగంబు లందు నాలుగు, మూఁడు, రెండు, నొక్కటిగ సహస్రంబులు సంఖ్యాతంబులయ్యె. ద్విగుణితములగు శతంబులును నిరూపితములయ్యె. సంధ్యకును సంధ్యాంశంబున కును సర్గలయంబులచే నే యంతరంబు కలుగు దానిన యుగంబని తద్విదులుచెప్పిరి. ఆయుగంబులఁ దత్తద్ధర్మంబులు విధింపంబడియె. ధర్మంబు చతుష్పాదంబై కృత యుగంబున మనుజుల ననువర్తించుచుండు. మిగిలినయుగంబుల నొక్కొక్కపాదం బుగ వృద్ధిపొందు నధర్మంబున ధర్మంబు క్షీణించుచుండు. ముల్లోకంబులకంటె వెలుపల బ్రహ్మలోకపర్యంతము యుగసహస్రం బొకదినంబగు. రాత్రియుఁ దావన్మాత్రంబగు. విశ్వస్రష్ట జాగ్రత్సుషుప్తులవలన లోకోద్భవ నాశంబులగు చుండు. చతుర్దశ మనువుల నిమిడ్చుకొనుచు భగవంతునిదినంబు నిశావసాన ప్రారబ్ధలోకకల్పంబై యొప్పారుచుండు. మనువు కించిదధికైకసప్తతియుగపరి పరిమాణంబగు స్వకాలం బనుభవించుచుండు. మన్వంతరంబులం గ్రమంబుగఁ దద్వంశ్యులగు ఋషులును, సురలును, గలుగుదురు. వీరొక్కమొగిని నింద్రా దుల ననువర్తించుచుందురు. ఇది త్రైలోక్యవర్ధనంబును, గర్మానుసారంబుగఁ దిర్యఙ్నర పితృదేవసంభవంబును నగుబ్రహ్మదేవుని యనుదినోత్పన్నంబగు సృష్టి ప్రకారంబు. భగవంతుండు మన్వంతరంబుల స్వమూర్తులగు మన్వాదులచే సత్త్వ గుణంబును ధరియించి, యుదితపౌరుషుండై యీవిశ్వంబును బాలించుచుండు. దినాత్యయంబునఁ దమోమాత్రంబును గైకొని ప్రతిసంరుద్ధపౌరుషుండై కాలాను ప్రవిష్టాశేషుండై యుదాసీనుండగు. నిశానువర్తనకాలంబున నిర్ముక్తశశిభాస్క రుండగు నాభగవంతుని భూరాదిలోకత్రయం బనుసరించి మెలంగు. సంకర్షణా గ్నిచేఁ ద్రిలోకంబులు దహింపఁబడుచుండ నయ్యూష్మంబునఁ బీడింపఁ బడి ఋష్యాదులు మహర్లోకంబునుండి జనర్లోకంబును జేరుదురు. తత్కాలంబునఁ, గల్పాంత ప్రవర్ధితసాగరంబు లుత్కటాటోపప్రచండవాయుప్రేరితతరంగంబులై ముల్లోకంబులను దేల్చుచుండు. అంతట ననంతాసనుండైన హరి యోగనిద్రాని మీలితాక్షుండై జనర్లోకాదులచే సంస్తూయమానుండగుచు నా సలిలంబున వెలుంగుచుండు. ఇట్టి కాలగత్యుపలక్షితంబులగు నహోరాత్రంబులచేత హాయ నశత పరిమాణంబగు బ్రహ్మదేవుని పరమాయువు గతప్రాయంబగుచుండు. ఇతని యాయువునం దర్ధభాగము పరార్ధం బనంబడు. పూర్వంబైన పరార్ధం బతిక్రాం తంబయ్యె. ఇప్పు డపరంబైన పరార్ధంబు ప్రవర్తించుచున్నయది. ఆదియందుఁ

చ. ఉరుమతి నిగ్రహింపఁబడుచుండియుఁ గ్రోధము తత్క్షణంబ తా
మరసజాతుకన్బొమలమధ్యమునుండి జనించె సర్వని
ర్జరనిచయాగ్రజుండనఁగ నంగుకుమారుఁడు నీలకంఠుఁడై
యురువడి నాతఁ డేడ్చెనపు డొక్క మొగిం బరమేష్ఠి చూడఁగన్. 225

చ. పదఁపడి నాతఁ డయ్యజునిఁ బద్మజుఁగాంచి జగద్గురూ ! విభూ!
సదయత నాదు నామములు స్థానములుం దెలుపంగదయ్య పో
యెదననుడుం దదుక్తులకు నీకొని బ్రహ్మయు భద్రవాక్య సం
పద భవుతోడ నీపగిదిఁ బల్కెఁ గృపారసపూరితాత్ముఁడై. 226

చ. సలిపెద నీకు నామములు స్థానములు న్విలపింపఁబోకు వి
హ్వలుఁడగుబాలునట్లు జననావసరంబున నిర్జరోత్తమా !
చలపడి నీవు రోదనము సల్పుటఁబట్టియ నిన్నునుం బ్రజల్
పిలుతురు రుద్రనామమునఁ బ్రీతిఁ దలిర్పఁగ నెల్లకాలమున్. 227

గీ. ప్రకటమగు హృదయేంద్రియప్రాణములును
వ్యోమవాయ్వగ్ని జలములు భూమియు మఱి
సూర్య చంద్రులుఁదపమును సారిది నీకు
స్థానములు సృష్టిఁ జేసితి వీని మున్నె. 228

వ. రుద్ర, మన్యు, మను, మహాకాల, మహచ్ఛివ, ఋతధ్వజ, ఉరురేతో, భవ, కాల, వామదేవ, ధృతవ్రతులనునవి నీ యేకాదశనామంబులు. ధీ, వృత్తి, అశన, ఉమా, నియుత్, సర్పి, ఇల, అంబిక, ఇరావతీ, సుధా, దీక్షా నామంబులఁ బరఁగువారు నీ భార్యలు. 229

క. ఈ నామస్థానంబులఁ, బూని సపత్నీకుఁడవయి భూరిప్రజలన్
వీనివలన సృజియింపు ప్ర, జానాథుఁడ వైతి గాన సమ్మతితోడన్. 230

గీ. అనిజగద్గురుఁడైన య య్యజునిచే ని,యుక్తుఁడై నీలలోహితుఁ డొప్పుమీఱ
విమలసత్త్వాకృతిస్వభావములచేతఁ, గ్రమతసృజియించెఁదానాత్మసములఁబ్రజల.

గీ. రుద్రదేవ సంసృష్టులైరుద్రులెల్లఁ, దెగ తెగలుగాఁగఁ జెలరేగి తీవ్రమతిని
జగము గ్రసియించుచుండ నాజలజసూతి, యగు ప్రజాపతి శంకించెనాత్మయందు.

వ. ఇట్లు శంకించి బ్రహ్మ రుద్రుంగాంచి యిట్లనియె. 233

గీ. ఇట్టిప్రజల నీఁకను సృజియించిచాలుఁ, గ్రూరదృష్టులతోడ దిక్కులనునన్నుఁ
గూడ దహియించుచుండిరి ఘోరరీతి, సురవరోత్తమ! రుద్ర! నాసూక్తివినుము.

గీ. అఖిల భూతసుఖావహంబైనతపము, చేయుమా నీకు భద్రంబు చేకురుఁజుమి
తపముచేతనె నీవు యథాతథముగ, వెండి యీ విశ్వసృష్టి గావింపఁగలవు. 235

గీ. తపముచేతనె యాపరంధాముఁడు భగ,వంతుఁడు నధోక్షజుఁడును సర్వప్రభుఁడును
సర్వభూతవాసుండునౌ శార్ఙ్గధరునిఁ,బొందఁగాఁగల్గుచుండును బూరుషుండు. 236

మైత్రేయుఁడు:—

క. అనియిట్లు పద్మభవుచేత నియుక్తుండగుచు నజుని దగ్గఱి మేల్మే
లని యతని యనుమతింగొని, వనమునకుం జనె భవుఁడు తపంబొనరింపన్. 237

ఉ. ఆయెడ లోకసృష్టికి నిజాత్మను ధ్యానముఁ జేయువాఁడు వి
ద్యాయుతచిత్తభాసితుఁడునై భగవత్ప్రభుశక్తి యుక్తుఁడౌ
తోయజసూతికిం దగఁ బదుండ్రుసుతుల్ పరమేష్ఠితుల్య శో
భాయుతమానసుల్ జగదపత్యనిమిత్తులు పుట్టి రింపుగన్. 238

సీ. నలువయుత్సంగంబు న న్నారదుండు ద,క్షుండు కమలభవాంగుష్ఠమునను
నలినజుప్రాణమున వసిష్ఠుండును, ద్వక్కున భృగువు హస్తమునఁ గ్రతువుఁ
బొక్కిటఁబులహుండు మొగి వీనులఁ బులస్త్యుఁ, డాస్యమం దంగిరుండక్షినుండి
యత్రి మనంబునయందుండియు మరీచి,యును గా సుతుల్ పదుండ్రుద్భవిల్లి

గీ. రెచట స్వయముగ హరి వసియించునట్టి, దక్షిణస్తనమందును ధర్మమొదవె
నెచట లోకభయంకరమృత్యువుండు, నట్టి పృష్ఠంబున నధర్మమదిజనించె. 239

సీ. హృదయంబునందుండి యుదయించెఁగామంబు, భ్రూయుగళమునుండి క్రోధమొదవె
వదనంబునందుండి వాణిజనించె లో,భంబయ్యె దంతచ్ఛదంబునుండి
మేఢ్రంబునుండి జన్మించెఁబాథోధులుఁ, బాయువునుండి పాపంబు వొడమెఁ
దత్తనుచ్ఛాయఁ గర్దముఁడు ప్రజాపతి, యుద్భవించెను దేవహూతిభర్త

గీ. యిట్లుజగదధినాథుండు సృష్టికర్తయైన యా తామరసగర్భు నంగమునను
మనమునం బహురూప సమస్తజగము, ప్రభవమయ్యెను నా పరాత్పరునికృపను.

క. మనము హరించెడువాణిని, దనయ యనక మిగులఁ గామతత్పరుఁడగుచున్
వనజభవుఁడు మదిఁగామిం, చె నటంచును వింటి మిది విచిత్రము విదురా! 241

చ. తనయ యటంచు నెంచక యధర్మమునన్ మతిఁజొన్పినట్టి యా
జనకునిఁ గాంచి తత్సుతులు సన్మతులైన మరీచిముఖ్యులౌ
మునివరు లాత్మలందుఁ జనవున్ వినయంబును సందడింప నొ
య్యన నిటులాడి రంచిత నయాన్వితవాక్కుల బోధసేయుచున్. 242

వృత్తులను సృష్టించె. వైఖానస, వాలఖి ల్యౌదుంబర ఫేనసావసంబులను న్యాసంబులను, జ్ఞానప్రధానులైన బహూదులను, జ్ఞానాభ్యాస నిష్ఠులగు హంసులను, బ్రాప్తతత్త్వులగు నిష్క్రియులను సృజించె. అన్వీక్షకీ త్రయీవార్తా దండనీతులును, బ్రణవంబును, వ్యస్తసమస్తంబులగు వ్యాహృతులును బ్రహ్మదేవుని హృదయాకాశమునుండిపొడమె. మఱియు నాతని రోమంబులనుండి యుష్ణిక్ఛందంబును, త్వచంబునుండి గాయత్రియు, మాంసంబునుండి త్రిష్టుప్ఛందంబును, స్నాయువునుండి యనుష్టుప్ ఛందంబును, నస్థినుండి జగతీఛందంబును, మజ్జనుండి పంక్తిఛందంబును, బ్రాణంబునుండి బృహతీఛందంబునుగలిగె. స్పర్శంబులవలన జీవుండును, స్వరంబున దేహంబును, నూష్మములనుండి యింద్రియంబులును, నంతస్థంబులనుండి యాత్మబలంబును, స్వరంబులనుండి సప్తవిహారంబులు నుదయించె. వ్యక్తావ్యక్తాత్మకంబగు శబ్దబ్రహ్మంబువలనఁ బరమాత్మ నానాశక్త్యుపబృంహితుండును బరిపూర్ణుండునై కానంబడు. అయ్యవసరంబునఁ బరాశక్తినిఁ గైకొని భూరితేజులైన ఋషుల సృష్టి యవిస్తృతమని భావించి విస్తృతసర్గంబుకొఱకు మనస్సు నిలిపె. విదురా! పరమేష్ఠి విశాలసృష్టిక్రమం బెఱింగి తద్వృద్ధికొఱకు మఱియుఁ జింతించె. ఇది నిత్యవ్యాపృతంబయ్యును నాకద్భుతావహంబయ్యె. దైవ మిటఁ బ్రతికూలంబగుటఁజేసి నిశ్చయంబుగఁ బ్రజావృద్ధి కలుగకుండె నని భావించి దైవానుకూల్యంబుకొఱకు నా బ్రహ్మదేవుండు నిరీక్షించుచుండె. అట్టి బ్రహ్మదేవునిరూపంబు ద్వివిధంబై మిథునం బుత్పన్నంబయ్యె. అందుఁ బురుషుండు స్వరాట్టగు స్వాయంభువమనువు నాఁబడె. స్త్రీరూపంబు శతరూపాఖ్యంబరఁగి యమ్మహానీయునకు మహిషియయ్యె. అప్పుడు తన్మైథునకర్మంబునఁ బ్రజలు వృద్ధిఁగాఁదొడంగిరి. ఆ స్వాయంభువమనువును శతరూపయుం దపత్యపంచకంబు కల్గించె. వారు ప్రియవ్రతుండును నుత్తానపాదుండు నను నిర్వురు కొడుకులు నాకూతి, దేవహూతి, ప్రసూతులను ముగ్వురు కన్యలునైరి. స్వాపత్యంబున జగంబులనిండించిన యీ యాకూతి, దేవహూతి, ప్రసూతులు రుచి, కర్దమ, దక్షులకు యథాక్రమంబునఁ బత్నులైరి.

## అ ధ్యా య ము 13.

### యజ్ఞవరాహావతార చరిత్రము

శ్రీశుకుఁడు:—

క. ఈతెఱఁగున వచియించిన, యా తాపసవర్యుపలుకు లాలించి నయో
పేతుఁడయి హరికథాశ్రవ, ణాతురుఁడయి విదురుఁ డిట్టు లడిగె నరేంద్రా! 250

క. మైత్రేయా! సన్నుతికిం, బాత్రుఁడు స్వాయంభువుండు ప్రభువు స్వయంభూ
పుత్రుఁ డతిప్రియమైన క, ళత్రంబును బడసి యే విశాలాసము నెఱపెన్. 251

గీ. ఆదిరాజును రాజర్షియైనయట్టి, యానృపుం డచ్యుతాశ్రయుఁ డగుటఁజేసి
తచ్చరిత్రము వివరింపుమచ్చువడఁగ,శ్రద్ధధానుండనగు నాకు సంయమీంద్ర! 252

శా. శ్రీనారాయణదేవదివ్యపదరాజీవంబు లెవ్వాని హృత్
స్థానంబందున నిల్చియుండునొ యజస్రం బట్టి భక్తాగ్రగ
ణ్యానూనోజ్జ్వల సద్గుణశ్రవణ సౌఖ్యంబే శ్రమాభ్యస్త వి
ద్యానిక్షేపఫలంబుగా బుధజనుల్ వ్యాఖ్యానమున్ సేయరే? 253

శ్రీశుకుఁడు:—

చ. అనివచియించు నవ్విదురు నార్యజనస్తుతశీలునిన్ జనా
ర్దనచరణోపధాను గుణరమ్యునిఁ గాంచి పరిహృష్టరోముఁడై
మునితిలకుండు దాఁ బరమపూరుషదివ్యకథాసుధానువ
ర్ణన పరిపూర్ణకౌతుక భరస్ఫురదాశయుఁడౌచు నిట్లనెన్. 254

మైత్రేయుఁడు:—

క. తనభార్యతో నుదయమం, దిన స్వాయంభువమనువు విధేయుండై మ్రొ
క్కి నిలిచి ప్రాంజలియయి తగ, నని నిట్టులు వినయవినమితాంగుండగుచున్. 255

చ. గొనకొని సర్వభూతములకున్ జనకుండవు వృత్తిదుండవున్
జననకరుండవీవ జలజాతభవా! యటులౌట మేము నం
దనులము నీకు నేతెఱఁగునం బరిచర్యలు చేయుటొప్పునో
యను విషయంబునం గడు జడాత్ములమైతి మనుగ్రహింపవే. 256

ఉ. దేవ! జొహారు నీకు నిదె దీనజనాప్తుఁడవౌదు వీవటుల్
గావున నాత్మశక్త్యుచితకర్మములన్ నియమింపుమమ్ముఁ దా
నేవిధియొనర్చినం బురుషుఁడీయిహలోకమునం బరంబునన్
బావనమైన సద్యశ మవశ్యము నొందునొ వానిఁదెల్పవే. 257

క. స్వాయంభువమనువీగతి, నా యంబుజగర్భు వేడిననంతఁ బ్రమోద
న్యాయోపేతముల్తైన త, దీ యోక్తుల కలరి బ్రహ్మదేవుఁడు పలికెన్. 258

బ్రహ్మ:—

చ. ఒదవు శుభంబునీకు నతనమో క్షితినాయక! నిర్వ్యలీకమా
హృదయముతోడ నన్ను నియమింపు మటంచని యొప్పనంబు చే
యఁదొడఁగితీవ నిన్ను నటుతలాటను బ్రీతుఁడనైతి నింకఁ దే
ల్పెద విను దేని నీవిపుడు పృచ్ఛ యొనర్చితి దాని నిమ్ములన్. 259

ఉ. ఓమనుజాధినాథ! వినుమోర్పును నేర్పులరన్ స్వశక్తియం
దేమఱపాటులేక మదినీసునుబూనక యాదరంబుతో
నేమముఁ గోరుచుండి నిజశీర్షమునందుఁ దదాజ్ఞఁదాల్చి స
త్ప్రేమను దండ్రిపూజ పచరింపవలెం దనయుం డజస్రమున్. 260

గీ. అధిప! యీశతరూపయం దాత్మగుణస, మానపుత్రులఁ బడసి ధర్మంబుతోడఁ
బుడమి శాసింపుము పరమపురుషు భక్తి,యజ్ఞములచేత నీవు నిత్యము యజింపు.

గీ. రాజచంద్ర! సదాప్రజారక్షవలన, నాకు నత్యంత శుశ్రూషణంబు కల్గుఁ
బ్రజలభరియించు నిన్ననిప్రమద మొందు, వరహృషీకేశుఁడాభగవంతుఁడు హరి.

గీ. యజ్ఞమూర్తియు భగవంతుఁడైనయట్టి, లోకనాథుండు తుష్టుండుగాకయున్న
వాని శ్రమమెల్లఁ దలప నపార్థమునకె, తన్నుఁదా నాదరింప కాతండు చెడును.

మనువు:—

క. అనియిట్లు పద్మజుఁడు పలి, కిన స్వాయంభువమనువు ప్రకృష్టముదముతో
ననియెన్ దేవుం ద్రిజగ, జ్జనకుం గని మది వినయము శ్రద్ధయునెసఁగన్. 264

శా. నేనీయానతిచొప్పునన్ మెలఁగుదున్ నీరేజగర్భా! యిఁకన్
స్థానం బెద్దియొ నాకు నాప్రజల కాజ్ఞాపింపు భూతోత్కర
స్థానంబౌమహి మగ్న యయ్యెఁగద భాస్వత్తోయమందుం బ్రభూ!
బూనంగాఁదగు నుద్ధరింప నిపుడే భూమిం బ్రజాకోటికై. 265

మైత్రేయుఁడు:—

వ. అని విన్నవించు స్వాయంభువు వాక్యంబు లాలించి— 266

చ. ఉరుజలమధ్యమగ్నయగు నుర్విని గాంచి విరించియెట్టులీ
ధరణి సముద్ధరించుటకు దక్షుఁడ నాదు నటంచు ధీరతన్
జిరము వివిక్తమైన మదిచే దగ ధ్యానముచేసె నాపరా
త్పరుని బ్రిపన్నకోటి పరిపాలన దక్షుఁ గృపార్ణవున్ హరిన్. 267

సీ. దేవదానవపితృదేవమనుష్యులఁ, బశువులఁ బక్షులఁ ఫణుల గిరుల
వివిధభూతంబుల వేగ సృజించెదు, నాచే జలంబు పానంబు సేయఁ
బడియె నెక్కడనెనంత వసుధయు మఱి సముత్పన్న మహాజలప్లావ్యమాన
యగుచు రసాతలమందు నోగింజొచ్చె, భూతసర్గంబులు బూనియిప్డు
గీ. మేమనుష్ఠింపఁదగిన దిం కేమిగలదు, రమణ! నెవ్వానిహృదయాంతరంబునుండి
నేను జనియించితినో యట్టియీశుఁ డిప్పు, డీమహాకార్యభరము వహించుఁగాక.
గీ. ఈవిధంబున మదిని ధ్యానించునట్టి, యజుని నాసావివరమున నల వరాహ
పోత మొక్కటి పీకమైఁ బొడమెనంత, నరయ నంగుష్ఠపరిమాణమై పరఁగుచు.
చ. గగనమునన్ మెలంగు చది కాంచుచునుండఁగనే క్షణంబులో
దిగిభ సమానమై పెఱిగె దీని తెఱంగు వెఱంగుఁ గూర్పు నిం
పుగ మనువున్ మరీచిముఖపుత్త్రకులుం బృథుయజ్ఞదంష్ట్రిమూ
ర్తిగనుచు వింతగాఁగఁ బలురీతులఁ దర్కముఁజేసి రీక్రియన్. 270
ఆ. ఏమిదారఁ! స్తబ్ధ రోమచ్ఛలంబున, నిపుడు దివ్యసత్త్వమేదొ వెలసె
నహహా! నాదునాసయందుండి నిస్సృత, మయ్యె బాపురే! మహాద్భుతమిది. 271
గీ. మఱియు నంగుష్ఠమాత్రమై మనము చూచు
చుండఁగనె త్రుటిమాత్రలో గండశిలను
బోలి పెంపయ్యె హరియ యీలీలఁ జెలఁగి
నా మదిని భ్రాంతిపెట్టుచున్నాఁడో! యేమొ! 272
గీ. అనుచు నిట్లాత్మజులతోడ నబ్జసూతి, యోలి మీమాంసయొనరించుచుండునంత
యజ్ఞపురుషుండు భగవంతుఁడచలరాజ, సన్నిభుండు గభీరగర్జనముఁజేసె. 273
క. తన గర్జితమున దిగ్ద్విజ, మును మార్మ్రోగించు చాప్రభుండు హరి విరిం
చిని నా ఘనవిప్రోత్తము, లను సంతోషాబ్ధిమగ్నులను గావించెన్. 274
మ. నిజఖేదాపనయిష్ణు యజ్ఞమయదంష్ట్రీంద్రోర్జితధ్వాన మ
క్కజముం గూర్పఁగ నాలకించి మదిలోఁ గౌతూహలం బొప్ప నొ
య్య జనస్సత్యతపోనివాసులగువా రత్యంతమున్ సామఋ
గ్యజురామ్నాయమయోక్తులన్ స్తవములం గావించి రద్దేవునిన్. 275
మ. పరమామ్నాయవితానరూపము కిటిబ్రహ్మంబు స్వాంచద్గుణో
త్కరనిష్పాదకమైన స్తోత్త్రమును మోదంబొప్ప నాలించి భూ
రి రవంబుం గలిగించి దేవతతికిన్ శ్రేయంబుఁ గల్పింప భా
సురకుంభీంద్రముభంగి నొప్పి జలముం జొచ్చెన్ జవం బొప్పఁగన్. 276

మ. సితదంష్ట్రింబు వియచ్చరంబును సముత్క్షిప్తోరువాలంబుఁ దీ
వ్రతరాత్యుగ్రఖురాహతాభ్రముఁ గఠోరంబున్ విధున్వచ్ఛటా
యుత ముద్యత్ఖరరోమశత్వచముఁ దృగ్జ్యోతిఃపరీతంబునై
క్షితిభాగోద్ధరణార్థ మాగమకిటిశ్రేష్ఠంబటన్ రాజిలెన్. 277

ఉ. భూమిపదంబు ముట్టియనుమూర్కొనుచుం గిటి కైతవంబునన్
దా మెలఁగాడునట్టి సర్వనాత్ముఁడు శ్రీవిభుఁ డుత్కరాళదం
ష్ట్రామహనీయుఁడయ్యు నకరాళసుదృక్కుల బ్రహ్మనాద్విజ
స్తోమమునెల్ల నాదృతినిఁ జూచుచుఁ జొచ్చె జలంబు నుద్ధతిన్. 278

చ. పటుతరవజ్రకూటతనుపాతజవాతివిశీర్ణకుక్షియై
స్ఫుటముగ మొఱ్ఱవెట్టుచు సముద్రుఁడు దీర్ఘతరంగబాహు లు
త్కటమగునార్తిఁబొందిన విధంబున మీఁదికి నెత్తుచున్ మహా
కిటిమయయజ్ఞరూప! పరికింపుము నన్ గృపనంచుఁ గుయ్యిడెన్. 279

చ. ప్రవిమలయజ్ఞరూపుఁడు క్షురప్రసమానఖురాళితో నపా
రవిలయతోయసంచయముఁ గ్రచ్చఱఁ బారముట్టఁ జీల్చి చే
యవనిని నీటఁ బంచుకొని నప్డు స్వకుక్షి నిమిడ్చెఁ దొల్లి యా
యవనిని భూతధాత్రిఁ బరమాత్ముఁడు గాంచె రసాతలంబునన్. 280

చ. తన యురుదంష్ట్రఁ జొన్పి వసుధం గడుహేలగ నుద్ధరించి పె
ల్చన ఘనయజ్ఞపోత్రియు రసాతలభాగమునుండి లేచె నం
దున గదఁబూని యడ్డమయి త్రోవనునిల్చిన వీరు నాదిదై
త్యునిఁ దునిమెన్ సుదర్శనముతో నలవోకఁ గరిన్ హరింబలెన్. 281

మ. క్రతురూపుండగు నాదిదేవుఁ డిటు తద్రక్తోరు పంకాంకితాం
చితవిస్ఫారిత గండతుండుఁడయి భాసిల్లెం గడున్ నిస్తుల
ప్రతిభన్ గైరికధాతుసంకలిత వప్రక్రీడఁ గావించు ను
ద్ధత కుంభీంద్రముపోలెఁ జూపఱకు నత్యంతాద్భుతాపాదియై. 282

ఉ. మదకలితోరుసామజముమాడ్కి సితోజ్జ్వల దంతకోటిచేఁ
బొడవి ధరిత్రిమీఁదికిని బోరననెత్తు తమాలనీలు నా
సదమల యజ్ఞదంష్ట్రిఁ గనిసాకస సంభవముఖ్యులెల్ల ర
య్యాదనున వేదసూక్తులను బ్రాంజలులై స్తుతియించి రీగతిన్. 283

ఆ. జయము జయము నీకు జయము యజ్ఞాత్మ! నీ
లలితరోమకూపములఁ బయోధు

లణఁగుఁ గొఱణకిటివై త్రయీతనువుఁ బెం
పొదవ విమర్శించు, నీకు నిదె జొహారు. 284

శా. దేవా! యీవిమలాధ్వరాత్మమగు నీదివ్య స్వరూపం బెదన్
భావింపం గన రాదు దుర్మతులకుం దవ్యక్త్యక్షనన్ ఛందముల్
శ్రీవిభ్రాజితరోమకూపముల బర్హిస్సత్తులం దాజ్యమున్
ద్రోవంజూపెడు నీదు పాదములఁ జాతుర్హోత్రిముంగల్గెఁగా. 285

గీ. స్రుక్కు తుండంబునందును స్రువము నాసి, కను నిడాపాత్రికుక్షిని గర్ణరంధ్ర
ములను జమసంబులునువక్త్రిముననుబ్రహ్మ, భాగపాత్రములిట్టులుగల్గున్న మయ్యొ.

వ. మఱియు నీ గ్రసనంబున గ్రహంబులును, జర్వణంబున నగ్నిహోత్రంబునుబొడమె.
నీవు దీక్షాజన్మస్థానమైన శిరోధరంబును, ప్రాయణీయము నుదయనీయము నను
నిష్టిరూపకదంష్ట్రలును, బ్రివర్గ్యంబగు జిహ్వాయుఁ, గ్రతుప్రవర్తకంబగు శీర్షంబును,
జితిరూపంబులగు పంచప్రాణంబులును, గలిగి వర్తింతువు. వెండియు నీకు సోమంబు
రేతస్సు. బాల్యాద్యవస్థలు ప్రాతస్సవనాదులు. దేహధాతువులు సంస్థావిభేదంబులు.
శరీరసంధులు సర్వసత్రంబులు. కావుటం జేసి నీవు సర్వయజ్ఞక్రతుస్వరూపుండవు.

ఆ. దేవ! యఖిలమంత్రదేవతాద్రవ్యుఁడ, వఖిల యజ్ఞమూర్తి వఖిలసత్క్రి
యాత్ముఁడవు విరక్తియతిభక్తి స్థిరబుద్ధి, నెగడు ప్రజకుఁ దోఁచు నీకు నతులు.

మ. స్తవనీయాధ్వరరూప! తావకకనద్దంష్ట్రాగ్రకోట్యుద్ధృతం
బవు శైలాబ్ధి నదీనదాటవియుతంబై నట్టి యీభూమి యొ
య్యో విరాజిల్లె సరోవరోదర వినిర్యద్దంతిరాడ్దంతభా
గవిలగ్నాతతపంకయుక్తనలినీకాంతిన్ విడంబించుచున్. 289

చ. అనుపమ తావకీన రదనాగ్రధృతంబగు క్షోణిమండలం
బునను ద్రయీమయంబగుచుఁ బొల్చు భవత్కిటిరూపమిద్ది య
ల్లన ఘనశృంగసంగత వనలాహకమైన కులాచలేంద్ర శో
భ ననుకరించుచుం గనులకుం బండువుగాఁ బొడగట్టెడిం బ్రభూ! 290

మ. జగముల్ స్వేచ్ఛమెయిన్ వసించుటకునై స్థాపింపుమో దేవ! యీ
జగతిన్ నీసతినిన్ జగజ్జనని నోసర్వేశ! యందుండి పొం
దుగఁ బూజింతుము మేము తండ్రివగు నీతోఁ దల్లి నుర్విన్ ఘనం
బగు తేజంబును ధాత్రియం దరణియం దగ్నింబలెన్ నిల్పవే. 291

శా. తా నెవ్వాఁ డొరుఁ డిచ్ఛగించు నలపాతాళస్థితోర్వీస్థలిన్
'నే'నంచిట్లు సముద్ధరించుటకుఁ దంష్ట్రీ! యింక నత్యద్భుతం

బౌ నానావిధవిశ్వజాలముల నొక్కయ్యన్ సృష్టిగావించి తా
హా! నీ వీపనిఁ జేయఁజాలు టది లోకాధీశ! యాశ్చర్యమే. 292

గీ. వేదమయ పూతదేహమున్ విదుర్పఁ గదలు
సటలకొనలనుండి చెదరుజలకణములఁ
దోఁగుచుంటిమి ప్రభుపాలితులము మేము
ప్రకట సత్యజనస్తపోవాసుల మిట. 293

ఉ. ఆగమరూపమైన భవదాకృతి స్తుత్యము నీదు యోగమా
యాగుణయోగముగ్ధము సమస్తము విశ్వము దేవదేవ! దా
వీగ కెవండు నీ యమితవిస్తృతకర్మవితానపారమున్
నేఁ గనుగొంటినంచు గమనించునొ భ్రష్టుఁడనంగవాఁడెపో. 294

మైత్రేయుఁడు :—

గీ. అనియిటుల్ బ్రహ్మవాదులౌ మునులచేత
నెలమి సంస్తూయమానుఁడై యిలను గాంచి
నట్టి యయ్యజ్ఞమూర్తి స్థైర్యంబు మెఱయ
డెక్కల జలంబు దువ్వుచుఁ జక్కనిలచె. 295

మ. భగవంతుండు ప్రజాపతీశుఁడగు విష్వక్సేనుఁడీరీతి ని
మ్మగ శ్రీయజ్ఞవరాహమూర్తిని స్వయంభూముఖ్యులెల్లన్ మదిన్
బొగడం బేర్మిమెయిన్ రసాతలగతంబున్ భూమిభాగం బతం
దరిగతిందెచ్చి జలంబులన్ నిలిపి యంతర్ధానమందెన్ వెసన్. 296

మ. హరిమేధస్కుఁడు వర్ణనీయపృథుమాయామేయచారిత్రుఁడౌ
హరికల్యాణకథామృతస్రుతి నెవండాలించు వాఁడచ్చు ని
ర్భరమాభక్తిఁ బఠించు నాతనిమనఃపద్మంబునన్నిల్చి శ్రీ
వరుఁ డీశుండు ప్రసన్నుఁడయ్యెడును సర్వాభీష్టసంధాయియై. 297

చ. అనితరలభ్యమైన సకలార్థము లబ్బుట యబ్రమే? విభుం
డు నిజమతిం బ్రసన్నుఁడగుడుం గడుఁదుచ్ఛసుఖంబులం బ్రయో
జనమదియెంత? చాలునవిస్తవ్యమతిన్ దనుఁగొల్చువారి కొ
య్యనఁ దనయంత నిచ్చును గుహాశయుఁ డాత్మగతిం బ్రహృష్టుఁడై. 298

చ. బహుళకథార్థసార విభవంబు నెఱుంగఁడు పూరుషుండు వే
డ్క హరికథాసుధారసము కర్ణపుటాంజలి గ్రోలి ఘోరపా

పహామగు తత్కథాశ్రవణభాగ్యమునందు విరక్తిఁబూను నె
ట్లహహా! వివేకశూన్యమయి నట్టిదియౌ పశువొందుదక్కఁగన్. 299

---

## అధ్యాయము 14.

### దితి గర్భోత్పత్తి

శ్రీశుకుఁడు:—

ఉ. కారణసూకరాత్మహరిగాథను వాక్చతురత్వమొప్పఁ గా
షారవి చెప్పఁగావినియు స్వాంతమునందునఁ దృప్తిఁ బొంద కా
కౌరవపుంగవుం డమితకౌతుకమొప్పఁగఁ గేలుమోడ్చి వి
స్తారముగా నెఱుంగ మునిచంద్రమునిం గని భక్తి నిట్లనెన్. 300

విదురుఁడు:—

మ. మునినాథా! క్రతుమూర్తియైన హరిచే మున్నాదిదైత్యేంద్రుఁ డ
త్యనివార్యోద్ధత దర్పయుక్తుఁడు హిరణ్యాక్షుండు పోకారె సం
చని విన్నారము తాపసోత్తమ! స్వదంష్ట్రాగ్రంబుచే ధాత్రి హే
లను బైకెత్తెడు శౌరి కయ్యసుర కేలా కల్గెఁ బోరయ్యెడన్. 301

గీ. శ్రద్ధధానుండ భక్తుండ సంయమీంద్ర!, యాహిరణ్యాక్షుజన్మ మొయ్యనవచింపు
నాదుహృదయంబు తృప్తిఁజెందదు రవంత,యంతకంతకుఁ గౌతుకమతిశయించు.

మైత్రేయుఁడు:—

చ. హరియవతార గాథను మహాశయ! పృచ్ఛమొనర్చి తీవు త
త్పరమతి సర్వమర్త్యులకుదానఁ దెగుం బృథుమృత్యుపాశ వి
స్తరములు నారదోక్తమగు తత్కథ నర్భకుఁడౌ ధ్రువుండు భీ
కరతరమృత్యు మూర్ధమునఁ గాలిడి విష్ణుపదంబు నెక్కఁడే. 303

క. ఆయజుఁడు దేవదేవుం, డీయితిహాసంబు సురలకెఱిఁగింపఁగ నే
నాయది వినియుంటిని సువి, ధేయుఁడవగు నీకు నిపుడు దెల్పెద వినుమా. 304

క. దితి దాక్షాయణి తొలి నిజపతిని మరీచసుతుఁ గశ్యపబ్రహ్మను సం
తతికాంక్ష మన్మథ శరార్దితయై పడి సంజవేళఁ బ్రీతిం గోరెన్. 305

గీ. అర్కభగవానుఁ డస్తమయంబు పొందు, నవసరంబునఁ గశ్యపుఁడగ్నిజిహ్వు
నాదిపురుషుని యజురీశు హరి యజించు, చుండె నగ్నిగృహంబు నందు శ్రద్ధ. 306

దితి:—

మ. మదమాతంగము దర్పితంబగుచు రంభాస్తంభముంబోలె న
మ్మదనుం డిత్తఱి నాత్తచాపుఁడగుచుం బాధింపఁగాఁ జొచ్చె నన్
హృదయాధీశ్వర! నీ నిమిత్తమున మోహీభూతచేతస్కనై
తి దయంజూడుము దీనురాల నను నర్థిన్ వేఁడుచుంటిన్ విభూ! 307

గీ. మత్సపత్నీసమృద్ధులు మానవతిని
నన్ను దహియించుచున్నవి నాథ! కాన
నీప్రజాపతులకు నీకు నెసఁగు శుభము
నన్ననుగ్రహించుట యిది న్యాయము సుమి. 308

గీ. భర్తృబహుమానభాగ్యముల్ వడయుసతుల, యశము సర్వలోకంబుల నావరించుఁ
ద్వాదృశుండగు నాథునిఁ బడసినట్టి, పడఁతి సుప్రజ కాకుంట భావ్యమగునె. 309

చ. స్వదుహితృవత్సలుండు భగవంతుఁడు మా జనకుండు దక్షుఁ డా
ప్పిదముగ మమ్ముఁ గూఁతులను బిల్చి నయమ్మున బిడ్డలార! మీ
హృది కనుకూలుఁడైన వరుఁ డెవ్వఁడొ కొంకక కోరుఁడంచు నా
త్మ దయఁ దలిర్ప మా యభిమతం బడిగెన్ మును వేఱువేఱుగన్. 310

ఉ. కూఁతులమైన మా మనసు కోరికలన్ విని దక్షుఁ డంతటన్
బూతచరిత్రుఁ డొప్ప పదుమువ్వురు కన్యల మమ్ము నీకు సం
ప్రీతమనస్కుఁడై యొసఁగె మేము సమానులమౌట మా యభి
ప్రేతములైన కార్యములు వీడ్వడఁ జేయ ననుగ్రహింపుమా. 311

గీ. నాదు కల్యాణకామంబొనర్పుమయ్య
వేయుఁదెఱఁగుల నార్తనై వేఁడుచుంటి
నుత్తములయందు నార్తప్రయోజనములు
మోఘములుగాక యుండుఁగా పుణ్యచరిత! 312

మ. అని కార్పణ్యహతస్వభావ యురుకామాధీన హేయప్రవ
ర్తనయై పెక్కువిధంబులం బలుకు నా దాక్షాయణిం గాంచి సా
నునయాలాపములన్ వచించె నిటు లన్యూనానుభావాఢ్యుఁడ
య్యనఘాత్ముండగు కశ్యపుండు సతి కామావేశమున్ డించుచున్. 313

ఉ. బెంగపడంగ నేల యిటు చేలరో! నే భవదీప్సితంబు దీ
ర్పంగలవాఁడ నమ్ము మిము త్రివర్గఫలాప్తికి హేతువైన య

ర్ధాంగి యభీప్సితంబు లనయంబును దీర్పక యెవ్వఁ డుండు నా
వెంగలి యందు నిందును నశేషసుఖుండయి భ్రష్టుఁడయ్యెడున్. 314

చ. అరసి కళత్రవంతుఁ డఖిలాశ్రమవాసుల రక్ష సేయుచున్
స్థిరత నిజాశ్రమంబున వసించి మహావ్యసనాంబురాశి ని
స్తరణము సేయుచుండును గదా జలయానముచే గభీరసా
గరమును గర్ణధారుఁ డొడికంబున దాటువిధంబుఁ దోఁపఁగన్. 315

శా. శ్రేయస్కామునకుం గళత్రము విచారింపంగ నర్ధాంగమౌ
స్త్రీయంబో భర మామెయందునిడి నిశ్చింతుండగున్ గేస్తుఁడున్
జాయం గైకొని దుర్జయేంద్రియవిపక్షవ్రాతమున్ గెల్చునే
యాయాసంబునులేక దస్యులను దుర్గాధ్యక్షు చందంబునన్. 316

ఆ. ఇట్టు లుపకరించు నింతి నేసుగుణాఢ్య, ఋణము లేని ననుకరింప లేర
టన్న మాదృశులకు నది సాధ్యమెట్లగు, నెంచిచూడ గృహిణి! యిది నిజమ్ము. 317

గీ. అయిననేను బుత్రోత్పత్తికై మనమునఁ
గోరు నీ కామితము సమకూర్చువాఁడ
నన్ను నిందింపకుండుమో యన్నుమిన్న!
విసువక ముహూర్తకాలంబు వేచియుండు. 318

శా. ఈసంధ్యాసమయంబునందు నలభూతేశుండు మృత్యుంజయుం
డో సాధ్వీ! వృషవాహుఁడై ప్రమథసంఘోపేతుఁడై గ్రుమ్మఱున్
ఈసాయంసమయంబు ఘోరతమమై యేపారి ఘోరప్రజా
వాసంబై వెగడున్ జరింత్రు చలమొప్పన్ రుద్రభృత్యావళుల్. 319

గీ. కాటిసుడిగాలిధూళులు గ్రమ్మి జటలు
మెఱయఁగా బూది యనిమెడి మేలిముసుఁగు
నిగుడ నొప్పారు తనువుతో నీ మఱంది
మూఁడుగన్నులఁ జూచుచున్నాఁడు వీఁడె. 320

మ. తనవాఁడీతఁ డితండొరుండనెడు భేదంబింతయున్ లోకమం
దును గానంబడ దాదృతుండును నిషిద్ధుండుం గనన్ రాఁడు శం
భునకున్ దచ్చరణాపవిద్ధమును సంభుక్తోపభోగంబునై
యనఘంబైన విభూతి సద్వ్రతులమై యాసింతు మే మెప్పుడున్. 321

శా. మాయాజాలము నుత్తరించుటకు ధీమంతుల్ మహాభక్తితో
నా యీశాను పునీతమౌ చరితమున్ ధ్యానింతు రేకాలమున్

వేయుం జెప్పఁగ నేల యావిభునకున్ ♦ మిన్నన్ సమం గానమో
హహా! యట్లయ్యుఁ బిశాచచర్యలను జేయున్ సజ్జనుల్ మెచ్చఁగన్. 322

చ. హతమతులై శ్వభోజ్యతను ♦ నాత్మఁగ నెంచుచు నవ్యవస్త్రమా
ల్యతతుల నంగలేపనములం గయిసేయుచునుండు దుర్మతుల్
సతము వివేకహీనులయి ♦ స్వాత్మరతుండయి వెల్గు నీశు పూ
జితమగు సచ్చరిత్రము హసింతురు నిత్య మపేతభాగ్యులై. 323

చ. శతధృతిముఖ్యులైన యలసర్వసుపర్వులు భక్తియుక్తిఁ ద
త్కృత ఘనధర్మసేతువులరీతులఁ బాలనఁ జేయుచుందు రీ
వితతజగంబు మాయయును ♦ వీడ్వడకుండును దద్వశంబులై
యతనికి భూతకోటి వశమా విభులీలలు విస్మయంబులౌ. 324

క. అని భర్త తెలియఁ జెప్పిన, మనసిజపృథుమార్గణౌఘమథితహృదయయై
తన పతికొంగును వేశ్యాం, గనక్రియ సిగ్గుండొఱంగి ♦ గడుకొని దిగిచెన్. 325

క. తనసతి నిషిద్ధకర్మం, బున నిర్బంధంబుఁ జేయ ♦ మునిపతి దైవం
బున కెఱఁగి యేకతమున న, ల్లన నా దాక్షాయణీ లలనఁ గవఁగూడెన్. 326

గీ. నింద్యమగు కర్మమునకును ♦ నెమ్మనమున, దితియు లజ్జితయై తనపతికడకొగి
నరిగి మెల్ల నధోముఖియగుచు విప్ర, మునివరేణ్యున కీవిధంబున వచించె. 327

గీ. భూతపతి రుద్రదేవుఁడు భూరియశుఁడు, మ దపరాధంబు సైచి ప్రేమంబుమీఱ
నా దుగర్భము ఘోరవినాశ మొంద, కుండఁ గాపాడుతన్ విప్రకులవతంస! 328

వ. మహాదేవుండును శివుండును న్యస్తదండుండును ధృతదండుండును మన్యుస్వరూ
పుండు నగు నా రుద్రదేవునకు నా నమోవాకంబులు. 329

గీ. బావయుఁ బ్రసన్నుఁడును భగవంతుఁడునగు, నానతీపతి మిగులనెయ్యంబుతోడ
వ్యాధునకునైనఁ గనికరింపఁగఁదగిన, స్త్రీలమగు మాయెడం గృపసేయుఁగాక.

మైత్రేయుఁడు:—

వ. అని యిట్లు దాక్షాయణి స్వకీయగర్భశ్రేయంబును గాంక్షించుచుఁ గంపమాన
గాత్రియై నిర్వేదంబున నుండం గని నిర్వర్తితసంధ్యానియముఁడై కశ్యపుఁడు
దితిం గాంచి— 331

కాశ్యపుఁడు:—

మ. తరుణీ! నీదగు మానసం బపరిశుద్ధంబౌట మాహూర్తికా
త్యురుదోషంబు ఘటిల్లియుంట విబుధస్తోమంబు నిందించుటన్

స్థిరమాబుద్ధిఁ బరిత్యజించుట మ దాదేశాతిచారంబుచే
నిరువుర్ దుష్టసుతుల్ జనింత్రుసుమి చండీ! నీకులోకాహితుల్. 332

ఉ. ప్రాణుల సంహరించుచు సభాగ్యుల నందఱ బాధఁబెట్టుచున్
స్త్రైణము బల్మిఁబట్టుచును సర్వజగంబుఁ గలంచుచుండ వి
న్నాణముగాఁగ వజ్రి గిరినాథులకై వడిఁ దున్మునాజగ
త్త్రాణపరాయణుండు హరిధర్మపరుండయి నీ కుమారులన్. 333

దితి:—

మ. తనుముంగావుత యుద్ధమందు భగవంతుండైన సాక్షాత్సుద
ర్శనబాహుం డల విష్ణుదేవుఁడు సురారాధ్యుండు నీపుత్రులన్
గినుకం జెందినయట్టి బ్రాహ్మణునిచేఁ గీడ్పాటుగాకున్నఁజా
లనఘా! నారకులైనఁగాని దయసేయంబోరు బ్రహ్మద్విషున్. 334

కాశ్యపుఁడు:—

చ. తరుణి! కృతాపరాధ పరితాపముననన్ సదసద్విచారమున్
వెరవునఁ జేయఁగల్గుటను విష్ణునియం దురుభక్తికల్గుటన్
స్మరహరుఁడైన రుద్రుపయి మానక నాపయినిన్ సమంచితా
దరము వహించుచుండుట ను దర్పము నీకొదవుం దిరంబుగన్. 335

చ. పొలఁతిరో! నీదుపుత్రకునిపుత్రులలో నొకఁ డుత్తముండు కాఁ
గలఁ డతఁ డార్యసమ్మతుఁడు కాఁగలఁ డాతనికీర్తి యాజగ
ద్వలయమునందు నల్లభగవంతునికీర్తికి సాటిచేసి ని
ర్మల మని యెల్లవారును సమంజసరీతులఁ బాడుచుం ద్రిలన్. 336

గీ. ప్రకటయోగంబులన్ హీనవర్ణమైన, హేమమునుబోలె సాధువులెల్లఁ బూవ
నుత్సహింత్రు నిర్వైరాదియోగములను, దత్సుశీలానువర్తనోద్యమపరులయి.

గీ. ఎవ్వనిప్రసాదమున విశ్వమిది ప్రసన్న, మగును మఱివిశ్వమెల్ల యదాత్మకంబా
యట్టిభగవంతుఁడైన నారాయణు నన, యంబుఁగనుచుండు నాతఁ డనన్యదృష్టి.

గీ. పరమభాగవతుండు దివ్యప్రభావుఁ, డుత్తమోత్తముఁడును మహామోజ్జ్వలుఁడగు
నతఁడు భక్తిసంభృతహృదయముననఁగొల్చు, హరిని స్థిరముగనిల్పి యనన్యముఁ
దృజించి. 339

సీ. శీలసౌభాగ్య విశేషయుక్తుండును, భాసుర గుణగణభాసితుండు
నితరసమృద్ధి ప్రహృష్టచేతస్కుండు, దుఃఖితజనసవ్యథుండు ఘనుఁడు

విగతశత్రుండును నుపవిమలయశోలతా, మండితసకలదిగ్భాండలుండు
నగురాజు నైదాఘికార్కోగ్రతాపమువోలె, నఖిలజగదుఃఖకర్తయునయి

గీ. యజ్ఞనేత్రు నంతర్బహిఃకరమలరూపు, మహితు విస్ఫురత్కుండలకమండితాస్యు
నాత్మపురుషానురూప దివ్యస్వరూపు, శ్రీశు నీమనుమండు దర్శింపఁగలఁడు. 340

మైత్రేయుఁడు:—

గీ. భాగవతుఁ బౌత్రు విని దితికభావమందు, నత్యధికమహాప్రమోదంబునం దె
మఱియుఁ
దనయులకు విష్ణుచేత వధంబుఁ గల్గు, ననియు నాకాంత నిర్భరాహ్లాదయయ్యె.

---

## అధ్యాయము 15.

### విప్రకృత జయ, విజయు శాపోదంతము

మైత్రేయుఁడు :—

క. ప్రాజాపత్యంబును బర, తేజోపహమైన భూరితేజము దితి తా
నోజ శతవర్షములు సుర, రాజిం గలఁచు నను శంకఁ గ బ్రిబలందాల్చెన్. 342

గీ. ఆ విపులతేజమునఁ గమలాప్తుదీప్తి, తగ్గ లోకపాలకులు హతప్రభులయి
దశదిశల వ్యాప్తమగు ఘనధ్వాంతసంత, తిన్ విరించి కపుడు నివేదించి రిట్లు.

దేవతలు :—

వ. దేవా! యెద్దానివలన మే ముద్విగ్నులమై మిగుల విపన్నుల మైతిమో యట్టి యీ తమంబును గనుంగొనుము. కాలంబుచే నెఱుంగఁబడని వర్త్మమ్మున నొప్పు భగవంతుఁడవగు నీకుఁ దెలియరాని దేదికలదు? దేవదేవా! జగన్నాథా! పరాపరభూతజాలంబుల భావంబులు నీ వెఱుంగుదువు. మాయాబలంబున జగంబును బొందియున్న విజ్ఞానవీర్యుండవగు నీకు నమస్కారంబు. గృహీతగుణభేదుండవై వ్యక్తలింగుండవగు నీకు నమోవాకంబులు. ఎవ్వాఁ రనన్యభావంబున నాత్మయందుఁ బ్రోతంబులగు జగంబులతో నొప్పు సదసదాత్మకమైన పరబ్రహ్మంబును భావింతురో పరిపక్వయోగులును జితశ్వాసేంద్రియాత్ములును లబ్ధయుష్మత్ప్రసాదులు నగువారికిఁ బరాభవం బెక్కడిది? ఎవ్వానివాక్యంబున సర్వప్రజలు త్రాటంగట్టంబడిన గోవులవలె బలిం గొనివచ్చి సమర్పింతు రట్టి దేవముఖ్యుండవైన నీకుఁ బ్రణామంబులు. ఉప్తకర్మంబులైన లోకంబులకు నీవు సుఖంబుఁ గల్పింపుము. నిరుపమానకరుణాతరంగితదృష్టిని నాపన్నులను రక్షింప నీవ

నేర్తువు. దేవా! యీ దితి గర్భంబు కాశ్యప సమర్పితంబైన తేజంబునుం దాల్చి దిక్కులఁ జీఁకట్లునించుచు నింధనంబున నగ్నియుంబోలె వృద్ధిపొందుచుండె నని దేవతలు బ్రహ్మదేవునకు నివేదించిరి. 344

మైత్రేయుఁడు;—

క. వినుము విదుర! భగవంతుఁడు, వనజభవుండు దరహాసభాసురముఖుఁడై
యనిమిషులన్ మృదుమధుర వచనముల నిట్లనియె సంతసమ్ముగ్రాలుపుచున్.

బ్రహ్మ:—

మ. సనకాదుల్ సుతపోవిరాజితులు యుష్మత్పూర్వజుల్ మన్మనో
జనితుల్ నిస్పృహులౌచు మింటను జగత్సంచారముం జేయుచున్
గని రొక్కప్డు పురాణపూరుషుఁడు లోకాధీశుఁడౌ విష్ణుదే
వుని యావాసము సర్వలోకచయ సంపూజ్యంబు వైకుంఠమున్. 346

ఉ. ఆ నగరిన్ వసించు జనులందఱు వైష్ణవమూర్తు లందఱున్
మాన కకామయోగమున మాధవునిన్ భజియించువారె యం
దా నిగమాంతవేద్యుఁ డజుఁ డాదిమపూరుషుఁడైన యిందిరా
జాని స్వభక్తులం గతరజమ్ముగు సత్త్వముఁ దాల్చి ప్రోచెడున్. 347

ఉ. శ్రీయుతమైన యప్పురిని సేవకకామఫలప్రదద్రుమం
బై యఖిలర్తుశోభల నిరంతర మొప్పుచు నేత్రపర్వముం
జేయుచు శోభనాకృతిని జెందిన మోక్షము నాఁ దనర్చి ని
శ్శ్రేయసనామకంబగు ప్రసిద్ధవనం బలరారు హృద్యమై. 348

మ. వనితాసంయుతులౌచు నాపురమునన్ వైమానికశ్రేణులా
మని నుద్యన్మధుమాధవీవికసితాంభోజ్ఞాన పద్మానాళి నూ
తనగంధంబున బుద్ధి మట్టువడఁగాఁ దామా సమీరంబు చ
య్యనఁబో నెట్టుచుఁ బాడుచుం దగుమహారంహబౌ విష్ణుచారిత్రముల్. 349

ఉ. ఆ హరిపీఠ సారసకు కాన్యభృతోజ్జ్వలచక్రవాకదా
త్యూహా ఘరాళ తిత్తిరి మయూరముఖాఖిల పక్షిరాజకో
లాహల మంతరించు బహుళంబగు కాల్లము భృంగరాజమా
శ్రీహరిగాథ గానమును జేయుచునుండఁ గడుం బ్రశాంతమై. 350

ఉ. ఆ రమణీయపట్టణమునందు నవోత్పల నాగ కుంద మం
దార కురంట కాభినవతామర సామల పారిజాత వి

స్ఫారిత పుష్పమంజరులు సత్తులసిన్ హరిమేన గంధమై
పేరయి యొప్పఁ దత్తపము పేర్మికి మెచ్చుకొనున్ నితాంతమున్. 351

చ. సిరి సుమనోజ్ఞరూపమును జెంది విసర్జిత దోషయౌచు శ్రీ
హరిసదనంబునందుఁ జరణాబ్జము మ్రోయ విలాసపాత్రితో
యరుహముఁ దాల్చి స్వర్ణమయ మా స్ఫటికాంచితభిత్తిఁ దోఁచు వా
విరి తదనుగ్రహంబుఁ గొను వేడుక నూడ్చుచునున్నదో యనన్. 352

సీ. విద్రుమతటములు విమలామృతాంబువులైన బావులయందు స్వాత్మవనిని
బరిచారికాగణపరివృతయై నాథుఁ దులసీదళంబులతోడఁ బూజఁ
బరపుచు నన్నిటఁ బ్రతిబింబితంబయి, యున్నతనాసికా యోజితంబు
శోభనాలకమునై శోభిల్లువదనంబుఁ, జూచి యద్దేవుచేఁ జుంబితముగ
గీ. నిందిరాదేవి తనమనమందుఁ దలఁచి, యధికలజ్జితయౌచుండు నాపురమున
సకలవైభవయుతము ప్రశస్తమునయి, నెగడు వైకుంఠపురము వర్ణింపఁ దరమె.

మ. వరవైకుంఠపురంబు నెవ్వరుగనన్ వాంఛింపరో యా శుభం
కరుగాథల్ వినమాని దుష్కథల నాకర్ణింపఁగా నెవ్వరా
తురతం గొందురొ వారి పుణ్యమును దోడ్తో నాచికొంచాకథల్
నిరయంబందునఁ ద్రోయు నొక్కమొగి నా నిర్భాగ్యులన్ దీనులన్. 354

ఉ. మాకును గోరఁగాఁదగిన మానవజన్మము నంది జ్ఞానమా
ర్గైకసుసాధ్య మాత్మవిషయంబు నెఱుంగఁగఁ జాలి భూరిమా
యాకృతమోహులై భగవదర్చన సేయక దివ్యమౌ తదీ
యాకముఁ బొందఁజాలరు దురాత్ములు కొందఱు భగ్నచిత్తులై. 355

చ. విపులయశస్కుఁడౌ హరిపవిత్రకథాకథనామృతానురా
గపులకితాంగులౌచు నధికంబగు భక్తిని సర్వనిర్జరా
ధిపు భజియించుచుం బితృపతిం గడు దవ్వులనుంచి తారు ని
ష్కృపణత నొప్పుచుండి వెసఁ జేరుదు రుత్తము లవ్వైకుంఠమున్. 356

ఉ. స్తవ్యము విశ్వమూర్త్యధికృతంబును లోకచరైకవంద్యమున్
దివ్యమగణ్యపుణ్యమును దేవవిమానవిరాజమానమున్
భవ్యమునౌ వికుంఠపురవర్యము యోగికశక్తిఁ జేరి యా
దివ్యమునీశ్వరుల్ తమ మదిన్ ముదమందిరి మిక్కుటంబుగన్. 357

మైత్రేయుఁడు:—

చ. ఇతరముఁజూడనొల్లక మునీశ్వరు లాప్పురి కక్ష్యలాఱిటిన్
దురితగతి దాటి కౌతుకముతో నట నేడవకక్ష్యయందు స
మ్మతిఁ బొడఁగాంచి రంతట సమానవయస్కుల ద్వారపాలురన్
ధృతగదులన్ శుభాంగదకిరీటకకుండలచారువేషులన్. 358

చ. సలలితమత్త భృంగవిలసద్వనమాలికచేత శ్యామలా
మలినభుజాచతుష్టయము మధ్యమునం గయిసేయఁబడ్డ వా
రలు కుటిలోజ్జ్వలభ్రువులు రక్తదృగంచలముల్ స్ఫుటంబులై
పొలిచెడు శ్వాసముల్ గలుగు మోముల నొప్పుచునుండి రయ్యెడన్. 359

ఉ. ధీరతమీఱఁగా ననుమతిం గయికోక య వారు సప్తమ
ద్వారము దాటి రల్ల తొలిద్వారము లెట్లటు లాత్మదృష్టి వి
స్తారమనీషులున్ విగతశంకులు నత్యనివార్యవృత్తి సం
చారముచేయుచుండెడు విశాలమనస్కులు కావునం ద్విజుల్. 360

చ. అసదృశచిత్తులన్ సలుపునైన కుమారుల వృద్ధులయ్యుఁ బం
చసమవయస్కుల న్దిసఁగుశాంతుల నిర్మల తత్త్వవేత్తలన్
గసరఁగరాని వారిఁ గినుకన్ భగవత్ప్రతికూలశీలురై
వెనమెయి నడ్డగించి రురువేత్రముచే నల ద్వారపాలకుల్. 361

చ. యతివరులంత శాంతమతులయ్యును శ్రీహరిద్వారపాలవా
రితులయి దేవకోటిగన శ్రీ విభుదర్శన లాభభంజనో
త్థిత పటురోష సంక్షుభితతీక్ష్ణతరేక్షణులౌచు నేత దు
ద్ధతికి సహింపఁజాల కలద్వారపులం గని పల్కి రీగతిన్. 362

కుమారులు:—

చ. గురుభగవత్సపర్యల నశుంఠితరీతి వికుంఠధామమున్
స్థిరముగఁజెంది యిందు నివసించెడు మీ కెటులయ్యె భేద మీ
శ్వరుఁడు ప్రశాంతుఁడైన భగవంతునిదాపున శంక లున్నె? యె
ల్లరఁ గపటాత్మ లీక్రియఁ దలంచెద రాత్మసమంబుగా మదిన్. 363

ఉ. బ్రహ్మవిదుల్ నభంబున నభంబును గైవడి నాత్మ నా పర
బ్రహ్మమునం దభిన్నముగభావనసేయుచునుంద్రు నిర్మ లా
జిహ్మసుపర్వవేషములచేఁ బొలుపొందెడు మీకు నిప్పుడీ
బ్రాహ్మణులందు నీ విషమభావము పుట్టుట కేమిహేతువో. 364

శా. గోవిందప్రభుభృత్యులై పరఁగుమీరాకున్ భద్రమున్ గూర్పఁగా
భావంబందుఁ దలంచుచుంటిమి జడవ్యాపారులారా! చనుం
డీవైకుంఠము వీడి భూస్థలిని జన్మింపుండు కామాదికం
బౌవైరిత్రితయంబు మిమ్ము మది నత్యంతంబు వేధింపఁగన్. 365

మ. అనియిట్లామునివర్యదత్త మురు శస్త్రాస్త్రానివార్యప్రభా
వ నిగూఢంబగు నుగ్రశాపగతి నాద్వాఃపాలకుల్ భీతిమై
విని యమ్మౌనుల పాదపద్మయుగళిన్ వేపట్టుచున్ భక్తియున్
వినయంబొప్పఁగ నిట్లు పల్కిరి నిజాభీష్టంబులం దెల్పుచున్. 366

ఉ. తాపసులార! దండ ముచితంబిదిపాపుల కిప్పు డీశ్వరా
జ్ఞాపదవీతిరస్కృతికినై వగవం బనిలేదు మీరిఁకన్
మాపయిఁ జాలి గొన్న యెడమాకు నధోగతిపొందుపట్టులన్
బ్రాపిలకుండుఁగాక భగవత్స్మృతినాశకదుష్టమోహముల్. 367

ఉ. ఆ యరవిందనాభుఁడు నిజానుచరుల్ సదతిక్రమం బటుల్
చేయు టెఱింగి యప్పుడ ఋషీశ్వరకోటిగవేషణీయ పు
ణ్యాయతనాంఘ్రిపద్మములనల్లఁ గదల్చుచు ద్వారభూమికిన్
శ్రీయుతుఁడై వెసం జనియెఁజిత్తమునం దనుకంప పుట్టఁగన్. 368

సీ. స్వజనసమానీతసకలసంభారుండు, నక్షిగతతపస్సమాధిఫలము
హంసపక్షోపమవ్యజనానిలవిలోల, శీతమయూఖశుభ్రాతపత్ర
లలితముక్తాహారసలిలశీకరవిభా, సితుఁడు దివ్యపరిభాంచితతనుండు
సకలజనాళి ప్రసాదసుముఖుఁడును, స్పృహణీయసుగుణవిశేషయుతుఁడు
గీ. ప్రేమపూరాంచితకటాక్షవీక్షణముల, హాయిఁగల్గించువాఁడునుశ్యామపృథుల
వక్షమున శ్రీ విరాజిల్లస్వశ్రీభావ, తంసవైకుంఠభూమయైతనరువాఁడు. 369

సీ. పృథునితంబాభోగవిస్ఫురత్పీతచే, లంబుతోఁ గాంచీగుణంబుతోడ
మత్తాళివిరుతిశుంభద్వనమాలాచ, యంబుతో మణికిరీటంబుతోడ
దీపరమనోజ్ఞకరప్రకోష్ఠక వల,యంబుతో శ్యామకాయంబుతోడ
సులలితమకరకుండలమండనాబ్జగం, డంబుతో సుముఖాననంబుతోడ
గీ. తార్క్ష్యపృథులాంసనిహితహస్తంబుతోడ, నన్యకరచాలితాంబురుహంబుతోడ
కంబుసమకంఠధృతకౌస్తుభంబుతోడ, నక్షిపర్వంబుఁజేసె నారాయణుండు. 370

ఉ. ఇందిర సుందరత్వమదమిందుఁ గృశించు నటంచు భక్తులో
జం దలపోయుచుండ బహుసౌష్ఠవభాసితమౌచు నారు పే

ర్మిం దగ నాకు నీశుసకుగ్మిమాకునువోఁచు తదంగముం దమిం
జెందని చూడ్కులం గనుచుఁ శీర్షములం బ్రణమిల్లి రమ్మునుల్. 371

ఉ. ఆ కమలేశు సుందరతరాధరభాసురమందహాస లీ
లాకలితాననాసిత నవాంబుజకోశము వెండియుం దమిం
గైకొని లబ్ధకాములయి కాంచి నఖారుణరత్నసంశ్రయం
బౌ కమనీయపాదయుగ మర్మిలి ధ్యానముఁ జేసి రాత్మలన్. 372

మ. జలజాతాక్షుపదారవింద నవకింజల్కప్రభామిశ్ర స
త్తులసీనూత్నమరందమారుతము సంతోషప్రదంబై యనా
విలనాసావివరంబునుండి కడు తీవిన్ లోనికిం జొచ్చి ము
క్తులకేనిం దను మానసంబులకు సంక్షోభంబుఁ గావించెడిన్. 373

ఉ. జ్ఞానసుయోగమార్గముల సద్గతిఁ గోరెడు పూరుషాళికిన్
ధ్యానశుభాస్పదంబు సురతాత్త్వికసమ్మత మక్షిపర్వమున్
శ్రీనిలయంబు సర్వజనసేవ్యము భవ్యమునైన యా రమా
జాని శుభాంగముం గనుచు సంయము లిట్లు నుతించి రింపుగన్. 374

చ. హృదయగతుండవయ్యు మతిహీనులకుం గనరావు దేవ! యిం
పు దనర మాకు నిప్డు తగఁ బొందితి లోచనగోచరత్వ మ
భ్యుదితదయుండు నీదు తనయుండును మాజనకుండునైన బ్ర
హ్మ తెలుప శ్రద్ధఁ ద్వత్పదరహస్యము నెమ్మదిఁ జొచ్చె పీనులన్. 375

వ. మఱియు నో దేవా! త్వదనుసరణవిదితంబులైన దృఢభక్తి యోగమార్గంబుల మనోగ్రంథులం ద్రెంచి వీతరాగులై మునులు నిన్నెఱుంగుదురు. అట్టి పరమాత్మ తత్త్వంబవును సత్త్వగుణప్రధానుండవగు నిన్ను మేము తెలిసికొంటిమి. భవద్వ్యతిరిక్తములైన కర్మములను బాటింపక భవదీయపాదపద్మంబుల శరణుఁ బొంది భవత్కథాకీర్తన పవిత్ర మనస్కులై రసజ్ఞులు కుశలులగుదురు. పాపంబులం జేసి నిరయంబులఁ బడుదుమేని మా మనంబు భృంగంబువోలె భవత్పదపద్మంబులం దనురక్తమగునట్లు సేసి మమ్ముఁ గాపాడుము. తులసీదళంబువోలె మావాక్యంబులు నీ పదపూజ కుపయుక్తములగునట్లు సేయుము. విపులయశస్కుండవగు నో ప్రభూ! నీదివ్య మంగళరూపంబు ప్రకటించుటం జేసి మా నేత్రంబులు సఫలత్వంబునొందెఁ గావున భగవంతుండవైన నీకు మేము నమస్కరించుచుంటి మనుగ్రహింపుము. 376

## అధ్యాయము 16.

### సనక సనందనాద్యనుగ్రహము

బ్రహ్మ:—

క. అని తన్ను స్తుతించెడు నా, సనకాదుల యోగధర్మఽసంశ్రియులను బ్రీ
తినిగని వికుంఠనిలయుఁడు, జనార్దనుఁడు పల్కె నిటులుఽసాదరమతియై. 377

శ్రీ భగవానుఁడు:—

గీ. తలఁప జయవిజయాభిధాఽనులగు వీరు, నాదు దౌవారికుల్ మునిఽనాథులార !
వీరు నను(గించపఱచి యీఽవిధముగాఁగ, దృప్తతంజేసిరి భవద్వ్యఽతిక్రమంబు.

గీ. యతివరోత్తములార ! నఽన్ననుసరించు, మీర లిప్పుడు తగురీతి ఽ వీరి కిడిన
దండ మది యెంతయున్ సమ్మఽతంబనాకు, వీరు ద్విజపీడఁజేసినఽకారణమున. 379

ఉ. కావున మిమ్ము వేడుకొని ఽ క్రన్నఁ బ్రసన్నులఁ జేసికొందు నా
దైవ మనంగ బ్రాహ్మణులెఽతాపసపుంగవులార ! యిట్లు దు
ర్భావముతోడ నాజనులుఽవారకచేసిన నేర మంతయున్
భావమునం దలంచితినిఽనాయదిగాఁ బలుమాటలేటికిన్. 380

గీ. సేవకుం డపకారముఽసేయనెవని, యాహ్వాయంబుఁదలఁచిలోకఽమాడిపోయు
నట్టి యపవాద మరయఁద ఽ ద్యశమడంచు,నామయమ్ము చర్మమ్మునఽట్లార్యులార!

మ. అమలంబై యమృతోపమంబగు మదీఽయప్రోజ్జ్వల కీర్తిగా
నము దుష్టశ్వపచాదిలోకము వినన్ ఽ సద్యఃపునీతంబగున్
జుమి మీచే నుపలబ్ధకీర్తినగుచున్ ఽ శోభిల్లు నే మీకు బ
న్నముఁ గావించినచో స్వబాహువసమునేన్ ఽ ఖండింతు వేయేటికిన్. 382

చ. ప్రవిమల విప్రసేవఁ బదఽపద్మపవిత్రరజస్కునిన్ సుశీ
లవినుతునిన్ కృతాఖిలమఽలవ్రజు నన్ను విరక్తునైననున్
దవిలి రమాసతీమణియుఁఽదా ద్యజియింపఁగఁబోదు తత్కృపా
లవమునుగోరి సద్వ్రతముఽలం బచరింతురు సంతతం బొరుల్. 383

చ. అనలముఖంబునందు నిజఽయజ్ఞమునన్ యజమాని వేల్చు శో
భనఘృతపూర్ణసిక్తచరుఽభక్షణసేయుచుఁ దృప్తిఁబొందఁ జా
లను నిజకర్మపాకవిధుఽలం దగ నాకు సమర్పణంబుగాఁ
గ నొసఁగఁదృప్తుఁడై ద్విజముఽఖంబునఁ దృప్తినిఁ బొందునట్లుగాన్. 384

మ. వితతాకుంఠితయోగమాయ మహిమన్ఽ వెల్గొందు నే విప్రసం
తతి పూతాంఘ్రిరజంబు మౌళిపయినింఽదాల్తున్ దదంఘ్ర్యంబు లం

చితబుద్ధిన్ ధరియించి పూతులయి రాశీతాంశుచూడాదిదై
వతబృందం బపరాధినేని ద్విజునిన్ బాధింపరా దెవ్వరున్. 385

చ. ద్విజులను గోగణంబులను దీనుల సన్నను భేదబుద్ధి నెం
చి జడతఁ గాంతు రేని నఘచిత్తులవారల నెల్లఁ బేర్మిఁ దోఁ
ప జముభటుల్ విశంకటులు పాముపగంగొని గృధ్రరూపులై
నిజపటుచంచుఘాతముల నిల్వునఁ జీలురు దారుణంబుగన్. 386

చ. పరుషములాడినన్ ద్విజులభావము రంజిలఁ గొల్చుచుండి సుం
దరదరహాసరమ్య వదనాంబుజులై యనురాగ మొప్ప సా
దరమధురోక్తులన్ సులలితంబుగ సన్నుతి సేయుచుండి ము
ప్పిరిగొను ప్రేమఁ దండ్రిఁ బలెఁ బిల్చెడివారికి వగ్గమయ్యెదన్. 387

చ. ఒడయఁడనైన నాహృదయమోలి నెఱుంగక యిట్లు మీకు నా
గడ మొనరించినందులకుఁ గాఁ దగు శిక్షను బొంది యీగతిన్
గడపి మదంతికంబునకుఁ గ్రమ్మఱఁ జేరెడు నట్లనుగ్రహిం
పుఁడు ద్విజులార! దీనికి మిముం గడు వేఁడెద భక్తిపెంపునన్. 388

బ్రహ్మ:—

గీ. ప్రియము మంత్రాత్మకంబునై వెలయునట్టి, యాదిపురుషుని వాక్సుధ నారగించి
యతిశయక్రోధసందష్టులగుటఁ జేసి, వారియాత్మలు సంతుష్టిపడకయుండె. 389

గీ. పరిమితాక్షరయుక్తంబు గురుతరార్థ, కలితము నగాధగంభీరలలితమునగు
నతనివాగ్ఘరిఁ జెవియొగ్గి యాలకించి, స్వామియాశయ మెఱుఁగంగఁ జాలరైరి. 390

గీ. యోగమాయాబలంబున నొప్పునట్టి, పరమపురుషునిఁ బొడఁగాంచి ప్రాంజలులయి
మోదసంభృతచిత్తులుఁ బులకితాంగు, లగుచు విప్రవరేణ్యు లిట్లనిరి ప్రీతి. 391

కుమారులు:—

ఉ. నాకుఁ బ్రసాదముల్ సలిపినారలు మీరలటంచు నీవు లో
కైకవిభుండవయ్యుఁ బలుకంగఁ బదాశ్రితకోటినిర్జరా
నోకహ! త్వచ్చికీర్షితమునుం గననేరకయుంటి మయ్య దే
వా! కరుణించి మాకును భవద్ధృదయంబును విప్పి చెప్పుమా. 392

గీ. ఆదిపురుష బ్రహ్మణ్యుఁడవైన నీకు, విప్రు లుత్కృష్టదైవముల్ వేదవేద్య!
విబుధసంపూజ్యులైనట్టి విప్రులకును, నీవు దైవంబ వాత్మవై నెగడుచుందు. 393

చ. భవదవతారదేహముల భవ్యసనాతన ధర్మరక్షణం
బు వెలయుచుండుఁ గా పరమపూరుష! నిన్ను నుతింపశక్యమే

పరివిమల ధర్మమూర్తుడవు ♩ భవ్యయశుండవు నిర్వికార మూ
ర్తివి త్రిజగన్నుతుండవును ♩ దేవర ! సుహ్యుఁడవై వెలుంగుదా. 394

గీ. ఎవ్వని యనుగ్రహంబున యతీశులెల్లఁ, బటువిరక్తిని మృత్యుదేవతను గెలిచి
ముక్తిఁ గాంతురో యట్టి పరిభునకు నీకు, నితరులయనుగ్రహంబుతో నేమిఫలము.

చ. సిరి విపులార్థకాంక్షిజనశీర్షధృతాంఘ్రిపరాగ యయ్యు సుం
దరచరితార్థభక్తనిచితాంఘ్రిలసత్తులసీసుదామవి
స్తరతరధామమై నెగడుతత్వత్పదపద్మమరందలోలబం
భరమయి తా ననుక్షణము ♩ మక్కువమీఱ భజించు నాత్మలోన్. 396

మ. స్థిరబుద్ధిన్ సుచరిత్రలంగొలుచు లక్ష్మిన్ మెచ్చ కీశా ! నిరం
తరమున్ భాగవతప్రసక్తనిరతిన్ వర్తిల్లునీవున్ ద్విజే
శ్వరసత్పాదపరాగరేణువును శ్రీవత్సాంక తుల్యంబుగా
ధరియింతేటికి? లోకసంగ్రహము ప్రాధాన్యంబుగా దే యిటన్. 397

ఉ. పావనధర్మగుప్తికిఁ దపశ్శుచితాదయలన్ధరించి యీ
స్థావరజంగమాత్మమగు సర్వజగత్తు ద్విజామరార్థమై
దేవ ! రజస్తమంబుల మథించియు సత్త్వసమేతమై ఘనం
బై వరదంబునై వెలయు నాకృతిఁ దాలిచి ప్రోతు వర్మిలిన్. 398

వ. దేవా ! నీవు ద్విజోత్తమకులంబును సూనృతమార్గంబున రక్షింపకుంటివేని దాసం
జేసి శుభప్రదమైన వేదమార్గంబు నశింపఁగలదు. శ్రేష్ఠుండగు వాఁడెయ్యది
ప్రమాణంబుగా నంగీకరించు నయ్యదిల్లోకంబు గ్రహించుచుండు. నిజశక్తులచే
విరోధులం బెకలించి సర్వజనంబునకు క్షేమంబుఁగావింపందలంచునీకు బ్రహ్మ
కులంబు విషయమై యవనతియుక్తంబయగు. సర్వలోకాధీశుండవగు నీకింతమాత్ర
యవనతిచేఁ దేజంబు క్షతంబుగానేరదు. అధీశ్వరా! యీ జయవిజయులకు మేము
విధించిన దండం బనుచితంబేని నివర్తింపుము. అల్పంబేని నుచితదండంబు విధిం
పుము. ఏతద్దండవిధానంబున మేము కృతాపరాధుల మగుదుమేని మమ్ము
నియమింపుము. అని సనకాదులు ప్రార్థించినవిని వారలంగని భగవంతుండిట్లనియె.

శ్రీ భగవానుఁడు:—

సీ. ద్విజవరులార ! యీసురగతిం గొని వైరమ వీరు తీవ్రకో
పజనిమహా సమాధిపరిబద్ధనిరంతరయోగులౌచు న
క్కజముగ మత్సకాశమును ♩ గాంతురు ఖేదము దక్కియింతయున్
నిజమిది మీదుశాపమును నే నియమించితి నిక్కముంగుడీ. 400

బ్రహ్మ:—

చ. పదఁపడి సన్మునుల్ నయనఽపర్వము సేయు వికుంఠనాథు స
త్పదము స్వయంప్రభంబునయి ఽ భాసిలునట్టి వికుంఠధామమున్
ముదమునఁ గాంచి భక్తిమెయి ఽ మ్రొక్కి యనుజ్ఞను బొంది విష్ణు సం
పదఁ గొనియాడుచున్ నిజనిఽవాసపదంబును జేరి రత్తఱిన్. 401

చ. అనుచరులం గనుంగొనుచుఽనాభగవంతుఁడు వల్కె నిట్లు వే
చనుఁడిఁక భీతిఁ జెందకుఁడుఽసౌఖ్యము గల్గెడుఁ గాక మీకు నె
మ్మనమున బ్రహ్మతేజమునుఽమాప సమర్థుఁడనయ్యు నేను బూ
నను బలుమాటలేల యిదిఽనా మతమంచు నెఱుంగుఁ డాత్మలన్. 402

వ. ఈయుదంతము కుపితయై లక్ష్మి మున్న నిర్దేశించెఁ గాని యుపరతక్రోధుండనై
యామెను ద్వారంబునంద నివారించితి. 403

చ. పనివడి క్రోధయోగమున ఽ బ్రాహ్మణశాపము నిస్తరించి గ్ర
క్కున నిటు మత్సకాశమునఽకుం జనుదెంతురు స్వల్పకాలమం
దనుచు నిజానుయాయులకు ఽ నానతి యిచ్చి రమాధినాథుఁడున్
జనియె విమానభూషితము ఽ సర్వమహత్తరమున్ స్వధామమున్. 404

గీ. దుస్తరబ్రహ్మశాపంబు ఽ తొందరింప, సంహృతశ్రీకులై సురఽర్షభు లిరువురు
గర్వమడుగంట విష్ణులోఽకంబునుండి, తత్క్షణము క్రిందఁబడిరి ఖేఽదంబు గదుర. 405

గీ. అంతట వికుంఠధామంబు ఽ నందునుండి, వీఁకఁ గ్రిందికిఁ బడుచున్న ఽ విష్ణుభటులఁ
గాంచి యురువిమానాగ్రభాఽగంబులందు, నొదవె ఘోరహాహాకారఽమొక్క
మొగిని. 406

గీ. ఆ రమానాథదౌవారిఽకాగ్రగణ్యు, లైనవారిర్వు రపుడె కాఽశ్యపునివీర్య
మందు వేగ నావేశించిఽయుబ్బరముగఁ, బొంది రల దితిగర్భంబుఁఽబుత్రులార! 407

క. ఆయవసరమునఁ గవలగు, నాయసురుల తేజమున హఽతాక్షిప్తంబై
పోయెను మీ తేజ మిపుడు, చేయుఁ బ్రతిక్రియఁ దనంత ఽ శ్రీవరుఁ డెలమిన్. 408

మ. భువనశ్రేణికి సృష్టిసంస్థితిలయంఽబుల్ సేయు నాద్యుండు యో
గవిభూత్యాఢ్యులకేనిఁ జేరఁగ నశఽక్యంబైన శ్రీయోగమా
య విరాజిల్లెడువాఁడునైన హరి శ్రేఽయం బిచ్చుఁ జుం డస్మదీ
యవిమర్శంబున లేశమేనిఁ బనిలేఽదందున్ విలోకింపఁగన్. 409

---

## అధ్యాయము 17.

—హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల జననము, హిరణ్యాక్ష ప్రభావము—

మైత్రేయుఁడు:—

క. అనియిట్లు పద్మగర్భుఁడు, వినిచిన కారణమెఱింగి ✽ విబుధులు మది శం
కను బాసి స్వర్గలోకం, బునకును వెస మఱలిచనిరి ✽ బుధనుతచరితా! 410

క. పతి యాదేశంబున నా, దితియు నపత్యగతశంక ✽ దిగులుపడుచుఁ దా
శతతమసంవత్సరమున, సుతులం బ్రసవించెఁ గవల ✽ సురవిద్విషులన్. 411

క. వివిధోత్పాతపరంపర, భువనత్రాసకరమగుచుఁ ✽ బొడఁగట్టె మొగిన్
దివిని భువి నంబరంబునఁ, గవలగు దితిసుతులు పుట్టు✽కాలమునందున్. 412

మ. కులశైలంబులతోడఁగూడి యఖిల✽క్షోణీతలంబెల్ల సం
చలనంబందుచు దిర్దిరందిరిగెఁ బె✽ల్చన్ రాలె నుల్కాళి ప్ర
జ్వాలనంబందఁగ సాగె నొక్కమొగి ద్యో✽భాగంబులన్ బిట్టు పి
డుగులు నల్దిక్కులనుండి రాలిపడెఁ గీ✽డుం దెల్పెఁ బన్నేతువుల్. 413

మ. మొగివీచెం బృథులానిలంబులు ముహుః✽ఫూత్కారముల్ రేఁగఁగా
నగరాజంబులఁ బెల్లగించుచును వా✽త్యాళుల్ రజఃకేతులై
నెగడొందెన్ బ్రహసత్తటిద్ఘనఘటల్ ✽ నిండారె నష్టాఖిలో
డుగణంబైన నభంబునందుఁ దమ మా✽టోపించెఁ జూడ్కుల్ సెడెన్. 414

మ. ఉదరస్థంబగు జంతుజాలములు పె✽ల్లుబ్బాత లూఁగంగ న
ష్టదధుల్ మేరలు మీఱె నుద్గతకరా✽ళోర్మిచ్ఛటాత్తంబులై
యుదపానంబులతోడఁ గూడుకొని య✽త్యుగ్రప్రవాహంబులై
నదులున్ శుష్కపయోరుహంబులయి తూ✽ర్ణక్షోభ మొందెన్ వడిన్. 415

సీ. పరివేషయుతములై ✽ పరఁగె రాహుగ్రస్త, భాస్కరచంద్రబిం✽బంబు లోలి
నిర్ఘాతరవభూరి✽నిర్హ్రాదములు గుహా, వివరంబులందుండి ✽ వెలువడియెను
గ్రామంబులందు న✽క్కలు గూబలుం జేరి, వాపోవఁగాఁ జొచ్చె ✽ భయదరీతి
కంఠముల్ పైకెత్తి✽గ్రామసింహసమూహ, ములు రోదనధ్వనిన్✽మొఱుగుచుండె.

గీ. గార్దభంబులు ఖరఖుర✽ఘాతములను, బృథివిఁ ద్రవ్వుచు ఘాత్కార✽వేగమొప్ప
మదముతోఁ గూడుకొని మంద✽మందలుగను, బరుగులిడఁ జొచ్చెఁ జెలఁగి
యా✽తరుణమందు. 416

గీ. గార్దభత్రాసమునఁ జేసి✽ఖగములెల్ల, నేడ్చుచును నీడములనుండి✽యెగిరిపడియె
వనమునను ఘోషమునఁగల✽పశువులెల్ల, భీతిచే శకృన్మూత్రముల్✽విడిచెనపుడు.

క. మొదవులు బెదరినవై, యయ్యదనున నెత్తురును జీమూతంబుకణంబుల్
పిదికె ననిలంబులేకయ, యదవదలై చెట్లెల్ల నవనిం బడియెన్. 418

క. క్రూరగ్రహములు సౌమ్యా, కారగ్రహములను వక్రగతిఁ బీడించెన్
వార కలదేవలింగము, లూరక రోదనముఁ జేసె నొగినవ్వేళన్. 419

గీ. ఏతదన్యములగు మహోత్పాతములను, బెక్కిటింగని తత్త్వవిదులు ప్రజలు
విశ్వవిలయంబుగా నెంచి భీతులైరి, యజునిపుత్రులు దక్క నయ్యవసరమున. 420

గీ. ఆదిదైత్యులావారు సువ్యక్తమైన, యాత్మపౌరుషములచేత నలరుచుండి
యశ్మసారములైన కాయములచేతఁ, బృథ్వీధరములకైవడిఁ బెరుగుచుండ్రి. 421

ఉ. హేమకిరీటరోచుల రహిన్ గగనస్థలమున్ లసద్దిశా
స్తోమము గ్రమ్మ నిర్వురును స్ఫూర్తియుతాంగద బాహులౌచు నీ
భూమిని బాదఘాతముల బోరనఁ గంపిలఁ జేయుచున్ సుకాం
చీమహిత ప్రభాఢ్యకటిచే రవికంటె వెలింగి రెంతయున్. 422

సీ. అంతఁ బ్రజాపతి యాత్మజులకు నామ, కరణంబుఁ గావింపఁ గాఁదలంచి
యాదిని దితిగర్భమందు దా నుంచిన, వీర్యంబునం బ్రభవించిన సుతు
నకు హిరణ్యకశిపునామధేయంబును, వెలఁది దా మును బ్రసవించినట్టి
యాత్మజునకు హిరణ్యాక్షునామంబును, జేసియుఁ జనె నిజావాసమునకు
గీ. తోడన హిరణ్యకశిపుండు దోర్బలమున, బ్రహ్మవరమున నల లోకపాలసహిత
లోకములనెల్లఁ దనకును లోఁబడంగఁ, జేసె నకుతోభయుండయి చేవ మెఱయ.

సీ. అతనితమ్ముఁడు హిరణ్యాక్షుండు ప్రీతుఁడై, ప్రత్యహంబును గదాపాణియగుచు
తన్నెదిరించి యుద్ధము సేయఁగల శత్రు, వీరుని వెదకుచుఁ బృథ్వియెల్లఁ
దిరిగియుంగానక దివికి దండెత్తఁగా, వైజయంతీమాల వఱలు వాఁడు
రణితకాంచననూపుర విభ్రాజమానుఁడు, దుస్సహాజయుఁ డకుతోభయుండు
గీ. స్కంధవిన్యస్తభీకరగదుఁడు నైన, నా హిరణ్యాక్షునిం గని యమరులెల్ల
తార్క్ష్యసంత్రస్తఫణిసముత్కరములట్లు, బెదరుఁ గొని మూలమూలల నొదిగియుండ్రి

గీ. తనప్రతాపముచేఁ దిరోధానమంది, రింద్రయుతులైన వేల్పు లంచెఱిఁగి దుర్మ
దాంధుఁడై వారిఁ గాన కయ్యవసరమున, సింహనాదంబుఁ జేసె నజేయుఁడగుచు.

ఉ. లోకవిజేతయై విబుధలోకమునుండి పునర్నివృత్తుఁడై
భీకరరావయుక్తము గభీరమునైన పయోధిఁ జొచ్చె న
స్తోకబలంబుతోడను మదోజ్జ్వలగంధగజంబుకైవడిన్
నా కెదురెవ్వఁ డింకని మనంబునఁ గ్రొవ్వర మావహిల్లఁగన్. 423

గీ. అతఁ డబ్ధిఁ జొరంగ నయ్యవసరమున, వరుణభటులును యాదో నివహములు మది
భీతిగదురఁగఁ దత్ప్రతాపాతిశయ ని, హన్యమానులై పఱచి రంతఁ దందు వీఁక.

చ. అతిబలుఁడై సముద్రమున నాతఁడు పెక్కగు వత్సరంబు లు
ద్ధతిఁ జరియించుచుం గడు బ్రతాపముతో శ్వసనేరితోర్మిలన్
వితతగదాభిఘాతముల భిన్నముచేసె ననంతరంబునన్
దితిజుఁడు జేరె నవ్వరుణదేవునిభవ్యవిభావరీ పురిన్. 428

శా. అందుం జేరి రసాతలాధిపతియై యాదోగణేంద్రుం బ్రచే
తుం దర్శించి నమస్కరించి స్మయయుక్తుండున్ మహాధ్యుండునై
మందుండుంబలె గేలిసేయ 'రణ మిమ్మా నాకు నోరాజ!' యం
చుం దీనమ్ముగ నిట్లనెన్ వరుణుతోఁ జోద్యంబుగా నత్తఱిన్. 429

ఉ. నేతవు లోకపాలురకు నీవల దుర్మదవీరబాహు కం
డూతిహరుండ వౌదువు కడున్ రభసంబున దైత్యదానవ
వ్రాతము గెల్చి లోకమునవైభవ మొప్పఁగ రాజసూయ మ
త్యాతతశక్తిఁ జేసితట యాపృథుశక్తిని నాకుఁ జూపుమా. 430

మ. భగవంతుండు ప్రచేతసుం డిటులు శుంభద్గర్వుఁడౌ వైరిచే
నగుబాటుం గని యుత్థితంబయిన కోపన్కున్ బుద్ధి వారించి మె
ల్లఁగ నీరీతిని బల్కె నో దితిసుతాలంకార! మేమిప్డు జ
న్యగతౌత్సుక్యము మాని యుంటిమి ప్రశాంతత్వంబునన్ దానవా! 431

చ. సురనుతుఁడుం బురాణపురుషుండగు విష్ణునికంటె యన్యుఁడో
క్కరుఁడు గనంబడండు త్రిజగంబుల యుద్ధకళాప్రవీణు నిన్
దురమునమించి తన్నఁగలదోర్బలశాలి భవాదృశుల్ ధురం
ధరులెవనిన్ నుతించెదరో దైత్యవరా! వెసఁ జేరు మాతనిన్. 432

ఉ. వీరవరేణ్యు నామారని వీక నెదిర్చి గతస్మయుండవై
ఘోరరణాంగణంబునను గూలుదు త్వాదృశదుష్టచిత్తులన్
బోరన సంహరించుటకు బుణ్యులఁ బ్రోచుటకుం జెలంగి యీ
ధారుణి నా పరేశుఁ డవతారములన్ ధరియించుచుండెడున్. 433

## అ ధ్యా య ము 18.

### యజ్ఞవరాహ, హిరణ్యాక్ష యుద్ధ వర్ణనము

మైత్రేయుఁడు :—

చ. అని వరుణుండు దెల్ప దురహంకృతి దుర్మదుఁ డౌటఁ జేసి యా
తని వచనంబుఁ గైకొనక దైత్యుఁడు నారదుచేత నా రమే
శుని యునికిం గ్రహించి రణశూరత నాతనితోడఁ బోరఁ జ
య్యనఁ జనియెన్ రసాతలమునకుఁ బ్రతిమానజయాభిలాషియై. 434

మ. జయశీలున్ గిటిరూపునిన్ స్వఘనదంష్ట్రాగ్రంబునన్ ధారుణిన్
బయికిం జయ్యన నెత్తుచున్న ఘనునిన్ రక్తాక్షులన్ స్వప్రభో
చ్చయమున్ ముచ్చిలుచున్నవానిఁ గని యక్షాలుండు దుర్మానసుం
డయి యోహో! వనగోచరంబగు మృగం బాయంచు నవ్వెన్ ధృతిన్. 435

ఉ. ఆ దితిపుత్రుఁ డిట్లనియె నజ్ఞుఁడ! రమ్ము మహిన్ ద్యజింపు మీ
మేదినిఁ దా నొసంగెఁ బరమేష్ఠి రసాకులమైనమాకు నా
సాదితసూకరాకృతి విశంకటవృత్తిని నేను జూడ నీ
మేదినితోడఁ గూడి యెలమిం జనఁజాలవు సుమ్ము దుర్మతీ! 436

చ. అసురవిరోధులైన యమరావళి దైత్యవధార్థమై నినున్
బొసఁగ భరించుచుండు రొక్కొ పొంచి వధింతువు దైత్యకోట్ల న
య్యసదృశయోగమాయ మతిశయల్పబలున్ నినుఁ జంపి మూఢ! వే
గ సుహృదపారశోకములఁ గ్రమ్మఱఁ జేయుదు నీక్షణంబునన్. 437

మహాస్రగ్ధర. వడి నీవన్మద్భుజాగ్రప్రవిణుదితగదాభగ్నశీర్షుండవై చే
డ్పడియుండన్ నీకునిచ్చల్ బలియొసఁగు ఋషివ్రాతముల్ దేవకోటుల్
దడయుం గంపంబు పుట్టం దడఁబడు చితికర్తవ్యతామూఢులై ద
ల్లడపాటున్ జెందుచుం ద్రుల్లములనికఁ గతాలంబులై దీనవృత్తిన్. 438

మ. అరివీరోగ్రదురుక్తితో మరవితానాయస్తుఁడై యీశుఁడా
హరి దంష్ట్రాగ్రగతన్ వసుంధరను భీతాత్మన్ సమీక్షించి యా
పరిభూతిన్ సహియించి వెల్వడియెఁ దా వార్మధ్యమందుండి వా
విరి గ్రాహాహతమౌ కరేణుయుతకుంభీంద్రంబుచందంబునన్. 439

మ. సలిలస్తోమమునుండి వెల్వడు జగత్స్వామిం గరిన్ గ్రాహమ
ట్లలఘుప్రౌఢిని వెంబడించుచు హిరణ్యాక్షుండు దంష్ట్రాకరా

ళ లసద్వ్యక్త్రీఁడు భూరినాథుఁడయి హేలన్ దంష్ట్రితోఁ బెల్కొని
ట్టులు నిర్లజ్జులు పాఱుఁబోతులగు మూర్ఖుల్ నిందఁ బాటింతురే! 440

వ. అని యధిక్షేపించుచున్నంత. 441

చ. ప్రముదితమానసుం డగుచు వారిజగర్భుఁడు ప్రస్తుతింప న
య్యమరులు పుష్పవృష్టిఁ గురియంగ నరాతియుఁ జూచుచుండఁ దో
యముపయి గోచరించునట్టులయ్యవనిం దగఁ బాదుకొల్పి నే
ర్పమరఁగ నందునుంచె జలజాయతనేత్రుఁడు స్వీయసత్త్వమున్. 442

చ. పెనుగదఁ గేలఁ బూని తన వెంబడి నుగ్రతవచ్చుచున్ లస
త్కనకవిచిత్రవర్మ్మఁడును గాంచనభూషుఁడునౌ హిరణ్యలో
చనుఁడు దురుక్తిబాణముల సారెకు మర్మములం గలంచి ప
ల్కిన విని శౌరి వానిఁగని కిన్క వచించె నిటుల్ హసించుచున్. 443

భగవానుఁడు:—

చ. ఘనవనసీమగోచరమృగంబుల మే మది నిక్కువమ్ము సు
మ్ము నెమకుచుందు మెప్డు మిముబోటి జుగుప్సితచేష్టితంబులౌ
శునకగణంబులన్ దితిజ! చూడుము నీగతి మృత్యుపాశ బం
ధనములఁ జిక్కి తింక బలదర్పవికత్థనముం ద్యజింపుమా. 444

చ. పలువ! యిదే రసాతల నివాసులన్యాసముఁ గొన్న మేము నీ
యలఘుగదం బలాయితులమైతిమి లజ్జఁ ద్యజించియైనఁ గే
వలమును శత్రువైన బలవంతునితో ననివార్య వైరమున్
గలిగినమాకు నెందు జనఁగాదగు నెట్టులొ నిల్తు మాజిలోన్. 445

ఉ. భూరిపదాతియూథపవిభుండవు నీవట మాకు వీఁకమై
ఘోరపరాభవవ్యథను గూర్పఁగడంగు వధించిమమ్ము నీ
వారి శుగశ్రువుల్ దుడువఁ బొల్పుడుమా స్వదృఢప్రతిజ్ఞ దాఁ
దీరుప నెవ్వఁడోపఁడో మదిం బరికింపఁగ వాఁడు సభ్యుఁడే? 446

మ. కిరిరూపుండగు శౌరి తన్నిటు లధిక్షేపించి రోషంబునన్
బరిహాసం బొనరింపుచుండ నలువొప్పం గ్రీడఁగావించు భీ
కరభోగీంద్రముభంగి రోజుచు నదగ్రక్రోధదుర్ధర్షుఁడై
యరిభీముండు మహాబలాఢ్యుఁడు హిరణ్యాక్షుండు విభ్రాజిలెన్. 447

మ. బహులామర్షసముత్థదీర్ఘతరనిశ్వాసంబులం బుచ్చు చం
త హిరణ్యాక్షుఁడు క్రోధసంచలితబుద్ధ్యాదీంద్రియవ్రాతుఁడై

ముహురాసాదితమైన భూరిగదచే ఁ మోదెన్ వెసన్ దానవా
రి హరిన్ ఛద్మకిరిన్ గృపాలహరి శౌరిన్ ధైర్యభాస్వద్గిరిన్. 448

క. అరివీరునిచేతం దన, యురమున విసరంగఁబడిన యుగ్రగదాభూ
రి రయంబును వంచించెను, హరి యోగారూఢపురుషుఁ డంతకుభంగిన్. 449

ఉ. వెండియు నాగదం గొని యభీక్ష్ణముఁ ద్రిప్పుచు సంభ్రమంబునన్
మండుచు గాఢదష్టరదనచ్ఛదుఁడై పొడఁగట్టుచున్న యు
ద్దండుని దైత్యనాథునిఁ గ్రధన్ హరి యుద్యతశుండమైన వే
దండము నమ్మృగేంద్రము విధంబునఁ దా నెదురించె ధీరతన్. 450

ఉ. ఆగతి నెత్తివచ్చు వికచాంబుజనాభుని దక్షిణాంసభూ
భాగమునందు వా దితిజవల్లభుఁ డూర్జితసత్త్వరాశిఁ దో
ర్దోగదతోడఁ గొట్టె నలతో యరుహాక్షుఁడుఁ గౌశలంబుతో
నాగదనున్ స్వకీయగదనడ్డుహతం బొనరించె వేల్మిడిన్. 451

క. పెనుగదల నీక్రియం బెల్చన నన్యోన్యవిజయేచ్ఛల హిరణ్యాక్షుం
డును శ్రీహరియును జలముం, గొని యొండొరువులను గొట్టుకొని రొండొరువుల్.

ఉ. పాయక పోరుసల్పుచు నవార్య గదాహతగాత్రులౌచుఁ బె
ద్దాయములందు శోణితము గాఱఁ బ్రవర్ధితమన్యులౌచు దై
తేయుఁడు వాసుదేవుఁడును ధేనువుకై తలపడ్డ దర్పశో
భాయతనంబులైన వృషభంబులచాడ్పునఁ బోరి రుగ్రతన్. 453

ఉ. చేవదలిర్ప నిట్టులు విచిత్రగతుల్ వెలయన్ జయేచ్ఛలన్
బావన యజ్ఞమూర్తియును వ్యాజవరాహతనుండునైన నా
దేవుఁడు దైత్యుఁడున్ వసుమతిం గొన సల్పు రణంబుఁ జూడ వా
ణీవిభుఁ డేగుదెంచెను మునివ్రజసంయుతుఁడౌచు వేడ్కతో. 454

మ. వితతావార్యపరాక్రమక్రము మదోపేతున్ భయాపేతు ను
న్నతగాత్రున్ దితిపుత్రు దక్షుని హిరణ్యాక్షున్ మహావక్షు ను
ద్ధతచిత్తున్ విహితప్రతిక్రియుని సంతతంగాంచి యజ్ఞాత్ముఁడౌ
శతపత్రాక్షునితోడ నీపగిది నోజన్ బ్రహ్మదేవుండనెన్. 455

బ్రహ్మ:—

శా. ఈలీలన్ ఖలుఁడున్ నిరంకుశుఁడు సంప్రాప్తుండు మాయావి దు
శ్శీలుండౌ దితిపుత్రకున్ దురితరాశింగూడి క్రీడింప నే

లా! లీలాగతి నుత్ఫణంబును గరాగ్రంబైన వ్యాళంబుతో
బాలుండుంబలె దేవదేవ! యిఁక నీ భావంబుఁ జాలింపుమా. 456

గీ. తనదు వేళను ప్రాపించి దారుణుఁడయి, మొనసి యితఁడభివృద్ధినిఁ బొందకమును
స్వీయయగుమాయఁగొని పాపచిత్తుఁడైన, యసురునివధింపుమయ్య దేవాదిదేవ!

చ. సకలజగద్వినాశకరి సంధ్య యిదే కడు ఘోరమై ప్రభూ!
వికటముగాఁగ వచ్చెడిని వీఁక మెయిన్ జగదేకనాయకా!
ప్రకటముగాఁగ నీ ఖలునిఁ బట్టి వధించి సమస్తదేవకో
టికి విజయంబుఁ గూర్చుము గడిందిమగంటిమి దోఁప నిత్తఱిన్. 458

మ. ఉరుమాహూర్తికమైనయట్టి యభిజిద్యోగంబు ప్రాపించెఁ దా
మరసాక్షా! యిపుడోలి త్వత్సఖులమౌ మాకున్ శుభశ్రీపరం
పరలం గూర్చుటకై రమేశ! త్రిజగన్మందార! వేవేగ దు
స్తరు దుర్దాంతు దురంతు దుశ్చరితు నీ దైత్యేంద్రుఁ బోఁ గార్చుమా. 459

గీ. తన యదృష్టపు మృత్యువౌ నినునెదిర్చి, పోరఁ జొచ్చిన యీ దితిపుత్రుఁ ద్రుంచి
శోభనముఁ గూర్పుమా యెల్ల సురలకిప్డు, డఖిలలోకైకనాథ! దయాసనాథ! 460

---

## అధ్యాయము 19.

### హిరణ్యాక్షవధ

మైత్రేయుఁడు:—

చ. ప్రవిమలమున్ సుధోపమము వ్యాజవిహీనమునైన యవ్విరిం
చి వచన మాలకించి ప్రహసించి శుభంబయి ప్రేమగర్భితం
బవు నదపాంగవీక్షల దయామయనిర్మలమానసుండు లో
కవిభుఁడు విష్టరశ్రవుఁడు గైకొనె నా పరమేష్ఠివాక్యమున్. 461

ఉ. పిమ్మట ప్రోల నేవలనభీతియొకింతయు లేక ధీరభా
వమ్మెసఁగం జలించెడు విపక్షుని దక్షునిఁ గాంచనాక్షు ను
గ్రమ్మయియొప్పు భూరిగదఁ గైకొని యెత్తి యుదగ్రమైన కో
పమ్మున బిట్టుఁగొట్టె హనుభాగమునన్ హరి యుజ్జ్వలాస్యుఁడై. 462

క. తన గదచే దైత్యుండా, ఘనగదవైవ భగవంతు కరపంకేజం
బుననుండి జారి యది బోరన దిర్దిరఁ దిరిగె నబ్బురం బది యయ్యెన్. 463

గీ. సమయము లభించినన్మది సమరధర్మ, మరసి యసుర నిరాయుధున్ హరిని బాధఁ
బెట్టఁడయ్యె నిర్జరులెల్ల బెగడుఁగుడిచి, నలిపిరపుడు హాహాకారములు కలంగి.

ఉ. దైత్యకులాధినాథురణఽధర్మముఁ దత్పృథు విక్రమక్రియం
బత్యధికాద్భుతంబు నిడఽనాతని మెచ్చుచు భీతులైన యా
దిత్యులఁ గాంచి మీరలు మఽదిన్ బెగడొందకుఁ డంచు నాగమ
స్తుత్యుఁడు దేవదేవుఁడు యఽశోభిరతుండు స్మరించెఁ జక్రమున్. 465

ఉ. అదితిసుతుల్ ససంభ్రమ సఽమాగత చక్రసమేతుఁడై స్వపా
ర్షదవరు దైత్యశేఖరు నఽజయ్యబలాఢ్యు నెదిర్చి యుగ్రతన్
గదనముఁ జేయ నేగు రణఽకౌశలు నీశునిఁగాంచి "నీకు మే
లొదవుతఁ ద్రుంపుమీ దితిజు ఽ నోహరి!" యంచు వచించి రుమ్మడిన్. 466

ఉ. అంత రథాంగపాణి వికఽచాబ్జదళాక్షుఁడునైన యార మా
కాంతు నిజాగ్రభాగమునఁఽగన్గొని భీషణరోషదూషిత
స్వాంతముతోడ దీర్ఘ మగుఽశ్వాసనిగుడ్చుచు దైత్యముఖ్యుఁ డ
త్యంతము క్రోధదంశితరఽదచ్ఛదుఁడై కనుపట్టె నుగ్రతన్. 467

ఆ. అతికరాళదంష్ట్రుఁఽడయి కన్నులం దహియించువాఁడువోలెఁ ఽ గాంచుచుండి
యెదురు పఱచి పృథులఽగదచే 'హతుఁడవైతి,' వనుచు బిట్టుమొత్తెఽనబ్జనాభు. 468

ఉ. వామపదంబుచేత భగఽవంతుఁడు యజ్ఞవరాహరూపుఁ డా
భీమగదాయుధంబు నరిఽవీరుఁడు చూడఁగ నెట్టివైచి యో
రీ! మనుజాశనాధమ! ధఽరింపుము వేఱొక యాయుధంబు ను
ద్దామజిగీష మార్కొనఁగఁ ఽ దార్కొను మంచనె గ్రేణి సేయుచున్. 469

మ. అసురేంద్రుండును యజ్ఞరూపకిటిపైఽనత్యుద్ధతిం బెన్గదన్
విసరెన్ మీఁదికి ముట్టివచ్చెడుగదన్ఽవీక్షించి సన్నద్ధుఁడై
యసురారాతి ఖగేశ్వరుండు ఫణికఽన్యంబోలె లీలన్ గ్రహిం
చె సమస్తామరమాని సంచయములుంఽజిత్తంబులం బొంగఁగన్. 470

చ. తన పృథుశౌర్య మిట్లభిహఽతంబగుడున్ దితిజాధముండు గ్ర
క్కున హతగర్వుఁడై మహిమఁఽగోల్పడి యచ్యుతదీయమానహా
ఘనగదనొల్లకప్డ త్రిశిఽఖంబు జలజ్జ్వలనోచ్ఛ్వలంబునై
యెనయు త్రిశూలముంగొని రఽమేశునిపై విడిచె న్మహోద్ధతిన్. 471

చ. విడిచిన యాత్రిశూలమును ఽ విప్రునిపై నభిచారకర్మకై
వడి వడితగ్గి బెండువడిఽవచ్చుచునుండినఁ గాంచి పద్మనా
భుఁడు సురలోకనాథుఁడు సఽముజ్ఝితతార్క్ష్యపతత్రిముంబలెన్
నడుమనఁద్రుంచె దానిని నఽనర్గళ భీషణచక్రధారచేన్. 472

మ. తనశూలం బిటు లా రమావిభునియుద్యచ్చక్రధారన్ వినా
శనమొందం బృథురోషుఁడై దితిజుఁడోజన్ డాసి సుశ్రీయుత
మ్మను విస్తీర్ణమునైన యా హరి యురమ్మున్ నిష్ఠురోన్ముష్టి పీ
త నయుండై ప్రహరించి యార్చుచునె యంతర్ధానమొందెన్ వెసన్. 473

ఉ. ఆదివరాహరూపుఁడగునా భగవంతుఁడు లోకలోచనుం
డా దితిపుత్రుచే నురమునందిటు లాహతుఁడయ్యుఁ బుష్పమా
లాదులచేతఁ గొట్టఁబడినట్టి మదద్విపరాజమట్టు లే
ఖేదలవంబులేక యెసగెన్ దరహాసవిభాసమానుఁడై. 474

గీ. అంత యోగమాయేశ్వరుఁడైన శ్రీశు
నందుఁ బలు తెఱంగులగు మాయల సృజించె
దైత్యుఁ డదిగాంచి ప్రజలు సంత్రస్తులగుచు
తలఁచిరి మనంబులన్ జగద్విలయమనుచు. 475

క. వీచెఁ బ్రచండానిలములు, తోఁచెను బాంశుజ తమంబుదుర్భరశిల లా
శాచక్రంబులనుండి య,నూచములై పడియె యంత్రనోదితములటుల్. 476

శా. వ్యోమం బయ్యె వినష్టతారము సవిద్యుద్గర్జితాంభోధర
స్తోమంబుల్ మలమూత్రకేశరుధిరాస్థుల్ గ్రుమ్మరించెన్ వెసన్
భూమీధ్రంబులు తోఁచె నాయుధచయంబుల్ వీఁచుచున్నట్లుఁ దో
డ్తో ముక్తాంబరకేశులై తిరిగి రందున్ యాతుధానాంగనల్. 477

చ. తతరథవాజికుంజరపదాతిదళంబులతోడఁ గూడి యు
ద్ధతులగు యక్షరాక్షసులు దారుణవాక్యము లాడుచుండఁగాఁ
గ్రతుమయరూపుఁడైనహరి రాక్షసమాయలనెల్ల వేగమే
ప్రతిహతముం బొనర్ప మనిపంచె సుదర్శనచక్రరాజమున్. 478

వ. అయ్యవసరంబున 479

చ. హృదయమునందుఁ గంప ముదయించె వడిన్ దితికిన్ స్వభర్త ప
ల్కు దలఁపునందుఁ దోఁచె మఱికోమలిచన్గవనుండి శోణితం
బు దెరలె యప్పు డప్పొలఁతిపుత్రునకుం దలపోయఁజావు. తె
ప్పదనుచు నాత్మలోనఁ బెనువంతను గుందుచునుండె దీనతన్. 480

గీ. తనదుమాయలు నశియించ దైత్యుఁడంతఁ
గ్రమ్మఱఁగ వచ్చి కేశవుఁ గ్రతురూపు

బహిరవస్థితు లోకైకపాలు హరిని
యుగ్రరోషోపగూఢుఁడై యొఱఁగాంచె. 481

గీ. పిడుగులంబోని పిడికిళ్లఁ బొడుచుచున్న, దైత్యు నధోక్షజుండు హస్తమునఁ బొడిచెఁ
గర్ణమూలంబునందు నుగ్రంబుగాఁగ, వృత్రదానవు నల దేవవిభుఁడువోలె.

చ. భువనవిజేత యాపరమపూరుషుచే నలవోకవోలె దా
నవవిభుఁ డాహతుండయి ఘనంబగు దేహము సంభ్రమింపఁ గ
న్గవ వెలికుబ్బఁగా మొగముఁ గంద విశీర్ణ భుజాంఘ్రికంధరా
ద్యవయవుఁడౌచు వాయువిహతాంఘ్రిప మట్టులు ధాత్రిపైఁ బడెన్. 483

ఉ. ఘోరకరాళదంష్ట్రుఁడు సకుంఠితతేజుఁడు దంశితోష్ఠుఁడై
ధారుణిభాగమం దవశతన్ శయనించినయట్టి భీకరా
కారుని దైత్యశేఖరుని గాంచి విరించిముఖామరోత్కరం
బౌర! యితండు నీల్గుటిది యబ్బురమంచు వచించి రక్రియన్. 484

ఉ. లింగతనూవిముక్తికి జ్వలింపని యోగసమాధి నే శుభా
పాంగుని యోగిపుంగవులు ధ్యానము సేయుచునుంద్రో యట్టి భ
వ్యాంగుని పాణిచేతఁ జఱవంబడి తద్వదనంబుచూచు చి
ట్లంగమువాసె నీతని మహత్తరభాగ్యముఁ జెప్పఁదీరునే? 485

క. వీరిరువురు వైకుంఠుని, ద్వారస్థులుకారె? శాపవశమున నిట్లీ
ఘోరగతిఁ జెందిరి మరల, శౌరిం జేరుదురుకొన్ని జన్మంబులకున్. 486

దేవతలు:—

చ. అమలినసత్త్వమూర్తి వెలయన్ భువనస్థితిఁ గూర్చునట్టి స
ర్వమఖమయాత్మకుండవయి వర్తిలునీకును మా నమస్కృతుల్
కమలదళాయతేక్షణ! జగంబులమర్మములం గలంచు దు
ర్దమ దనుజున్ వధించితివి ధన్యులమైతిమి మేము నీకృపన్. 487

మైత్రేయుఁడు:—

మ. ధరణీభారము వాయఁజేయుటకునై దైత్యేశ్వరుం గూల్చి యా
సరసీజాసన ముఖ్యసర్వదివిషత్సంఘంబు శ్లాఘింప నా
వరదుండైన రమాకళత్రుఁ డరిగెన్ వైకుంఠధామంబు సుం
దరనామంబు మనోభిరామము ననంతశ్రీప్రభావోద్దామమున్. 488

చ. జగతిఁ గృతావతారుఁడగు శౌరి సుచేష్టితముల్ యథాతథం
బుగ వివరించినాఁడఁ గురుపుంగవ! నీకిపు డవ్విభుండు కే

ళిఁగ నొక యాటబొమ్మను వలెన్ సమరంబునఁ గాంచనాక్షు ను
గ్రగతి నిజంపినట్టి పృథుగాథ యదెల్ల సుబోధమయ్యెఁగా. 489

శ్రీశుకుఁడు:—

క. అని మైత్రేయుఁడు దెల్పిన, యనఘుంబగు శ్రీహరికథ నాలించి నృపా!
మనమునఁ బరమానందంబును విదురుఁడు భాగవతుఁడు పొందెన్ మిగులన్.

గీ. పుణ్యచరితులు ధన్యులు భూరియశులుఁ నైన యితరుల సత్కథ లాలకింపఁ
గడుఁ బ్రమోద మవశ్యముఁ గల్గునన్న, శ్రీరమాధవు కథ వేఱె చెప్ప నేల. 491

ఉ. పాదమునన్ ఝషంబొడిసి బల్మిని బట్ట గజేంద్రుఁ డప్పు త
త్పాదసరోజమున్ మదిని ధ్యానముఁ జేయఁగ నాత్మలందుఁ బెం
పేది కరేణుసంతతులు నెంతయు దీనతఁ గూయివెట్ట నా
శ్రీదయితుండు ప్రీతినిఁ గరీంద్రునిఁ గష్టముఁ ద్రోసి కావఁడే? 492

గీ. ఋజుమతి ననన్యశరణులై యెసఁగు నరుల
కును సుఖారాధ్యుఁడై చెలంగుచు నసాధు
జనదురారాధ్యుఁడైనట్టి సకలలోక
విభుఁ గృతజ్ఞుఁ డెవండు సేవింపకుండు? 493

మ. మహిమోపేతము యజ్ఞదంష్ట్రియగు శ్రీమచ్చారు విక్రీడితం
బు హిరణ్యాక్షువధంబు నెవ్వఁడు కడున్ మోదంబుతోడన్ వినున్
బహురీతుల్ వెలయంగఁ బ్రీతమతియై పాడున్ వినోదించు న
న్వహమున్ బ్రహ్మవధంబునుండియును వేయాతండు ముక్తుండగున్. 494

గీ. అతిపవిత్రతరమ్ము మహాఫలమ్ము, శ్రీయశస్కర మాయురాశీఃపదంబు
ప్రథనశౌర్యదమునగు నీకథను విన్న, యఖిలజనులకును గతి నారాయణుఁడగు.

---

## అధ్యాయము 20.

### మనువంశము

శౌనకుఁడు:—

గీ. మహిని స్థానంబుగాఁ బొంది మనువు నిర్మ, లాత్ముఁడైన స్వాయంభువుఁ డవరజన్మ
జంతుకోటుల సృష్టికై సరగ నెన్ని, గతులఁ గావించె నది యెఱుఁగంగఁ జెపుమ.

ఆ. పరమభాగవతుఁడు హరికి నేకాంత సు, హృదుఁడునైన విదురుఁ డెలమిఁ గృష్ణు
నందుఁ గీడు సలిపె ననుచుఁ దలంచి సా, పత్యు నగ్రజుం బరిత్యజించె. 497

గీ. వ్యాసునకు మహాత్త్వంబునఁ బడసిపోని, యనఘుఁడు తదంగసంభవుఁ డైనవాఁడు
సర్వవిధముల శ్రీకృష్ణసంశ్రితుండు, కృష్ణతత్పరుల ననుసరించు ఘనుఁడు. 498

గీ. విమల తీర్థసంసేవలవిరజుఁ డైన, విదురుఁ డల కుశావర్తంబుఁ గదిసి యందుఁ
దగసుఖాసీనుఁ డై యున్న తత్త్వవిదుని, ననఘు మైత్రేయు నేమని యడిగెఁ జెపుమ.

మ. జనసంసేవ్యులు వారలిర్వురు మిథస్సంవాదముం జేయుచో
ఘనపాపఘ్నములుం బ్రసన్నములు నై గంగాంబువుల్ వోలెఁ బా
వనకృష్ణాంఘ్రి సమాశ్రయంబులయి విభ్రాజిల్లు నైర్మల్యశో
భనదివ్యత్కథ లెవ్వి కల్గె ననఘా వర్ణింపుమా తత్కథల్. 500

గీ. నీకుఁ గల్యాణమగుఁ గీర్తనీయపుణ్య, కర్ముఁ డై విలసిల్లు శ్రీకాంతుని ఘన
దివ్యలీలామృతంబు నర్థి మెయిఁ గ్రోలి, తృప్తిఁ గనఁ జాలునె రసజ్ఞుఁ డెవ్వఁ డేని.501

క. అని శౌనకాదిమును లడిగిన నయ్యుగ్రశ్రవుండు కృష్ణార్పిత స
న్మనుఁ డై వారలఁ గనుఁగొని, వినుఁ డని వాక్రువ్వఁ దొడఁగె విమలమనీషన్.502

శ్రీశుకుఁడు:—

మ. గురుమాయాద్భుతశక్తి పెంపున ధృతక్రోడాంగుఁ డై నట్టి శ్రీ
హరి సర్వేశుఁడు దా రసాతలగతం బై యున్న భూదేవి యు
ద్ధరణంబుం బొనరించినట్టి విధమున్ దైత్యున్ హిరణ్యాక్షు సం
హారణంబుం బొనరించినట్టివిధ మర్థిన్ లాలించెఁ గౌరవ్యుఁడున్. 503

వ. ఇట్లాలించి సంజాతహర్షుం డై దురితశిఖరిభిదురుండగు విదురుండు భాగవతవిధే
యుండగు మైత్రేయుం గాంచి యిట్లనియె. 504

విదురుఁడు:—

సీ. యతికులతిలక! యవ్యక్తమార్గవిదుండు, జలజగర్భుండు ప్రజాపతిపతి
సకలలోకప్రజాసర్గంబునందుఁ దా, మునుమున్ ప్రజాపతులను సృజించి
యేమియారంభించె నెఱుఁగంగఁ జెప్పుమా, బ్రహ్మస్వరూప! పావనచరిత్ర!
ధీయుక్తి బ్రహ్మ యాదేశంబునం జేసి, యలమరీచ్యాది విప్రులును మఱియు

గీ. ఘనుఁడు స్వాయంభువాఖ్యుఁడౌ మనువు నెట్టు, లీజగంబును బుట్టించి రెలమివీరు
సతులఁ గూడక యే సృష్టి సలిపిరి మఱి, యింతులనుఁ గూడి యెదిన్ని సృజియించి రనఘ!

గీ. వార లందఱు నేక మై ప్రౌఢిమెఱయ, నేమిసృష్టినిఁ గావించి రెవ్విధంబు
వినఁగ నెంతయు నాకు దివేడ్క వొడమె, బోధపఱుపుము మైత్రేయ! బుధ
విధేయ! 506

మైత్రేయుఁడు:—

వ. దుర్వితర్క్యంబగు జీవాదృష్టఫలంబుచేతను, ప్రకృత్యధిష్ఠాతయగు మహాపురుషుని చేతను, హేతుభూతంబైన కాలంబుచేతను, జాతక్షోభంబైన భగవంతుని గుణత్రియంబునుండి మహత్తత్త్వ ముత్పన్నంబయ్యె. అమ్మహత్తత్త్వంబువలన నాకాశాది పంచభూతంబులు వొడమె. అవి యొక్కొక్కటిగ భౌతికసృష్టింజేయ నసమర్థంబులై దైవయోగంబున నొండొంటిం గలిసికొని హేమమయాండంబును సృజించె. సమర్థంబై నిరాత్మకంబైన యయ్యండకోశంబు సలిలమధిష్ఠించి సహస్రవర్షంబులుండె. ఎవని నాభిభాగముననుండి సహస్రభాను తేజంబును, సర్వజీవనికాయంబును, విధాతృ జన్మస్థానంబును నగు పద్మంబు సముత్పన్నంబయ్యెనో, యేభగవంతుఁడు సలిలాశ్రయంబునఁ బవ్వళించెనో యేపరమేశుండాత్మసంస్థచే యథాపూర్వకంబుగ లోకసంస్థను నిర్మించెనో యాభగవంతుఁడయ్యండకోశంబుఁజొచ్చె. మఱియు స్వకీయచ్ఛాయచే నవిద్యనుదామిస్రంబనియు, నంధతామిస్రంబనియుఁ, దమంబనియు, మోహంబనియు, మహామోహంబనియుఁ బంచపర్వంబులుగా సృజించె. 507

క. తామసమగు తనకాయము, తామరసభవుండు విడిచి తనివి సనం డు
ద్దాములు రక్షోయక్షులు, యామినిఁ యగుదానిఁగొనిరి యటుక్షుత్తృడ్జన్. 508

క. ఆకలిదప్పులచేఁ బ్, ర్వ్యాకులులై యజు భుజింప నభిముఖులగుచున్
సాఁకకుఁడు వీని నిప్పుడ, కైకొని భక్షింపుఁ డనుచుఁబల్కిరి వారల్. 509

గీ. పద్మజుఁడు భీతుఁడై పల్కెవారికిట్లు, చెలఁగి భక్షింపకుండు రక్షింపుఁడునను
నాప్రజలు యక్షరక్షోగణంబులార!, మీరుగావునఁ గనుఁడిదిమీమనముల. 510

వ. ఇట్లు బ్రహ్మ 'మా, మా, జక్షత, రక్షత' యనుట వారలు యక్షరక్షస్సు లనంబడిరి. అంత— 511

గీ. ప్రభ నలరు వేల్పులసృజించెఁబద్మసంభ, వుండు ప్రాముఖ్యమునఁ దద్విభము క్తమగుచు
వెలుఁగు దివసరూపప్రభన్ వేల్పులెల్లఁ, గైకొనిరి క్రీడమానులై కౌతుకమున.

క. శతధృతి జఘనతలంబున, నతిలోలుర నసురసంచయముల సృజించెన్
మతిహీను లపుడుమైధున, గతికై పొదివిరి కడంగి కమలాసనునిన్. 513

క. అంతట నవ్వుచు నాభగ, వంతుఁడు గతలజ్జులగుచువారలు తఱుమన్
స్వాంతమునఁ గ్రుధయు భయమును, వింతయుఁ బెనఁగొనఁగఁబఱచెవీఁకదలిర్పన్.

చ. ద్రుతగతి నిట్లు పాఱి వరదా మంచు ప్రపన్నజనార్తిహర్త భ
క్తతతిమనోనురూపశుభదర్శనుఁడై కృపసేయునట్టి శ్రీ
పతిఁ గని నన్నుఁగావు సురవందిత! నీదగు ప్రేరణన్ బ్రజా
తతి సృజియించినాఁడఁ జుమి తత్ప్రజ నన్ను యభింపఁజేరెడిన్. 515

క. ఆపన్నుల యాపదలన్, బాపఁగ నీవొక్కరుఁడవె వలఁతివి మఱియున్
నీపదములు గొలువనియా, పాపులకుం గ్లేశ మొసఁగు వాఁడవు నీవే. 516

మైత్రేయుఁడు:—

క. వనజజు కృపణత్వంబున్, గని యింగితవేది శౌరి కశ్మలమగు నీ
తనువుం ద్యజింపు మనిచె, న్విన విడిచె నజుండు నదియు వెలఁదుక యయ్యెన్. 517

సీ. కనకమంజీరనిక్వాణనముఖరిత, చరణారవింద భాసురకపోల
మణిమేఖలాలసమానదుకూలాంచి, త నితంబభాగ మదచపలాక్షి
యన్యోన్యసంశ్లేషణాంచితతుంగపీ, వరకుచాభోగ శుభ్రదరహాస
వ్రీడోపగూఢ శరీరభాగ వినీల, కుంతల వరనాసకుందరదన

గీ. యైతనర్చు సంధ్యారూపనన్నెలంత, ననుచు నెల్లరుఁ దమహృదయంబులందు
సారెసారెకుఁ దలఁచి విస్తారమైన, మోహముం బొందుచుం దలపోసిరిట్లు. 518

క. ఈ యతివరూపమును లేఁ, బ్రాయము ధైర్యము నపూర్వభాగ్యగరిమయున్
మాయురె ! భావింపఁగ మున్నే, యెలనాగలకునైన నెందుంగలదే. 519

క. మనమందజమున్ దీనిని, మనమునఁ గామించుచుండఁ దగువయదేమో
చనుచుండె నకామకయై, మనమధ్యమునుండి దురభిమానము పేర్మిన్. 520

క. బహుగతులిటు తర్కింపుచు, మహిళాకృతియైన సంధ్యమన్నించి స్మయా
వహులగుచుఁ గుమతు లసురులు, బహువిస్రంభంబుతోడఁ బ్రశ్నించిరిటుల్. 521

మ. సుదతీ! యెవ్వరిదాన వీవెవతె విచ్చేసీకు నే యర్థము
న్నది? రూపద్రవిణాఖ్య పణ్యమున నొయ్యన్ మమ్ము నీరీతి వే
పె దహో యెవ్వతెవో యొకర్తుకవు ప్రాపించెన్ భవద్దర్శనం
బిదె నీ కందుక కేళిలీలఁ గను మాహృత్సీమలూటాడెడున్. 522

మ. స్తనభారావనతావలగ్నము సముద్యద్దోర్వ్యథమై భాసిలన్
ఘననీలోజ్జ్వల కేశజాలము సమగ్రధ్వాంతమై యొప్ప హ
స్త నివృత్తంబగు పూలచెండును బతద్భాస్వంతుఁడై త్రిప్పఁగా
ననువౌ చూపులు ఱెక్కలై తనర సంధ్యాకాంత! నీ వొప్పెదా. 523

గీ. ఒక్కచోటనె యొప్పారుచుండుఁ గమల, మంగనామణీ! నీమృదులాంఘ్రికమల
మరయసర్వస్థలంబులనలరుచుండు, నెందుఁ గన లేరు నినుఁబోలు నిందుముఖులు.

క. అని ప్రమదాకృతిలోభవి, జనకయగుచుఁ దనరుస్త్రిసాయంసంధ్యన్
ఘనమోహాపరవశులు గై,కొనిరయ్యసురులును మరులుకొని మూఢమతిన్. 525

గీ. అన్నలినసంభవుండునుత్సన్నుఁడౌన, మూరుకొను చప్డు భావగంభీరతఁగొని
సహజవిభ్రమమునఁ బ్రహాసంబుఁజేసి, రూఢిఁజేసె గంధర్వాప్సరోగణముల.

గీ. కాంతియుతము ప్రియము చంద్రికామయంబు
నైన యత్తనువుఁ ద్యజించె నబ్జభవుఁడు
కడఁక విశ్వావసుప్రముఖగణమెల్ల
దానిఁగైకొనెఁ బ్రీతచిత్తమ్ముతోడ. 527

క. తన యలసత నజుఁడు సృజించెను భూతపిశాచగణముఁ జెలఁగియప్పుడు వా
రును వేగ ముక్తకేశులు, మొనసి దిగంబరులు నగుచుమూసెన్ గన్నుల్. 528

క. ధాతయు జృంభణరూపకమౌ తనువుఁ ద్యజింపఁబడసి రది భూతాదుల్
భూతములదానఁదోఁచెడు, నాతత నిద్ర యఖిలేంద్రియక్లేదంబున్. 529

వ. ఏ యింద్రియక్లేదంబున నుచ్ఛిష్టులై భ్రాంతులగుదురో వార లున్మాదు లనంబడుదురు. అన్నంబు భుజించువానిఁగాఁ దన్ను భావించు భగవంతుండైన యజుండు సాధ్యగణంబులఁ బితృగణంబులఁ బరోక్షంబున సృజించె. వా రాత్మసృష్టికారణభూతంబగు నా యదృశ్యకాయంబును బొందిరి. ఈసాధ్య పితృగణంబులకు కర్మకోవిదులు శ్రాద్ధాదిహవ్యకవ్యంబుల నొసంగ నదృశ్యరూపంబున వారు గ్రహింతురు. సిద్ధవిద్యాధరులనుగూడఁ దిరోధానరూపంబున బ్రహ్మ సృజించె. వారికి నంతర్ధానాఖ్యంబును నద్భుతంబునగు నయ్యాత్మ నొసంగె. మఱియు బ్రహ్మ కిన్నరకింపురుషులను, బ్రతిబింబరూపంబున సృజించె. వారాత్మయందాత్మను బ్రతిబింబంబుగాఁ జూచుచుఁ బరమేష్ఠిత్యక్తంబైన యా ప్రతిబింబరూపంబును గ్రహించిరి. వారు మిథునీభూతులై ప్రాతఃకాలంబున నా పరబ్రహ్మగీతంబులు గానము సేయుచుందురు. మఱియు విధాత భోగవంతంబగు దేహంబునఁ బెక్కుచింతలం బవ్వళించియుండి యనుపచితంబైన సర్గంబునఁ గ్రోధంబునం జేసి యా శరీరంబు విడిచె. అందుండి రాలిన రోమంబు లహిరూపంబులఁ బ్రభవనంబులయ్యె. పాదాద్యాకుంచనంబుల సర్పంబులును, నతివేగవంతంబులై ఫణంబులు నురుకంధరంబులుగల క్రూరనాగంబులును జనించె. అంత నాత్మభవుండు కృతకృత్యునిఁగాఁ దన్ను భావించుకొనియె. అంతమున మనస్సుచే లోకభావనులైన మనువుల

సృజించి వారికై పురుషరూపంబైన యాత్మశరీరంబు నొసంగె. "అహో! జగత్స్రష్ట వగు నీచే సుకృతంబు చేయంబడియె. ఏ మనుసృష్టివలన తపోవిద్యాయోగసమాధి యుక్తులమై మేమన్నంబు భుజింతుమో యెం దగ్నిహోత్రాది క్రియ లుప్పతిల్లునో యట్టి లోకభావనంబగు మనుసర్గంబు నీచే గావింపఁబడియె" నని వారిం జూచి పూర్వసృష్టులైనవారు ప్రజాపతినిఁ బ్రశంసించిరి. అంత నాదిఋషియైన బ్రహ్మ స్వవశేంద్రియుండగుచు ఋషిప్రజలను సృజించి వారికి నొక్కొక్కటిగ సమాధి, యోగ, వృద్ధి, తపో, విద్యా, విరక్తుల స్వదేహాంశంబుల నొసంగె నని మైత్రేయుంజూచి విదురుండిట్లనియె. 530

---

## అధ్యాయము 21.

### కపిలోపాఖ్యానము - కర్దమ దేవహూతి వివాహసూచన

విదురుఁడు :—

క. స్వాయంభువమనువంశము, ధీయుతసమ్మతము నాకుఁ దెలియఁబలుకు మై
త్రేయా! యెట మైథునమున, నీయఖిల ప్రజయును జనియించెనో దానిన్. 531

గీ. మాన్యుఁడైన స్వాయంభువమనువునకును, దనయులైన ప్రియవ్రతోత్తానపాదు
లుచితరీతి సప్తద్వీపయుక్తమైన, ధరణినేలిరిగా యథార్థధర్మముగను. 532

సీ. ఆ మనుపుత్రికయగు దేవహూతి ప్ర, జాపతి కర్దము జాయయయ్యె
నని నీవు దెలుపంగ వినియుంటి సమ్మహా, యోగిపుంగవుఁడును యోగలక్ష
ణోపేతయగు దేవహూతియందెన్నివి, ధములను దనదు వీర్యముసృజించె
భగవంతుఁడగు రుచి బ్రహ్మసుతుండగు, దక్షుండు నలమనుతనయలైన

గీ. యట్టి యాకూతియుఁ బ్రసూతియాత్మజాయ, లగుచుఁ దనరంగ నేరీతినఖిలభూత
రాజి సృజియించె నదియెల్లరహివినంగ, మదిఁ దలఁచు నాకుఁ దెల్పు బ్రహ్మ
స్వరూప! 533

మైత్రేయుఁడు :—

సీ. బ్రహ్మదేవునిచేత భగవంతుఁడగుకర్ద, ముఁడు ప్రజాసృష్టికై మునునియుక్తుఁ
డగుచుఁ జేసె దశసహస్రహాయనములు, తపము సరస్వతీతటమునందు
నా తపశ్చర్య సమాధియుక్తంబగు, క్రియయుతపూజాపరికారమునను
హరినిఁ బ్రసన్నునఁనాబ్జుని జగదీశుఁ, బురుషోత్తమునిఁ గర్దముండు పొందె

గీ. సుప్రసన్నుఁడు భగవంతుఁడప్రమేయుఁ, డబ్జనేత్రుఁడు కృతయుగమందు విదుర!
పరమమైన శాబ్దబ్రహ్మవపువుఁదాల్చి, కర్దమప్రజాపతికి సాక్షాత్కరించె. 534

సీ. ధవళపద్మోత్పలదాము సుస్నిగ్ధనీ, లాలకకలితాననాభిరాము
శంఖచక్రగదాదిసాధనోపేతుఁ గుం, డలకిరీటాది మండనసమేతు
శ్రీమ దురస్థ్సితశ్రీకు సజ్జనహృద, యాహ్లాదకర సుస్మితావలోకుఁ
బ్రకటిత సత్త్వగుణకదంబు మేఖలా, పీతకౌశేయ శోభిత నితంబు

గీ. కౌస్తుభమణివిరాజితకంబుకంఠు, వైనతేయాంసవిన్యస్తపాదపద్ము
నంతరిక్షస్థితున్ మహితార్కతేజుఁ, గమలనాభునిఁ గాంచెనా కర్దముండు. 535

గీ. కాంచి సంజాతహర్షుఁడై కర్దమప్ర, జాపతి సులబ్ధకాముఁడై సాగిలఁబడి
ప్రీతిపూరితదృక్కులఁ జేతులొగ్గి, దివ్యవాక్కుల నిట్లు స్తుతింపఁ దొడఁగె. 536

కర్దముఁడు :—

గీ. అఖిలసత్త్వరాశివగు నీయమలదర్శ, నమున సాఫల్యమందె నానయనయుగళ
మంతకంతకు శ్రేష్ఠమ్ములగు జనుః ప, రంపరల మునుల్ నీదుదర్శనమొనర్తు. 537

మ. భవపాథోనిధి పోతమైతనరు నీపాదారవిందంబుఁ దా
రవివేకుల్ భజియించుచుండెదరు మాయామోహితస్వాంతులై
యవనిం గామలవార్థ మో వరద! నీవాయాయికామంబులన్
మిపులంగా నిరయస్థులౌ జనుల కీనింగూర్తుగాదే ప్రభూ! 538

గీ. అయిననేను దుర్భావుఁడనై సమాన, శీల గృహమేధధేనువ శేషమూల
యగుసతినిఁ గోరి కామదుఘావనిజుఁడ, వైననీయడ్డఁ జేరితినంబుజాక్ష! 539

శా. ఈ విశ్వంబు ప్రకామకామహతమైయీశా! ప్రజానేతవౌ
నీ వాక్తంత్రి నిబద్ధమౌనట గదా నేనట్లె ధర్మాత్మకా!
యీ విశ్వానుగతుండనై బలిని నీకేప్రొద్దు నర్పింతు నో
దేవా! కాలమయస్వరూప! యనువర్తింతున్ త్వదీయాజ్ఞలన్. 540

సీ. లోకజాలంబునులోకానుగతపశు, కోటులవిడిచి భక్తులుచెలంగి
త్వద్గుణకథనసుధారసాస్వాదనా, ధఃకృతప్రథుదేహధర్ములగుచుఁ
ద్వచ్చరణాతపత్రముఁ గాంతు రక్షర, భ్రమియుఁ బ్రమోదశాకరంబు మఱియు
విశదమష్ట్యుత్తరత్రిశతదివారాత్రి, పర్వంబు షణ్ణేమి బహుళపత్ర

గీ. మధికవేగంబును ద్రినాభియైననీదు, కాలచక్రము సకలలోకముల యాయు
వును గొనుచుఁ బర్విలిడి వడిఁబోవునీదు, భక్తకోటియాయువుదక్క పరమపురుష!

చ. భువనసిసృక్ష నో పరమపూరుష! యొక్కఁడవయ్యు నాత్మనం
భవపృథుయోగమాయమహిమన్ నిజశక్తులుఁ బూని యూర్ణనా

భవమునన్ సృజింతు వోగిఁ బెంతు లయం బొనరింతుగాదె యీ
భువనచయంబు దేవముని ముఖ్యులెఱుంగరు నీ వినోదముల్. 542

మైత్రేయుఁడు:—

చ. అమలవచోమృతంబున మహాత్ముఁడు కర్దముఁ డిట్లు తన్నుఁ బ్రి
జ్ఞమెయి స్తుతింప నక్కమలనాభుఁడుఁ దాను సుపర్ణు నంసభా
గమున వెలుంగుచుండి కడకన్నులఁ బ్రేమరసంబు తొట్రిలన్
విమల శుచిస్మితుండగుచు వేడుక నిట్లని పల్కె నత్తఱిన్. 543

శ్రీభగవానుఁడు:—

ఉ. దేనినిఁ గోరి యాత్మనియతిన్ నను నర్థి భజించినాఁడవో
మానివరేణ్య! నీవిమలమానసభావ మెఱింగి మున్నె య
ద్దానినిఁ గూర్చియుంటి నిరతంబు ననున్ భజియించువారి కే
దేనియు వమ్ముగాదు తదభీష్టము నీ కిఁకఁ జెప్ప నేటికిన్. 544

మ. సువిచారోన్నతుఁడుం బ్రజాపతితనూజుండున్ సదాచారవై
భవసంపన్నుఁడునైన శ్రీమనువు సప్తాంభోధిసంయుక్తమౌ
యవనిం బాలనఁ జేయుచుండె నల బ్రహ్మావర్తమందుండి యా
దివిజవ్రాతము లెల్ల స్వీయవిలసద్ధీయుక్తికిన్ మెచ్చఁగన్. 545

గీ. విప్రరాజర్షిధర్మకోవిదుఁడునైన, మనువు సమ్రాట్టు తనపట్టమహిషియై త
నర్చు శతరూపతోఁ గూడి పేర్చి నిన్నుఁ, గానఁగా నేఁట రేపటఁ దానెవచ్చు. 546

క. రూపానురూపసుగుణక, లాపవయశ్శీల సుభగలక్షణయుత నీ
లాపాంగకలిత సుతను, ర్వీపతి నీకొసఁగుఁ బతిగవేషణ నిరతన్. 547

చ. నిలిచె సమాధియుక్తమతి నీహృదయం బనురూపపత్నినిన్
దలఁచుచు నింతకాలమును దాన నృపాత్మజ నిన్ను భక్తిదో
హలమగుబుద్ధితోఁ గొలుచు నాత్మభృతంబయియొప్పు నీ సమి
ద్ధలలితవీర్యమున్ నవవిధంబులుఁగాఁ బ్రసవించు నామెయున్. 548

గీ. స్తవ్యభవదీయవీర్య సంజాతలైన, కన్యలందు మహర్షిపుంగవులు గ్రమత
సుతులఁ బుట్టింతు రీవును శుద్ధసత్వ, యుతుఁడవై మా నిదేశంబునోలి నెఱపు.

ఉ. జీవగణంబులందుఁ గృపఁ జేసి సదా యభయం బొసంగుచున్
నీవు సమస్త కర్మములు నిశ్చలబుద్ధి మదర్పితంబుగా
వావిరిఁ జేసి పొందుదువ వశ్యము నన్నును విప్రవర్య! నీ
పావనసచ్చరిత్రము శుభంబు జగత్త్రయకీర్తనీయమౌ. 550

క. నాయందు జగములీవును, నీయందున్ మౌనివర్య! నేను ననిశమున్
బాయక యుండుదు మనుచున్, నీయెడఁ దలంచుచుండు నిశ్శంకముగన్. 551

చ. అమరఁ ద్వదీయవీర్యమున నార్య! భవత్సతిదేవహూతిగ
ర్భమునను మత్కళాంశమునఁ బ్రాభవమొప్ప జనించినేను ద
త్త్వమహిత సంహితం దెలియఁ బల్కెదునం చనియిష్టప్రీతిఁ గ
ర్దమున కెఱుంగఁ జెప్పె సముదంచితలీలల నారమేశుఁడున్. 552

చ. విమలసరస్వతీ ప్రవృతబిందుసరంబుననుండి తన్నుఁ గ
ర్దమముని కాంచుచుండ ఘనతాపససంస్తుత సిద్ధమార్గుఁడై
తము విహగాధినాథు గరుదంచలసంజనితోరుసామనా
దము వినుచున్ జనార్దనుఁడు తాను దిరోహితుఁడయ్యె నయ్యెడన్. 553

మ. అనువొప్పన్ సకళత్రుఁడై మనువు దీవ్యత్కాంచనస్యందనం
బునఁ గూర్చుండి సుభాగ్యలక్షణయుతన్ బుత్రిన్ బ్రమోదంబునన్
దనవెంటం గొని తోడితెచ్చుచు మహాధాత్రీతలం బెల్ల జ
య్యనఁ దా గ్రుమ్మరుచుండి బిందుసరమొయ్యం జేరె సంతుష్టుఁడై. 554

మ. హరినిర్దిష్ట దినంబునన్ మనువు శాంతాత్ముండు సన్మౌనిశే
ఖరుఁడౌ కర్దము నాశ్రమస్థలమెదన్ గౌతూహలంబొప్పఁ జొ
చ్చె రమేశుం డటఁ గాదె కర్దమతపస్విం గాంచి కన్నుంగవన్
గురియించెం బ్రమదాశ్రుబిందువుల ముదన్మోదంబు సంధిల్లగన్. 555

చ. అదియ శివామృతాంబువు మహర్షివితానసుసేవితంబు భ
ద్రదము సరస్వతీపరివృతంబును బుణ్యమునై తనర్చుచున్
హృదికి నపారమోదమునిచ్చుచు బిందుసరంబు నాఁగడుం
బొదలె విరించిముఖ్య సురముఖ్యులు మెచ్చఁగ నాటినుండియున్. 556

ఉ. పుణ్యమృగంబులున్ విహగముల్ విరుతంబులు సేయ నొప్పు న
త్పుణ్య తరువ్రజంబులఁ బ్రభూత లతానిచయంబులన్ గడున్.
గణ్యతఁ గాంచి మోద మొనఁగన్ సకలర్తు ఫలప్రసూన సా
ద్గుణ్యలసద్వనాళిరమతోడుత బిందుసరంబు భాసిలున్. 557

క. మత్తద్విజసంకులమును, మత్తేందిందిరసువిభ్రమవిశోభితమున్
మత్తపికరావకలితము, మత్తశిఖిసునాట్యభంగిమాన్వితమునగున్. 558

చ. లలితకదంబనింబవకుళ క్రముకార్జున నారికేళ వం
జులకదళీశిరీషనవచూత లవంగ కరంజ కుంద పా

టల కరవీర చందన వటద్రుమశాల్మలి కోవిదారమం
జుల తరమాచు నొప్పెనది చూపఱ డెందము కందళింపగన్. 559

క. కారండవ హంసప్లవ,సారస బక చక్రవాకజలకుక్కుట వి
స్తారకురరీ కపోత చ,కోర మయూరగణవల్గుకూజితయుతమున్. 560

క. హరిణ క్రోడగవయ వా,నర గోపుచ్ఛప్లవంగనాభి సకుల కుం
జరశల్యక ముఖజంతు వి,సరయుక్తమునగుచు బిందుసరము వెలుంగున్. 561

గీ. అనుచరసమేతుఁడగుచు నాయాదిరాజు, విమలతీర్థరాజంబగుబిందుసరము
నొయ్యనంజొచ్చి మునివర్యుహుతహుతవహు,ధన్యజన్ము నాసీనుఁ గర్దమునిగాంచె

క. సుచిరోగ్రతపోయుక్తిన్, రుచిరతనుం డతఁడు శ్రీవరుని దృగ్జ్యోత్స్నా
నిచితుండగుటను భగవత్, వచనామృతపానమునను వాడకయుండెన్. 563

గీ. జటిలుడుం బద్మపత్రలోచనుఁడు ప్రాంశు,తనుఁడు నురువల్కలాంబరధారియునయి
యయ్యెడన్ సాననిడని యనర్ఘరత్న, మట్లుమలినతఁ గర్దముఁడలరుచుండె. 564

ఉ. అంతటఁ గర్దముండు తనయాశ్రమభాగముఁ జేరి మేదినీ
కాంతుఁడు భక్తిమైఁ బదయుగంబుపయిం బ్రణతుండుకాఁగ సు
స్వాంతునిఁజేసి దీవెనల భావము రంజిలఁ జేసి యప్పుడ
త్యంతము సత్కరించెను దదర్హసపర్యల నాచరించుచున్. 565

గీ. స్వీకృతసపర్యుఁడగుచు నాసీనుఁడైన, సంయుతాత్ముని మనువు సమ్మదమునఁ
దనిపి భగవదాదేశంబు తలఁచికొనుచు, మధురవాక్కుల నీక్రియం బలికె మౌని.

కర్దముఁడు:—

ఉ. కారణరూపుఁడౌ హరి జగత్పరిపాలకశక్తివౌటచే
క్ష్మారమణాగ్రగణ్య! యల సజ్జనరక్షణ దుష్టశిక్షణల్
పేరిమిఁ జేయుపొంటెఁ బృథివిం జరియించుచునుందుగాదె యే
ధీరునకేని నచ్చెరువు దెల్పునుగా భవదీయ కృత్యముల్. 567

క. తరణి సుధాకర పావక, వరుణేంద్ర పరేతరాజవాయ్వాత్మకభా
సురరూపంబులఁ దాల్చుచుఁ, బరఁగెదు నీకునివె నాదు వందనశతముల్. 568

ఉ. ఆదినృపాలకా! మణిగణాంచిత చైత్రరథంబు నెక్కి యా
సాదితచండచాపమున సర్వజనంబుల నాంక్షఁ బెట్టుచున్
మేదిని పై న్యఘట్టనల మేరకుఁ గంపముఁ జెంద నీగతిన్
భూదయితా! చరింతుగద పోడిమిఁ జండగభస్తికైవడిన్. 569

ఉ. పాటవమొప్ప నీవిటులు పర్యటనంబొనరింపకున్న డ
బ్బాటుగ విశ్వమందు భగవద్రచితాఖిలధర్మసేతువుల్
చేటును బొందు దస్యుతతిచేతను వర్ణములాశ్రమంబులున్
నూటగు తన్నిబంధనలచొప్పులు తప్పి వినాశమొందెడున్. 570

చ. క్షితివర! నీవు నిశ్చలతఁజెంద నధర్మము వృద్ధిఁ బొందు దు
ర్మతులు నిరంకుశాత్ములగు మానవకోటులచేత లోకమున్
వెతఁగొను దస్యుసంతతినిపీడితమౌను నిరంతరం బనిం
దితచరితా! జగంబునకు నీవ నియంతవు కావె యారయన్. 571

చ. అడిగెద నిన్ను నొక్క విషయం బటులయ్యును నీవు దేవ యీ
యెడ కిపు డేగుదెంచుటకు నేమి నిమిత్తము దెల్పుమయ్య! యే
ర్పడ భవదీయవాంఛిత మవశ్యముఁదీర్పఁగ నెమ్మనమ్మునం
దొడఁబడియున్నవారము నయోజ్జ్వలరూప! యథార్థమింతయున్. 572

---

## అధ్యాయము 22.

### కర్దమ దేవహూతి వివాహము

మైత్రేయుఁడు :—

క. అనియిట్టులు ముని ప్రకటిం, చిన నిజగుణకర్మగణవిశేషము విని య
మ్మనువు సలజ్జుఁడువలె న, మ్మునిని నివృత్తిపరుఁ గాంచి ముదమున ననియెన్. 573

మనువు :—

క. తోయజభవుఁడు తపోవి, ద్యాయోగయుతుల నలోలుపాత్ముల మిము నా
మ్నాయప్రవర్తనమునకు, నై యాత్మముఖంబునుండి యర్థిసృజించెన్. 574

గీ. తత్పరిత్రాణమునకునై ధాత తనదు, బాహువులనుండి మమ్ము నేర్పడసృజించె
తద్విదులు బ్రహ్మజాతి హృదయమనియును, క్షత్రజాతి యంగంబని కాదె యంద్రు. 575

క. అజసృష్టబ్రహ్మక్షా, త్రజాతు లన్యోన్యముఁదము రక్షించుకొనున్
త్రిజగన్మయుఁడైన యధో, క్షజుఁ డవ్యయుఁడరసి ప్రోచు నారెండింటిన్. 576

మ. భగవంతుండు తనంత నీజగము గాపాడంగఁ గాంక్షించు నీ
కు గతాఘంబగు ధర్మముం దెలిపె నక్షుద్రప్రభావాఢ్య! మీ
దగు సందర్శనభాగ్య మబ్బుటను నాకదా సంశయవ్యూహమె
ల్ల గతంబయ్యెఁ గృతార్థతం బడసితిన్ లాభంబునున్ జేకురెన్. 577

క. అవశీకృతాత్ములకును దు, రవగముఁడవు నీవు నాకు నగపడితివి భా
గ్యవశత నీపాదరజో, లవము శివప్రదము నాతలం దాలిచితిన్. 578

క. అనుశాసింపంబడితిని, మునిచంద్రమ! నాదు భాగ్యమున ధన్యుఁడనై
తిని నీమధురోక్తులు వి, ష్పిన కర్ణాంజలులఁ గ్రోలి ప్రీతింగంటిన్. 579

గీ. దుహితృవాత్సల్యగరిమ దోదూయమాన, మానసుండను దీనుండనైన నాదు
విన్నపము నాలకింపు మో విప్రముఖ్య!, కర్దమప్రజాపతి! యనుకంపవాఁడమ. 580

గీ. తాపసేంద్ర! ప్రియవ్రతోత్తానపాదు, లకునుఁ జెలియలు నాకుఁ దల్లంప దుహిత
రూప శీల గుణ వయోనురూపుఁడగుచు, నొప్పు పతినిగ వేపించుచుండె నీపె. 581

ఉ. బాలగుణాలవాల యిదితత్వ్రచ్ఛితరూపవయోగుణంబులున్
శీలము మున్న నారదునిచే విని నిన్న వరింప నెంచె నీ
వీ లలనన్ సులక్షణ గ్రహింపు మొసంగెద శ్రద్ధ నీమె నే
కాలమునందు నీకు గృహకార్యములం దనుకూలయయ్యెడున్. 582

గీ. ఎందు నిర్ముక్తసంగునకేనిఁ బరిభ, వింపఁజనదు స్వతఃప్రాప్తవిషయమమతి
కామరక్తునికిఁక బలుకంగవలెనె, తప్పక గ్రహింపవలయు నాతండు దాని. 583

గీ. ఆదరింప కెవఁడు స్వతఃప్రాప్తవిషయ, మర్థిమైఁ గృపణాత్మునిసనుగఁ జూచు
భూతలవ్యాప్తమైన తద్భూరియశము, ణంగు మఱియు నవజ్ఞఁ దన్మానముఁ జెడు.

చ. నిను వినియుంటి నే మును మునిప్రవరా! మది నీవు పాణిపీ
డనవిధికై నయంబునఁ గడంగితి వంచని యట్లుగాన మ
త్తనయను మత్సమర్పితను దప్పక కైకొనుమయ్య నీదు నె
మ్మనమునఁ బ్రీతి నెక్కొనఁగ మాకుపకారము సేయుమిక్రియన్. 585

ఋషి :—

గీ. నీదుహిత యప్రదత్తయే నేనుగూడ, నిప్పుడు పెండిలియాడఁగా నెంచుచుంటి
బాగు! మా యిరువుర కార్యపరిణయవిధి, యెంత యే ననురూపమై యొసక మొసఁగు.

ఉ. ఓనరదేవచంద్ర! విగమోక్తవిధిన్ మిగులం బ్రసిద్ధమా
మానితకామమే పొడమ మన్ననఁ బొందుత నీకుమారి నె
మ్మేని బెడంగుచేఁ జెలువు మీఱుచు లక్ష్మి నిమించునట్టి యీ
చానను గౌరవింపక రసజ్ఞుఁడెవండు తిరస్కరించెడున్. 587

మ. హృదయాహ్లాదకరంబుగాఁ గ్వాణదంఘ్రి శ్రీకమై విభ్రమా
స్పదమౌ కందుకమందు దృష్టి నిగుడం బ్రాసాదపృష్ఠంబునన్

ముదమొప్పారఁగ నాఁడ యాసతిని సత్ప్రేమాంబునంజూచి దీ
ప్తి దొలంగంబడియెన్ విమానగతుఁడౌ విశ్వావసుం డుర్విపైన్. 588

ఉ. శ్రీలలనాపదార్చకులు చేరి కనుంగొనరానిసాధ్వి స
చ్ఛీలసమేత యుచ్చపదు చెల్లెలు నా మనురాజపుత్రి నీ
యాలలనాలలామను దనంతన చేరిన భాగ్యరాశిసన్
బాలను గైకొనం బుధుఁ డెవం డొడఁబాటును బొందకుండెడున్. 589

ఉ. కావున నీసతీమణినిఁ గైకొనుదున్ సమయంబుతోడ నో
భూవరమౌళి! మామకవపుశ్చ్యుతతేజముఁ దాల్చునంతఁ దా
కీ వనజాక్షిఁ గూడి చరియింతును బిమ్మటఁ బూనువాఁడ నా
శ్రీవిభుసూక్తముల్ శమపరీవృతపారమహంస్యధర్మముల్. 590

ఉ. ఎవ్వనిచే విచిత్రమగు నీజగముప్పతిలున్ వివృద్ధమై
నివ్వటిలుం దుదిం జెడు వినిర్మలమూర్తి ప్రజాపతీశ్వరుం
డవ్విభుఁ డాదిపూరుషుఁ డనంతవిలాసుఁడు దేవదేవుఁడే
యెవ్విధిఁ గన్న నాకతిచరింపఁగరాని ప్రమాణమయ్యెడున్. 591

గీ. ఇంతమాత్రమె పల్కి యోగీశ్వరుండు, బుద్ధియందుఁ బంకేజనాభునిఁ దలఁచుచు
ధృతియలర మిన్నకుండెను దేవహూతి, భావముప్పొంగఁ దత్స్మేరవదనముఁ గని.

ఉ. ఆదినృపాలకప్రవరుఁ డా మనువున్ నయమొప్పఁగా స్వప
త్నీదుహితృస్ఫుటవ్యవసితిన్ గ్రహియించి గుణోత్కరాఢ్యుఁడున్
మోదయుతుండునై న మునిముఖ్యున కత్యనురూపకన్యకన్
సాదరబుద్ధితోడుత నొసంగెఁ బ్రహర్షితభవ్యచిత్తుఁడై. 593

గీ. ఆమహారాజ్ఞి శతరూప యల్లునకును, గూఁతునకు నిచ్చె నెంతయుఁ బ్రీతితోడ
వివిధభూషణాంబరమహావిత్తములను, వరవధూవరోచితపారిబర్హములను. 594

మ. మనుసమ్రాట్టనురూపుఁడౌ వరునకున్ మర్యాదగా నాత్మనం
దన నర్పించి గతవ్యథుండగుచు నుద్యద్బాహులన్ దేవహూ
తినిఁ దాఁ గౌఁగిటఁ జేర్చి ధీరుఁడయినన్ దీనత్వముం గైకొనెన్
గనియుం బెంచినయట్టి స్నేహము మదిన్ గారింప నుత్కంఠుఁడై. 595

చ. దుహితృవియోగజన్యమగు దుఃఖము నోర్వఁగరామిచే ముహు
ర్ముహురుపపన్నబాష్పజలపూరమునన్ సువివాహలక్షణా
వహయగు దేవహూతి మదబంభరనీలశిరోజజాలమున్
రహిఁ దడిపెన్ మనుప్రభువు 'రా జననీ!' యని బుజ్జగించుచున్. 596

మ. జనవంద్యుండగు నార్యకర్దము ననుజ్ఞం జేసి వీడ్కోలు వొం
ది నృపశ్రేష్ఠుఁడు సానుగుండును సపత్నీకుండునై కాంచనా
ఢ్యనిజస్యందన మెక్కి స్వీయమగు బ్రహ్మావర్తముం జేర నొ
య్యనఁ దాఁ బ్రస్థితుఁడయ్యెఁ గన్గొనుచు నందా యా విశేషంబులన్. 597

గీ. ఋషికులోపేతమై తేజరిల్లు నా స, రస్వతీనది యుభయతీరంబులందుఁ
బెంపుమీఱు ఋష్యాశ్రమసంపదలను, బ్రీతిఁ దిలకించుచేగె నీరీతి మనువు. 598

క. ఈవిధమునఁ జనుదెంచు ప్ర, జావల్లభుఁ దెలిసి యలప్రజావళియును బ్ర
హ్మావర్తమునుండి యెదురు, గా వెడలిరి గీతవాద్యగతులు సెలంగన్. 599

గీ. తనశరీరము విద్రుచు సుభాసురవరాహ, రూపుఁడైనట్టి శ్రీహరిరోమరాజి
పడియె నెచ్చోట సర్వసంపత్సమగ్ర, మగుపురి యది బర్హిష్మతియనఁగఁబరఁగె.

సీ. ఆరోమములె నిత్యహరితవర్ణములగు, కుశకాశవితతులై కొమరుమిగిలె
నవ్వానిఁ గొనిఋషుల్ యజ్ఞవిఘాతుక, రాక్షసాదులను బరాభవించి
యజ్ఞేశుయజియింతు రాకుశకాశాత్మ, కంబగు బర్హిస్సుఁ గైకొనికదె
యజ్ఞపూరుషు భక్తి యజియించిభూస్థాన, మందెను భగవంతుఁడైనమనువు
గీ. నట్టిబర్హిష్మతీవిమలాఖ్యపురిని, జొచ్చి స్వాయంభువుండు ప్రస్తూయమానుఁ
డగుచుఁ దాపత్రయాపహమైనతనదు, భవనమునఁ బ్రవేశించె వైభవముతోడ.

శా. ఆ యాదిక్షితిపాలకుండు మను వట్లన్యావిరోధంబుగా
జాయాపత్యసమేతుఁడౌచుఁ బడసెన్ స్వాభీష్టకామ్యంబులన్
స్త్రీయుక్తుల్ సురగాయకుల్ నిజయశశ్శ్రీసంపదన్ గానముల్
సేయన్ ఱేపకడన్ ముకుందునికథల్ చెల్వొప్ప నాలించుచున్. 602

మ. వనజాతాక్షుని భక్తుఁడై యొసఁగు నా స్వాయంభువాభిఖ్యుఁడౌ
మను వీభంగి వివిక్తభోగరచనామగ్నాత్ముఁడుం బోలె ను
న్నను శ్రీ విష్ణునిభక్తినుండి యతనిన్ భ్రంశంబుగావింప నే
రనివై యుండె సమస్తభోగములు ధీరస్వాంతుఁడై యుండుటన్. 603

సీ. విష్ణుదేవునికథల్ వినుచు ధ్యానించుచుఁ, బలుకుచు మురియుచుఁ జెలఁగెడు మను
ధరణీశ్వరునకు స్వాంతరయాపనములుగా, యామమ్ములనయాతయామములయి
జరిగె నీగతి నేకసప్తతియుగములు, స్వాంతరంబును గేశవప్రసక్తి
పరిభూతజాగరస్వప్నసుషుప్తిగ, తిత్రయుండగుచు శక్తి మెయిఁ గడపె
గీ. మాన్య! విదుర! దైహికములు మానసములు
దివ్యములు మానుషములు భౌతికములునగు

క్లేశసంఘాతములు పరికించి చూడ
విష్ణు సంశ్రితులను బాధపెట్టగలవె ? 604

గీ. నరులవర్ణాశ్రమములనానావిధశుభ, ధర్మములుఁ దెల్పె నాసర్వధర్మవిదుఁడు
మునులడుఁగఁగ స్వాయంభువభూవిభుండు, సర్వభూతహితుండయి సంతతంబు.

గీ. ఆదిరాజయియొప్పు స్వాయంభువమను, విభునియద్భుతచరితంబువిదుర ! నీకుఁ
దెల్పితిని జుమ్మియింకపైఁ దెల్పువాఁడ, ననఘమైనతత్సంతతియభ్యుదయము.

---

## అ ధ్యా య ము 23.

### కర్దమదేవహూతి విమాన విహారము

మైత్రేయుఁడు:—

క. జననీజనకులు తన్నట,నునిచి చనఁగ సాధ్వి దేవహూతి యనిశమున్
దనపతియింగితమెఱుఁగుచు, నొనరించెం బూజ భవుని నుమయుంబోలెన్. 607

గీ. ప్రకటవిశ్వాసమున గౌరవంబుచేత, శమదమాదుల శుశ్రూషసౌహృదమున
సరసవాక్కుల నాత్మశౌచంబుతోడఁ, బతికిఁబరిచర్యఁజేసె నాపరమసాధ్వి. 608

గీ. కామమును లోభముమదంబుఁగపటవృత్తి, విధినిషిద్ధాచరణమును విడిచి యిట్లు
ధృతియలర నప్రమత్తయై దేవహూతి, ప్రకటతేజుని సంతృప్తిపఱచెఁ బతిని.

శా. ఆ దేవర్షి వరుండు కర్దముఁడు నిత్యానువ్రతన్ మానవిన్
శ్రీ దైవంబునుమీఱఁజాలు తన యాశీస్సున్ మదిం గోరుచున్
మోదంబొప్ప సపర్యఁ జేసెడు సతింబుణ్యవ్రతాచార చ
ర్యాదీక్షాపరికర్శితాంగిఁ గని నెయ్యంబొప్పఁ దా నిట్లనెన్. 610

కర్దముఁడు:—

మ. పరితుష్టాత్ముఁడనైతి మానిని! కడున్భవ్యాత్మవై యొప్పు నీ
వరశుశ్రూషలచేత నిమ్మపటమైవర్తిల్లు నీ భక్తిచేన్
తరుణీ! నిత్యము దేహధారులకు నత్యంతేష్టమా మేను మ
త్పరిచర్యావశతం గృశింప మదిలోఁ బాటింప వా క్లేశమున్. 611

సీ. సరసిజాక్షి స్వధర్మనిరతుండనైన నే,నధికతరతపస్సమాధి విద్య
లందు నేకాగ్రత యలరంగ నే భగ, వత్ప్రసాదంబులు వడసినాఁడ
రమణిరో! భయశోకరహితంబులగుచు మ,త్పరిచర్యలన్ భవద్వశ్యములయి
పరఁగెడునాదివ్యభగవత్ప్రసాదముల్, నెఱి విలోకింపుము నీకునిపుడె

గీ. దివ్యదృష్టి నొసంగెద దేవహూతి!, యితరభోగముల్ తుచ్ఛము లెంచి చూడఁ
బరమపావనచిత్తవై పరఁగుచున్కి, నీకు నవి గోచరంబగు నిక్కువంబు. 612

మ. విమలాత్ముండగు శ్రీరమేశు భ్రుకుటీ విక్షేపవిభ్రంశితా
ర్థములౌ తుచ్ఛతరాన్యభోగముల సుంతైనన్ ఫలం బున్నె? ద
ర్పమునన్ రాజులమంచు నెంచు నరులుం బ్రాపింపఁగారాని ది
వ్యములైనట్టి స్వధర్మలబ్ధవిభవ వ్రాతంబులం బొందుమా. 613

ఉ. ఈగతిఁ బ్రీతిఁ బల్కెడుము నీంద్రునిఁ గర్దము సర్వయోగమా
యాగురువిద్యలన్ నిపుణుఁ డై వెలుగొందెడువాని నాథునిన్
బాగుగఁ జూచి యత్తఱిని బ్రశ్రయ సుప్రణయాఢ్యవాక్కులన్
దా గతచింతయై పలికెఁ దన్వి త్రపాదృగుదంచితాస్యయై. 614

దేవహూతి:—

సీ. అవితథయోగమాయాధిపుఁడవు ద్విజోత్తమ యిదియెల్లను దలఁచిచూడ
నీయందు సిద్ధంబ నేనదియెఱుఁగుదు, జీవితేశ్వర! మున్ను చేసియుంటి
సమయంబు మద్గర్భ సంభవపర్యంత, మంగసంగమమని యట్లుగాన
శ్రేష్ఠుఁడౌ భర్తచేఁ జెలువగు ప్రసవంబు, సతులకుఁ గల్గుట యతిగుణమగు
గీ. దాన నితికృత్యమును దెల్పు మానినాథ, ! సదుపదేశపూర్వక వాక్య సరణినాకుఁ
ద్వత్కృతమనోభవాగ్ని దగ్ధనయియుంట, సంగమేచ్ఛల నాతనువుం గృశించె.

మైత్రేయుఁడు:—

వ. అనియిట్లు దేవహూతి వేడినఁ గర్దముండు తన ప్రియకుం బ్రియంబు సేయంగోరి యోగ
మహిమం జేసి తత్క్షణంబ కామగమనంబుఁగల విమానంబు నావిర్భవింపం జేసె. ఆ
విమానరాజంబు సర్వకామప్రదంబును దివ్యంబును సర్వరత్న సమన్వితంబును,
సర్వాభ్యుదయోదర్క ఫలంబును మణిస్తంభగుంఫితంబును దివ్యపట్టికాపతాకాద్య
లంకృతంబును, సర్వకాల సుఖావహంబును, సమస్త పరికరోపేతంబును, విచిత్ర
మాల్యక షట్పదరుతయుత కుసుమ స్రగ్విలసితంబును దుకూలక్షౌమాది నానా
విధవస్త్రభూషితంబును, నుపర్యుపరిభాగవినిర్మిత నిలయంబును బృథక్పృథక్ఛ
య్యాస్తృతంబును బర్యంక వ్యజనాసన విభ్రాజితమును నందందు నిక్షిప్తములగు
నానాశిల్పంబుల శోభించునదియు మరకతస్థలియందు విద్రుమవేదికలం గూడి
నదియు ద్వారంబులం బవడంబుగడపల భాసిల్లునదియు వజ్రకవాటంబులు కల
దియు నింద్రనీల శిఖరంబుల సౌవర్ణ కుంభంబులు దాల్చినదియు స్ఫటికభిత్తి ఖచి
తంబులగు పద్మరాగోపలంబులఁ జక్షుష్మంతంబై వెలయునదియు మహార్హంబులగు

వింత మేల్కట్టుల బంగారుతోరణంబులఁ గూడినదియు రాయంచలుం బావు రంబులుం గృత్రిమమరాళపారావతంబుల స్వజాతీయములుగా భావించి యెక్కుచు దిగుచు నటనటఁ గూయుచుండఁ జెలంగునదియు, విహారస్థానంబుల విశ్రామ ప్రదేశంబులఁ బ్రాంగణంబుల సజిరభాగంబుల, సుఖానుభవ యోగ్యంబుగా నిర్మింపంబడి తనకుంగూడ విస్మయజనకంబై యొప్పుచుండఁ గర్దముఁడద్దాని దేవ హూతికిం జూపిన నా సాధ్వియు. 616

క. ఏతాదృగ్భవనంబును, నాతిప్రీతాత్మయై కనం గని నాతిన్
భూతాశయజ్ఞుఁడు గుణో, పేతుఁడు కర్దమమునీంద్రుఁడిట్లనిపలికెన్. 617

క. ఈ మడుగున మునుగుము సాధ్వీ! మఱి నీ వీ విమాన మెక్కుము పిదపన్
శ్రీమద్ధరితీర్థం బగు, నీ మడువును నరులకోర్కె లీడేర్పుఁజుమీ! 618

మ. అని యీభంగినిఁ బల్కు కర్దముని వాక్యంబున్ మదిం బూని యిం
పున సమ్మానిని ధూళిధూసరితమాకపుట్టంబు మాలిన్య మం
దిన మేనున్ శబలస్తనంబులును వేణీభూత కేశోత్కరం
బును గాఁబూతసరస్వతీ హ్రదజలంబుం జొచ్చె నిశ్శంకయై. 619

మ. తరుణీరత్న మిటుల్ సరోవరజలాంతర్భాగనిర్మగ్నయై
యరు దొప్పార సహస్రకన్యకల దివ్యాగార భాగస్థలన్
బరికెంచెన్ మఱి వార లందఱును లేఁబ్రాయంబునం గుల్కుచుం
డిరి నవోత్పలగంధులై యువతికోటీమాళి రత్నంబులై. 620

ఉ. వారును దేవహూతిఁగని ప్రాంజలులై వెస లేచి పల్కి రో
నీరజగంధి! మే మరయనీవరపుల్లము మమ్ముఁబంపు నీ
కోరినయట్టి కార్యములకుం గడు భక్తి నొనర్పువార మం
చా రమణీమణుల్ వివిధమా పరిచర్యలు చేసి రీగతిన్. 621

ఉ. మానవతీశిరోమణి నమన్ననమీఱఁ బ్రశస్తమంగళ
స్నానమొనర్పఁ జేసియును నవ్యతరాచ్ఛదుకూల వస్త్రముల్
పూనఁగఁ జేసియున్ రుచిరభూషలుదాల్పఁగఁ జేసియున్ సుధా
న్యూనతరాన్న పానములనున్ భుజియింపఁగఁ జేసిరా చెలుల్. 622

సీ. అమలంబు విమలాంబరాభిరామంబు విచిత్రమాల్యసగంధచితము శుభము
స్నాతంబు కృతశిరస్స్నానంబు సర్వాభరణభూషితంబు విరాజితంబు
కంకణయుతము నిష్కగ్రీవమును క్వణత్కాంచననూపురాభ్యంచితంబు
శ్రోణితటోపరిశోభిత బహురత్న, కాంచనకాంచీ సమంచితంబు

గీ. నైనతనువును దారహారాళితోడఁ, గమ్రసుస్నిగ్ధలసదపాంగములతోడ
నీలకుంతలములతోడ నెగడు మోముఁ, దాల్చి యొప్పెడు తనుఁ గాంచె దర్పణమున.

గీ. కాంచి ఋషివృషభుండగు కర్దమప్ర, జాపతిం బతిఁదలఁప నాసనమయమంద
స్త్రీజనసహస్రియు క్తయై దేవహూతి, యాతని సమక్షమందె యొప్పారుచుండె.

గీ. తన మనోహరుఁడైన కర్దమునిమ్రోల, స్త్రీసహస్రం బటు లనుసరించి కొలువఁ
గాంచి తద్యోగమహిమలఁ గడు వెఱఁగున, మనమున 'నిదేమి' యనుచు
సంశయముఁ జెందె. 625

ఉ. మానివరుండు కర్దముఁడు మక్కువ మీఱఁగఁ దాఁ గృతామల
స్నానను స్వీయరూపమును జక్కఁగఁ దాల్చినదానిఁ బ్రావృత
వ్యానకుచన్ సఖీజనసహస్రపరీవృతయైనదాని న
మ్మానినిఁ గూడి యంతట విమానము నెక్కెఁ బ్రభూతహర్షుఁడై. 626

శా. అందుం గర్దమమానిపుంగవుఁడు భార్యంగూడి విద్యాధరీ
బృందారాధితగాత్రుఁడై యల నభోవీధిస్థుఁడై కైరవా
నందాధిక్యము గల్గఁగా వెలుఁగుచుం దారేశుఁడై యొప్పు న
య్యిందుం డుంబలెఁ దేజరిల్లెఁ బ్రకటాహీనప్రభావాఢ్యుఁడై. 627

ఉ. కామసుహృత్సమీర సుభగమ్ములు నాక ధునీ నిపాత ని
త్యామల సుస్వనంబు లలయష్టదిగీశ విహార కేళికా
భూములు నా లసత్కనకభూధరరాజదరీస్థలంబులన్
బ్రేమను స్త్రీలతోడ విహరించెఁ గుబేరుఁడువోలె మానియున్. 628

గీ. ఘనము విభ్రాజమానము కామగంబు, నగు విమానరాజముతోడ నత్తపస్వి
యఖిలవైమానికశ్రేణి నతకరించె, లీల జగముల ననిలుపోలికఁ దిరుగుచు. 629

గీ. వ్యసనకర్శనమగు జగత్పతిచరణము, లెవరిచే భక్తిమెయి నాశ్రయింపఁబడును
ధీరచేతస్కులైన యాపూరుషులకుఁ, బొందరానిది కలదొక్కొ యెందు నేని. 630

గీ. ద్వీపవర్షాదిరచనచే దేవహూతి, కాత్మసతికి భూగోళము నంతయుఁ దగఁ
జూపి యాశ్చర్యరూపుఁడై తాపసేంద్రుఁ, డొగి నిజాశ్రమమునకుఁ దా మగిడివచ్చె.

గీ. సురతపర్యుత్సుకన్ మనుసుతను సతిని, నవవిధంబులుగాఁగఁ దన్ను విభజించి
తమి రమింపఁగఁ జేయుచుఁ దపసి పెక్కు, వత్సరములు ముహూర్తంబుపగిదిఁ గడపె.

గీ. ఆ విమానరాజంబునన్ దేవహూతి, రమ్యతరమును బ్రీతి కరంబునైన
సెజ్జఁ బ్రియుఁడగు పతితోడఁ జేరి యాత్మ, నించుకేనియుఁ గాలంబు నెఱుఁగకుండె.

ఉ. ఈగతి యోగభావమున నింపుమెయిన్ నవపుణ్యదంపతుల్
భోగపరాయణత్వమును బూని రమింపుచునున్న యంతలో
నేగెను నూఱువత్సరము లేర్పడఁ గర్దముఁ డుంచె నమ్మహా
భాగ పవిత్రగర్భమున భవ్యతరంబగు స్వీయవీర్యమున్. 634

క. స్త్రీనవకంబునుగనియెన్, మానిని యా దేవహూతి మహి వారెల్లన్
మానిత భవ్యాకార ల, నూనగుణాఢ్యలు నవారుణోత్పలగంధుల్. 635

చ. ఎలమిని సన్యసించు హృదయేశు నెఱింగియు దేవహూతి వ్యా
కులతఁ దపించు డెందమునఁ గొందలమందుచు ఱిచ్చవాటు చొ
ప్పిల నఖరత్నకాంతిసముపేతపదంబున నేల రాయుచున్
మలఁచి యుదశ్రుపూరమును మంజులవాక్కులఁ బల్కె నీగతిన్. 636

దేవహూతి:—

మ. భగవద్రూప! భవత్ప్రతిశ్రుతము సర్వంబిట్లు నాకీవు సొం
పుగఁ గావించితివైన నిప్పు డభయంబున్ గూర్పనౌ నాకు నున్
దగ నీకూఁతులఁ గూర్పఁ గావలయుఁ గాదత్తుల్యులౌ భర్తలన్
మొగిఁ దత్త్వం బెఱిఁగింపఁ జాలు నొకనిం బుత్రుం బ్రసాదింపనౌ. 637

చ. ఉరువిషయప్రసంగమునఁ బ్రోజ్ఝితతత్పరమాత్మతత్త్వనై
జరిపితి నింతకాలమును జాలు నిఁకన్ మునినాథ! యింద్రియా
ర్థరతి మెలంగు చే నిట నిరర్థకమైన ప్రసక్తిఁ జేసితిన్
గురువర! నిన్నుఁ బొందియును గూరిమి నాకభయంబొసంగవే. 638

చ. ధరణిపయిం గుబుద్ధి విహితంబగు సంగ మసాధులందు సం
సరణనిమిత్తమౌచు నగుఁ జాట్లకుఁ బట్టగుఁ బూజ్యులైన స
త్పురుషుల కవ్యలీకమగు బుద్ధిని గల్గినఁ దాఁటఁ జేసి యా
గురుతరసంగమే మిగులఁ గూర్చునుఁ గాదె యసంగలాభమున్. 639

క. ధర్మార్థంబయి యెవ్వని, కర్మము వెలయదొ విరక్తికలితముకాదో
నిర్మలహరి సేవార్థ బ, హిర్ముఖమగునో యతండు మృతుఁడె బ్రతికియున్. 640

గీ. ముక్తిదుఁడవైన నిన్నును బొందియు భవ, బంధనమునుండి మోక్షంబు వడయనైతి
మౌనినాథ! యాభగవంతు మాయచేత, నేనువంచింపఁబడితిని నిశ్చయముగ. 641

## అధ్యాయము 24.

### కపిలావతారఘట్టము, బ్రహ్మస్తుతి

మైత్రేయుఁడు :—

మ. వెను నిర్వేదముతోడ నిట్లను మనుక్ష్మానాథపుత్రీమణిన్
గని మౌనీంద్రుఁడు కర్దముండు మదిలోఁ గారుణ్య మొప్పారఁగన్
దనకున్ విష్ణువు చెప్పినట్టి నుడులం దానాత్మ భావించి సా
నునయాలాపములన్ వచించె నిటు లన్యూనానురాగంబుతోన్. 642

ఋషి :—

ఉ. ఖేదము బొందకో శశిముఖీ! మనురాజకుమారికామణీ!
నీదుచరిత్ర మారయ ననింద్యముగావున నీకునై యిటుల్
శ్రీదయితుండు నక్షరుఁడు శేషశయానుఁడునైన విష్ణుఁడే
నీదగు గర్భమందు రమణీ! యచిరంబున నుద్భవించెడున్. 643

చ. దమనియమంబు లొప్పఁగ ధృతవ్రతవై తపమున్ స్వవిత్తదా
నము దనరంగ శ్రద్ధకలనం బరమేశు రమేశునిన్ భజిం
పుము భవదర్చితుండయి విభుండును మద్యశ మొప్ప నీదు గ
ర్భమున జనించి నీహృదయగ్రంథినిఁ ద్రెవ్వఁగలం డుదాత్తుఁడై. 644

మైత్రేయుఁడు:—

మ. అతిమోదంబున దేవహూతి మునిలోకారాధ్యుఁడౌ యా ప్రజా
పతి సందేశమునందు గౌరవము విశ్వాసంబుఁబుట్టన్ జగ
త్పతిఁ గూటస్థుని నాదిపూరుషుని శ్రద్ధాభక్తులొప్పార స
మ్మతిఁ బూజించె నిజేప్సితంబు వడయన్ సమ్యగ్విధానంబునన్. 645

ఉ. తద్దయుఁ బెద్దకాలము గతంబగుడున్ భగవంతుఁ డచ్యుతుం
డుద్దవడిం దపోధనజనోత్తమకర్దమవీర్యమందుఁ దా
నొద్దిక నావహించి చెలువొప్పఁగ దారువునందు నగ్ని నా
ముద్దియయందు సొంపెసఁగఁ బుట్టె జగత్త్రియగేయమానుఁడై. 646

సీ. అత్తఱి వ్యోమంబునందుఁ బెన్దుందుభి, ప్రభృతి వాద్యంబులు పరిఢవిల్లె
పాడిరి గంధర్వవరులు తత్కీర్తుల, నాడిరి ముదమున నప్సరసలు
ఖేచరకోటిప్రకీర్యమాణంబులై, దివ్యసుమంబులు దెసలఁబడియె
సకల కకుప్పులు సలిలంబులును మాన, సంబులు మిగులఁ బ్రసన్న మయ్యె

గీ. నా మొడ సరస్వతీవిమలాపగావ, రిశ్రితమ్మగు కర్దముని నాశ్రమమున
నా స్వయంభువు తగ మరీచ్యాది మౌని, సత్తములతోడ పతం బ్రవేశంబు సేసె. 647

మ. అమలంబౌ నిజసాత్త్వికాంశమున సాంఖ్యంబుం బ్రబోధింపఁ గ
ర్దమపుత్రుండయి యుద్భవించిన పరబ్రహ్మన్ రమేశున్ విరిం
చి ముదం బొప్పఁగఁ గాంచి శుద్ధమతిఁ ద చ్చేష్టల్ ప్రశంసించుచున్
బ్రమదంబొప్పఁగఁ బూజ్యకర్దమునకున్ వాక్రుచ్చె నీరీతిగన్. 648

బ్రహ్మ:—

ఉ. మానధనా! మదుక్తులనుమన్ననసేయుచు నిర్వ్యళీకతన్
బూనితిఁ గాన నా కుచితపూజయొనర్చితి విశ్ల తండ్రికిన్
సూనులు పూజసేయుటయచొప్పగుఁదండ్రి వచించినట్టి ప
లొక్కనని పుత్రులియ్యకొనుచల్లె మెలంగుట ముఖ్యపూజయౌ. 649

క. ఈ నీదుహితలు సౌమ్యలు, మానితగుణరమ్య లో కుమారక! వీరల్
నానావిధసృష్టికి నెం, తేనియుఁ గావింతు రుపచితిన్ స్వమహిమలన్. 650

క. కావున ఋషివరులకు స, ద్భావ సదాచారశీలపరులకు వీరిన్
నీ వాదరమున నొసఁగి య,శో విభవము పెంపుసేయు క్షోణితలమునన్. 651

గీ. ఆద్యపురుషుని స్వీయమాయావతీర్ణు, భూతసంఘాత శేవధియై తనర్చు
దేహమునుదాల్చినట్టి యాదేవదేవుఁ, గాఁగఁ దెలిసితినేను నీకపిలునిని. 652

సీ. పద్మపత్రాక్షుఁడు పద్మముద్రాపదా, బ్జుండు హిరణ్యకేశుండు విభుఁడు
త్వద్గర్భజాతుఁడై తగ నవిద్యాసంశ, యగ్రంధి ఛేదించియవనియందు
జ్ఞానవిజ్ఞానయోగ క్రమమ్మునఁజేసి కర్మవాసనల భగ్నంబొనర్చి
చరియింపఁగలఁ డలసాంఖ్యమతాచార్య, సమ్మతుండగుచుఁ దా నిమ్మహాత్ముఁ

గీ. డఖిలసిద్ధగణాధీశుఁ డగుచులోక, మందుఁగపిలాహ్వయంబును బొందఁగలఁడు
దేవహూతి! యితఁడు భవత్కీర్తినెల్ల, జగములం దతివిస్తృతిసలుపఁగలఁడు. 653

మైత్రేయుఁడు:—

గీ. వారి నిట్లు జగత్స్రష్ట పలుకరించి, యా మరీచ్యాదిపుత్రుల నందెశ్రీతి
నుని చి నారదసనకాదియుక్తుఁడగుచు, సరిగె సత్యలోకమునకునంచనెక్కి. 654

చ. శతధృతి యేగినంత మునిచంద్రుఁడు కర్దముఁడట్లు బ్రహ్మచో
దితుఁడయి యాత్మపుత్రికలధీవిభవాతిశయాఢ్యలన్ యథో
చితముగ విశ్వసృష్టిని రచించుచుఁ బెంపెసలారునట్టి య
య్యతుల కొసంగె దానఁదనయాత్మ ప్రమోదపయోధిఁ దేలఁగన్. 655

సీ. అల మరీచికిఁ గళ నత్రికి ననసూయ, నంగిరునకు శ్రద్ధ నప్పులస్త్యు
నకు హవిర్భువుఁ గ్రతునకుఁ గ్రియఁ బులహున, కు గతిని ఖ్యాతిని భృగువునకును
ధృతి వసిష్ఠున కరుంధతి నధర్వణునకు, శాంతిని నిజకులాచారసరణిఁ
బెండిలిఁగావించి విప్రవరేణ్యులఁ, బత్నీయుతుల గౌరవంబుఁ జేసె
గీ. సంతటఋషీశ్వరులు స్వభార్యాయుతులయి, కర్దమునివీడుకొని కౌతుకంబుతోడ
నమరగణముల సన్నుతు లందుకొనుచు, నల్లనల్లనఁ జేరిరి స్వాశ్రమములు. 656

చ. ధర నవతీర్ణుఁడైన విబుధర్షభుఁడుం ద్రియుగుం డితం డటం
చు రహి నెఱింగి కర్దముఁడు సొంపు మెయిన్ విజనస్థలంబునన్
హరిఁ బురుషోత్తముంగని ప్రహర్షితమానసుఁడై ప్రణామముల్
బరపుచు నమ్రభావమునఁ బల్కె నిటుల్ మృదుమంధరంబుగన్. 657

క. గురుతర నిజదురితములన్, నరకమున దహింపఁబడెడు నరులకును మహా
త్తరకాలంబున వేల్పులు, కరముఁ బ్రసన్నులగుచుండ్రు గాదె మహాత్మా! 658

సీ. బహుజన్మతతిపరిపక్వయోగసమాధి, యతులు శూన్యగృహంబు నందునుండి
యెవ్వాని పాదంబు నెలమి సందర్శింప, నభిలషించుచునుండ్రో యట్టి నీవు
లాఘవం బించుకఁ దలంపక స్వాశ్రిత,పోషకుండవు గాన శేషశయన
గ్రామ్యులమగు మా యగారంబునందు సం,జాతుండవైతివి జలజనాభ!
గీ. స్వీయవాక్యంబు సత్యంబు చేయఁ దలచి, భక్తకోటికి జ్ఞానలాభంబుఁ గూర్ప
నెంచియున్ నీవిటు లవతరించి యుంటి, వర్థిజనకల్పభూజ! యనంతతేజ! 659

గీ. తత్త్వజిజ్ఞాస బుధులు సదాత్వదీయ, పాదపీఠంబునకు నభివాదము లొసఁ
గెదరు ప్రవిభూతి వైరాగ్య కీర్తి బోధ, వీర్య శక్తులఁ దగు నీకు వినతు లివియె. 660

సీ. పరముఁడవు ప్రధానపురుషమహత్తత్త్వ, కాలరూపుండవు కవివరుఁడవు
లోకపాలుఁడవు మహాకుక్షినిక్షిప్త, విశ్వప్రపంచుండ వీశ్వరుఁడవు
స్వచ్ఛందమూర్తివి సకలలోకారాధ్య, లీలావతారకేళీయుతుఁడవు
కపిలాఖ్యఁ జెన్నారు ఘనుఁడవు సకలశో,భనుఁడవు నత్యంతపావనుఁడవు
గీ. నీకు మ్రొక్కులు గావింతు నిరతమేను, నిప్పుడు ప్రజాపతిని నిన్నొకింత తెలుఁగుదు
సుతుఁడవై నాకు నుద్భవించుట ఋణత్రయంబుఁ దగనీఁగికొంటి శ్రేయంబుఁగంటి

క. ఇఁకపై నేను బరివ్రాజక పదవిన్ స్వీకరించి స్వామీ! భవదం
ఘ్రికమలమును హృది నిల్పుచు, సుకరముగఁ జరింతు విగతశోకుఁడనగుచున్.

గీ. అంతభగవంతుఁడుం బరమాత్ముఁడైన, వాసుదేవునియందుఁ దాఁబరమభక్తి
యోగమునఁజేసి లబ్ధాత్ముఁడై గతిక్రియుండు గతబంధనుండునై యొప్పె మాని.

గీ. అరసి భగవంతుఁడగు పరమాత్మ సఖిల
భూతములయందుఁ బొడఁగాంచు భూతసంచ
యమును భగవంతుఁడగు పరమాత్మునందుఁ
గాంచునత్యంత నియతినిఁ గర్దముండు. 672

క. రాగద్వేషరహితమున్, త్యాగయుతము భక్తియోజితము సర్వసమో
ద్యోగము నగుచిత్తమునన్, భాగవతపదంబుమానివర్యుఁడు పొందెన్. 673

---

## అధ్యాయము 25.

### కపిలదేవహూతి సంవాదము

శౌనకుఁడు:—

మ. కపిలాభిఖ్యుఁడు సాంఖ్యబోధకుఁడు సాక్షాచ్ఛ్రీమహావిష్ణు వా
త్మపృథుప్రోజ్జ్వల యోగమాయ నిటు జన్మంబందె నృశ్రేణికిన్
విపులజ్ఞానముఁదెల్ప యోగివరుఁడై వెల్గొందు నయ్యిందిరా
ధిపుకీర్తిన్ విని నాదు మానసము తృప్తింబొంద దావంతయున్. 674

సూతుఁడు:—

క. మైత్రేయుఁడు ద్వైపాయన, మిత్రుం డాన్వీక్షకీసమీరితుఁడగుచున్
పాత్రుఁడగు విదురునకు గత,శత్రునకుం దెల్పె నిట్లుసముచితఫణితిన్. 675

మైత్రేయుఁడు:—

మ. జనకుండిట్లు లరణ్యభూమి కరుగన్ స్వాంతంబునం దల్లికిన్
ఘనమైనట్టి ప్రియంబు సేయుటకు సంకల్పించి యా నిత్యపా
వనమా బిందుసరోవరంబునను సంవాసంబుఁ గావించె స
జ్జనసంసేవ్య పదాంబుజుండు కపిలాచార్యుండు మోదంబునన్. 676

ఆ. తత్త్వమార్గపారదర్శి యాసీనుఁడు, నిష్క్రియుండునగు మునిని స్వసుతుని
గని విధాతృవచనమును సంస్మరింపుచుఁ, బ్రీతి నిట్లు దేవహూతిపలికె. 677

దేవహూతి:—

మ. అవివేకాంధతమఃప్రవిష్టమతినై యల్లాడితిం దండ్రి! మా
... నివరా! యవ్విషయేచ్ఛలన్ విసివితిన్ నేనింక దుష్పారఘో

రవివృద్ధాంధతమశ్ఛటావితతిపారం బీవ చేర్పన్ ఫలం
తివి ప్రాపించె ననేకజన్మలకు నిర్వీక్షించు భాగ్యం బహో! 678

క. పురుషోత్తముఁడ వజుండవు, పరమేశుఁడ వీవు తరణివలెఁ దామిస్రో
త్కరమునఁ గడునంధంబై, పరఁగు జగంబునకు నక్షివై పొడమితిగా. 679

గీ. నేను నాదను నయ్యభిమాన మీవ, కల్గఁజేసితి దేహాదికంబునందు
ననఘ! యిట్టిసమ్మోహంబు నపనయింప, నీవె తగుదువు కాదె యోదేవదేవ!

గీ. స్వీయభక్తసంసారాటవీకుఠారు, ధర్మవిద్వరు నార్తబాంధవు శరణ్యు
నిన్ను జగదీశు శరణుఁ బొందితిని నేను, బ్రకృతిపురుష జిజ్ఞాసచే బరమపురుష!

మైత్రేయుఁడు:—

చ. నిజజనయిత్రి యాప్సిత మనింద్యము వంద్యము మోక్షదంబు న
క్కజముగ జ్ఞానలాభము నొగల్గఁగఁజేసెను దాని నయ్యధో
క్షజుఁడెదలోన మెచ్చుకొని చారు దరస్మిత శోభితాస్యుఁడై
స్వజన హితైషి యాట మృదు భావము దోఁపఁగఁ బల్కె నీక్రియన్. 682

శ్రీ భగవానుఁడు:—

మ. మును మానుల్ వినఁగోరఁ దెల్పితిని నేబ్రహ్మోజ్జ్వలద్యోగమున్
గనరా వెచ్చటఁ బాపపుణ్య సుఖదుఃఖ ద్వేషరాగంబు ల
త్యనఘంబున్ జనభద్రదంబునగు నయ్యాధ్యాత్మికాత్యంత పా
వనయోగంబును నీకు నేను మగుడన్ వాక్రుత్తు నాలింపుమా. 683

గీ. మానవశ్రేణికిన్ నిజమానసంబె, కారణము బంధమునకు మోక్షమునకునగు
పరఁగు విషయానురక్తమై బంధమునకు, మూలపురుషానురక్తమై మోక్షమునకు.

గీ. ఉరవడి నహమ్మమాభిమానోత్థములగు, కామక్రోధాదిమలములఁ గ్రందుకొనక
మనసు సుపరిశుద్ధమును సమంబు దుఃఖ, విరహితంబును మఱిసుఖవిరహితమగు.

ఉ. స్థూలముకంటె స్థూలమును సూక్ష్మములన్నిటికంటె సూక్ష్మమున్
మూలములైన యన్నిటికి మూలమునై సకలాద్భుతక్రియా
కేలికి నాలవాలమయి కేవలమై తగునాత్మముం దమిన్
దేలుచుఁగాంచుపూరుషుఁడు నేర్మిఁగనుం బ్రకృతిన్ హతప్రభన్. 686

గీ. వరదుఁ డఖిలాత్ముఁడగు భగవంతునందు, యుజ్యమానసుస్థిరభక్తి యోగమునకు
సదృశమైన సత్పథ మొండు జగతిలేదు, సిద్ధయోగులసద్బ్రహ్మసిద్ధికొఱకు.

చ. బహువిషయప్రసక్తి దృఢపాశము జీవునకంచు ధీమణుల్
రహిఁగని రా ప్రసక్తియె కరంబనురక్తిని సాధులందు న

స్వాహము పరివృత్తమైనను నపావృతమగా నపవర్గమార్గముల్
సుహృదులు సర్వదేహులకు సూరిజనోత్తములైన సాధువుల్. 688

మ. ధృతి నాయందు ననన్యభావమున భక్తిన్నిల్పి నాయందక
ర్మతతుల్ డించియుఁ ద్యక్తబంధుజనులై మత్పుణ్యగాథల్ సమా
దృతి నాలించుచుఁ జెప్పుచుం దలచుచుం బ్రీతిన్ వినోదించు మ
ద్గతచేతస్కుల బాధఁ బెట్టవుసుమీ తాపంబు లొక్కింతయున్. 689

గీ. సర్వసంగవివర్జితుల్ సాధ్వి! వింటె, జగతినాసాధుపుంగవుల్ శ్లాఘ్యమతులు
వారిసంగంబు నీకును గోరఁదగును, జనని! వారలు సర్వదోషఘ్నులుగద. 690

మ. జననీ! సాధుజనపరిసంగమున నస్మద్వీర్యసంబోధకం
బును హృత్కర్ణరసాయనంబగు కథాపుంజంబగుం దత్కథా
ఘనతాకర్ణనభాగ్యలబ్ధి నపవర్గస్ఫీతమార్గంబులం
దనఘశ్రద్ధయు భక్తి రక్తియును బెల్లావిర్భవించుంగదే! 691

సీ. దృష్టశ్రుతాఖిలేంద్రియసౌఖ్యముల జాత,వైరాగ్యుఁడై దృఢభక్తిచేతఁ
బురుషుండు మత్సృష్టిముఖ్యలీలాభూతి, చింతనం జిత్తంబుచిక్కఁబట్టి
ప్రయతించు ఋజుయోగపథముల ననుపమ,యోగయుక్తుండు నుద్యుక్తుఁడునయి
ప్రకృతిగుణాసేవ వైరాగ్యజృంభిత,జ్ఞానంబుచేత యోగంబుచేత
గీ. మత్సమర్పితబుద్ధిచే మహితుఁడనగు, ప్రత్యగాత్మనునన్ను నీభవమునంద
పడయఁగల్గును జీవుండు పరిజ్ఞమీఱ, జననిరో! యింతవట్టు నిస్సంశయంబు.

దేవహూతి:—

సీ. నీయందు గురుభక్తి యేయది యుచితమౌ?, నాకుయోగ్యంబగునట్టి దేది?
నేనిఁకెద్దాననీనిర్వాణమార్గంబు, నతిశీఘ్రమునఁబడయంగగలను?
భగవంతుఁడేలక్ష్యముగనొప్పునురుబాణ,యోగమెయ్యది భవత్ప్రోక్తమొయది
యెట్టిది? యంగమ్ములెన్ని? తత్త్వావబోధనము నేరీతి నద్దానఁ గలుఁగు?
గీ. మందమతినైననేను నేమాడ్కిఁదెలిసి, కొందు? నాగతి దాని నాకున్ వచింపు
మేను నీయనుకంపచే నిట్టిదురవ, గాహవిషయంబు సులభంబుగా గ్రహింతు.

మైత్రేయుఁడు:—

గీ. తత్తనూజాతుఁడగుట జాతానురాగుఁ, డగుచుఁ గపిలుండుతల్లి వాక్యంబునెఱిఁగి
మునులు దేనిసాంఖ్యామ్నాయమనుచుఁబలుకు,చుందు రాభక్తియోగ మిట్లోజఁ
దెలిపె. 694

శ్రీ భగవానుఁడు:—

సీ. గుణలింగులౌ దేవతాకోటుల కాధార, భూతుఁడౌ యయ్యాదిపూరుషుండు
సత్త్వరూపుండును జగదధీశ్వరుఁడును, భూతమయుండునై పొలుపుమీఱు
ననిమిత్తమగుపరమాత్మునందలి భక్తి, ముక్తికంటె గరిష్ఠము జనయిత్రి!
ప్రోజ్జ్వలజఠరాగ్ని భుక్తాన్నముంబలె, నరుదుగ లింగదేహంబుఁ నణఁచు.

గీ. మచ్చరణభక్తియుక్తులై మత్పరులయి
భాగవతులు కొందఱు మోక్షపదముఁగోరరు
పొసఁగ నన్యోన్యభాషణంబుల మదీయ
కీర్తిపౌరుషములను శ్లాఘించు చెపుడు. 695

చ. వరదములుం బ్రసన్నశుభవక్త్రసముజ్జ్వలనేత్రముల్ మనో
హరము లమానుషంబులునునై పొలుపొందెడు నాదురూపముల్
వెరవునఁ గాంతు రాసాధువులు వెండి పరస్పరమున్ వచించు కొం
దురు స్పృహణీయమత్పరమృదూక్తుల భక్తిరసంబు చొప్పిలన్. 696

ఉ. ఆయవలోకనీయరుచిరావయవంబులు హాసదృష్టి లీ
లాయతనంబులున్ మృదువచోమృత యుక్తములైన రూపముల్
స్వీయములైన ప్రాణములఁజిత్తములన్ హరియింప భక్తిమైఁ
బాయక కొల్చు సాధులకు భక్తియ కోరకయిచ్చు మోక్షమున్, 697

మ. అనవద్యంబగుభక్తిఁ గల్గు నణిమాద్యష్టాంగమైశ్వర్యమున్
ఘనమాయాబలవర్జితంబును సమగ్రంబౌ విభూతిన్ సిరిన్
గొన కాసాధుజనోత్తముల్ శుభద మద్ధ్యానంబునౌ నాదు భా
వనలోకంబును బొందుచుం దనిశమున్ బ్రహ్మాదు లగ్గింపఁగన్. 698

ఉ. మానిని! దేవహూతి! వినుమత్పరు లెప్డు నశింపఁ బోరు సుం
తేనియుఁ గాలచక్రము గ్రసింపదు వారిని నిచ్చ వారికిన్
నేను ప్రియుండ నాత్ముఁడను నెమ్మి గురుండను బ్రాణమిత్రుఁడన్
సూనుఁడ నిష్టదైవమను జుట్టమనై పరిరక్షఁ జేయుదున్. 699

చ. ఇహముఁ బరంబును న్విడిచి యాయుభయానుగతస్వదేహమున్
గృహపశుదారపుత్రధనబృందము నన్యమునుం ద్యజించి య
న్వహమును విశ్వతోముఖుని నన్ను భజింతురు సమగ్రభక్తి ని
స్పృహులయి సాధు లాఘనులమృత్యువుబారిఁ దరింపఁ జేయుదున్. 700

సీ. పరముఁడను బ్రధానపురుషేశ్వరుఁడ భగవంతుఁడ సర్వభూతాంతరాత్మ
నగు నావలనఁ గాకయన్యులవలనను, దీవ్రభయము నివర్తింపఁబడదు
నాయాజ్ఞఁ గడవ నెన్నటికి నెవ్వరికిని, శక్యంబుగాదు నిశ్చయముసుమ్ము
వీఁచును గాలి తపించు సూర్యుండు వర్షించు నింద్రుండు దహించు నగ్ని

గీ. మిత్తియును మద్భయంబున నొత్తిగిల్లు, జ్ఞానవైరాగ్యయుతభక్తిఁ బూనియోగు
లెల్ల నకుతోభయంబయి యెసఁగునాదు, పాదమూలంబుఁ జేరుదు రాదరమున.

గీ. గాఢతరమైన భక్తియోగమునఁ జేసి, మనము నాయందుఁ దిరముగ ననుపఁబడిన
నదియ నిశ్శ్రేయసోదయం బగునుజూవె, జననిరో! నిక్కువముగ నీజగమునందు.

---

## అ ధ్యా య ము 26.

### సాంఖ్యయోగ కథనము

గీ. జననిరో! యింకఁ దత్త్వలక్షణము నీకు, వేఱువేఱుగ వివరింతు వినుము వేడ్క-
దాని విని పూరుషుఁడు ప్రాకృతంబులైన, గుణగణంబులచే విముక్తుండగుఁజుమి.

మ. వినుహృద్గ్రంథి విభేదనంబును సుధీవేద్యంబునౌ యాత్మదర్శనరూపంబగు మూఢకోట్యసులభజ్ఞానంబు వర్ణించెదన్
జననీ ! యాత్మ యనాది నిర్గుణము స్వచ్ఛంబున్ స్వయంజ్యోతియున్.
ఘనమున్ విశ్వయుతంబునై ప్రకృతిభిన్నంబై విరాజిల్లెడున్. 704

గీ. ప్రత్యగాత్మ స్వప్నద్రష్ట స్వప్నకాలమునను బోలెఁ దద్ధర్మముల్ గనోవియు హేతు
వైన దేహాద్యుపాధిచయంబుతోడఁ, బుట్టబోఁ డొకయప్పుడు గిట్టబోఁడు. 705

గీ. ఆ విభుఁడు పరాత్మయు గుణత్రయాత్మకయును
దేహసంబంధినియునై యదృచ్ఛఁ దన్నుఁ
జేరియున్నట్టి ప్రకృతినింపార జననీ!
చెలఁగి లీలాగతిం బ్రవేశించెఁజుమ్ము. 706

గీ. చేరి సత్త్వాదిగుణముల చే విచిత్రమగు సరూపప్రజానివహము సృజించెఁ
బ్రకృతిఁగని జ్ఞానగూహయాపప్రకృతిచేతఁ, బురుషుఁ డాత్మ క్షణమునందు
మోహమందె. 707

క. పురుషుఁ డిట్లు పరధ్యాన, నరతుండై యాప్రకృతిగుణంబులచే వా
విరి కర్మలుచేయఁబడన్, గర మారోపించుకొనునుగ ర్తృత తనకున్. 708

గీ. అక్రియుండు సాక్షియు నివృతాత్ముఁడునగు
నీశునకు సంసృతియు బంధ మెంచిచూడఁ
బారతంత్ర్యమవెల్ల నా ప్రకృతిచేత
నేర్పడినదిగా నీమది నెఱుఁగుమమ్మ! 709

గీ. కార్య కారణ కర్తృత్వ కారణమ్ము, గాఁగ దద్విదుల్ ప్రకృతిని గాంచుచుంద్రు
తెలియుదురు సుఖదుఃఖ భోక్తృత్వమందుఁ, బ్రకృతికిం బరుఁబురుషుఁ గారణము
గాఁగ. 710

దేవహూతి:—

క. పురుషోత్తమా! ప్రకృతికిం, బురుషునకున్ లక్షణములు బోధింపుము నా
కరయం బ్రకృతిపురుషు లిర్వురు సదసద్విశ్వహేతుభూతులు కారే? 711

శ్రీ భగవానుఁడు:—

వ. జననీ! నిత్యంబును గుణత్రయాత్మకంబును, సదసద్రూపంబును, నవిశేషంబును, సవిశేషంబునగు ప్రధానంబును బ్రకృతియని చెప్పుదురు. పృథివ్యప్తేజో వాయ్వాకాశంబులను బంచమహాభూతంబులును, గంధ, రస, రూప, స్పర్శ, శబ్దంబు లనియెడు పంచతన్మాత్రలును, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబు లనెడు పంచజ్ఞానేంద్రియంబులును, వాక్పాణిపాదపాయూపస్థంబులనెడి పంచకర్మేంద్రియంబులును, మనోబుద్ధిచిత్తాహంకారంబులనెడు నంతఃకరణచతుష్టయంబును గూడి ప్రకృతి సంబంధమగు చతుర్వింశతికగణంబని పలుకుదురు. ఇది సగుణ బ్రహ్మ సంఖ్యాభేదంబు. ఇఁకఁ బంచవింశతికతత్త్వంబైన కాలంబు నెఱింగించెద వినుము. ఎద్దానంజేసి యహంకార విమూఢుండై ప్రకృతిం బొందిన కర్తయగుపురుషునకు భయంబువాటిల్లు నట్టి పరమపురుషుని ప్రభావంబును గొందఱు కాలంబుగాఁ జెప్పుదురు. గుణసామ్యకలితంబును, నిర్విశేషంబును నగు ప్రకృతిచేష్ట కాలం బనియుఁ దెలుపంబడు. పురుషరూపంబునం గాలరూపంబునఁ దత్త్వంబు లోపల వెలుపల భగవంతుం డాత్మమాయచేఁ గూడియుండు. దైవంబున క్షుభితగుణంబులుగల జగద్యోనియగు నీప్రకృతియందు నీ పరమపురుషుండు వీర్యంబునుంచె. ఆ ప్రకృతి హిరణ్మయంబైన మహత్తత్త్వంబును బ్రసవించె. జగద్బీజంబగు కూటస్థుఁడీశ్వరుండాత్మగతంబగు విశ్వంబును బ్రకటించుచుఁ దీవ్రప్రళయకాలికంబును, నాత్మ ప్రచ్ఛాదకంబును నగు తమంబును దనతేజంబునఁ బానంబుఁ జేసె. స్వచ్ఛంబును, శాంతంబును, భగవత్పదంబును, సత్త్వగుణ ప్రధానంబును, మహదాత్మకంబునగు చిత్తంబును వాసుదేవాఖ్యంబని యంద్రు. జలంబులకు నైజ

ప్రకృతియుంబోలెం జేతంబునకు స్వచ్ఛత్వము నవికారిత్వము శాంతత్వము వృత్తి లక్షణంబులుగాఁ జెప్పంబడు. భగవద్వీర్యచోదితంబై వికృతంబైన మహత్తత్త్వమునుండి వైకారిక, తైజస, తామస, భేదంబుల రజోగుణోద్రిక్తంబైన యహంకారం బుత్పన్నంబయ్యె. మనంబునకు నింద్రియములకు నాకాశాది మహాభూతంబులకుఁ దన్మాత్రలకుఁ ద్రివిధాహంకారంబువలన నుత్పత్తికలిగె. భూతేంద్రియ మనోమయుండగు సంకర్షణాఖ్యపురుషుని సహస్రశిరుండగు నాద్యుండైన సాక్షాదనంతునిగా వచింతురు. కర్తృత్వము, కరణత్వము, కార్యత్వంబు నను లక్షణంబుల నహంకారము శాంత, ఘోర విమూఢత్వములందు వికృతింబొందిన వైకారికత్వమునుండి మనస్తత్త్వముపుట్టె. అది కామజనకంబై సంకల్ప, వికల్పంబులం గావించుచుండు. హృషీకేశ్వరుండును, శారదేందీవరశ్యాముండును, శనైర్గతిని యోగులచే సాధింపఁదగినవాఁడునైన పురుషు ననిరుద్ధాఖ్యుని గా బుధులెఱింగిరి.వికృతింబొందిన తైజసాహంకారంబువలన బుద్ధితత్త్వంబు వొడమె. ద్రవ్యస్ఫురణ విజ్ఞానంబును నింద్రియానుగ్రహంబును సంశయంబును, విపర్యాసంబును, నిశ్చయంబును, స్మృతియు స్వాపంబు ననంబడునవి వృత్తులంబట్టి పృథగ్రూపంబులగు బుద్ధిలక్షణంబులు. తైజసంబులగు నింద్రియంబులు క్రియాజ్ఞాన విభాగంబుల వేఱైయుండు. అందు ప్రాణంబులకుఁ గ్రియాశక్తియు బుద్ధికి విజ్ఞానశక్తియు సహజంబులైయుండు. భగవద్వీర్య చోదితంబై వికృతింబొందిన తామసాహంకారంబునుండి యాకాశగుణకంబగు శబ్దతన్మాత్రయుదయించె. అందుండి నభంబును శ్రోత్రంబునుగలిగె. అర్థంబు నాశ్రయించుటయుఁ గుడ్యాంతరితుండైన వక్తను జ్ఞప్తిచేయుటయు నభోలక్షణమగు శబ్దతన్మాత్రయని కవులెఱుంగుదురు. భూతంబులకు బహిరంతర్భాగంబుల నవకాశం బొసంగుటయుఁ బ్రాణేంద్రియాత్మాశ్రయత్వంబును, నభోవృత్తి లక్షణంబులు. కాలగతిచే వికృతింబొందిన శబ్దతన్మాత్రకంబగు నభంబునుండి స్పర్శంబుకలిగె. అందుండి వాయువును స్పర్శసంగ్రహంబగుత్వక్కును గలిగె.మృదుత్వంబును,గఠినత్వంబును. శైత్యంబును నుష్ణత్వంబును స్పర్శంబునకులక్షణములు. ఈస్పర్శంబువాయుతన్మాత్రమైయొప్పు. కదపుటయు, బోగువెట్టుటయుఁ, బ్రాప్తియు,ద్రవ్యశబ్దంబుల నేతృత్వము సర్వేంద్రియంబులకునాత్మత్వము వాయుకర్మ లక్షణంబులు. దైవేరితంబై స్పర్శతన్మాత్రంబగు వాయువునుండి రూపంబుద్భవించె. అందుండి తేజంబును రూపోపలంభనంబగు చక్షువుం గలిగె. ద్రవ్యాకృతిఁగలిగియుండుట, గుణత్వము, వ్యక్తిసంస్థానము, తేజస్సుకలిగియుండుట, రూపతన్మాత్రలక్షణంబులు. ప్రకాశనముఁ బచనంబును, హిమమర్దనంబును, శోషణంబును, క్షుత్పిపాసలుఁ దేజోవృత్తులనంబడు.

దైవచోదితంబై వికృతింబొందిన రూపతన్మాత్రనుండి రసతన్మాత్ర యుదయించె. అందుండి జలంబును, రసగ్రాహకంబైన జిహ్వయుఁ బొడమె. కషాయంబును, మధురంబును, తిక్తంబును, కటువును, నామ్లంబు నని యనేకవిధంబుల భౌతిక వికారంబున నేకంబైన రసంబు విభజింపంబడుట, రసతన్మాత్రలక్షణంబులు. ఆర్ద్రీకరణంబును, మృదాదిపిండీకరణంబును, తృప్తిదానంబును, జీవనంబును, నాప్యాయనంబును, మృదూకరణంబును, దాపాపనోదనంబును, బునఃపునరుద్గమంబును, జలవృత్తి లక్షణంబులు. దైవచోదితంబై వికృతింబొందిన రసతన్మాత్రికంబగు జలంబునుండి గంధతన్మాత్రయుదయించె. అందుండి పృథ్వియు,గంధగ్రహణంబగు ఘ్రాణంబును గలిగె. మిశ్రగంధంబును, దుర్గంధంబును, కర్పూరాది సౌరభ్యంబును, శతపత్రాది శాంతగంధంబును, లశునాద్యుగ్రగంధంబును, బర్యుషితభుక్తాన్నాద్యామగంధంబును మున్నగువానిచే ద్రవ్యావయవ వైషమ్యంబులం బృథగ్భావమునొంది యొక్కటయ్యు విభిన్నంబై గంధతన్మాత్రయొప్పు. ప్రతిమాదిరూపంబున బ్రహ్మభావనంబును, స్థానంబును, ధారణంబును, సద్విశేషణంబును, సర్వసత్వ గుణోద్భేదంబును బృథివీ వృత్తిలక్షణంబు లని మఱియు నిట్లనియె. నభోగుణ విశేషార్థము శ్రోత్రంబని చెప్పంబడు. వాయుగుణ విశేషార్థము చర్మంబనియుఁ దేజోగుణవిశేషార్థము చక్షువనియు, నంభోగుణ విశేషార్థము జిహ్వయనియు, భూమిగుణవిశేషార్థము ఘ్రాణంబనియుఁ జెప్పంబడు. కారణంబగు నాకాశాదిధర్మంబు కార్యంబగు వాయ్వాదికంబునందుఁ గార్యకారణ సమన్వయంబునం గానంబడుచుండుఁగావుటం జేసి భూమియందే భావవిశేషంబు మెండుగఁ గన్పట్టుచుండు. ఈ మహదాదిసప్తకంబు నొండొంటం గూడక పురుషుని భోగార్హునింగా సృజింపజాలకయున్నప్డు కాలకర్మ గుణోపేతుండైన జగదాదిరూపుఁడగు నీశ్వరుం డందుఁ బ్రవేశించె. అంతట నా విరాట్పురుషా విర్భావంబునకు హేతుభూతంబై యచేతనంబైన యండంబుక్షుభితంబులై యన్యోన్యసంగతంబులైన మహదాదిగణంబువలననుత్థితంబయ్యె. విశేషాఖ్యంబైన యీయండంబు బహిర్భాగంబునం బ్రకృత్యావృతంబులును, గ్రమవృద్ధంబులును, దశగుణితోత్తరంబులును నగు తోయాదికంబులచేఁ బరివేష్టితంబయ్యె. అందు భగవంతుండైన హరిరూపంబగు నీ లోకవితానంబు కలిగె. సలిలంబునందున్న హిరణ్మయంబగు నండకోశంబునుండి విరాట్పురుషుం డుత్థితుండై ఖగోళంబు బహువిధంబుల నిర్భిన్నంబుఁగావించె. ఈ విరాట్పురుషునకుఁ బ్రథమమున ముఖము నిర్భిన్నంబయ్యె. అందుండి వాణితో వహ్ని యుదయించె. పిమ్మట నాసలును, నా నాసికారంధ్రములనుండి ప్రాణముతోడి ఘ్రాణంబును, ఘ్రాణము

నుండి వాయువును, నందుండి యక్షులును, దాన జక్షురింద్రియంబును విభక్తంబు లయ్యె. ఆ చక్షువునుండి సూర్యుండును, నందుండి కర్ణంబులు, వానివలన శ్రోత్రేంద్రియంబును, దానివలన దిక్కులును విభిన్నంబులయ్యె. అందుండి విరాట్పురుషుని త్వక్, రోమ, శ్మశ్ర్వాదులు; వానివలన నోషధులును గలిగె. అంత శిశ్నంబు నిర్భిన్నంబై దానివలన రేతంబును, నందువలన జలంబులును బొడమె. దానం జేసి గుదంబు నిర్భిన్నంబయ్యె. గుదంబునుండి యపానంబును, యపానంబునుండి లోకభయంకరంబైన మృత్యువును గలిగె. పదపడిహస్తంబులు విభక్తంబులయ్యె. వానివలన బలంబుగలిగె. దాన నింద్రుండు వొడమె. పిదపపాదంబులు నిర్భిన్నమ్ములుకాఁగ వానినుండి గతియు దానివలన హరియుఁ గలిగె. ఈ విరాట్పురుషుని నాడులు విభిన్నంబులైనంత వానినుండి పూర్ణంబైన రక్తంబును దానివలన నదులును గలిగె. పదంపడి యుదరంబు నిర్భిన్నంబుకాఁగ దానినుండి క్షుత్పిపాసలు వానినుండి సముద్రింబునుగలిగె. అంత నీ విరాట్పురుని హృదయంబు భిన్నంబైన నద్దాన మనంబును, నందుండి చంద్రుండును, బుద్ధియు, బుద్ధినుండి చతుర్ముఖబ్రహ్మయుఁ గలిగిరి. అనంతరం బహంకారంబున రుద్రుండును, జిత్తంబున క్షేత్రజ్ఞుడును గలిగిరి. ఇట్లు పొడమిన యీదేవాదివ్యష్టిశరీరరూపభూత జాత మవ్విరాట్పురుషుని బ్రవృత్త్యున్ముఖుం జేయఁజాలక యుండె. అంత న వ్విరాట్పురుషోత్థాపనంబునకై యింద్రియాదుల నధిదేవతలు ప్రవేశించిరి. వహ్ని వాక్కుతోఁగూడి ముఖంబునుబొందె. అప్పుడును విరాట్పురుషుం డుత్థితుండు కాలేదు. వాయువు ఘ్రాణేంద్రియంబుతో నాసికలంజొచ్చె. ఆదిత్యుండు చక్షురింద్రియంబుతో నక్షులంజొచ్చె. దిక్కులు కర్ణేంద్రియములతో శ్రోత్రంబుల జొచ్చె. ఓషధులు రోమంబులతోఁ ద్వచంబును, జలములు రేతంబుతో శిశ్నంబును, మృత్యువపానంబుతో గుదంబును, విష్ణువు గతిచేఁ జరణంబులను, నింద్రుండు బలంబుతో హస్తంబులను, నదులులోహితంబుతో నాడులను, సముద్రుఁడు క్షుత్పిపాసలతో నుదరంబును జొచ్చిరి. చంద్రుఁడు మనస్సుతోను, బ్రహ్మబుద్ధితోను, రుద్రుఁడహంకారముతోను, హృదయముంబ్రవేశించిరి. కాని విరాట్పురుషుండు ప్రవృత్త్యున్ముఖుండుకాలేదు. అంత క్షేత్రజ్ఞుండు చిత్తంబుతో హృదయంబుఁ బ్రవేశింప నవ్విరాట్పురుషుండు సలిలంబునుండి యుత్థితుండయ్యె. ప్రసుప్తుండగు పురుషుని ప్రాణేంద్రియమనోబుద్ధు లెవ్వండులేక యుత్థాపనంబుచేయ సమర్థంబులుగాకుండునో యాప్రత్యగాత్మను యోగప్రవృత్తమైనబుద్ధిచేతను, భక్తిచేతను, విరక్తిచేతను, జ్ఞానంబుచేతను, నెఱింగి యాత్మయందు చింతింపనగునని చెప్పి మఱియుఁ గపిలుండిట్లనియె. 712

## అధ్యాయము 27.

### ప్రకృతి, పురుష, వివేకము,

కపిలుండు:—

సీ. నిర్వికారుండును నిర్గుణుండు నకర్త, యగుటచేఁ బ్రకృతిస్థుఁడయ్యుఁబురుషుఁ
డంబుబింబితుఁడగు నర్యముండుంబోలెఁ, బ్రాకృతగుణకదంబంబువలన
నిర్లిప్తుఁడై యుండు నిక్కువమైనను, నతఁ డహంకారమూఢాత్ముఁడగుచుఁ
బూనికర్తృత్వాభిమాన పూరితుఁడయి, ప్రకృతిగుణంబులఁ బట్టువడును

గీ. దానసిర్వృతినాత్మఁ జెందమినిబ్రకృతి, జన్యకర్మదోషంబులు సంభవించు
దేవమానవతిర్యగాదికసమస్త, జన్మలందుచుఁ గాంచు సంసారపదవి. 713

గీ. తల్లిరో! లేనిదయ్యు వాస్తవమునందు
విషయములను ధ్యానించుపూరుషున కెలమి
సంసృతినివృత్తిఁ గాకుండు స్వప్నమందు
మతిని భ్రమపెట్టు నర్థాగమంబువోలె. 714

గీ. కావున నసత్పథప్రసక్తమగుచిత్త, మల్లనల్లన నతితీవ్రమై చెలంగు
భక్తియోగముచేత విరక్తిచేత, వశ్యమొనరింపఁ గాఁ బూనవలయునెప్పుడు. 715

సీ. యమనియమాదికాష్టాంగయోగపథంబు, నభ్యసించుచును శ్రద్ధాన్వితుఁడయి
మత్పరంబగుభక్తితాత్పర్యమునఁజేసి, మత్కథాశ్రవణోద్యమంబుచేత
నిర్వైరమైయొప్పుసర్వభూతసమతన్, మౌనంబుచే స్వధర్మంబుచేత
చాగంబుచే బ్రహ్మచర్యంబుచే యదృచ్ఛాలాభతుష్టుఁడై శాంతుఁడగుచుఁ

గీ. బరిమితాహారుఁడు వివిక్తశరణుఁడునయి
సత్వమున నాగ్రహంబు నుంచక తనువునఁ
బ్రకృతి పురుషతత్త్వజ్ఞానభాసితుఁడయి
పురుషుఁడు మెలంగవలయు నీశరణి మఱియు. 716

వ. సంకల్ప వికల్పాది బుద్ధ్యవస్థలను నివర్తించి భగవద్వ్యతిరిక్త దర్శనంబులన్ దూరంబునఁ దొలఁగించి నేత్రేంద్రియంబుచే సూర్యునింబలె నాత్మదర్శి యాత్మచే నిర్ముక్త దేవాదిశరీరంబును, నిత్యజ్ఞాన స్వరూపంబును, బ్రత్యగాత్మబంధువును, నసత్ప్రపంచ ప్రకాశకంబును, సర్వానుస్యూతంబును, నద్వంద్వంబుననగు నాత్మను బొందును. స్థలస్థితుండగువానిచే జలస్థంబగు నాభాసంబు చూడంబడు తెఱంగు నను జలస్థంబైన స్వాభాసంబున సూర్యుం డంతరిక్షస్థితుండయ్యుఁ బ్రకాశించు

తెఱంగునను ద్రిప్రకారాహంకారయుతుండై భూతేంద్రియ మనోమయంబులగు స్వాభాసంబుల సత్యజ్ఞానాత్మకుండగు పరమేశుండు లక్షితుండగు. అసద్భూతంబులైన భూతసూక్ష్మేంద్రియ మనోబుద్ధ్యాదులు నిద్రచే లీనంబులుకాఁగ బురుషుండందు వినిద్రుండును, నిరహంకారుండునై యుండు. భూతాది విషయాహంకారంబు నష్టంబయ్యు నష్టుండు గాకుండియు నష్టునిగాఁ దన్ను మిథ్యాభాసంబునఁ దలఁచుచు, నష్టధనుండైన యాతురుండుంబలె ప్రకృతిసంబంధా హంకారంబున నష్టుఁడై యుండు. సాహంకారదృశ్యంబునకు నధిష్ఠానంబైన పురుషుండిట్లు పరామర్శించి యాత్మను బొందును. 717

దేవహూతి:—

బ్రహ్మస్వరూపా ! ప్రకృతిపురుషులన్యోన్యాశ్రయులగుటం బట్టి నిత్యులగుటం జేసియుఁ బ్రకృతి పురుషు నెప్పుడు విడువకుండుంగదా! పృథివికి గంధంబుఁబోలె జలంబులకు రసంబుంబోలెఁ బరమపురుషునకుఁ బ్రకృతి వ్యతిరిక్తంబుగాకుండు. అకర్తయైన పురుషునకు గుణాశ్రయంబైన యీ కర్మబంధంబు లెట్లు కలిగె. తత్త్వజ్ఞానంబుచే సంసారరూపంబైన భయంబు నివృత్తంబయ్యును బ్రకృతి సంబంధంబు నివృత్తికామిం జేసి క్వాచిత్కముగ వెండియుఁ దోఁచుచుండు. ఇట్లు ప్రకృతిగుణంబులు సన్నిహితంబులై యుండ వీనినుండి కైవల్యంబు పురుషునకెట్లు ప్రాపించుననఁ గపిలుండిట్లనియె. 718

భగవానుఁడు:—

సీ. విగతఫలాపేక్షమగు స్వధర్మంబుచే, నమలినమగు హృదయంబుచేత
మత్కథాశ్రవణ సంభరితమద్భక్తిచే, ప్రబలమైనట్టి విరక్తిచేత
జ్ఞానతత్త్వంబగు జ్ఞానసంపదచేత, ఘనతపోయుక్తయోగంబుచేత
నతిగాఢమైయొప్పు నాత్మసమాధిచేఁ, బురుషుని ప్రకృతి యద్భుతము కాఁగ
గీ. దలఁప రాత్రిందివంబు దందహ్యమాన,మగుచు నగ్నికారణమైన యరణివోలె
మందగతినిఁదిరోభావమొందుచుండుఁ,దల్లిరో! యింతయును యథార్థంబుసుమ్ము.

గీ. భుక్తభోగయాటను బరిత్యక్తయగుచు, నిరతమును దృష్టదోషయై పరఁగు ప్రకృతి
స్వమహిమమునందునున్న యీశ్వరున కెట్టి,నశుభము నొసంగఁజాలక
యణఁగియుండు. 720

మ. జననీ ! గాఢసుషుప్తపూరుషునకున్ స్వప్నంబు గల్పించుచుం
డు ననర్థంబులు పెక్కు బుద్ధునకుఁ గీడుం జేయ దొక్కింత య

జ్ఞానకుం బ్రాకృతదోషబంధములు పెకల్కుల్గల్గు సిద్ధంబ యీ
శునకున్ జ్ఞానికిఁ గర్మసాక్షికి మనఃక్షోభంబు లేదింతయున్. 721

గీ. తల్లి! యిట్టులు సువిదితతత్త్వుఁడగుచు, నెలమి నాయందు మనమునునిలిపినట్టి
జ్ఞానఘనున కాత్మారామునకును బ్రకృతి, సలుపఁ బోదహంకృతి నలుసంతయేని.

సీ. బహుజన్మపరిమితబహుళకాలంబున, నధ్యాత్మరతుఁడౌచు నన్నియెడల
సత్యాదిలోక సంజాతవైరాగ్యుఁడై, విమలమా మద్భక్తి వెలయుచుండి
తత్త్వమైన మత్ప్రసాదమునఁ బ్రబుద్ధార్థుఁ, డగుచు మదాశ్రయమైనతనర్చు
నిశ్శ్రేయసంబును నిజశుభస్థానంబు, కైవల్యధామమహాఘనపదంబు

గీ. సూక్ష్మదేహవిముక్తి నెచ్చోట కేగి, మగిడిరాకుందురో యట్టిమానితంబు
నాత్మదృగ్ఛిన్నసంశయంబైన దివ్య,పదముఁగాంచును ధీరుండుభద్రముగను.

చ. అరయ ననన్యహేతుకములౌ పృథుయోగ సమృద్ధమాయలన్
బొరయకయుండునెప్డు పరిపూర్ణనిమానస మద్దె మృత్యుని
ష్ఠురతరహాస మెచ్చటనుజొప్పడకుండునో యట్టి భవ్యమా
నిరతిశయ ప్రకృష్టగతి నిక్కముగా లభియించు వానికిన్. 724

---

## అ ధ్యా య ము 28.

### అష్టాంగయోగలబ్ధస్వరూపజ్ఞానము

భగవానుఁడు:—

క. ఏయోగవిధిఁ బ్రసన్నం,బై యుల్లము సత్పథంబునందునో మనువు
త్రీ! యట్టి సబీజంబౌ, యా యోగికలక్షణంబునభివర్ణింతున్. 725

సీ. అమలశక్తిని స్వధర్మాచరణంబును, బ్రబలవిధర్మనివర్తనంబు
శాంతబుద్ధి యదృచ్ఛాలాభసంతుష్టి, యాత్మ విచ్చరణసమర్చనంబు
గ్రామ్యధర్మనివృత్తి ఘనమోక్షధర్మ సుస్థితి వివిక్తస్థలసేవనంబు
మితమేధ్యభుక్తియు సతతంబుసజ్జన, సంగంబు సత్యభాషణనిరతియుఁ

గీ. దగ నహింస యస్తేయముతపము బ్రహ్మ
చర్యమున్ శౌచమును బురుషార్చనంబు
జాగ్రతయు యావదర్థపరిగ్రహంబు
నాసనజయంబు సమత స్వాధ్యాయము మఱి. 726

గీ. ప్రాణజయము స్థైర్యము బుద్ధియందు నింద్రి
యముల బల్మిఁ బ్రత్యాహారమమరఁ జేసి
యుంచుటయు స్వస్థలంబులనొక్కచోట
చిత్తమున బ్రాణధారణచేయుటయును. 727

వ. మఱియు వైకుంఠనాథుని లీలాభిధ్యానంబును, మనస్సమాధానంబును. నాత్మా కారత్వము మున్నగు కార్యంబులచేతను, దదన్యంబులగు వ్రతదానాద్యుపాయం బులచేతను, దుష్టంబు నసత్పథంబునగు మనంబును బుద్ధిచే మెల్లన జితప్రాణుండు నలసుండునై శుభాశ్రయపరంబుఁ గావింపవలయు. మఱియు జితాసనుండై సుపరి శుద్ధంబగు ప్రదేశంబున నాసనంబును బ్రతిష్ఠించి యందు స్వస్తికాసనంబున నాసీ నుండై ఋజుకాయుండునై సమ్యగ్విధానంబునఁ బ్రాణవాభ్యాసంబు చేయందగు. పూరక కుంభక, రేచకంబులఁ బ్రాతికూల్యంబుచేఁ జిత్తంబుస్థిరంబుఁగావించి వెం డియు నచంచలంబగునట్లు ప్రాణమార్గంబును బరిశోధింపవలె. జితశ్వాసుండైన యోగిమనంబు వాయ్వగ్నులచేఁ గరిగించఁబడిన లోహంబుఁబోలె నచిరకాలంబున రజోవిరహితంబై మాలిన్యంబువిడుచు. ప్రాణాయామంబుల దోషంబులం ద హించు. ధారణలచేఁ గిల్బిషములణంచు. ప్రత్యాహారంబున విషయసంగంబుఁ దొలగించు. ధ్యానంబుచే ననీశ్వరంబులగు రాగాదిగుణంబులఁ బోగొట్టు. అపేత రజంబగు మనంబు యోగసమాధియుక్తంబై యెప్పుడుండు నప్పుడు స్వకీయ నాసాగ్రావలోకనంబు సేయుచు భగవంతుని లీలావిగ్రహంబు నిట్లు ధ్యానింప వలయును. 728

సీ. శ్రీవత్సలాంఛనాంచితపీనవక్షునం, భోరుహ నవ్యపత్రారుణాక్షు
వికచాబ్జకింజల్కపీతకౌశేయు స,ద్భక్తజనావళిభాగధేయు
నమలప్రసన్నాననాంభోజు శతకోటి, మార్తాండసన్నిభమహితతేజుఁ
గాంచనకాంచీ గుణాంచత్పృథునితంబుఁ, బ్రణుతిపాత్రోజ్జ్వలద్గుణకదంబు
గీ. నలికులాంచితవనమాలికాభిరాము, నవ్యనీలోత్పలశ్యాము భవ్యధాము
వరకిరీటకేయూరనూపురవిలాసు, శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గభాసు. 729

సీ. వినివర్తితాశ్రితజనమనోమోహు సు,శ్యామలదేహు నాజానుబాహు
భక్తరాజీమనఃపద్మాసనాసీను, దివ్యప్రభాళిదేదీప్యమాను
సాధుసముత్కరసంరక్షణోత్కంఠు, కౌస్తుభాలంకృతకంబుకంఠు
స్వజనమనోనేత్రవర్ధనపారీణు, నార్తజనావనోద్యమధురీణు

ఆ. పాపకర్మజన శుభప్రదదర్శను, కీర్తనీయతీర్థకీర్తికలితు
ననఘుమతిఁ దరుణవయస్కు సముగాత్రుఁగు, ధ్యానమునొనరింపఁదగుఁదిరముగ.

క. అతిశుద్ధమనమునన్ స్థితు, గతు నాసీనుని శయానుఁ గానిమిగుల స
మ్మతిని గుహాశయుఁ బ్రేక్ష్యు, హితునిన్ ధ్యానింపవలయునింపు దలిర్పన్. 730

సీ. వజ్రపద్మాంకుశధ్వజహలచ్ఛత్రాది, భద్రలాంఛనగణముద్రితంబు
నిజశౌచనిస్సృతనిమ్నగాతీర్థంబు, మూర్ధధారణపరిపూతశివము
ధ్యాతృసంతతిమనఃపాతకసంఘాత, శైలవిసృష్టవజ్రాయుధంబు
నుత్తుంగశోణితయుతనఖచంద్రికా, హతభక్తజనహృదయాంధతమము

గీ. నాశ్రితజనకోట్యవనపరాయణంబు, సకలలోకసముత్కరశ్లాఘితంబు
నైనభగవంతు వరచరణాంబుజంబు, నమలమతిని ధ్యానింపఁగ నగుఁజిరంబు.

చ. వనజదళాయతాక్షి సురవందితపాదయు నవ్విధాతకున్
జననియునైనయిందిర నిజస్ఫురదూరువులందుఁ దాల్చి య
ల్లనఁ గరపల్లవంబులను లాలనఁ జేయఁగనొప్పు నా నిరం
జనుఁ డభవుండునైన విభు జానుయుగం బెడఁదం దలంపనా. 732

మ. అతసీపుష్పసమాభమున్ విహగరాడంసస్థితంబుం బ్రభా
యుతముం బూజ్యమునై తనర్చెడు తదీయోరుద్వయం బెన్న నా
క్షితిఁ జీరాడెడు పీతచేలము పయిన్ జెన్నారు కాంచీగుణాం
చిత సంశ్లిష్టనితంబ బింబము మదిం జింతించి ధ్యానింపనా. 733

గీ. ఆత్మయోని నికేతన మఖిలభువన, సద్మమైనట్టి పద్మ మెచ్చటజనించె
సకలలోకగుహోదరస్థమగు దేవ, దేవు నాభీహ్రదంబు చింతింపఁగనగు. 734

క. అనుపమ తేజోన్వితమును, మనోజ్ఞతరహారనిచయమండితముఁ బ్రభా
ఘనమరకతమణిసదృశ, స్తనయుగళముఁ బ్రీతినాత్మ ధ్యానింపఁగనా. 735

గీ. శ్రీ మహాలక్ష్మికిన్ శుభధామమగుచుఁ, బూరుషాళిమనోనేత్రమునకు మిగుల
నిర్వృతింగూర్చునట్టి యా సర్వలోక, నిలయు వక్షంబు ధ్యానింపవలయు మదిని.

గీ. అమలకౌస్తుభమణికి దివ్యాభరణము, నఖిలలోకవంద్యమునయి యలరునట్టి
శ్రీరమానాథు కంఠంబుఁ జిత్తమందుఁ, జేర్చి ధ్యానింపవలయు ఋషిప్రవరుఁడు.

క. ఘనమందరగిరిపరివ, ర్తనోజ్జ్వలీకృతవరాంగదములు భువనపా
లనివహసంశ్రితములునయి, తనరెడు హరిబాహువులను ధ్యానింపఁదగున్. 738

గీ. దుస్సహంబగు తేజంబుతో వెలుంగు, దశశతారచక్రంబును దలఁపవలయు
నా విభుకరాంబురుహరాజహంసమైన, శంఖరాజంబుఁ దలఁపనౌ స్వాంతమందు.

గీ. వైరిభటసాంద్రశోణితపంకలిప్త,మగు ముకుందుకౌమోదకి నమలమైన
యళికులాకులవనమాల నఖిలజీవ, తత్త్వమగు కంఠమణి నెదన్ దలఁపఁగనగు.

ఉ. కోమలమున్ స్ఫురన్మకరకుండలవల్గితనిత్యభాసమా
నామలసత్కపోలయుగళాంచితమున్ సముదారనాసమున్
శ్రీ మహితంబునై వెలుఁగు శ్రీరమణీశు ముఖారవిందమున్
దా మునిపుంగవుండు హృది ధ్యానముసేయఁదగున్ శుభస్థితిన్. 741

ఉ. శ్రీలలనానికేతనము స్వీయసమగ్ర మహావిభూతి మ
త్తాలి నిషేవితంబుఁ గుటిలాలకసంకలితం బధిక్షిప
ల్లాలితపద్మనేత్ర మకలంకము మీనయుగాశ్రయంబు సు
భ్రూలతికాయుతంబు నగు మోమును ధ్యానముసేయఁగాఁదగున్. 742

మ. కృపఁ దాపత్రయశాంతి కీక్షణయుగోత్సృష్టంబు నిర్దుష్టమున్
విపులానుగ్రహజుష్టమున్ గృతమనోభీష్టంబు నా శ్రీరమా
ధిపు స్నిగ్ధస్మితదీప్తిపుష్టివిలసద్దృష్టిన్ గతవ్యాజభ
క్తిపరుండై యతిపుంగవుండు మదిఁ జింతింపందగున్ ధీరతన్. 743

చ. అవనతసర్వలోకసముదగ్రశుగశ్రువితానభీషణా
ర్ణవపరిశోషమున్ సురుచిరాచ్ఛవిలాసము హాసమున్ ముని
ప్రవరులకున్ సుమాస్త్రునకుఁ గాఢవిమోహముఁ గల్గఁజేయుచున్
దవిలి స్వమాయచే విరచితంబగు తద్భ్రుకుటిన్ స్మరింపనౌ. 744

చ. బహుళతరాధరోష్ఠరుచిభాసిత సుందరదంతపంక్తియౌ
ప్రహసితమున్ స్మరింపఁదగు భావమునందు స్వకీయమౌ తనూ
కుహరనివిష్టుఁడై హరియకుంఠితరాగరసార్ద్రభక్తి స
న్నిహితమనస్కుఁడై ముని గణింపక యుండఁదగుం దదన్యమున్. 745

మ. భగవంతుండగువిష్ణునందు నుపలబ్ధప్రేముఁడై భక్తి నిం
పుగఁ జిత్తంబు ద్రవింప మేనఁ బులకల్ మోదంబునన్ వృద్ధిఁ జెం
దఁగ నుత్కంఠముదశ్రుపుల్ వొడమ నానందాబ్ధినోలాడి మె
ల్లగ యోగీంద్రుఁడు స్వీయచిత్తమనుగాలంబున్ విసర్జించెడున్. 746

సీ. అంతటనిర్విషయంబు ముక్తాశ్రయ,మును విరక్తంబునై మనసు వేగ
నర్చి మహాజ్యోతియందునుబోలె ని,ర్వాణంబుఁ జెందును బ్రహ్మమందు
నీ దశయందు యోగీశ్వరుండిమ్ముల, నపగతదేహాద్యుపాధియగుచుఁ
బరమపురుషునందు వ్యవధానవిరహితా, ఖండితాత్మంబును గాంచుచుండు

గీ. నీ మనోనివృత్తిరమచేనెలమిని సుఖ,దుఃఖ బాహ్యాస్వమహిమమందుం దనరుచుఁ దలఁచు సుఖదుఃఖభోక్తృతాధర్మకం బ, హంకృతి యటంచు యోగ లబ్ధాత్ముఁడగుచు. 747

చ. చెలువగుస్వస్వరూపమును జెందినసిద్ధుఁడు దేహ మొక్కెడన్
నిలుచుటయుం జరించుటయునిశ్చలరీతిని గూరుచుంటయుం
దొలఁగుట యాది సర్వము గనుంగొనఁబోఁడల మద్యపానవి
హ్వాలుఁడగు దుర్మదాంధుఁడు నపావృతవస్త్రమెఱుంగనట్లుగాన్. 748

శా. ప్రారబ్ధంబయినట్టికర్మగలపర్యంతంబు దేహంబు పెం
పారన్ దైవవశానుగంబగుచు సప్రాణాదికంబై మనున్
దారాపత్యయుతంబు స్వప్నసమమౌ తద్దేహమున్ గాన బోఁ
డారూఢోరుసమాధియోగుఁడగు లబ్ధాత్ముండు దాఁ బ్రమ్మతన్. 749

క. అనురక్తిని నాత్మత్వం, బున నభిమానించు మిత్రపుత్రులకంటెన్
మనుజుండు భిన్నుఁడగు వడు, వున దేహాదికముకంటెఁ బురుషుఁడు వేత్తా. 750

గీ. బ్రహ్మసంజ్ఞితుఁడగు భగవంతుఁ డాత్మ, ప్రకటభూతేంద్రియాంతఃకరణవిలసిత మగుప్రకృతికంటెఁ బార్థక్యమందిసారిది,నిత్యమునుద్రష్టయగుచు రాణిల్లుచుండు.

గీ. అఖిలభూతములందుఁదన్న ఖిలభూత,ములను దనయందుఁగాంచుచు యోగి ననన్య భావమునఁజేసి భూతనివహమునందు, నలమహాభూతధర్మంబునరయుచుండు.

గీ. జ్యోతియొక్కటియయ్యు స్వయోనులైన
కాష్ఠములఁ బెక్కువిధములఁగాఁగదోఁచు
పోల్కి నాత్మయు గుణభేదములను వివిధ
దేహములఁ బెక్కుగతుల వర్తిల్లుచుండు. 753

గీ. కావునన్ దుర్విభావ్యముదైవికమగు, సదసదాత్మికప్రకృతి నిచ్ఛాగతిం బ రాభవించుచు నాత్మ నిరంతరంబు, స్వస్వరూపంబుతోడ నొప్పారుచుండు. 754

---

## అధ్యాయము 29.

### భక్తియోగము

దేవహూతి:—

వ. దేవా! మహదాదిలక్షణంబును దత్త్వపరమార్థికంబునఁ దోపించు ప్రకృతి పురుషుల స్వరూపంబును, యన్మూలంబగుసాంఖ్యంబునఁ గథితంబై యుండునని చెప్పు

దురో యట్టి భక్తియోగమార్గంబును విస్తరించి నాకుంజెప్పుము. ఎద్దానఁ బురుషుంపు సర్వవిధంబుల పీతరాగుండగు నద్దాని వివరింపుము. వివిధంబగు జీవలోక సంసారంబును దెలియఁబఱుపుము. ఈశ్వరరూపుండవును బరాత్పరుండవును గాల రూపకుండవును నగు నీవు దేనివలన జనులు కుశలంబాచరింతురో యట్టి నీస్వరూపంబు నుగ్గడింపుము. దేహంబునందు మిథ్యాత్మాభిమానంబుగలిగి యజ్ఞుండై నిరాశ్రయంబైన తమంబునం జిరసుప్తుండును, గర్మలయందుశ్రాంతుండును, నగు జీవుని బ్రబోధించుటకొఱకు యోగభాస్కరుండవై తదనుబంధంబైన బుద్ధిని నీ వావిర్భవించితివిగదా కావున నాయడిగిన విషయంబులన్నియు విస్తరించి యాన తీయుము. 755

మైత్రేయుఁడు:—

క. అనియిట్లు జననిపలికిన, మనోజ్ఞమగు వాక్యములకు మదిమెచ్చి మహా
మునికపిలుఁడు సంప్రీతుం,డును గరుణార్ద్రుండునై యిట్టుల్ వాక్రుచ్చెన్. 756

గీ. భామినీ! భక్తియోగంబు బహువిధమయి
చెలఁగుచుండుఁ బ్రకారవిశేషములను
బూరుషులభావములు పృథగ్గ్యాతములయి
వెలయును స్వభావగుణవృత్తిభేదములను. 757

గీ. మది సహింసను దంభమున్మత్సరతను, దవిలి క్రోధపరీతచేతస్కుఁడగుచుఁ
గడఁగి నాయందు భిన్నదృగ్భావముంచు, ధరణిలో నెవ్వఁ డాతండె తామసుండు.

గీ. విషయములనెంచియైశ్వర్యవిభవములను,యశమునుందో ర్త నర్చించియవలనన్న
భేదబుద్ధిని బూజగావించు నెవఁడు, రమణిరో! విను మాతండెరాజసుండు. 759

గీ. కర్మనిర్హృతిఁజేసియోకర్మఫలము, పరమపురుషునియందు సర్పణము ప్రీతిఁ
జేసియో వలయునని యజించునెవఁడు, జగతి భిన్నమతిన్ వాఁడెసాత్త్వికుండు.

మ. తగుచందంబున మద్గుణశ్రవణమాత్రానన్ శుభాంగీ! యనం
త గుణాధారుఁడ నార్తరక్షకుఁడనోనాయం దవిచ్ఛిన్నరీ
తిగఁ జెల్వొందెడు సన్మనోగతి పయోధిం జేరు నా నిర్ఝరా
పగతోయంబులువోలె లీనమయి యొప్పారుం జుమీ నిచ్చలున్. 761

క. అవ్యాజ మవిచ్ఛిన్నం, బవ్యవహితమగుచును బరమాత్మునియందున్
భవ్యమయి వెలుఁగుభక్తికి, నవ్యయమగు లక్షణం బదాహృతమయ్యెన్. 762

వ. మఱియు మత్పూజనంబునం దక్క యోగిజనంబులు, సాలోక్యంబు, సాయుజ్యంబు, సామీప్యంబు, సారూప్యంబు, నను పదవులొసంగినను గైకొనంజాలరు.

ఎద్దాన ద్రిగుణంబుల కతీతుండై మద్భావంబుగాంచుచుండు నదియే యాత్యంతిక భక్తియోగం బని చెప్పంబడు. 763

సీ. సమ్యక్కృతఫలాభిసంధివిరహి స్వ, ధర్మంబు నిష్కామకర్మయోగ
మాదృతి మత్ప్రతిమాదర్శన స్పర్శ, పూజాభివందనంబులు నసంగ
సత్త్వ గుణంబునుసజ్జనబహుమాన, మాత్మసదృశమైత్రిదయార్తకృపయు
యమనియమంబు లాధ్యాత్మికానుశ్రవ, ణము నామసంకీర్తనంబుమఱియు

గీ. నధికవైరాగ్యమును నిరహంకృతియును, మున్నుగాఁగ మద్ధర్మియాపురుషుగుణచ
యంబుచేతను బరిశోధితాశయుఁడయి, కోరినన్నును శ్రుతమాత్రగుణునిఁబొందు

క. తనతావునుండి ఘ్రాణము, ననిలానీతమయి గంధమందెడు కరణిన్
ఘనయోగరతమయి మనం, బనఘుంబై తాన ప్రత్యగాత్మన్ బొందున్. 765

గీ. అఖిలభూతములందు భూతాత్ముఁడనయి, నలరుచుండు సర్వేశ్వరునాత్మ నన్ను
మొగి నవజ్ఞగావించి విమూఢుఁడగుచు,మర్త్యుఁడురక యర్చావిడంబన మొనర్చు.

చ. అరయక సర్వభూతములయందు నభిన్నత వెల్గుచుండు నీ
శ్వరుఁ బరమాత్ము నన్ను నిజభావమునందు నుపేక్షఁజేసి ని
బ్బరముగ నర్చలన్ నలుపువాఁడగునేనియు మానవుండు త
త్పరమతి భస్మగుండమునవమ్ముగ హోమము చేయువాఁడగున్. 767

మ. పరకాయంబున నున్ననన్నును ద్విషద్భావంబుతో నుండి బం
ధురభావంబున భిన్నదర్శియగుచున్ భూతాళివైరాను బం
ధరతుండై కడుమాయలం జెలఁగు నాదర్పిష్ఠు చిత్తంబు సు
స్థిరమై యుండమిఁజేసి భవ్యమగు శాంతిం బొంద దావంతయున్. 768

గీ. సుమధికద్రవ్యజక్రియాసమితిచే వ, మర్చితుఁడ నయ్యు భూతావమానినైన
మనుజు నయ్యర్చలం దుష్టిఁగానను నేను, పావన సుధీవిభూతి! యోదేవహూతి!

గీ. సర్వభూతములందునుసహృదయమున, నలరునన్నెంత దనుకఁ దానరయలేఁడొ
యంతదనుక స్వకర్మలనాచరించు, చీశ్వరుని నన్నుఁ బురుషుఁ డర్చింపవలయు.

క. పురుషకుఁ దనకు నొకింతం, తరమును గల్పించి భిన్నదర్శియగుచుఁ దాఁ
బరగెడు మానవునకు భీ, కరమగు మృత్యువును నేనుగల్పింతుఁ జుమీ. 771

గీ. అఖిలభూతములందు భూతాత్మకతను, గృతనికేతుఁడనగు నన్నుధృతి నభిన్న
దృష్టి దానమానములమైత్రింజెలంగి, యర్హమగునర్చ నరుఁడు సేయంగవలయు.

సీ. చేతనంబులు మే లచేతనంబులకంటెఁ, బ్రాణధారులు మేలువాని కంటె
జ్ఞానవంతంబు లవ్వానికంటెను మేలు, సేంద్రియంబులు శ్రేష్ఠమింతకంటె

స్పర్శవేదులకంటెఁ బ్రవరముల్ రసవేదు, లవు గంధవేదు లెయధికములగు
వీనికంటెను శబ్దవేదు లుత్తమములు, వీనికంటెను రూపభేదవిదులు

గీ. గణ్యములగును మఱి వానికంటె నుభయ, దంతయుతములు మేలయి దనరుచుండు
వానికంటె బహుపదముల్ ప్రవరములగు, వానికంటెను మేలి చతుష్పాదములగు.

క. చరణద్వయ సంయుతులై, పరగెడు నరు లంతకంటెఁ బ్రవరులు మఱి యా
నరులందు నాల్గువర్ణము, లు రహిన్ శ్రేష్ఠంబులై వెలుంగుచునుండున్. 774

సీ. వర్ణచతుష్టయిన్ బ్రాహ్మణుఁ డుత్తముం, డందు వేదజ్ఞుఁ డర్థవిదుఁడు
నధికులై యొప్పుదు రర్థజ్ఞుకంటెను, సంశయచ్ఛేత్త శ్రేష్ఠత్వముఁ గను
నాతనికంటె మేలగు స్వకర్మకరుండు, నిష్కాముఁడై ధర నెగడు ముక్త
సంగుండు శ్రేష్ఠుఁ డెన్నంగ నాతనికంటె, నవ్వానికంటెఁ దా నవ్యవహితుఁ

గీ. డై యశేషక్రియార్థదేహములు నాకు, నర్పణముఁ జేసి నాయందు నఖిలకర్మ
నిచయముంచి మదాత్ముఁడై నెగడు యోగ, యుక్తపూరుషుఁ డరయ సర్వోత్తముండు.

గీ. తలపఁగ నకర్తయును సమదర్శనుండు, నైన పరమాత్ముకంటె నన్యమగుభూత
మెందుఁ గానఁ గావున మది నీ సమస్త, భూతముల నాదరించుచున్ మ్రొక్కవలయు.

క. మనుపుత్రి! జీవరూపం, బున భగవంతుండు పరమపురుషుఁడు తగఁ జొ
చ్చె ననుచును భక్తియోగం, బును యోగముఁ దెల్పితిని సుబోధము గాఁగన్.

క. అందే దే నొకయోగము, పొంది నరుఁడు పరమపురుషుఁ బొందఁగవలయున్
పొందైన పరబ్రహ్మ, నందాత్మకరూప మిది కనన్ జనయిత్రీ! 778

వ. ప్రకృతి పురుషాతిరిక్తంబును, దద్వ్యతిరిక్తవివిధ రూపభేదాస్పదంబగు దైవంబు కాలంబని చెప్పంబడు. భిన్నదర్శులగు మహదాది భూతంబులకు నెవ్వనివలన భయం బుప్పతిల్లు నెవ్వాఁడు లోనఁ బ్రవేశించి యఖిలాశ్రయుండై భూతంబులచే భూతంబుల ఖాదించుచుండు నట్టి విష్ణ్వాఖ్యుండు, నధియజ్ఞుండుఁ, గాలస్వరూపుండు, సర్వప్రభుండునగు నప్పరమాత్మునకు నొకఁ డిష్టుండును, వేఱొకఁడు ద్వేష్యుండును, మఱియొకఁడు బాంధవుండును గాఁబోఁడు. 779

సీ. అప్రమత్తుండయి యాతండు సొచ్చి ప్ర, మత్తజనంబుల మట్టుపెట్టు
నతనిభయంబున ననిలంబు వీఁచుఁ ద, పించు సూర్యుండు వర్షించు వజ్రి
నక్షత్రగణము మానక వెల్గును వనస్ప, తులు లత లోషధుల్ చెలువు మీఱ
స్వస్వకాలంబులఁ బల్లవపుష్ప ఫ, లంబులఁ గొను నవశంబులగుచు

గీ. నదులు ప్రవహించుచుండు వననిధులు మేర, మీఱకుండు సశైలమై మేదినియు ని
మగ్నగాకుండు నగ్నియు మండుచుండు, శ్వాసమున కవకాశ మొసంగు నభము.

వ. మహత్తత్త్వంబు సప్తావరణావృతంబగు స్వదేహంబును లోకంబుగాఁ బ్రపంచించును. ఎవ్వరికిఁ జరాచరాత్మకంబగు నీప్రపంచంబు వశంబై యుండు నట్టి గుణాభిమానులైన దేవతలు సృష్ట్యాదులయందుఁ దద్భయంబునం జేసి ప్రతియుగంబునందుఁ బ్రవర్తింతురు. అనంతుండు నంతకరుండును గాలస్వరూపుండును ననాదియు నాదికరుండు నవ్యయుండునై యాభగవంతుఁడు జనంబుచే జనంబును జనింపంజేయుచు మృత్యువుచే నంతకు నంతంబు నొందించుచునుండు. ఇట్లు విశ్వం బెల్ల భగవదధీనంబై యుండునని చెప్పి కపిలుండు మఱియు నిట్లనియె. 781

## అధ్యాయము 30.

### కామిజనాధోగతిప్రాప్తి కథనము

కపిలుఁడు :—

ఉ. చాలితమయ్యు నాపవనశక్తిని మేఘచయంబెఱుంగఁగాఁ
జాలనిభంగి నీజగము సర్వవిధంబులచే బలాఢ్యుఁడున్
గాలమయస్వరూపుఁడు నఖండుఁడునౌ పరమేశు విక్రమం
బోలి మనంబులం దెఱుఁగ నోపదు చూ మనురాజపుత్రికా!. 782

క. తోయలి! సుఖకారణ మని, యాయాసముతోడ యద్యదర్థమ్ము గొనున్
మాయించు దాని నీశుం, డాయెడ శోకించు వానికై మర్త్యుఁ డెదన్. 783

చ. జనుఁడు విమూఢమానమతి నశాశ్వతరూపము సానుబంధమౌ
తనువున మోహముంచి గృహదారధనాదికముల్ ధ్రువంబటం
చని తలపోయుచుండు మఱి యాయయి జన్మల నొందుచుండి యా
తనువులయందుఁ బొందఁడు నతంబును నిర్వృతియున్ విరక్తియున్. 784

క. నరకస్థుఁడయ్యుఁ దనువును, బురుషుఁడు విడనాడఁజూడఁ బోఁడింతయు దు
స్తరభూరి దేవమాయా, పరిమోహితుఁడౌట నధిక పామరుఁ డగుటన్. 785

మ. తన జాయాసుత బంధుగేహపశు విత్తవ్రాతమందున్ బ్రస
క్తనిరూఢాత్మకుఁడై జనుండు తనుఁ దా ధన్యాత్ముఁగా నెంచు నం
తన తత్పోషణమాదిగా వెతలచేఁ దంతప్యమానాఖిలాం
గనికాయుండయి దుష్టతన్ దురితముల్ గావించు వేభంగులన్. 786

సీ. అసతులౌ స్త్రీలు రహస్స్థలంబులఁ, బాయక కావించు మాయచేత
నవ్యక్తమధురము లాహ్లాదకరములౌ, బుడుతల బుడిబుడి నుడులచేత

నాక్షిప్తహృదయేంద్రియచయుఁడై దుఃఖప్రధానంబులును గూటధర్మములగు,
నాలయంబులయందు ననలసత్వమున దుఃఖప్రతిక్రియ సేయఁగడఁగుచు గృహి
గీ. తన్ను సుఖవంతుఁగా నాత్మఁదలఁచుచుండు, నార్జిత ధనంబుచే హింసలాచరించి
తన యధోగతి హేతువౌ దారసుత గృ, హాదివర్గముఁ బెంచు శేషాశియగుచు.

క. ప్రారబ్ధమగుచు సారెకు, సారెకు లోపించువృత్తి చక్కఁబఱప ని
స్సారుండయి లోభసమవ, ధీరితుఁడయి పరధనము మదిన్ వాంఛించున్. 788

మ. జడచిత్తుండు కుటుంబపోషణమునన్ సామర్థ్యముం బాసి దీ
నుఁడు మోఘోద్యముఁడుం గ్రియారహితుఁడున్ శూన్యాత్ముఁడున్ మందభా
గ్యుఁడునై యూరక చింతఁ జేయుచును నిట్టూర్పుం గళత్రాదులున్
బడుగెద్దుం గృషికాళివోలె నతనిన్ మన్నింప రావంతయున్. 789

క. ఐన నటన్ నిర్వేదము, పూనకయ స్వయంభృతజనములచే భృతుఁడై
తాను ముదిమిన్ విరూపుం, డై నరుఁడు గృహమ్మున మరణాభిముఖుండౌ. 790

చ. మిగుల నవజ్ఞచేఁ దన సమీపమునం దిడినట్టి యోగిరం
బు గృహముఁ గాయు కుర్కురమువోలె భుజించుచు నల్పచేష్టుఁడై
తెగులున గ్రుగ్గుచున్ జఠరదీప్తి యడంగఁగ స్వల్పభోజియై
పొగులుచు దీనవృత్తిని విమోహముఁ జెందుచునుండు నెంతయున్. 791

సీ. వాతప్రకోపంబుచేత నుద్గతనేత్రుఁ,డును కఫరుద్ధకంఠుఁడును మఱియు
శ్వాసకాసోత్థితాయాసుఁడై గొంతులో, 'గుఱుగుఱు'మనియెడుగుఱక వుట్టఁ
బడియుండి తనమీఁదఁబడి బంధుజనులెల్ల, విలపించుచుం దన్నుఁ బలుకరింపఁ
బలుకనేరక కాలపాశవశంగతుఁ,డగుచుఁ గాలును గేలు నవశములయి
గీ. యుండ మూవవ్వుఁ డిట్టు లార్తుం డగుచును
నిజకుటుంబపోషణమగ్న నిఖిలవిహ్వ
లేంద్రియుండయి స్వజనులయేడ్పులన్ స్వ
బుద్ధి యడుగంటగాఁ దనువుం ద్యజించు. 792

క. సరభసనేత్రుల యమకిం,కరుల భయంకరుల జూప కంఠాగతులన్
బరికించుచు నుక్కిరిబి,క్కిరియై యవశత విడుచు శకృన్మూత్రములన్. 793

గీ. యాతనాదేహమున నున్న యతని బల్మి
మెడకుఁ బాశంబులం జుట్టి కడిమిఁ బట్టి
దండ్యులన్ రాజభటులు చందమున వారు
పొడవగు పథమ్మునం గొని పోవుచుండ్రు. 794

గీ. ఇచట స్వకళేబరంబు త్య ఽ జించి భూత
సంతతిద్రోహమునఁజేసి ఽ సంచితమగు
పాతకమె దారిబత్తెమై ఽ పరఁగఁద్రోవ
నొక్కరుఁడె పోవు మానవుఁ ఽ డో శుభాంగి! 802

గీ. అవహృతధనుండువోలె దా ఽ నాతురుఁడయి
తన కుటుంబ పోషాఘ సం ఽ జనిత ఫలము
దైవబలమునఁ బ్రాప్తమా ఽ దాని జడుఁడు
నిరయమున నొందెడున్ జన ఽ నీలలామ! 803

గీ. ఇట్టులు స్వయంకృతంబులై ఽ నట్టిపాప, జాలములకు ఫలంబుగా ఽ సకలమైన
యాతనలఁ దాఁ గ్రమంబుగ ననుభవించి, శుద్ధుఁడై నరజన్మ గాంచును మఱిభువి.

## అ ధ్యా య ము 31.

### మానవజన్మప్రాప్తి

భగవానుఁడు:—

సీ. దైవగతిం బ్రవ ఽ ర్తకమగుకర్మచే, దేహసంపర్కంబు ఽ తిరిగిపొందఁ
దలపోసి పురుషరే ఽ తఃకణాశ్రయుఁడయి, స్త్రీగర్భమునఁ బ్రవే ఽ శించి జీవుఁ
డొకరాత్రి కలిలమైయుండు బుద్బుదమగుఁ, బంచరాత్రుల దశ ఽ వాసరములఁ
గర్కంధురూపంబుఁ ఽ గాంచుఁబిమ్మటనగు, మాంసపిండం బొక ఽ మాసమునను

గీ. శిరము మాసద్వయంబునఁ ఽ గరపదాది, కాంగతతి మూఁడునెలల నఖాస్థిరోమ
చర్మములును లింగచ్ఛిద్రసంభవంబు, నెలలునాల్గింట సప్తధాతులను దాల్చు.

గీ. పంచమాసంబులన్ క్షుత్పిపాస లొదవు
మాసషట్కమునందుఁ దామావిఁబొదువఁ
బడియుఁ గుక్షిలో దక్షిణ ఽ భాగమందుఁ
దిరుగుచుండును వింటివా ఽ దేవహూతి! 806

గీ. సప్తమంబగునట్టిమాసంబునందు, గతములౌ జన్మకర్మ సంతతుల నెల్లఁ
దలఁచి దేహంబు నాత్మబంధంబు మదిని, జీవుఁడుస్మరించుచుండు నిశ్శ్వసముగను.

గీ. మాతృభుక్తాన్నపానైధమానధాతు, వగుచు జంతుసంకీర్ణము ఽ ననభిమతము
నైన మలమూత్రగర్తంబు ఽ నందుఁ బండి,యుండునాజీవుఁ డంత నిరుత్సుకతను.

గీ. అటఁ గ్రిమిక్షతసర్వాంగుఁ ƒ డగుటఁ నధిక
సౌకుమార్యంబునం బ్రతిక్షణము మూర్ఛఁ
జెందుచుండును ఖిన్నుఁడై ƒ జీవుఁడు వెతఁ
గుందుఁ బూర్వజన్మకృతంబు ƒ లం దలఁచుచు. 809

క. అట జననీభుక్తములగు, కటుతీక్ష్ణోష్ణలవణములు ƒ క్షారంబులునా
చటులోల్బణరసములను, త్కటసర్వాంగోత్థితార్తి ƒ కలితతనుఁడగున్. 810

ఉ. మావినిఁజుట్టఁగాఁబడి స్వ ƒ మస్తము గర్భమునందుఁ జొన్పియున్
బ్రేవులపోవులన్ వెలిఁ బ ƒ రీవృతుఁడౌచు స్వకీయ పృష్ఠమున్
గ్రీవయుఁ గుంగ సంగతితి ƒ నిం గదలింపఁగలేక యాతురుం
డై విహగంబు పంజరము ƒ నందునుబోలె నడంగియుండెడున్. 811

గీ. దైవవశమునఁజేసి లబ్ధస్మృతియయి, యూష్పవుచ్చుఁదెఱపిలేక ƒ యుత్కటతర
జన్మశతభవకర్మముల్ ƒ సంస్మరించు, చందు జీవుఁడే సుఖముఁ దా ƒ నంద లేఁడు. 812

గీ. అందునేడవమాసంబు ƒ నాదినుండి, ప్రాప్తబోధుఁడై సూతికా ƒ వాతములఁ బ్రి
చలితుఁడగుచు సహోదర ƒ జన్మమైన, క్రిమిగతిన్ దిరిగెడు నలు ƒ గెలఁకులందు. 813

గీ. తప్యమానుండు దేహాత్మ ƒ దర్శి సప్తవర్ధిభీతుండునా జీవుఁ ƒ డర్థిఁ గేలు
మోడ్చి యీరీతిఁ దను గర్భ ƒ మునను నిలిచిన, యట్టివిభు వ్యాకులోక్తుల ƒ నభినుతించు.

జీవుఁడు:—

చ. అవమతినైన నాకుఁ దగు ƒ నట్లుగ నీదృగవస్థఁ జూపెఁ దా
నెవఁడు ప్రపన్నమైన జగ ƒ మెల్లను బ్రోచుటకై యథేచ్ఛమై
వివిధ తనువ్రజంబును భు ƒ విన్ ధరియించెడు నట్టి విష్టర
శ్రవు నకుతోభయాంఘ్రిజల ƒ జంబును నే శరణంబు వేడెదన్. 815

సీ. భూతేంద్రియాత్మక ƒ భూరిమాయం బూని, యేవిశ్వవిభుఁడు క ƒ ర్మావృతుండు
బద్ధుండునుంబోలె ƒ బరఁగుచీమాత్రదే, హంబున యందుఁ దా ƒ నణఁగియుండి
తంతప్యమానచి ƒ త్తమునఁదోఁచునోయవి, కారుఁడు శుద్ధుఁ ƒ డఖండబోధుఁ
డు నగు నాహరికి మో ƒ ద్దుంగేలు పంచభూ, తరచితతనువునం ƒ దదప్రహితుఁడ

గీ. నయ్యుఁగప్పంగఁబడి యింద్రి ƒ యగుణసముద
యార్థచిద్రూపుఁడను నే న ƒ హార్యమహిముఁ
బ్రకృతిపురుషవిభిన్ను నిం ƒ బరమపురుషు
నమలునాయీ ఋషి శ్రేష్ఠు ƒ నభినుతింతు. 816

చ. తతమగువిష్ణుమాయ విగతస్మృతియై గుణకర్మబద్ధ సం
సృతిపథమందుఁ గ్లిష్టతఁ జరించుచు జీవుఁడు దాను శ్రీరమా
పతి యనుకంపలేక నిరపాయతఁ గ్రమ్మఱఁ బొందఁ జాలునే
హితమగు స్వస్వరూపగతినే ఘనయుక్తిని బూని యేనియున్. 817

సీ. ప్రాణితనూకుహరంబున జఠరాగ్ని, పృథుతప్తదేహుఁడున్ రుధిరమూత్ర
మలకూపపతితుఁడై నెలలలెక్కించుచు, నందుండి వెడలంగ నభిలషించు
చెప్పుడునన్ను బహిర్గతు గావింతు,పరమేశ! యనుచు గృపణమతియయి
యతికృపాళుండవు నసదృశుండవునగు, నీవలనం బదినెలలలోన

గీ. జీవు నీదృశజ్ఞానంబు జెందునొరుల, వలనఁగాదు వరద! కృతోపకృతినైన
నీకు నెవఁడంజలిం దక్క లోకమందుఁ, బ్రత్యుపకృతినిఁ దానొనర్పంగఁగలఁడు.

మ. కడుదుఃఖంబులతో వసించుచును దగ్గర్భంబునందుండి వె
ల్వడఁజాలన్ బహిరంధకూపమునకున్ వ్యాపించుఁగా యందు న
ల్గడలన్ దైవికమాయ దాన సతముం గాయాత్మబుద్ధిన్ మహా
జడతన్ నేనుభ్రమించుచుందు నకటా! సంసారచక్రంబునన్. 819

ఉ. కానఁ ద్యజించి వ్యాకులత గ్రక్కున సారథిరూపబుద్ధిచే
నేను దమోమయంబగుచు నేఁచు భవంబుననుండి యాత్మనుం
బూని సముద్ధరింతునిఁక బూజితవిష్ణుపదుండనైన నా
కీ నరకోపమంబు గడు హేయమునౌ వ్యసనం బడంగుతన్. 820

కపిలుఁడు:—

సీ. గర్భగోళమున నీగతిఁ గృతమతియైన,జ్ఞాని జీవి దశమాసములు గడపి వఁ
దత్సమయ ప్రేరితఘనప్రసూతిమారుత తరంగములు భూపతనమున క
వాఙ్ముఖుఁ గావించు వాయ్వధఃక్షిప్తుఁడ,ధశ్శిరుండును విగతస్మృతియును
వ్యాకులుండునునిరుచ్ఛ్వాసుండునై యతి,కష్టంబుచే వినిర్గతుఁడగుమఱి

గీ. యిట్లు భూపతితుండై యసృగ్విలిప్తుఁ,డగుచుఁ గ్రిమిగతిఁ జేష్టలనాచరించు
జ్ఞానమంతయు నణఁగఁ దత్సమయమందుఁ,బొరలి యేడ్చునువిపరీతబుద్ధియగుచు.

క. తనభావంబు నెఱుంగని, జనములచేఁ బెంచఁబడుచు సవ్యథుఁడై తా
ననభిప్రేతంబును వల,దని కడఁక నిరాకరింప నసమర్థుఁడగున్. 821

గీ. మశకమత్కుణదూషితమతినవస్త్రు, కలితమైన పర్యంకభాగంబునందు
శాయితుండయి కండులస్వాంగములను, గోకికొనుటకు నే నశక్తుఁడయి యుండు.

గీ. అపగతజ్ఞానుఁడై యేడ్చుచుఁ బట్టివానిఁ, గోమల త్వచు దంశమత్కుణమశకము
లాదిగాఁ గీటకంబులు వ్యథపఱచును, గ్రిమిసమూహంబులు మ్రింగిడి క్రిమిని బోలె.

వ. ఇట్లు శైశవం బనుభవించి పిమ్మట దుఃఖకరంబగు పౌగండావస్థను గడపి యప్రాప్త మనోరథుండై యజ్ఞానంబునఁ బరివృద్ధకోపుఁడై శోకకలితుండగు. పదంపడి వర్థమానంబగు దేహంబుతోడను, మానంబుతోడను, గోపంబుతోడను గూడి కాముకుండై స్వనాశమ్మునకై కాముకులయెడ విరోధంబు పాటించు. పంచభూతారబ్ధమైన దేహంబునందు దేహి యజ్ఞానియై యహంకారమమకారంబులచే మోహంబుగల్గియుండు. మఱియు బద్ధుండై సంసారకారకంబులగు కర్మంబులాచరించుచుండు. క్లేశంబునొసంగు నవిద్యాసంబంధికర్మబంధంబులం దగిలియుండు. శిశ్నోదరకృతోద్యములగు నసజ్జనులచే నపమార్గంబునఁ జొనుపఁబడి పూర్వంబునంబలె జనుం డజ్ఞానంబునం బడు. 825

గీ. సత్యమును మానమును దయ శౌచము మతి
హ్రీయుఁ గీర్తియు క్షమయును శ్రీయు మఱియు
శమము దమము భగంబు నాఁ జనుగుణములు
సంక్షయము నొందు దుర్జనసంగమునను. 826

గీ. జడులు దేహాత్మబుద్ధులు శాంతులునయి, మెలఁగెడు నసజ్జనులతోడ నలుపరాదు
సంగ మెక్కుడు వ్వాఁడే నడి జరుపఁ దగదు, తగిలి క్రీడామృగంబులై తముగువలందు.

గీ. అంగనలసంగమునను దత్సంగిసంగ,మునను గలిగెడునట్లులు మోహబంధ
ములు మదిం దలపోయఁగాఁ బూరుషునకుఁ, గలుగఁగాఁ జాల వన్య
సంగంబు కతన. 828

మ. మృగిరూపంబును గొన్న యాత్మదుహితన్ వీక్షించి తద్రూపమోహగతుండై మృగరూపియై యజుఁడు వెన్నాడెన్ గతహ్రీకుఁడై
మగవాఁ డెవ్వఁడు లోఁగకుండు దరుణీభ్రమయ్యుజ్జ్వలన్మాయ నెం
చఁగ నారాయణుఁ డొందుదక్క విధిసృష్టంబౌ ప్రపంచంబునన్. 829

చ. అమితపరాక్రమంబున దిగంతజయంబును గొన్న శూరులన్
బొమముడిమాత్రి స్త్రీయపథముల్ వెనఁబట్టఁగఁ జేయఁ జాలు దు
ర్దమమహిళామయంబగుచు రాజిలుమత్ప్రభు మాయశక్తిఁ జూ
డుము జననీమణీ! యిది కడుం గడు దుస్తరమౌ జనాళికిన్. 830

మ. నిరయద్వారమటంచుఁ గోవిదులు దేనినిం బల్కుచుం దారి సుదు
స్తరరూపప్రమదాళిసంగ మెప్పుడేన్ సల్పంగరా దింతయున్

జిరకాలావిరతప్రవృత్తగురు మత్సేవోపలబ్ధాత్మలా
భరతుండై యురుయోగసారము గనన్ వాంఛించు మర్త్యుం డిలన్. 831

క. శనకై ర్గతి నమ్మాయాం,గన దైవికముగను దనదుకడ కే తేరన్
గని తృణసంవృతకూపం,బును గైవడి నాత్మమృత్యువుగఁ దలపఁదగున్. 832

వ. మన్మాయచేఁ బురుషత్వమును బొందుజీవుం డనవరత స్త్రీసాంగత్యంబునం జేసి విత్తాపత్యగృహాదిప్రదంబగు స్త్రీత్వంబును, స్త్రీత్వంబునుబొందిన జీవుండు డనవరతపురుషసాంగత్యముచే విత్తాపత్యగృహాది ప్రదంబగు పుంస్త్వంబును బొందు. మృగయునిగానంబు సుఖప్రదంబని భావించు మృగంబుపోలిక ధనాపత్య గృహాత్మకంబైన సంసారము సుఖాస్పదంబని భావించి జీవుండు మృత్యుబద్ధుండగు. జీవోపాధిభూతంబగు లింగదేహంబున లోకాలోకంబులం జరించుచు బురుషుం డవిరతకర్మంబుల ననుభవించుచు నాచరించుచుండు. ఈ పురుషునకు జీవోపాధి భూతంబగులింగదేహం బనుయాయి దేహంబు. అదిభూతేంద్రియ మనోమయంబు. తన్నిరోధంబు మరణంబు. తదావిర్భావంబ జన్మంబు. ద్రవ్యోపలబ్ధిస్థానంబులగు చక్షురాదిగోళకంబులకు రూపాదిదర్శనంబునందుఁ గాచకామలాది దోషంబున నయోగ్యతవాటిల్లిన ట్లహమ్మానమ్మునఁ బంచత్వంబును ద్రవ్యదర్శనంబున నుత్పత్తియుఁ గల్గుచుండు. గోళకాయోగ్యతవలన నింద్రియాయోగ్యత సంభవించునట్లు స్థూలసూక్ష్మశరీరవైకల్యంబ జీవమరణంబుగఁ గల్పింపఁబడుఁగాని స్వతస్సంపన్నంబుగాదు. పురుషునకు నింద్రియంబులు స్వగతంబైన సుఖదుఃఖప్రదంబును గల్గించుచుండు. ఆత్మ కేవలజ్ఞానరూపంబు. దేహాదికం బసజ్జడపదార్థంబు. కావున సుఖదుఃఖంబు లాత్మకుంగాని దేహమునకుఁగాని కలుఁగనేరవు. 833

క. కావున మనమునఁ బూనం,గావలవదు సంభ్రమభయకార్పణ్యంబుల్
జీవగతి నెఱిఁగి మెలఁగం,గావలె సంగముత్యజించి కడుధీరుండై. 834

గీ. యోగవైరాగ్యయుక్తయభ్యుచితసాధు, దర్శనియునైన బుద్ధిచేతం గళేబ
రంబునొల్లకమాయావిరచితమగు జ,గమ్మున విరక్తిఁగొని మెలఁగంగవలయు.

---

## అ ధ్యా య ము 32.

సాత్వికధర్మోపలబ్ధోర్ధ్వగతి. తత్త్వజ్ఞాన విహీనపునరావృత్తి

భగవానుఁడు:—

క. గృహముననే వసియించుచు, గృహపతి ధర్మార్థకామ వృత్తిక్రియ సం
గ్రహమును గావించుచు న,న్నహమును యత్నించుచుండు వానికొఱకునై.

సీ. పుడమిఁ గేస్తుఁడు కామ్యమూఢుఁడై భగవదా, రాధనరూపధర్మంబునం బ
రాఙ్ముఖుండగుచు నక్రతువులచేతను, దేవతలనుఁ బితృదేవతలను
శ్రద్ధాసమేతుఁడై సమ్మతితోఁ గూడి, యజియించుచుండు సమంచితగతి
నీరీతి దేవపితృవ్రతుండై యజ, న్రింబు దా నింద్రియార్థంబులందుఁ
గీ. గామపరుఁడయి చంద్రలోకంబునందుఁ, జేరియట సోమపానంబు చేసి తిరిగి
యా యభాగ్యు స్వీయపుణ్యంబు క్రమత, క్షీణమై పోవుడుం బ్రవేశించు నిందు.

గీ. ఎప్పుడనంతాహిశయ్యాయం దీశుఁడు హరి, యోగనిద్రాగతుండయి యొప్పుచుండు
నప్పుడె గృహమేధిజనుల సమస్తలోక, చయములున్ వీకతోడ విలయముఁ జెందు.

సీ. ధీరులు కామసిద్ధికి స్వధర్మంబును, వమ్ముసేయక భగవత్సమర్పి
తాఖిలకర్ములు నమల మనస్కులు, వీతసంగులును నివృత్తి ధర్మ
పరులు నిర్మములును నిరహంక్రియులునై స్వ, ధర్మాఖ్యమైన సత్త్వంబుచేతఁ
బరిశుద్ధమైన సద్భావంబుచేతను, బురుషుని సర్వతోముఖుఁ బరావ
గీ. రేశు, జగదుద్భవస్థితినాశహేతు, నజు, ననంతు, ననాది, నవ్యయు రమేశు
ముదమెలర్ప సూర్యద్వారమునను బొంది, యపునరావృత్తిపదవి నొప్పారుచుంద్రు.

వ. మఱియు ద్విపరార్ధావసానంబగు బ్రహ్మప్రళయ పర్వతంబు పరమేశ్వరదృష్టిచేత
హిరణ్యగర్భోపాసకులగు వారలు లోకంబు నధివసించుచుందురు. పృథివ్యప్తేజో
వాయ్వాకాశమానసేంద్రియార్థ భూతాదులం గూడిన బ్రహ్మాండంబు నుపసంహరిం
పంగోరి స్వాయంభువుండగు పరమేశ్వరుండు ద్విపరార్ధలక్షణంబగు కాలం బనుభ
వించి యవ్యాకృతంబుం జొచ్చు. ఇట్లు పైతత్త్వంబును బొంది భగవంతుండగు
హిరణ్యగర్భు ననుసరించి చొచ్చుచు జితమనఃప్రాణులై విరక్తిం జెంది గతాభి
మానులై యాహిరణ్యగర్భుం గూడి యమృతస్వరూపుండును, బురాణపురుషుఁడు
నగు పరబ్రహ్మంబునందుఁ జేరుదురు. 840

గీ. కావునన్ సర్వభూతహృత్కంజకృతని, కేతుఁడు శ్రుతప్రభావుఁడునైన తనర్చు
పుండరీకాక్షు శరణంబు పొందుమంబ!, ప్రవిమలంబగు భక్తిభావంబుతోడ. 841

సీ. స్థిరచరాద్యుండయి చెలువొందు వేదగ, ర్భుండల యోగీశ్వరులు ఋషులును
యోగప్రవర్తకుల్ యోగసిద్ధులు నాకు, మారులతో నభిమానమునను,
గడు భేదదృష్టి నిష్కామకర్మంబునఁ, బ్రథమంబునందు రపారమేష్ఠ్య
మైన యైశ్వర్యంబు నంది పదంపడి, సగుణుఁడౌ పురుషుని సంక్రమించి

గీ. మొనసి ప్రతికాలమం దీశమూర్తిచే గు, ణవ్యతికరంబు గల్గుచుం గ్రిమ్మఱంగఁ
ద్రొల్లి వలె బ్రహ్మపదవిఁ గ్రతుఁడయి చెలఁగు, ఋషులు నట్లు స్వస్వపదాధికృతు
లగుదురు. 842

సీ. కర్మసక్తాత్ములై కడు శ్రద్ధఁ గొందఱు, ప్రతిషిద్ధనిత్య కర్మములొనర్తు
రజితేంద్రియులును గామాత్ములునై రజః, కుంఠితబుద్ధితోఁ గూడి గృహము
లందనుదినము యజియింతురు పితృదే, వతలను సంసక్తభావులగుచుఁ
గథనీయభూరి విక్రముఁడగు మధువైరి, విమలసత్కథలందు విముఖులగుచుఁ

గీ. బరఁగుచుండు పూరుషులు ద్రైవర్గికులని, యందు రచ్యుత దివ్యకథామృతంబు
విడిచి విధిహతి దుష్కథల్ వినుచునుందు, రూరపంది పురీషముఁ గోరురీతి. 843

గీ. అర్యముని దక్షిణాయనమందునుండి, వారు పితృలోకమును వేగఁ జేరు చంద్రు
కడపటను క్షీణపుణ్యులై క్రమ్మఱంగ, బడుదు రీలోకమున విధిప్రహతులగుచు.

గీ. ఆత్మనందనులకును దా మాత్మజులయి, సంభవించుచు వారవశత్వమునను
వింతగా శ్మశానాంతపర్యంత మిచటఁ, బనులు గావించుచుందురు జనని! వింటె.

క. కావున నీవు వినిర్మల, భావంబున వందనీయ పాదాంబురుహున్
శ్రీవిభుని సద్గుణాశ్రియు, వావిస్తృతభక్తితో సమర్చింపు తగన్. 846

గీ. వాసుదేవునియందు సంకల్పింగఁబడిన, భక్తియోగంబు గూర్చు నవ్వారిగాఁగ
గాఢవైరాగ్యమున్ సమారూఢ బ్రహ్మ, దర్శనజ్ఞానలాభముం దల్లి! వినుము. 847

చ. అవికలమైన భక్తహృదయంబు ప్రియంబిది యప్రియం బటం
చు విషమభావసక్తమగుచున్ సకలేంద్రియవృత్తులన్ సమా
ర్థవితతులందుఁ దానెపుడుఁ దప్పఁ దలంపక యుండు నద్దె సం
గవిరహితంబు రూఢము నఖండము నా పరమాత్మముం గనున్. 848

వ. జ్ఞానమాత్రుండును, బరబ్రహ్మస్వరూపుండును, బరమాత్ముండును, బరమపురుషుండు నగు నీశ్వరుండు దృశ్యాదులచేత భిన్నంబుగాఁ దోఁచు. యోగీశ్వరునికి సమగ్రయోగంబుచే నేతావన్మాత్రంబైన యభిమతార్థంబు ప్రాప్తంబగుచుండు. పరాఙ్ముఖంబులైన యింద్రియంబులచే నేకరూపంబును, నిర్గుణంబును, జ్ఞానస్వరూపంబునగు బ్రహ్మంబు మనోవిభ్రాంతిచే శబ్దాదిధర్మకంబగు నర్థరూపంబునఁ దోఁచుచుండు. అహంకారరూపకంబై త్రివిధంబును, భూతాత్మకంబై పంచవిధంబును, నింద్రియాత్మకంబై యేకాదశ విధంబునై యుండు జీవరూపుండైన విరాట్పురుషుండు జీవశరీరంబగు బ్రహ్మాండంబునఁ దోఁచుచుండు. ఈ పరబ్రహ్మం

బును శ్రీద్ధాభక్తి యోగాభ్యాసంబులచేత నిత్యంబు సమాధియుక్త చిత్తుండును
నిస్సంగుండును, విరక్తుండై నవాఁడు గాంచుచుండు. 849

క. మాతరో! తెల్పితి నిట్లు, త్యాగతమగు ప్రకృతిపురుషతత్త్వము దీనన్
ద్యోతకమగుచుండుఁ బరీ, క్షితము జ్ఞానమ్ము బ్రహ్మబోధకమగుచున్. 850

గీ. నిర్గుణజ్ఞానయోగ, మనన్యనిష్ఠభక్తి, యోగములు దెల్పఁబడియె నిక్కఁసరోరు
హాక్షి! విను భగవచ్ఛబ్దలక్షణమగు, నొకప్రయోజనమె యగు రెంటికిని జూడ.

గీ. అఖిలరూపరసాదిగుణాశ్రియమగు, నర్థము విభిన్న భావేంద్రియములఁబోలె
నోజ నానాత్వమొందుఁదానొక్కఁడయ్యు, వాసుదేవుండు బహుశాస్త్ర
వర్త్మములను. 852

సీ. పూర్తక్రియాయాగభూరిదానంబులఁ, దతతపస్స్వాధ్యాయదర్శనములఁ
జిత్తేంద్రియజయంబుచేతనుగర్మస, న్యాసంబుచేత నష్టాంగసహిత
యోగంబుచే భక్తియోగంబుచే సకామ విగతకామ కర్మములచేత
పూర్ణాత్మతత్త్వావబోధంబుచే దృఢ,సిద్ధవైరాగ్యంబుచేత నెవఁడు

గీ. తాఁ బ్రవృత్తినివృత్తులఁదనరుచుండు, నట్టిపురుషునకున్ సగుణాత్ముఁడు
నిర్గుణాత్మకుఁ డగుచును నెగడునట్టి,స్వప్రకాశుండు విభుఁడుసాక్షాత్కరించు.853

వ. కావునఁ జతుర్విధంబగు భక్తియోగస్వరూపంబు నీకెఱింగించితి. అవ్యక్తగతియగు
కాలంబ జీవులకు నుత్పత్తినిధనంబుల నొప్పుచుండు. అవిద్యాకర్మనిర్మితంబు
లగు బహువిధంబులైన సంసారంబులు జీవునకుఁ గల్గుచుండు. ఆ సంసారంబునం
జొచ్చి జీవుం డాత్మగతి నెఱుంగకుండు నని మఱియు నిట్లనియె. 854

సీ. పరమరహస్యమైపరగునీసాంఖ్యయో,గప్రకారంబునుగలుషమతికి
నవినీతునకును దురాచారునకు మఱి, డాంబికునకును మూఢాత్మునకును
లోలాత్మునకు గృహాలూఢచిత్తునకు మ,ద్భక్తవిద్వేషి కభక్తునకును
నుపదేశమొనరింప యుక్తంబుగాబోదు, శ్రద్ధధానుండును శాంతమతియు

గీ. భూతసఖుఁ డనసూయుఁడు బుద్ధిశాలి, జాతవైరాగ్యుఁడున్ సువినీతుఁడు శుచి
హితుఁడు నాకు శుశ్రూషాభిరతుఁడు భక్తుఁడై నయధికారియె యుపదేశ
పాత్రుఁడు సుమీ. 855

క. పురుషుం డెవ్వఁడు దీనిన్, గురుతరమగుశ్రద్ధ నాత్మఁగొని వినునో మ
త్పరచిత్తుండయి నుడువునో, పొరయునతఁడునామపరమపుణ్యపదంబున్. 856

## అధ్యాయము 33.

### జీవన్ముక్తి కథనము

మైత్రేయుఁడు:—

చ. కపిలునిసూక్తు లిట్లువిని కర్దమవల్లభ దేవహూతి మో
హపటలమెల్ల నొత్తిగిలఁ నామునికిం బ్రణమిల్లి భక్తితో
విపులతరాత్మతత్త్వ పదవీ విషయాంకితసిద్ధిభూమియౌ
నిపుణమనస్కుఁ నిట్లు సుతునిన్ స్తుతియించెఁ బరిస్ఫుటంబుగన్. 857

దేవహూతి:—

సీ. భవ దుదరాబ్జ సంభవుఁ డజుండు యుగాంత, సలిలశయానంబు సకలభూత
మయ మింద్రియార్థాత్మమయము గుణప్రవాహము సదశేషబీజాత్మకంబు
నగునీదు దివ్యదేహమును ధ్యానముఁజేసెఁ,గాని సాక్షాత్తుగాఁగాంచఁడయ్యె
నా భగవంతుఁడ వైననీవు గుణప్రవాహంబుచేత విభక్తవీర్యుఁ
గీ. డవు నతర్క్యసహస్రశక్తి విలసితుఁడ, వరయ నాత్మేశ్వరుఁడవు నర్గాద్యనీహుఁ
డవు నమోఘాభిసంధివి నగుచుసకల, విశ్వమును సృజియింతువు పేర్మిమీఱ.

శా. ఈవిశ్వంబు సమస్తమున్ వెలుఁగుఁ దానేవానిగర్భంబునం
దేవాఁ డవ్వటపత్రశాయియయి హాయిం బొల్చుఁ గల్పాంతమం
దేవాఁ డచ్ఛనిజాంఘ్రిపాయియయి దానేపాఱు మాయార్భుఁడై
యావిశ్వాత్ముఁడవీవు నాదుజఠరం బందెట్లులుంటో ప్రభూ! 859

ఉ. దుష్టుల నిగ్రహించుటకుఁ దోఁప నిజాజ్ఞఁ జరించువారలౌ
శిష్టులకున్ మహాభ్యుదయసిద్ధిని గూర్చుటకుం దలంచి యు
త్కృష్టవరాహముఖ్య శుభదేహము లెట్లు భరింతు వట్లె న
న్నేష్టదతత్త్వబోధమున కీయవతారముఁ బొంది తచ్యుతా! 860

మ. అనఘా! నీ శుభనామధేయమహిమం బాలించినన్ గీర్తనం
బును గావించిన సంస్మరించినను సంబోధించినం బుల్కసుం
డును దత్కాలమునందె శుద్ధుఁ డయి తోడ్తోసర్వయజ్ఞార్హుఁడౌ
నన నీదర్శనభాగ్యమబ్బ నిఁక దేవా! చెప్పఁగా నేటికిన్. 861

మ. అమలంబైన త్వదాఖ్యాయం బెవని జిహ్వాగ్రంబునంబొల్చు ను
త్తముఁడౌ నాతఁడు శ్వాదుఁడైనమఱియున్ దన్నామ సంకీర్తనో
ద్యములే హోమముచేయు హోతలు తపోదక్షుల్ సుతీర్థంబులన్
విమలస్నానములాడువారు బుధులున్ వేదక్రియాపారగుల్. 862

వ. అట్టి బ్రహ్మాపరుండవును, బరమపురుషుండవును బ్రత్యక్స్రోతంబగు మనంబునం జింత్యమానుండవును, నిజతేజోధ్వస్తగుణప్రవాహుండవును వేదగర్భుండవును గపిలాఖ్యుండవు విష్ణుండవు నైన నీకు నమస్కరించెద. 863

మైత్రేయుఁడు:—

చ. అనిజననయిత్రిచే వినుతుఁడై భగవంతుఁడు మాతృవత్సలుం
డును గపిలాహ్వయుండును ఘనుండును నైన పురాణపూరుషుం
డనఘతరప్రభావుఁడు సదయం బెసఁగంగవచించె నీగతిం
జననికి దేవహూతికిఁ బ్రశాంతగభీర మనోజ్ఞవాక్కులన్. 864

కపిలుఁడు:—

క. నానుడి విను మిమ్మార్గ మ్మనూనము సుఖసేవ్యమిది యనుష్ఠితమగుచో
మానితజీవన్ముక్తిని, మానక యిఁక బొందుదువు సుమా! జనయిత్రీ! 865

గీ. బ్రహ్మవాదులచేత సంప్రాప్తమగుచు, మదభిమతమైనయిద్దానినిమాతరో! ధ
రింపశ్రద్ధవహింపుచేరెదవు నన్ను దీని, నొల్లక మిత్తి నందెదరు జడులు. 866

క. అని విమలంబగు నాత్మగతిని గపిలమునీశ్వరుండు దెలిపి జననిచే
ననుమతుఁడై యిచ్చంజన్నెనని మైత్రేయుండు దెలిపె నవ్విదురునకున్. 867

వ. ఇట్లు దెల్పి మైత్రేయుఁడు విదురునిం గాంచి మఱియు నిట్లనియె. విదురా! యా దేవహూతియుఁ దనయోక్తంబైన యోగాదేశంబున యోగయుక్తయై సరస్వతీ మకుటభూతంబగు నాకర్దమాశ్రమంబున సమాధియుక్తయగుచు ముహుర్ముహుస్సవా రవగాహన కపిశంబులును జటిలంబులునగు కుటిలాలకంబులఁగూడియుగ్రతపంబునఁ గృశీభూతంబును వల్కలోపేతంబునగు దేహంబునుదాల్చి యగ్రభాగంబున 868

గీ. అనుపమమును వైమానికప్రార్థ్యమునయి, భర్తయగు కర్దమప్రజాపతి తపో మ
హాత్మ్యమున నొప్పుస్వీయగార్హస్థ్యభూరి, వైభవంబును దద్గతప్రాభవమును. 869

సీ. పాలనురుగువోలెఁ బరఁగు సెజ్జలు మనో, హరదంతఘటిత పర్యంకములును
సౌవర్ణసుందరాసనవితానములు సుస్పర్శంబులై వయాస్తరణములును
వజ్రవైడూర్యాదిభాసుర నవరత్న, భాసమానోరు సోపానములును
గణనీయమరకతఘనమణిగణాంచితములై, విలసిల్లు స్ఫటికంపుభిత్తికలును

గీ. విమలతరరత్నదీపార్చులన్ని యెడలఁ, బర్వుచుండంగ సుప్రభావంతములయి
లలితలలనామణీ పరికలితములయి, వరలుచున్నట్టి మందిరభాగములును. 870

సీ. ఉత్పలగంధియై యొప్పు వాపికయందుఁ, గర్దమమౌని పుంగవుఁడు నెమ్మి
లాలింపఁగా నెందు లీలం జొరం దన్ను, దివ్యానుచరులు స్తుతించి రట్టి

కుసుమితసురతరువిసరశోభితమును, కూజద్విహంగ సంకులతమంబు
గాయన్మదాత్త భృంగావళికలితంబు, నైన సుందరగృహోద్యానవనము

గీ. నిందిరాకాంతలకేని నభీప్సితతమ, మైన గృహమునుగాంచి తదాస్థ విడిచి
తనయవిశ్లేషణాతురత్వమునఁ జేసి, కించపఱచెను మోమునొక్కించుకంత. 871

గీ. జ్ఞాతతత్త్వయయ్యును దేవహూతితనయ, భర్త సన్యాసమును బూనివనికి నేగ
నందనవియోగఖిన్నయై నష్టవత్స, యైన ధేనువుకైవడి నయ్యె నంత. 872

గీ. ఆదిదేవుఁడుం దన యపత్యంబునైన, కపిలనాము హరిం జిత్తకమలమందు
ధ్యానమొనరించుచుండి కర్దమునిపత్ని, తానునిస్పృహయయ్యెఁ దద్భవనమందు.

క. తన తనయుఁడు కపిలుఁడు చె, ప్పినచొప్పునఁ జింతలెల్ల విడిచి ప్రసన్నా
నను ధ్యానగోచరుం దన, యుని భగవద్రూపు ధ్యానమొనరించె మదిన్. 873

వ. నిజానుభూతితిరోభూతమాయాగుణ విశేషుండును, విశ్వతోముఖుండును, నాత్మస్వరూపుండును నగు నాభగవంతు నిట్లు విశుద్ధమనంబునందు ధ్యానించి ప్రవాహరూపంబున నొప్పారుభక్తియోగంబున, బలీయంబగు వైరాగ్యంబున, బ్రహ్మత్వాపాదకంబును, యుక్తానుష్ఠానజాతంబుననగు జ్ఞానంబున నాత్మసంశ్రయుండును, బ్రహ్మస్వరూపుండునగు భగవంతుని యందు నవస్థితబుద్ధియై జీవభావంబు దొలంగుటంజేసి వీతక్లేశయై నిర్వృతిం జెంది నిత్యారూఢసమాధి సంపన్నయగుట గుణభ్రాంతిరహితయై సుప్తోత్థితుండు స్వప్నదృష్టంబగు పదార్థంబుంబోలె నప్పుడు నిజదేహంబును స్మరింపకుండె. పదంపడి యద్దేహం బాధివిరహితంబును, నన్యపోషితంబును నగుట నకృశంబై మలంబులం బ్రచ్ఛన్నంబయ్యును సధూమకంబగు పావకంబువలె విరాజిల్లె. దేవహూతియు వాసుదేవప్రవిష్టబుద్ధియై తపోయోగమయంబును, ముక్తకేశంబును, గతాంబరంబును, దైవగుప్తంబుననగు స్వశరీరంబును దెలియకుండె. ఇట్లు కర్దమపత్ని కపిలోక్తయోగ మార్గంబునఁ దద్దయుఁ బెద్దకాలంబునకు నాత్మస్వరూపుండును, నిత్యముక్తుండును, భగవంతుండునగు పరబ్రహ్మముంబొందె. ఆ దేవహూతి యెందు బ్రహ్మసిద్ధిం బొందె నది త్రైలోక్య విశ్రుతంబగు సిద్ధిపదనామకంబగు పుణ్యక్షేత్రం బయ్యె. యోగవిధూత దైహికధాతుమలంబగు నా దేవహూతిశరీరంబు పుణ్యస్రవంతియై విరాజిల్లె. సౌమ్యుండవగు నోవిదురా! సిద్ధసేవితయై యానదీమతల్లిక సర్వసిద్ధిప్రదాయకంబై యొప్పారె. భగవంతుండును మహాయోగియు నైన కపిలాచార్యుండును దండ్రియాశ్రమంబునుండి తల్లియగు దేవహూతి యనుజ్ఞ వడసి ప్రాగుదీచియగు దిశకుఁ జనియె. అటనతండు సిద్ధ, చారణ, గంధర్వ చయంబులచేతను, మునివ్రజంబులచేతను,

నప్సరోగణంబులచేతను, సంస్తూయమానుండై సముద్రదత్తార్ఘ్యనికేతనుండై యోగంబునుబొంది సాంఖ్యాచార్యసంస్తుతుండై లోకత్రయంబునకు శాంతిం గూర్ప సమాహితుండై యుండె. 874

క. చరితార్థత నీయడిగిన, యుగుతరమగు కపిలదేవహూతిసుసంవా
దరహాస్యము దెల్పితిఁగురు, వర! యిది యెన్నంగఁ బరమపావనము సుమీ. 875

చ. గురుకపిలోక్తమున్ బరమగుహ్యమునౌ విమలాత్మయోగమున్
ధర నెవఁడాలకించుఁ గడుఁదత్పరతం బఠియించు నెంచు నా
పురుషుఁడు ధన్యుఁడై భువనమోహనుఁడున్ గరుడధ్వజుండు నౌ
హరియెడ బుద్ధినిల్పుచుఁ దదంఘ్రిసరోజయుగంబుఁ జేరెడున్. 876

గద్యము.

శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, 'శ్రీరామనృసింహమూర్తి కవులు' అను గంథం శ్రీరామమూర్తి, ఇజ్జీంకి నరసింహమూర్తులచే రచింపఁబడిన శ్రీమదాంధ్రభాగవతమున తృతీయస్కంధము సంపూర్ణము.